# భాషానువర్తనం






చేకూరి రామారావు

# భాషానువర్తనం

## భాషా ప్రయోగ వ్యాసాలు

చేకూరి రామారావు

హైదరాబాదు

2000

**Bhashanuvartanam**

*A collection of articles on Language use*

by

**Chekuri Ramarao**

St. 7, Newfoundland

Habsiguda, Hyderabad - 500 007

Phone : 7152440





| | | |
|---|---|---|
| *First Edition* | : | 2000 |
| © | : | K. Heman |
| *Copies* | : | 500 |
| *Price* | : | **Rs. 75** |
| *Cover Design* | : | **Mohan** |
| *Copies* | : | **Navodaya Book House,** Kachiguda, Hyderabad.<br>**Visalandhra Book House** All branches<br>**Prajasakti Book House,** Hyderabad<br>**Disa Pustaka Kendram,** Chikkadpally, Hyd. |
| *Composed* | : | **Ushodaya Graphics,** Ph: 7612258 |
| *Printed at* | : | **Charita Graphics,** Chikkadpally, Hyd. Ph:7607361 |
| *Publisher* | : | **Chera Publication** St. 7, Habsiguda, Hyderabad-500 007. |

---

**This book has been published with the financial assistance of Potti Sreeramulu Telugu University, Hyderabad.**



తన భవిష్యత్తు తప్ప
అంతా తెలిసినట్టు కనిపించే
జ్ఞాని
చిన్నారి చిరునవ్వుల హేమంత్‌కి

# ఇందులో....

# అనువర్తన వృత్తం

నిర్మాణ దృష్టి, సిద్ధాంత స్పర్శ ఎక్కువ ఉన్న నా భాషా వ్యాసాలను భాషాంతరంగం పేరుతో సంకలనం చేశాను. భాషా ప్రయోగ దృష్టితో చేసిన సూచనలను, ప్రతిపాదనలను, పరిశీలనలను, చర్చలను ఇప్పుడు భాషానువర్తనం పేరుతో సంకలిస్తున్నాను. వివిధ భాషా సమస్యలపై నా అభిప్రాయాలను వాదం అనే భాగంలో వినిపించాను. భాషా శాస్త్రాన్ని అనేక మానవావసరాలకు వినియోగించుకొనే పద్ధతులను, ఆధునిక భాషాశాస్త్ర విజ్ఞానం బహుజ్ఞానరీతులను ఇముడ్చుకొని వృద్ధి పొందిన వైనాన్ని సంకర్షణ - వికర్షణ అనే మొదటి వ్యాసంలో సమాలోచించాను. ఇది భాషానువర్తనకు ఉపోద్ఘాతప్రాయం.

ఇందులో 3,4,9,10 సంఖ్యలున్న వ్యాసాలు ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వ విద్యాలయం వారి తెలుగు మౌలికాంశాల కోర్సు కోసం రాసినవి. వీటిలో ప్రస్తావించిన అంశాలకు బహుళ ప్రయోజనాలు ఉన్నాయని భావించి ఈ సంకలనంలో చేర్చాను.

తెలుగు వచనంలో శైలీ పరిశీలన అత్యంత శైశవ దశలోనే ఉన్నదన్న విషయం సువిదితమే. జరిగిన కొద్ది అయినా నలుగురికీ అందటం మంచిదని చలం శైలి పైన, విశ్వనాధ శైలిపైన రాసిన వ్యాసాలను ఇందులో చేర్చాను. కాలం అనుకూలిస్తే తెలుగు వచన శైలిపై ఒక పుస్తకమే రాసే ఆలోచన ఉంది.

ఈ పుస్తకంలో పదమూడో అంశం విశ్వనాథ సత్యనారాయణ గారి వచన రచనను అనుకరించి రాసిన ఫీచర్. వ్యాస సంపుటిలో ఇమిడేది కాకపోయినా విశ్వనాధ శైలిని గ్రహించటానికి పనికి వస్తుందని ఇందులో చేర్చాను. పేరాల భరత శర్మగారి వంటి సాత్యనారాయణీయ విద్వాంసుల మన్ననలను పొందింది ఈ రచన.

వివాదంలో ఎక్కువ వ్యాసాలు ప్రఖ్యాత రచయిత్రి రంగనాయకమ్మగారితో జరిపిన భాషా చర్చలు. రంగనాయకమ్మగారి నవలలు ఇష్టంగా చదివాను. సామాజిక సమస్యలపై ఆమె రాసిన వ్యాసాలను ఆసక్తిగా చదివాను. వాటిలో కొన్నిటితో నాకు భావసామ్యం కూడా ఉంది. కాని భాషను గురించి ఆమె వాదం, అహేతుకం మాత్రమే కాదు అమాయికం (naive) కూడా. ఈ వివాదాన్ని ప్రచురించాలన్న ఉద్దేశం మొదటి నుంచీ లేదు. అయితే వాద పద్ధతులు గ్రహించటానికి పనికి వస్తాయని ఇప్పుడీ సంకలనంలో చేరుస్తున్నాను. ఈ వ్యాసాల్లో అక్కడక్కడా కొన్ని పరుష వాక్యాలు దొరిలాయి. పారుష్యం నా పద్ధతి కాదు. ఎంత నిగ్రహంతో ప్రవర్తించాలన్నా మానవ సహజమయిన బలహీనతల వల్ల తెలియ కుండానే మాట జారుతుంది. పద్దెనిమిదో వ్యాసం శీర్షికలోనే ఇట్లాంటి పొరపాటు జరిగింది. ఇందుకు సభ్యపాఠకలోకానికి క్షమాపణలు చెప్పుకుంటున్నాను.

ఇదే సందర్భంగా ఇంకో సంగతి : ఆంధ్రజ్యోతి వారపత్రికలో సుమారు పదేళ్ల కిందట రంగనాయకమ్మగారి వాడుక భాషే రాస్తున్నామా ? అనే వ్యాస పరంపర అచ్చయి నప్పుడు అందులో ప్రస్తావించబడిన కొన్ని విషయాలకు సమాధానంగా మూడు విడతలుగా ఒక వ్యాసం రాయదల్చుకొన్నాను. ఆ క్రమంలో తయారయిన మొదటి భాగాన్ని ఆ పత్రిక వారికి పంపగా వారు ప్రచురించటానికి నిరాకరించారు. ఒక శాస్త్ర విషయంపై శాస్త్రం తెలియనివారు చర్చలేవనెత్తితే శాస్త్రంలో కృషి చేసిన వారికి అవకాశం ఇయ్యని బహుదొడ్డ పత్రికా సంప్రదాయం మనది. అప్పుడు గత్యంతరం లేక *చేరాతలులో* రచయిత్రి పేరు చెప్పకుండా విషయం మాత్రమే తీసుకొని చర్చించాను. రచయిత ఎవరో స్పష్టంగా తెలిసి నప్పుడు 'ఒకరు' అని దాచిపెట్టి మాట్లాడటం నాకు ఇష్టం లేదు. (రంగనాయకమ్మ గారికీ ఇష్టం లేదు). తప్పని సరి పరిస్థితులలో రచయిత్రి పేరు చెప్పకుండా సాధారణీకరించి చెప్పవలసి వచ్చింది. అంతేకాని ఎత్తిపొడుపు ధోరణి ఇష్టమై కాదు. ఆ వ్యాసాలను మళ్లీ తిరగ రాయకుండా ఇందులో అచ్చువేస్తున్నాను. వాదాంశాన్ని మాత్రమే గ్రహించవలసిందిగా గుణగ్రహణ పారీణులైన పాఠకులను ప్రార్థిస్తున్నాను. నేను అప్పుడు రాయతలపెట్టిన ఆ దీర్ఘ వ్యాసాన్ని ఇటీవలే పూర్తి చేశాను. *మాట్లాడే భాష, రాసే భాష ఒకటేనా ? అవును/కాదు* అనే పేరుతో *భాషాంతరంగంలో* అచ్చయింది. పదేళ్లు శ్రమించి సంగ్రహించిన భాషా ప్రయోగ సమాచారం ఆమె పరిశోధకులకు అయాచితంగా అందించిన అమూల్య సంపదగా అక్కడ అభివర్ణించాను.

భాషా విషయంలో ఇతరులతో పడ్డ ఒకటి, రెండు పేచీలను కూడా ఈ వివాదంలో చేర్చాను.

ఈ సంకలనంలో మూడో భాగం అనువాదం. *అనువాద పద్ధతులు : ఆచరణ సమస్యలు* అనే వ్యాసం *భాషాంతరంగంలో* ఉంది. అందులో కొన్ని గహనమైన సిద్ధాంత విషయాలున్నాయి. ఈ సంపుటిలో ఇంగ్లీషు కవితలకు ఇద్దరు కవులు చేసిన తెలుగు అనువాదాలను చర్చించాను. ఒకటి అను సృజనకు, మరొకటి పునః సృజనకు ఉదాహర ణాలుగా పనికి వస్తాయని గ్రహించాను. ఇందులో ఒకరు వచన కవి. ఇంకొకరు పద్య కవి. ఇట్లా భిన్న పద్ధతులకు ఇవి ఉదాహరణయోగ్యాలు.

ఇందులో ప్రీతీష్‌నందీ అనే భారతీయాంగ్ల కవి రచనలకు త్రిపురనేని శ్రీనివాస్ చేసిన అనువాదాలను మూలంతో పోల్చి చూసి కవితానువాద పద్ధతులను గురించి చర్చించాను. ఈ వ్యాసాన్ని తన అనువాదం కోర్సులో ఉపయోగించానని శ్రీ పద్మావతీ మహిళా విశ్వ విద్యాలయ తెలుగు అధ్యయన శాఖాధ్యక్షులు ఆచార్య పి. కుసుమ కుమారిగారు చెప్పారు.

నేను పోగొట్టుకున్న వ్యాసం ప్రతిని వారే అందించారు. వారికి అన్ని విధాలా కృతజ్ఞుడను. రెండో వ్యాసం భారతీయ భాషా కవితలకు ఆంగ్లానువాదాల ద్వారా ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు చేసిన పద్యానువాదాలకు నేను రాసిన పీఠిక. ఇందులో బే.రా. గారు అనుసరించిన కొన్ని పద్ధతుల పరిశీలన ఉంది. కవిత్వానువాద పరిశీలనకు ఇవి మార్గ దర్శకంగా, ఉంటాయని ఈ సంకలనంలో చేర్చాను. ఈ వ్యాసాలను భాషాంతరంగంలో అనువాద పద్ధతులు : ఆచరణ సమస్యలతో కలిపి చదివితే ఎక్కువ ప్రయోజనం పొంద వచ్చు.

భాషా సమస్యలపై ఆసక్తి ఉన్నవారు, భాషా పరిశోధనలో నా ఆలోచనలను, పద్ధతులను మరికొంత లోతుగా పరిశీలించదల్చుకొన్నవారు ఈ సంకలనం కంటే ముందో వెనకో భాషాంతరంగం చదివితే మరింత ప్రయోజనం పొందగలుగుతారు. నిజానికి రెండు పుస్తకాలూ కొన్ని మార్పులతో ఒక పుస్తకంగా రావలిసింది. సిద్ధాంతం, నిర్మాణం – ఆచరణ, ప్రయోగం అంత స్పష్టంగా వేరు చేయటానికి వీలులేని అంశాలు. అయితే పెద్ద పుస్తకాలను, పాఠకులకు అందుబాటులోకి తేవటానికీ అనంతమైన ఆటంకాలున్నాయి. అందువలన Sma l is beaut ful అనే నినాదాన్ని Small s feas b e అని మార్చి అనువర్తించుకోవాల్సిన స్థితిలో ఉన్నాం. పుస్తకం భౌతిక పరిమాణాన్ని, తద్వారా ధరను అదుపులో పెట్టడం కోసం అచ్చులో అక్షరాల సైజు కూడా తగ్గించవలసి వచ్చింది.

ఈనాటి మేటి కార్టూన్ బొమ్మల కళాకారుడు మోహన్ బహుస్ఫూర్తిదాయకమైన కవరు పేజీ బొమ్మలు వేశాడు. 'సెన్సాఫ్ హ్యూమర్' ఉన్నవారికి ఇవి నచ్చుతాయని నమ్మకం. సీతారాం ప్రధానంగా సాహిత్య పరిశోధకుడు. అయితే సాహిత్య పరిశోధనలో భాషా శాస్త్ర ప్రాధాన్యాన్ని ఎరిగినవాడు. భాషా శాస్త్ర సాహిత్యాల మధ్య వారధి నిమిత్తం తానూ ఒకరాయి, చేయి అందించినవాడు. వివాదంలో అక్కడక్కడ సంయమనాన్ని కొంత అతిక్రమించినా పాటించిన సంయమనంలో విలువలను గుర్తించినందుకు అతనికి అభినందనలు.

శ్రద్ధతో అక్షరాలు కూర్చిన ఉషోదయా గ్రాఫిక్సు రమాదేవి బృందానికి, ఎప్పటిలాగే అచ్చు బాధ్యత అంతా నెత్తికెత్తుకున్న దిశా పుస్తకాలయాధినేత సుబ్బయ్యకు ఆశీస్సులు. ఈ పుస్తక ప్రచురణకు తగిన ధన సహాయం చేసిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారికి కృతజ్ఞతలు.

చేరా

2000 జులై 25

# సంయమి చేరా

విషయ విధేయుడైన భాషాశాస్త్రవేత్త 'చేరా' రూపంలో అందిస్తున్న వ్యాస సంపుటి భాషానువర్తనం. విషయానికి విధేయంగా ఉండటం శాస్త్రవేత్తలందరికీ సాధారణ స్వభావంగానే కనిపిస్తుంది. అయితే చేరా ప్రత్యేకత ఏమిటి ? 'చేరా' మాష్టారిలో భాష పట్ల, భాషా శాస్త్రం పట్ల అధ్యయనం వల్ల వచ్చిన మమకారం కంటే - భాషను గురించి, భాషా శాస్త్రం గురించి ఎంతో ఎరుకను మనకు కల్పించాలన్న అంశం మీద మమకారమే నాకు ఎక్కువ కనిపిస్తుంది. భాషా శాస్త్ర జ్ఞానాన్ని నేను ఇవ్వగలను, ఇస్తున్నాను అనే ఆధిక్య భావం కంటే - 'ఇది మనందరం తెలుసుకోదగింది', దీని గురించి మనమంతా ఈ కోణంలో ఆలోచించవలసి ఉందని సూచిస్తున్నట్లుగా ఉన్నాయి ఈ వ్యాసాలు. 'చెప్పడం' అనే ప్రక్రియే అమానుషం . వినడం అంతకన్నా. చెప్పడంలో ఉండే అమానుషత్వాన్ని బాగా పరిహరించారంటే అందుక్కారణం చేరా ప్రజాస్వామిక వాది కావడం. ఈ కీలకం మీకూ అందాలంటే ముందుగా 'మాతృభాష-ప్రజాస్వామ్యం' అన్న వ్యాసం చదవండి. చేరాను ప్రజాస్వామిక వాదిగా అంగీకరించాక ఇక జాగ్రత్తగా తక్కిన వ్యాసాలు చదవండి. భాషా శాస్త్రం పట్ల, భాష పట్ల కనీస అవగాహన కలిగించుకోవడం కోసమైనా ఇది చదవాలి. భాషాశాస్త్రవేత్తగా 'చేరా' అధ్యయనాలు మనకు కలిగిస్తున్న ప్రయోజనం మనలో భాషా చైతన్యం, భాషా స్పృహ కలిగించటమే.

''ప్రజాస్వామ్య వ్యవస్థలో ఉపవ్యవస్థలన్నీ ప్రజలకు విధేయంగా ఉండాలి''... ప్రజలకు ప్రభుత్వానికీ మధ్య భావ ప్రసారం లేదు. మన ముఖ్యమంత్రిగారు చాలా సార్లు ప్రస్తావిస్తున్న పారదర్శకత లేదు'' యిక్కడ -

కేవలం భాషా శాస్త్రమే చెప్పడం లేదు చేరా - భాష ఒక 'సాంఘిక వ్యవస్థ' గా మారటం దానిపై నియంత్రణను మనం సాధించాలనుకోవటం ఎందుకంటారా ?. భాషను నియంత్రించగలిగితే మనకు అనుకూలంగా కార్యకలాపాలను జరిపించుకోవచ్చు.

మనకు అనుకూలంగా జరిగే కార్యకలాపాల ద్వారా జీవన ప్రమాణాల మెరుగుదల, అందుకు గల అవకాశాలను గుర్తించవచ్చు. ఒక విధంగా చూస్తే ఒక సమాజంలోని వ్యక్తులకున్న భాషా స్పృహను బట్టి ఆ సమాజం సాధించిన ప్రగతిని లెక్క కట్టవచ్చుననిపిస్తుంది.

ఒక ప్రజాస్వామిక వాదియైన భాషాశాస్త్రవేత్త మనలో భాషాచైతన్యం కోసం కృషి

చేస్తున్నాడని మనకు అర్థమవుతుంది. నీ భాషా పరిమితి నీ ప్రపంచానికి పరిమితి విధిస్తుంది కాబట్టి కొంత భాషాజ్ఞానం ద్వారా విస్తరించమని 'చేరా' మాష్టారు ఈ వ్యాసాల్లో అడుగుతున్నారనుకుంటాను.

నాకు తెలిసిన చేరాలు ముప్పైరు. ఒకరు రెండు పదులపైన...లో, మరొకరు 'చేరాతలు'లో, ఇంకొకరు 'లింగ్విస్టిక్స్'లో అయితే ఈ ముగ్గురినీ ఒకే అంతస్సూత్రం నడుపుతూ ఉన్నది. అదే 'సెన్సిబిలిటీ' చేరా 'అద్భుత సంవేదనల సంపుటి'. దీనికి రుజువు కావాలంటే ''ప్రయోజనం లేని సిద్ధాంతాన్ని నేను ఊహించలేను'' అన్న కెన్నెత్ ఎల్. పైక్ వ్యాఖ్యను, రాబర్ట్ లీజ్ వాక్య నిర్మాణ వివరణ సందర్భంగా గీచిన చెట్టును ''అందంగా లేదూ ఇది?'' అని అడిగిన విషయాన్ని ఎంత హృద్యంగా మళ్ళీ చెప్పారో చూడండి. భాష, భాషాశాస్త్రం గురించి ఎన్నో కొత్త విషయాలను చేరా ఆవిష్కరించారు. దీని వెనుక నాలుగు దశాబ్దాల భాషాబోధన, అధ్యయనం, పరిశోధన ఒకటేమిటి బహుముఖీన కృషి ఉంది.

భాషను గురించి 'చేరా' అధ్యయనం ఒక ఎత్తయితే తాను గ్రహించిన దాన్ని అందరికీ తెలియజెప్పగల విధానం, పద్ధతి తెలియడం ఇంకో ఎత్తు. ''భాషానువర్తనం''లో చాలా విషయాలు గహనమైనవే. వాటి గహనత్వం చేరాకి ఉన్న స్పష్టత, నిబద్ధతల కారణంగా ·చెరిగిపోయింది.

ఎక్కువ మంది భాషాశాస్త్రవేత్తల విలువైన పరిశోధనలు, అమూల్య ప్రతిపాదనలు మామూలు వాళ్ళకి అర్థం కావు. ఆ మాటకొస్తే మామూలుగా తెలుగు భాషాశాస్త్ర వేత్తలు 'ఆంగ్ల లింగ్విస్టుల్లు' కనుక తెలుగులో ఎక్కువ రాయరు. చేరా టార్గెట్ గ్రూపు భాషా శాస్త్ర వేత్తల సమూహం కాదు. భాషను గురించి ఎవరు తెలుసుకోవాలో వారికి తెలియజెప్పడం కోసమే చేసిన పరిశ్రమ ఈ వ్యాసాలలో అధికంగా ఉంది. ''ఉపయోగించుకునే వారి అవసరాలకు జ్ఞానాన్ని తీసుకు రావడం శాస్త్రజ్ఞుల కర్తవ్యంగా ఉండాలి'' అన్నది చేరా నిష్కర్ష. దీని నుంచి చేరా ఎప్పుడూ, ఎక్కడా పైదొలగ లేదు. ఈ సంపుటిలోని మొదటి వ్యాసంలో విషయ విస్తృతి ఎంతో ఉంది. ఎంతో విస్తృతి ఉన్న విషయాన్నైనా 'సమగ్ర దృష్టి' కలిగేట్లు చెప్పగలిగారు. భాషాశాస్త్రవేత్తకు కావలసిన f exib lity గురించి ఎక్కువ నొక్కి చెప్పకుండానే తన పూర్వ అవగాహనలను వాటి అసమగ్రతను ఒప్పుకుని భాషాశాస్త్ర వేత్తకు కావలసిన లక్షణం ఏమిటో చెప్పారు. అయితే అదే సమయంలో అధికార భాషా సంఘాల నిర్వీర్యతను చెపుతూ ''ఈ రాష్ట్ర పాలకులు ఏనాడూ భాషా శాస్త్రానికీ, సాహిత్యానికీ

మధ్య భేదాన్ని గుర్తించలేదు. భాషా శాస్త్రజ్ఞులే ఇందుకు తగిన వారు అయినా, వారిని ఇట్లాంటి పదవుల్లోకి రానీయకుండా జాగ్రత్త పడ్డారు. ఈ పరిస్థితికి కారణం భాషా శాస్త్రం గురించిన స్పృహను కలిగించడంలో ఆ శాస్త్రజ్ఞుల వైఫల్యం కావచ్చు లేదా పాలకుల దుర్భేద్యమైన అజ్ఞానం కావచ్చు; లేదా ఈ రెండు కారణాలూ కావచ్చు'' అని ఖరా ఖండిగా తేల్చి చెప్పేస్తారు. జ్ఞానాభివృద్ధి సంకర్షణ - వికర్షణ గతి తర్కం మీద ఆధారపడి ఉంటుందని పేర్కొని ఒక కొత్త ప్రతిపాదన చేశారు. చేరా సూత్రీకరణలను అందిపుచ్చుకొనే భాషా శాస్త్ర పరిశోధకులు ఈనాడు చాలా అవసరం. ఈ సంపుటిలోని వ్యాసాలన్నీ చదివాక ఇంతకాలం కవిత్వం రాసి కాలాన్ని వృదా చేశానని అనిపించడం ఈ వ్యాసాల్లో ఉన్న విషయ గాంభీర్యం వల్లనే తప్ప మరొకందుకు కాదు.

నిజానికి 'చేరా' మాష్టారి 'భాషానువర్తనం' పుస్తకానికి భాషా శాస్త్రం గూర్చి ఏమంత తెలీని నేను ఈమాట రాయడం సాహసమే. నాచేత ఈ సాహసం చేయిస్తోంది 'చేరా'నే. 'చేరా'కు వ్యూహం అనే మాట చాలా ఇష్టం. నాచేత రాయించడం కూడా 'వ్యూహం'లో భాగమని నేను భావించటంతో ఈపనికి పూనుకున్నాను.

చేరా వ్యూహం వెనుక భాషా శాస్త్రం గురించి మనలో చాలామందికి ఉండే అపోహలు తొలగిపోవాలన్న ఆకాంక్ష ఉంది. 'భాషాశాస్త్రం' నాకు సంబంధించింది కాదనుకునే ధోరణి పోవాలనే ఆశ ఉంది చేరాకి. తత్ఫలితమే ఓ పామరుడికి ఆ వ్యాసాలు చదివి నువ్వేం రాస్తావో రాయమని అడగటం.

ఎంతో కాలంగా భాషా శాస్త్రానికీ, సాహిత్యానికీ ఒకానొక అసహజమైన, అనవసరమైన దూరం కొనసాగుతూ వచ్చింది. ఈ దూరాన్ని విశ్వవిద్యాలయాల తెలుగు విభాగాలు బ్రహ్మాండంగా పెంచి పోషించాయి. సాహిత్యానికీ, భాషా చరిత్రకు, భాషా శాస్త్రానికి సంబంధం లేదనే ఇప్పటికీ (సాహిత్య) విద్యార్థులను నమ్మిస్తున్నాయి. చేరా ఈ తరహా నమ్మికకు భరతవాక్యం పలికిన తొలి భాషా శాస్త్రవేత్త.

ఆధునిక భాష, భాషావ్యవస్థ ఇవి చేరాకు అధ్యయనాంశాలు. భాషా శాస్త్రంలో ఒక విప్లవానికి ప్రారంభంగా చామ్‌స్కీ 1957లో ప్రచురించిన 'సింటాక్టిక్ స్ట్రక్చర్' అన్న పుస్తకం నిలిచింది. ఇప్పుడు భాషాశాస్త్ర అధ్యయనంలోనూ, సాహిత్య విమర్శకు భాషాశాస్త్ర అధ్యయన ఫలితాలను ఉపయోగించుకోవడంలోనూ 'చేరా' గ్రంథాలు నిశ్చయంగా ఒక విప్లవానికి దారి తీస్తాయని చెప్పాలనిపిస్తుంది. అందునా 'భాషాను వర్తనం' కీలక పాత్రను పోషిస్తుందనటంలో సందేహించనక్కరలేదు.

*'భాషాను వర్తనం'* మూడు భాగాలుగా విభక్తమైంది. ఒకటి: వాదం, రెండు: వివాదం; మూడు: అనువాదం. మొదటి విభాగంలో వ్యాసాలు పదమూడు. ఇంచుమించు ఐదువ్యాసాలు 'శైలి'ని గురించి, భాష ప్రామాణికత గురించి, ఏకరూపత గురించి చర్చిస్తాయి. కొన్ని వ్యాసాల్లో పత్రికల భాష - ప్రమాణీకరణ, తెలుగు రాయటంలో వచ్చే చిక్కులు - పరిష్కారాలు, మాతృభాష - ప్రజాస్వామ్యం. ఆధునిక భాష - భాషాధునీకరణ, అనే అంశాలను భాషోద్యమాలు : వ్యావహారిక భాష తదితరాంశాలను వివరిస్తాయి.

ఆధునిక భాషలో వస్తున్న మార్పుల పరిశీలన, వాటి సమగ్ర విశ్లేషణ, అందులో భాగంగా చర్చ - ప్రతిపాదన ఈ అంశాల మీద ఆధారపడి 'వాదంలో' వ్యాసాలు సాగాయి. చేరా ఏ విషయాన్నీ బలవంతంగా రుద్దరు. ముఖ్యంగా భాషాశాస్త్ర సంబంధమైన అంశాలను కేవలం తన పరిశీలనలు గానే పరిచయంలో పెడతారు చేరా.

ఉదాహరణకు 'మాతృభాషను పరిరక్షించుకొందాం' వ్యాసంలో మాతృభాషను రక్షించుకోవటం, విషయ ప్రధాన వచనం రాయటం, తెలుగు పిల్లలను తెలుగు పౌరులుగా తయారు చేసుకోవటం, భాష భౌతికావసరం అని గుర్తించటం, నిర్దిష్ట శాస్త్ర వచనం ప్రాముఖ్యాన్ని గుర్తించటం చిన్న విషయాలేమీ కాదు.

వచనం గురించి భాషావేత్తగా చేరా గంభీరంగా ఆలోచిస్తారు. ఇదెంత బాధ్యతగా నిర్వర్తించాల్సిన పని. చేరా సాహిత్య వచనం గురించి, దానిలోని శైలీ భేదాలను గురించి ప్రతిపాదనలు బాధ్యతాయుతంగా ఉన్నాయి కనుకనే వీటిని 'వాదం' విభాగం క్రింద చేర్చారు. చలం, విశ్వనాథ తదితర రచయితల creative prose గూర్చి చేసిన విలువైన పరిశీలను ఇందులో ఉన్నాయి.

ఒక్కముక్కలో చెపితే ఆధునిక కాలంలో ఎన్ని రంగాలలో తెలుగును వాడుతున్నామో ఆ అన్ని రంగాలలోనూ వాడబడుతున్న తెలుగు భాష గురించి చేరా నిశితంగానూ, దూర దృష్టితోనూ చేసిన పరిశీనలు 'వాదం' విభాగంలోని వ్యాసాల్లో కనిపిస్తాయి.

లిఖిత భాషలకీ, మాట్లాడే భాషలకీ మధ్య ఉండే తేడాలు, అంతరాలు, వెసులుబాట్లు ఈ రెంటి గురించి భాషాశాస్త్ర జ్ఞానం ఉన్నవారి అవగాహన, భాషాశాస్త్ర శిక్షణ లేని వారి ఊహాపోహలు కొన్ని వ్యాసాల్లో వివరించే ప్రయత్నం చేశారు. తగినంత భాషా శాస్త్ర శిక్షణ లేకుండా శాస్త్ర సత్యాలను సూత్రీకరించే వారి పట్ల చేరా తగినంత అసహనాన్ని చూపగలరు.

భాషకు సంబంధించిన కొన్ని రకాల భావచట్రాలను కూల్చటం, భావ చట్రాలను విశాల పరచటం, కొత్త భావ చట్రాలను ఏర్పరచటం కాదు చేరా ధ్యేయం. భాషా నిర్మాణ వ్యవస్థలతో సంబంధం లేకుండా భాషను గురించి, భాషా శక్తిని గురించి, భాషా ప్రయోజకత్వాన్ని గూర్చి ఆవరించి ఉన్న 'సంభావ్యాల'ను తొలగించి భాషకు సంబంధించి మనం సరైన మార్గంలో పడేట్లు చేయడమే చేరా సంకల్పం.

''రాసే భాష మాట్లాడే భాషకన్నా భిన్నంగా ఉండకూడదని చాలామంది అంటున్నారు. భిన్నంగా ఉండక తప్పదు. భిన్న సందర్భాలకు వాడే భాషలో భేదాలున్నట్టే భిన్న ప్రయోజనాలకు వాడే భాషలో భేదాలుంటాయి'' అంటారు చేరా. ఈ విషయంగా ఎన్నో కొత్త ఉదాహరణలతో అనేకాంశాలను విశదపరిచారు. వ్యావహారిక భాషావాదుల్లో ఉండే దృక్పథ భేదాలను వివరించి దీనిని ఓరియంటేషన్ భేదం అని తేల్చినా, చలం భాషా ప్రయోగ రహస్యాలను పరిశోధించేందుకు కావల్సిన ఆలోచనల తలుపులు చేరా. తెరిచినా 'విశ్వనాథ సత్యనారాయణ గారి రచనా వ్యూహాలు' శోధించినా నిబద్ధుడైన భాషా పరిశోధకుడు మనకు దర్శనమిస్తాడు.

'భాషానువర్తనం'లో రెండవ భాగం 'వివాదం'. ఇందులో పన్నెండు వ్యాసాలున్నాయి. ఈ భాగం *'బడు'* రాయటం చేత కానివాళ్ళే బడుద్ధాయిలు' అన్న వ్యాసంతో మొదలై ''తెలుగు స్పెషలిస్టుల నుంచి తెలుగును 'బ్రోచే' వారెవరు ? అనే వ్యాసంతో ముగుస్తోంది. ఈ భాగం 'వివాదం' కనుక ముగుస్తుంది అనడానికి వీల్లేదు. పుస్తకంలో చేరా విభేదించిన విషయాల మీద తిరిగి ఎవరికి వారు తమ తమ ఓపిక మేరకు వివాదాంశాలతో విరుచుకు పడతారు. ఎందుచేతంటే చేరా 'తప్పుడు చైతన్యం'తో సాగించే వాదాలను కొంత మొండిగా, కాస్త నిర్దాక్షిణ్యంగా ఖండిస్తాడు.

ఏ భాషలోనైనా కర్మణి ప్రయోగం భాషల ఉన్నత స్థితికి చిహ్నమని సూచించి '*బడు* ప్రయోగింపబడును, *బడు* ప్రయోగింపబడవలెను' అని కోరారు *'బడు'* వ్యతిరేకులను ఉద్దేశించి చేరా భాషా రౌడీలు, 'ఆత్మాశ్రమ భావాలు' అన్నారు. దీన్లో 'ఆత్మాశ్రయ భావాలు' అన్నదే పెద్ద తిట్టు అయినా 'భాషా రౌడీలు' అన్న మాట 'చేరా' సంయమనం కోల్పోవ డాన్ని సూచించదా ? అనిపిస్తుంది. అయితే 'చేరా'కు అంతకు మించి మార్గం లేదు. ఆయనే చెప్పినట్లు ''ఈ *'బడు'* ప్రయోగం చుట్టూ అల్లుకున్న అజ్ఞానపు తెరలు చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఈ తెరలు ఎంత దట్టంగా చుట్టుకొని ఉన్నాయంటే వీటిని ఛేదించటం ఒక పట్టాన సాధ్యమయ్యే పని కాదని నాకే అప్పుడప్పుడు భయం వేస్తుంది''. భయం

లోంచి, కోపం లోంచి నిస్సహాయత, తిట్లు, శాపనార్థాలు వస్తాయేమో ! 'చేరా' ఇందుకు మినహాయింగా ఉండిపోతే బావుండును.

ఒక వాదాన్ని పూర్వ పక్షం చేయడానికి చేరా సహేతుకం కాని వాదాన్ని ఎప్పుడూ చేయరు. భేషజాలకు పోకపోతే 'బడు' వాడకం మీద ఇక చర్చ అక్కర్లేదని 'బడు' వ్యతిరేక వాదులు కూడా ఒప్పుకునేన్ని ప్రమాణాలు చూపించారు.

'చేరా' ఈ వివాదాలలో ఒక వెసులు బాటు సూత్రాన్ని ''వ్యాకరణ సూత్రాలు - భాషా వ్యవహారాన్ని బంధిస్తాయా?'' అన్న వ్యాసంలో ఇచ్చారు. భాషకు సంబంధించి ఉన్న ప్రయోగాలకు సూత్రాలు తయారు చేయాలి. అంతే తప్ప భాషలో ఇది తప్పు అది ఒప్పు అనేది లేదు. తప్పొప్పుల జాబితా తయారు చేయడం భాషా శాస్త్రవేత్త పనికాదు. ''చాలామంది చేస్తున్నారు కనుకనే వీటిని తప్పులనగూడదు. శాస్త్ర కారుడు వీటిని భాషలో జరిగే సహజ పరిణామాలుగా గుర్తిస్తాడు. అనేకులు అసంకల్పితంగా చేసే 'తప్పులు' తప్పులు కావు. నిజానికీ తప్పుల వల్లనే భాషా విస్తృతి (code elaboration) జరుగుతుంది.'' భాషా శాస్త్రవేత్త, భాషా శాస్త్రం వీటి పరిమితులను కూడా చేరా తరుచూ నొక్కి చెపుతుంటారు. సరైనా భాషాశాస్త్ర పరిజ్ఞానం, తగిన శిక్షణ, ఆలోచన లేకుండా భాష గురించి తమకు తెలిసిన అజ్ఞానాన్ని సూత్రబద్ధం చేయవద్దని చేరా హెచ్చరిక, ఈ విభాగంలోని ఎక్కువ వ్యాసాలు 'భాషా వ్యవహారాన్ని తప్పొప్పుల పద్ధతిలో అర్థం చేసుకోవటం సాధ్యం కాదనే విషయాన్ని బలంగా నొక్కి చెపుతాయి. అంతే కాకుండా ''తప్పొప్పుల ప్రసక్తి శాస్త్రానిది కాదు. (శాస్త్రం అంటే body of know edge అనే అర్థంలో) శాసకులది. అందుకే ఇది తప్పు, ఇది ఒప్పు అంటే శాస్త్ర పరిశోధకులకు చిరాకు కలుగుతుంది'' (పుట 145) అన్న అంశాన్ని ఎక్కువ సందర్భాలలో వివరించే పనికి పూనుకున్నారు చేరా.

వివాదంలోని వ్యాసాలన్నీ పరిమాణంలో చిన్నవిగానూ, ప్రయోజనంలో దొడ్డవిగానూ కనబడుతున్నాయి. 'వివాదం' ఎట్లా పడితే అట్లా చేయడం కాకుండా ఎదుటి వాదంలోని అసమగ్రాంశాలను సమగ్రం చేయడం కోసమే రాసినట్లున్నవి. చేరా 'వివాదా'ల్లో ఇదొక ప్రత్యేకతగా కనిపిస్తుంది నాకు. చాలామంది వివాదాల ద్వారా ప్రఖ్యాతి పొందుదామని చూస్తుంటారు. అందువల్ల అవసరం, పరిమితులు దాటి అంతు పొంతు లేకుండా తమ agrument వినిపిస్తారు. చేరా ఇందుకు భిన్నం. ముందే చెప్పినట్లుగా చేరాకు శాస్త్ర గౌరవం ఎక్కువ. తాను మితంగా మాట్లాడటం, వాదించటమే కాదు. ఎదుటి పక్షం నుంచి కూడా

తన. తరహా మితత్వాన్ని ఆనిస్తారు. శాస్త్ర సంబంధమైన చర్చలు చేసేప్పుడు ఎక్కువమంది అసలు విషయం వదిలిపెట్టి ఛలోక్తులు, విసుర్లు, హేళనలు, ఎద్దేవాలు ఇట్లాంటివి చేస్తుంటారు. చేరా ఇట్లాంటి వారిని సహించడు పైగా ఇట్లాంటి వారిని 'అతి తెలివిగా వ్యాఖ్యలు' గలవారిగా పేర్కొంటాడు. శాస్త్రం పట్ల అధిక గౌరవం చేరాకు కాబట్టే ''... శాస్త్రం చతురోక్తుల సంపుటి కాదు. తర్కాభాసవాద సంకలనం కాదు'' అని ప్రతి కక్షులతో విభేదిస్తాడు. 'తప్పొప్పుల పద్ధతిలో భాష అర్థం కాదు', శాస్త్ర చర్చలకు కొన్ని మర్యాద లుంటాయి' లాంటి వివాద వ్యాసాలు విషయాన్నే కాకుండా వివాదం ఏ పద్ధతిలో నడవాలి? ఎంత మర్యాదగా నడవాలి అన్న అంశాలను గుర్తు చేస్తుంటాయి. ఈ భాగంలోని వ్యాసాలు వివాద విమర్శకు ఒక కొత్త వరవడి పెట్టేట్లుగా ఉన్నాయి.

'వివాదం' విభాగంలోని వ్యాసాలు అన్నీ పాత వివాదాలను ఒక కొలిక్కి తెచ్చేందుకు ఉద్దేశించినట్లు కనబడుతుంది ('బడు' ఉండొచ్చునో) 'బడు'ను గురించి చేరా నిరంతరం ఆలోచించారని ఈ సంపుటి సాక్ష్యమిస్తుంది. 'భాషను శాసించడం ఎవరి తరం ? లోనూ ఎన్నో విలువైన విషయాలు చెప్పారు. వాటిల్లో ఒకటి : గిరిజన భాషల మీద పరిశోధన చేస్తున్న వారికి కర్మణి వాక్యాలు లభ్యం కాలేదు. దీనిని ఎంత అద్భుతంగా సూత్రీకరించారో వ్యాసం చదవండి. అసలు చేరా ఏ సూత్రీకరణ నేపథ్యాన్నయినా పరిశీలించండి. నాగరికతా భివృద్ధికి కర్మణి ప్రయోగానికి సంబంధం ఉండొచ్చని అనిపిస్తుంది చేరా చెప్పినట్లు అభి వృద్ధి చెందిన సంస్కృతుల భాషల్లో కర్మణి వాక్యాలుంటాయి. సాంస్కృతికాభివృద్ధికి కర్మణి వాక్యాలు ఒక భాషా సూచిక అని నిర్ధారించారు. భాషను శాసించడం ఎవరి తరం ? ఎవరి తరమూ కాదు. చేరా తరమూ కాదు. అయితే ''భాషను గురించి మాట్లాడడానికి శిక్షణ ద్వారా వచ్చే అధికారం ఉండాలి, భాషా శాస్త్రానికి కొన్ని మర్యాదలు convert'ons ఉంటాయి. భాషలో జరిగే మార్పులను తప్పొప్పుల పద్ధతిలో చూడకూడదు'' అని పదే పదే చెప్పి ఇక విననప్పుడు'' శిరసి మాలిఖ, మాలిఖ, మాలిఖ'' అని తనలో తాను అనుకుంటూ ఉంటారు.

వివాదాలను, ముఖ్యంగా హేతుబద్ధ, తర్కసహిత వివాదాలను ఎప్పుడూ తిరస్కరించ లేదు. ఎంత తర్కబద్ధం కాకపోయినా, హేతు రహితంగా ఉన్నా వాటిలోని అసామంజస్యాన్ని, అసంగతత్వాన్ని సరిదిద్దేందుకు ఓపికగా ప్రయత్నించటమూ, ఆ వివాదాన్ని ముగింపుకు తేవడం చేశారు.

'చేరా'దొక విలక్షణ పద్ధతి. 'వాదం'లోగానీ వివాదంలోగానీ ఎక్కడా సంయమనం తప్పరు. పిడివాదమూ చేయరు. ఎక్కడన్నా తప్పినా అప్పటికప్పుడే canfess అవుతారు. అంటే తన విమర్శ పరిధిని పరిమితులను అందరికంటే తానే ముందుగా గుర్తిస్తారు. వీటన్నిటి కంటే ముఖ్యమైంది తాను చేసే ప్రతిపాదనలను పూర్వపక్షం చేసే అంశాలను కూడా తాను ముందుగానే గ్రహించగలరనుకుంటాను ఈ విషయంలో చేరాకు అక్కిరాజు ఉమాకాంతం గారితో సామ్యం ఉంది. ఇది చేరా సైతం సంతోషంగా అంగీకరిస్తున్న సత్యం.

'చేరా'లో భాషాశాస్త్రవేత్త, సాహిత్య విమర్శకుడు అన్యోన్యం కలిసిపోయారు. ఈ యిద్దరి వ్యక్తిత్వాలు భూష్య, భూషణ భావాన్ని పొందినట్లు అమిరినాయి. సాహిత్య విమర్శ వల్ల భాషా శాస్త్రం, భాషా శాస్త్రం వల్ల సాహిత్య విమర్శ ఈ మూడు, నాలుగు దశాబ్దాలుగా విలసిల్లడం చూశాం. 'చేరా' భాషా శాస్త్రవేత్తగా కంటే 'చేరాతలు' సాహిత్య విమర్శకులుగా గుర్తింపు పొందినందుకు నొచ్చుకుంటూ ఉంటారు గానీ, భాషను భాషా శాస్త్రాన్ని సాహిత్య విమర్శకు ఉపయోగకరమైన సాధనంగా మలిచి బహూకరించడంలో చాలా శ్రమించారు. ఆయన అందించిన సిద్ధాంతాలను, సాధనాలను అందిపుచ్చుకొని ముందుకు పోగలగటమే మనమిచ్చే పారితోషికం, ఊరట.

-సీతారాం

# సంకర్షణ - వికర్షణ : జ్ఞానాభివృద్ధి గతితర్కం

నేను ఈ ఉపన్యాసాన్ని కాస్త ఇష్టాగోష్ఠి ధోరణిలో మీ ముందు నివేదించటానికీ అందులో నా జీవన గమన పురాస్కృతులను కూడా జోడించటానికీ మీ అందరి అనుమతినీ, సభాధ్యక్షుల వారి సమ్మతినీ అభ్యర్థిస్తున్నాను. అటువంటి పురాస్కృతులు, ఈ గోష్ఠి సమావేశానికి అవసరమని భావిస్తున్నాను. భాషాశాస్త్ర సిద్ధాంతాలలో వచ్చిన గుణాత్మకమైన మార్పులతోటే, నిత్యం మారుతూ వచ్చిన భాషాశాస్త్ర పద్ధతులతో పాటు నా పరిశోధనా క్షేత్రం విస్తరిస్తూ వృద్ధి చెందింది. ఇది నాలో ఉన్న ప్రేరణ వంటిది కావచ్చు. ఒకవేళ ఇది మీకు ఎక్కువ పిట్టకదల మాదిరిగానూ, తక్కువ మేధా సంబంధిగానూ అనిపిస్తే, మీరు నన్ను క్షమించవలసినదిగా కోరుతున్నాను.

భాషా నిర్వచనాలు అనేకం ఉన్నా నేను వాటి వివరాలలోకి వెళ్లను.

భాషంటే ఏమిటో మనకు అందరకూ తెలుసుననుకొంటున్నాను. మన అవగాహనల్లోనూ అంతో ఇంతో వ్యత్యాసాలూ, సమస్యలూ ఉంటాయి. అయితే భాషా శాస్త్రం అంటే, భాష *గురించి* విజ్ఞానం అని మనకందరకూ తెలుసు. ఇక్కడ *గురించి* అన్న పదం ఏమంత స్పష్టమైనది కాదని కూడా మనకు తెలుసు.

భాషా శాస్త్రం, భాష గురించిన విజ్ఞానాన్ని సమకూర్చాలన్నదే మన ప్రధాన ధ్యేయం. అయితే ఏది జ్ఞానమౌతుందీ, ఆ జ్ఞానాన్ని సమకూర్చేదెలా అన్న ప్రశ్నలను ప్రస్తుతం పక్కన పెడదాం. ఈ విజ్ఞానం ఎవరికి పనికి వస్తుంది అన్నదే ప్రస్తుతం మన సమస్య.

జ్ఞానాభివృద్ధికి ఇతరేతర కారణాలు దోహదం చేసినప్పటికీ,మానవ జీవితపు అవసరం పునాదిగానే జ్ఞానం అభివృద్ధి చెందింది. భారతదేశంలో వేదాధ్యయనాన్నీ, వేదోచ్చారణనూ రక్షించటానికి భాషా శాస్త్రం మొదలైనది. కెన్నెత్ ఎల్. పైక్ గ్రంథం ఫోనీమిక్స్ (1947) ఉపనామం 'A technique for reducing languages to writing" అని ఉన్న విషయం మనకు తెలుసు. ఈ విషయం పట్ల అప్పటి ప్రముఖ భాషా శాస్త్రజ్ఞులు చాలామంది అభ్యంతరం చెప్పారు. 1970 ప్రాంతంలో ప్రొఫెసర్ పైక్ హైదరాబాదుకు వచ్చినప్పుడు నేను ఆయనను గ్రంధ ఉపనామ సార్థకత గురించి అడిగాను. అప్పటికే ఫోనాలజీ గురించి అనేక సిద్ధాంతాలు అధ్యయనంలో ఉన్నాయి. అందులోనూ అవి అప్పటికి అమూర్త అధ్యయన పద్ధతులుగా ఉన్నవి. పైక్ ఇచ్చిన పదునైన జవాబు నాకు బాగా గుర్తున్నది.

''ప్రయోజనం లేని సిద్ధాంతాన్ని నేను ఊహించలేను'' అన్నదే పైక్ గారి వ్యాఖ్య. ఆయన ఈ విషయాన్ని గట్టిగా నొక్కిచెప్పారు. ఆయన గళంలో గట్టి నిబద్ధత విన్పించింది. ఈ విషయమై నేను ఆయనతో ఇక వాదించలేదు కానీ, ఆయన వ్యాఖ్య మాత్రం నన్ను ఆందోళనకు గురి చేసింది. అప్పట్లో నేను ఫోనాలజీలోను, వాక్య నిర్మాణంలోనూ అమూర్త రూపాలను ప్రతిపాదిస్తూ, వాటిని ఆస్వాదిస్తూ ఉన్న సమయం అది. ఆ అమూర్త రూపాలు, భాషా వ్యవహార రూపానికి చాలా దూరంగా బీజగణిత సమీకరణాల్లా ఉంటూ ఉంటే ఎంత బాగున్నవి అని ఆనందిస్తూన్న సమయం అది. అప్పటి భాషా శాస్త్రంలో ప్రధానంగా ఉన్న ధోరణికి ప్రతిబింబమే ఆ అమూర్త సూత్రాల సృజన. 1968లో రాబర్ట్ లీజ్ (Robert Lees) సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్ సంస్థలో ఉపన్యాసాలు ఇస్తున్నారు. ఆయన (వాక్య నిర్మాణంలో) చెట్టు బొమ్మలు గీసి, ఆవృత్త సూత్రాలు ఎట్లా ప్రవర్తిల్లినదీ వివరించారు. ఒకరోజు ఉపన్యాసంలో లీజ్ చెట్టు బొమ్మ వైపు చూస్తూ ''అందంగా లేదూ ఇది ?'' (Isn t that beautifu ?) అన్నారు. ఒకరెవరో ఆయనను డేటా గురించి అడిగారు. ''డేటా పరమ చెత్త. బయటపారేసెయ్'' ('data is garbage, throw it out") అన్నారు రాబర్ట్ లీజ్.

పూర్వపు బిహేవియరిస్టిక్ యుగంలోని కొన్ని మిథ్యాంశాలను జనరేటివ్ సిద్ధాంతం (generative theory) పటాపంచలు చేసినప్పటికీ, అది కొత్తగా కొన్ని హేత్వాభాస గాథలను సృష్టించింది. ''జన్మగత భావనలు'', ''విశ్వజనీన వ్యాకరణం'', ''ఆదర్శీకృత వ్యవహర్త'' ''నిశ్చల ప్రతిభ'', ''ప్రతిభ – ప్రవృత్తి విభజన'' మొదలైనవి ఇటువంటివే. వీటిని తర్వాత తర్వాత సామాజిక భాషాశాస్త్రం, భాషాధ్యయనాలు – పూర్వ పక్షం చేశాయి. జనరేటివ్ సిద్ధాంతాల అధ్యయన క్రమంలో ఏర్పడ్డ ఫలితం ఏమంటే, భాషాశాస్త్రం గురి, భాషలోని విస్తృత భాగాలవైపుకు మారింది. గత ఒకటి రెండు దశాబ్దాల కాలంలో, ఏదో ఒక ప్రధాన సిద్ధాంత నిరంకుశ పాలనకు బదులు, వివిధ దృక్కోణాల శాంతియుత సహజీవనం కొనసాగినట్లు కన్పిస్తున్నది. సంపూర్ణ సత్యాన్ని ఏ ఒక్కసిద్ధాంతం అందించజాలదు కాబట్టి, ఈ సహజీవన స్థితిని ఆహ్వానించవలసిందే. జనరేటివ్ సిద్ధాంతం, భాషాశాస్త్ర స్థాయిని ఉన్నత స్థానానికి చేర్చింది కానీ, భాషకూ, భాషా శాస్త్రజ్ఞులకూ మధ్య దూరం పెంచి, భాషా శాస్త్రానికీ – భాషా ప్రయోగానికీ మధ్య అఖాతాన్ని సృష్టించింది. అయితే ఇతర సిద్ధాంతాల వల్ల, ఈ దూరం తగ్గింది. భాషా శాస్త్రంలో వాస్తవ ఆధారం, మానవ అవసరాలూ అన్నవి పునస్ స్థాపితమయ్యాయి.

భాషా శాస్త్ర జ్ఞానం అర్థవంతంగా ఎలా ఉపయోగిస్తుంది అని ఇప్పుడు మనం స్వేచ్ఛగా ధైర్యంగా అడగవచ్చు. ఇతర మేధారంగాల్లో, భాషాశాస్త్రం ఎలా ఉపయోగ పడుతుందన్న విషయాన్ని ఇప్పుడు హాయిగా అడిగే పరిస్థితి ఉన్నది.

ఛార్లెస్, ఎఫ్. హాకెట్ గ్రంథం ''కోర్సు'' A course in Modern inguistics (1958) పరిచయ అధ్యాయంలో ''అనేకమందికి భాష గురించిన జ్ఞానాన్ని తెలుసుకోవలసిన వృత్తి పరమైన అవసరం ఉన్నది'' అని కొన్ని ఉదాహరణలను ఆయన పట్టికగా ఇచ్చారు.

1. భాషాలోపాలను సరిదిద్దే నిపుణుడు.

2. వ్యాసరచన నేర్పే ఉపాధ్యాయుడు.

3. పరభాషా బోధకుడు.

4. సాహితీ కళావేత్త.

5. మనస్తత్వ శాస్త్రజ్ఞుడు (మనిషికీ, జంతువులకూ మధ్య విభాజకరేఖ భాష అన్న విషయం ఎరిగినవాడు)

5. నృశాస్త్రవేత్త

6. మతబోధకుడు

7. చరిత్ర రచయిత

8. తత్త్వవేత్త

10. భాషాప్రసార సంబంధ ఇంజనీర్.

ఈ జాబితా ఇక్కడితో పూర్తి అయిందని హాకెట్ ఉద్దేశించలేదు. భాషా శాస్త్రం యొక్కసైద్ధాంతిక, అనువర్తిత రంగాల గురించి ఆయన ప్రస్తావించారు. భాషా పరిశీలనను స్వయం ప్రతిపత్తిగల అధ్యయనంగా భావించాలని హాకెట్ అభిప్రాయ పడ్డారు. భాషా శాస్త్రంలో తరువాత ఏర్పడ్డ పరిణామాల వల్ల, ఈ ''స్వయంప్రతిపత్తి స్థితి''ని సమర్థించడం కష్టతరమైంది. తాత్త్వికంగా కూడా ఈ వైఖరిని సమర్థించడం కష్టమే. జ్ఞాన సంబంధమైన వివిధ శాఖలు వికర్షణాత్మకంగానూ, అదే సమయంలో సంకర్షణాత్మ కంగానూ ఉంటాయి. ఒక్కో ప్రత్యేక సమయంలో, మనకున్న దృక్కోణాన్ని బట్టి ఈ జ్ఞాన శాఖలు వికర్షణాత్మకంగానో, సంకర్షణాత్మకంగానో గోచరిస్తాయి. భిన్న జ్ఞాన శాఖల మధ్య ఇది ఒక గతి తార్కిక సంబంధం, మొత్తంగా జ్ఞానం అభివృద్ధి చెందేందుకు ఈ సంబంధం

అవసరమౌతుంది. పూర్వ, పశ్చిమ దేశాల ప్రాచీన పరిశోధకులు విభిన్న జ్ఞాన శాఖల మధ్య పెద్దగా తేడాలను పాటించలేదు. ''వికర్షణ'', ''స్వయం ప్రతిపత్తి'' అనేవి జ్ఞానాన్ని సూక్ష్మ పరిశీలనా స్థాయిలో పదునెక్కిస్తాయి. అయితే ''సంకర్షణ'' అన్నది జ్ఞాన పరిధినీ, ఉపయోగాన్నీ విస్తృతపరుస్తుంది.

ఆధునిక కాలంలో విభిన్న శాస్త్రాలు విస్తృతంగా పెరిగాయి. ఏదో ఒక రంగంలోనైనా పట్టు సాధించటం కష్టతరమౌతుంది. ఈ స్థితివల్ల భిన్న శాస్త్రాల స్వతంత్ర అభివృద్ధి జరిగి నూతన జ్ఞాన శాఖలు ఏర్పడ్డాయి. వాస్తవానికి, అమెరికాలో భాషాశాస్త్రం సాంస్కృతిక నృశాస్త్రంలో అంతర్భాగంగా మొదలైంది. భాషాశాస్త్రంలో అధ్యయనం చేస్తున్న విద్యార్థులు, చదవాల్సిన అనుబంధ విషయాల్లో, సాంస్కృతిక నృశాస్త్రాన్ని cultural anthropology తప్పక చదవాల్సి వచ్చేది. నేనూ ఆ బాధితులలో ఒకణ్ణి.

విశ్వానికి సంబంధించిన జ్ఞానం ప్రాథమిక స్థాయిలో ఉన్న దశలో, ఒకటికన్నా ఎక్కువ రంగాల్లో పరిశోధకుడు పట్టు సాధించడం సాధ్యమయ్యేది. దీనివల్ల వివిధ శాఖల పరస్పర సంకర్షణ జరిగే వీలు ఉండేది. స్వతంత్ర శాస్త్రస్థాయికి చేరటానికి నూతన శాస్త్రాలు సంఘర్షించేటప్పుడు, అది ఇతర శాస్త్రాలతో సంబంధాలను ఒక రంగం కన్నా ఎక్కువ విషయాల్లో పట్టు ఉన్న శాస్త్రజ్ఞులు ఆ రంగాల మధ్య అఖాతాన్ని పూడ్చి శాస్త్ర సరిహద్దులను విస్తృత పరుస్తారు. ఈ క్రమంలోనే 'మానసిక భాషాశాస్త్రం', ''సామాజిక భాషాశాస్త్రం'' ''విస్తృత భాషాశాస్త్రం''లో భాగాలుగా రూపొందాయి. నలభై ఏళ్ళ క్రితం వర్గీకరించిన రీతిలో ఈనాడు భాషాశాస్త్రాన్ని, వర్ణ నిర్ణయం, పదాంశ నిర్ణయం, వాక్య నిర్మాణం, శబ్దార్థ అధ్యయనాలకు పరిమితం చేయలేం.

ప్రస్తుతం ''సామాజిక భాషాశాస్త్రం'', మానసిక భాషా శాస్త్రాల, విజ్ఞానంతో పరిశోధన చేయటానికి, అనువర్తిత రంగాల్లో వినియోగించటానికీ అనేక అవకాశాలు ఉన్నవి. భాషలోని అంతరాలను అధ్యయనం చేసే సామాజిక భాషాశాస్త్రం భాషాశాస్త్రాన్ని తగిన భౌతిక పునాదిపై పునఃప్రతిష్ఠించింది. దీనివల్ల వ్యవహారంలోని భాషను అధ్యయనం చేసే అవకాశం భాషా శాస్త్రజ్ఞులకు కలిగింది. ఈ క్రమంలో సామాజిక అవసరాలకు అనుగుణంగా భాషను మలిచి కొత్త పుంతల్లో రూపొందించి పథకీకరించి వినియోగించేందుకు నూతన మార్గాలను అన్వేషించడం మొదలైంది. సామాజిక అంతరాలు స్పష్టంగా ఉన్న బహుభాషా దేశంలో, సామాజిక శాస్త్ర పరిశోధనా ఫలితాలను, విద్యావిధాన ప్రణాళికలలో ఉపయోగించుకోవచ్చు. అటువంటి విద్యాపథకాలు దేశంలోనే వెనుకబడ్డ వర్గాలకు ఉపయోగపడతాయి. మానసిక

భాషాశాస్త్రజ్ఞులు మామూలు పిల్లలు నేర్చుకొనే భాష మీదా, మనోవైకల్యం పొందిన పిల్లలు నేర్చుకొనే భాష మీదా అధ్యయనం చేస్తుంటారు. ఈ శాస్త్రజ్ఞులు, పిల్లల వైద్యుల తోటి విద్యావిధానకర్తల తోటి ఉమ్మడిగా కృషిచేస్తే సమాజానికి ఎంతో ఉపయోగంగా ఉంటుంది.

చాలామంది మధ్య వారి వ్యవహారాల్లో వచ్చే సమస్యలకు మూలం వ్యక్తీకరణలో సమస్యలే అని నాకు అనిపిస్తున్నది. ఇటువంటి ఉదాహరణ ఒకటి దెబోరాటానెన్ ప్రస్తావించారు. అమెరికాలో కారులో ఒక జంట పోతున్నప్పుడు భార్య భర్తను సాధుపానీయం తాగుతావా అని అడిగింది. ఆమె భర్త వద్దని జవాబిచ్చాడు. భర్త నిరాకరణతో ఆమె అవమానం పాలైనట్టు భావించి ఆగ్రహించింది. కానీ ఆ సమయంలో పానీయం తాగాలనిపించడం లేదన్నదే భర్త ఉద్దేశం.

కొన్ని వాక్య నిర్మాణాల వల్ల అనుకోని వ్యక్తీకరణలు అందడం నా అనుభవంలో గమనించాను. ఉదాహరణకు ఇదే డిపార్టుమెంటులో ఒక సహోద్యోగిని ఏదో డిపార్టుమెంటు నోటీసు గురించి ''ఆ విషయం నాకు తెలియదే'' (I was not aware of it ) అన్నారు. ఈ వ్యాఖ్య నాకు ఫిర్యాదులా అనిపించింది. మరో ఉదాహరణ. మా ఆవిడ సంభాషణను ''కాదు'' అన్న వ్యతిరేక ప్రత్యయంతో ప్రారంభిస్తుంది. ఆమె విధ్యర్థకం నిశ్చయార్థక రూపాల బదులు, ప్రశ్న రూపాలను ఉపయోగించడం నాకు కించిత్తు కోప కారణమౌతుంది. అయితే ''కాదు'' అన్నది ఆమెకు సంభాషణా ప్రారంభ సూచిక మాత్రమే. ఆమె భాషలో *ప్రశ్నార్థకాలు నిశ్చయ*, విధ్యర్థకాలకు ప్రత్యామ్నాయం. ప్రాయోగిక దృక్కోణం, ఔపయోగిక లక్ష్యాలు సమ్మిశ్రమంగా, సంభాషణా విశ్లేషకుడు ఇటువంటి అపోహలనూ వాటి కారణాలనూ విశ్లేషించగలుగుతాడు. ఒక విశ్వవిద్యాలయం శాఖలోగానీ, మరో ఇతర సంస్థలో గానీ, పనిచేసే సహోద్యోగుల మధ్య ఏర్పడే సమస్యలు భాషా శాస్త్ర అధ్యయనం ద్వారా ఒక కొలిక్కి వస్తాయని నా ఉద్దేశం. వ్యక్తుల మధ్య, సంస్థల మధ్య ఏర్పడే పొరపొచ్చాలు తీర్చేందుకు భాషా ''కౌన్సెలింగ్'' వ్యవస్థ రాబోతున్న భవిష్యత్తును నేను ఊహిస్తున్నాను. *ఉపయోగించుకొనేవారి* అవసరాలకు జ్ఞానాన్ని *తీసుకురావడం* శాస్త్రజ్ఞుల *కర్తవ్యంగా ఉండాలి.* శుద్ధ, అనువర్తిత భాషా శాస్త్రాల మధ్య భేదక రేఖ అంటూ ఎప్పుడైనా ఉన్నా అది చాలా పీలగా మాత్రమే ఉంటుంది.

జనరేటివ్ భాషా శాస్త్రం రాజ్యమేలిన సమయంలో వర్ణనాత్మక భాషా శాస్త్రజ్ఞుడిని అని చెప్పుకోవడం కన్నా, సైద్ధాంతిక భాషా శాస్త్రజ్ఞుడిని అని ప్రకటించుకోవడం ఒక ''సొబగు''గా ఉంటూ ఉండేది. ఏదో ఒక పరివర్తన సూత్రం మీద ఒక ''నిబంధన''

కనిపెట్టడమో, ఒక ''నిబంధన''కు ఏదైనా అపవాదాన్ని చూపడమో చేసి 'సైద్ధాంతిక భాషా శాస్త్రజ్ఞుడిని'' అంటూ ప్రకటించుకొనే వారు చాలామందికి తారసపడే ఉంటారు. గోష్ఠీసమావేశాలలోనూ, సంబంధిత పత్రికలలోనూ, ''నేను ప్రతిపాదిస్తున్నాను'' అనో, ''ఈ వ్యాస ప్రతిపాదన ఏమంటే'' అన్న పదబంధాలు తరచుగా వినబడటం భాషా శాస్త్ర పరిభాషలో రివాజు అయింది. అటువంటి 'సైద్ధాంతిక ప్రవక్తలలో'' ఆధిక్య భావం ప్రదర్శితమయ్యేది. పైగా, అనువర్తిత పార్శ్వాలను పరిశోధించే వారిని వీరు తక్కువ దృష్టితో చూసేవారు. ఒక నిఘంటు నిర్మాణ కృషిలో పని చేయమని నన్ను భద్రిరాజు కృష్ణమూర్తి గారు అడిగితే, ''నిఘంటు నిర్మాణం భాషా శాస్త్రం కాదు'' అని నేను అన్న విషయం గుర్తు వస్తున్నది. తెలుగును ద్వితీయ భాషగా ఏడేళ్లు బోధించాను. అయితే ఈ బోధన భాషా శాస్త్రజ్ఞుడి కార్య క్షేత్రం అన్న నమ్మకం లేకుండానే, బతుకు దెరువు కోసం ఆ బోధన సాగించాను.

తెలుగు భాషా బోధన చేయటం వల్లనే, తెలుగు భాష గురించిన లోవెలుగులు నాకు అవగతంయ్యాయని నేనిప్పుడు గుర్తిస్తున్నాను. ఉస్మానియా విశ్వవిద్యాలయం, భాషా శాస్త్ర శాఖ చరిత్రలో ఒక వాస్తవ విషయాన్ని అంగీకరించాలి. భాషా శాస్త్రాన్ని అనువర్తిత దిశగా అధ్యయనం చేయటానికి ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు మమ్మల్ని నడిపిస్తూ వచ్చారు. విశాల ప్రపంచానికి ఎలా ఉపయోగ పడేదీ మా సెమినార్లు ప్రతిఫలించాలని ఆయన నొక్కి చెప్పేవారు. సమాజానికి ఉపయోగపడే పద్ధతుల్లో ఈ శాఖను అభివృద్ధి పరచాలని ఆయన ఆకాంక్షించారు. భాషా వైకల్యంగల పిల్లలకు భాష నేర్పేందుకు స్పీచ్ పాథాలజీ ప్రయోగశాల నెలకొల్పారు. దీన్ని ఈ దిశలో తొలి అడుగుగా భావించాలి. భాషా వైకల్యాన్ని సరిదిద్దే వారు ప్రజలకు తోడ్పడుతూ, భాషా పరమైన ఇబ్బందులను అధిగమింప జేస్తారు. అటువంటి ''భాషా వైద్యులకు'' భాషా శాస్త్ర విజ్ఞానం అవసరమౌతుంది. భాషా శాస్త్ర స్పృహతో, భాషా స్థాయి అంచనా, సరిదిద్దే విధానం పెరిగి, ఫలితంగా మరో భాషా శాస్త్రశాఖ స్థాయికి చేరింది. దీన్నే డేవిడ్ క్రిస్టల్ ''క్లినికల్ లింగ్విస్టిక్స్''గా ప్రస్తావించారు. ''క్లినికల్ లింగ్విస్టిక్స్'' ను పరిచయం చేసే కోర్సును ఎం. ఏ., ఎం. ఫిల్, స్థాయిల్లో భారతదేశంలో బోధించే యూనివర్సిటీ ఉస్మానియా యూనివర్శిటీ ఒక్కటే అని తెలుస్తున్నది. తెలుగు బధిర బాలల భాషపైనా, రాయడం - చదవడంలలో పిల్లల సమస్యలపైనా, మేధా రుగ్మతలకు గురయిన పెద్దల భాషపైనా, పరిశోధనలు ఈ శాఖలో నిర్వహించబడుతున్నాయి. ఈ అనువర్తిత శోధనలవల్ల, భాషా శాస్త్ర అధ్యయనం

సమాజానికి ఉపయోగపడుతుందన్న విషయం ఇంకా బలపడుతుంది.

భారత్ వంటి బహుభాషా దేశంలో ''అనువాదం'' ప్రక్రియ చాలా ముఖ్యమైన అంశం. మనం శాస్త్ర గ్రంథాలను విదేశీ భాషల నుంచీ, సాహిత్యాన్ని ఇతర భారతీయ భాషల నుంచీ అనువాదం చేసుకోవాలి. ఉస్మానియాలో అనువాద సిద్ధాంత పీఠాన్ని అభివృద్ధి చేయాలనీ, అది ''ప్రాగ్ సౌందర్యశాస్త్ర పీఠం'' తరహాలో ఉండాలనీ ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు కలలుగనే వారని నాకు గుర్తున్నది. ఆ స్వప్నం నిజం కాకపోవచ్చు. కానీ సాహిత్య శాఖల నుంచీ, భాషా శాస్త్ర శాఖ నుంచీ తగిన వారిని ఎంచుకొని మంచి అనువాద కేంద్రాన్ని అభివృద్ధి చేయవచ్చు. వారు, సృజనాత్మక అనువాదకులతోటీ, భాషా శాస్త్రజ్ఞులతోటీ కలిసి అనువాద కృషిని సాగించవచ్చు.

సృజనాత్మకత విషయానికి వస్తే, సృజనశీల సాహిత్యాన్ని అవగతం చేసుకోటానికి, భాషాశాస్త్రాన్ని ఉపయోగించుకోవచ్చు. ఈ వాస్తవం నిగ్గుదేలి, 'శైలీ శాస్త్రం'' అన్న ప్రత్యేక అధ్యయన శాఖ ఏర్పడింది.

(1984, మార్చినెల) ఆంధ్రజ్యోతిలో సావిత్రి ప్రచురించిన ''బందిపోట్లు'' అన్న స్త్రీ వాదకవితను నేను, భాషాశాస్త్రం ఆధారంగా విశ్లేషించాను. ఈ కవిత నిర్మాణాన్ని భాషా శాస్త్రపరంగా బాగా అర్థం చేసుకోవచ్చు. (చూ. చేరాతలు, పేజీ : 127-128)

సాహిత్యంతో భాషాశాస్త్రానికి విడదీయలేని సంబంధం ఉన్నది. అందువల్ల ఆ వివరాల లోకి పోనక్కరలేదు. భారతీయ సాహిత్య శాస్త్రాలలో వ్యాకరణం అంతర్భాగం గానే ఉన్నది. ఆధునిక భాషాశాస్త్రంలో ఈ రెండు రంగాలూ పరస్పర సహకారంతో జ్ఞా ఉంటూ ఉన్నవి. అయినప్పటికీ, సాహిత్య రంగానికి, భాషా శాస్త్రం దోహదం చేసిందన్న విషయం లో కొన్ని అపోహలు ఉన్నది. ఈ స్థితికి భాషా శాస్త్రజ్ఞులే ఎక్కువ బాధ్యత వహించాల్సి ఉంటుంది. భాషా శాస్త్ర శాఖలు ఉన్న విశ్వవిద్యాలయాలలో, ఉమ్మడిగా పరిశోధన జరప గలఅంశాలను శోధించాలని నా సూచన. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పటిష్ఠమైన భాషా శాస్త్ర శాఖ, అనేక సాహిత్య శాఖలూ ఉన్నవి. భాషా శాస్త్ర శాఖ ఏర్పరచిన మూడు దశాబ్దాల తరువాత కూడా, ఆ శాఖకూ, ఇతర సాహిత్య శాఖలకూ మధ్య పరస్పర సంబంధం కొరవడినట్లు కన్పడుతున్నది.

భాషా బోధనలో భాషా శాస్త్రాన్ని అనువర్తింప చెయ్యటం అన్నది బాగా తెలిసిన అంశమే. ఇతర దేశాలతోటీ, ఇతర భాషలతోటీ అమెరికా దేశానికి ఉన్న వలస వాద అవసరాల దృష్ట్యా, అమెరికాలో, ద్వితీయ భాషా బోధనలో భాషా శాస్త్ర జ్ఞాన అవసరం

గుర్తించబడింది. భాషా శాస్త్రం చదువుకోడానికి నేను అమెరికాలో ఉన్నప్పుడు అమెరికన్ యూనివర్సిటీల్లో వివిధ ప్రాంతీయ అధ్యయన శాఖలు ఉన్న విషయం నాకు గుర్తున్నది. సౌత్ అమెరికన్, ఆగ్నేయాసియా, దక్షిణ ఆసియా, ప్రాంతాల అధ్యయన శాఖలు అటువంటివే. కొన్ని విశ్వవిద్యాలయాల్లో, భారతీయ అధ్యయన శాఖలు ఉండేవి. ఆధునిక భాషలకు సంబంధించి బోధనా సామగ్రినీ, ప్రాయోజిక అభ్యాసాలనూ రూపొందించారు. ఇట్లా ద్వితీయ భాషా బోధనకు పర్యాయపదంగానే అనువర్తిత భాషా శాస్త్రం చాలా కాలం ఉంటూ వచ్చింది. నృశాస్త్ర క్షేత్ర పరిశోధకులూ, రాజకీయ శాస్త్ర పరిశోధకులూ మాట్లాడే భాషనే ప్రధానంగా ఎంచుకొన్నారు. పీస్‌కోర్ కార్యకర్తల బృందాలను వర్ధమాన దేశాల ప్రజలకు సహాయం అందించేందుకు ఈ పథకంలోనే పంపించారు. పాశ్చాత్యుల రాజకీయ, సైద్ధాంతిక అవసరాల మేరకు, ఆధునిక భాషా శాస్త్రం, మాట్లాడే భాషలకు అధిక ప్రాధాన్యం ఇచ్చింది. దీనివల్ల భాషా శాస్త్ర ఉపయోగం, పరిధీ ప్రభావితమైనవి. ప్రస్తుతం, మాట్లాడే శైలులనూ, రాసే భాషలోని శైలులనూ విశ్లేషించి, వ్యాకరణ, పదజాలాల్లో వాటి మధ్య ఉన్న భేదాలను వింగడించాల్సి ఉన్నది. లభ్యమౌతున్న రాత ప్రతుల ఆధారంగా, భారత సంస్కృతికీ భాషా పరంగా విభక్తమైన సమాజానికీ సంబంధించిన చరిత్రను నిర్మించేందుకు, ఒక కొత్త తరహా సామాజిక శాస్త్ర వేత్తలు ముందుకు వస్తున్నారు.

భాషా శాస్త్ర విజ్ఞానం ఉపయోగపడే మరో రంగం ''మాతృభాషా బోధన''. మాతృ భాషా బోధన పిల్లలకూ, పెద్దలకూ జరపవచ్చు. ద్వితీయ భాషా బోధనలో రూపొందించిన పద్ధతులు, మాతృభాషా బోధనలో ప్రయోజనకరంగా ఉండవు. నిర్మాణ రీతుల అభ్యాసాలు, ధ్వని సూత్రాలు, వాక్య నిర్మాణరీతులను అనుసరించి తయారు చేసిన పాఠ్యాంశాలు – ఇవేవీ ప్రథమ భాషా బోధనలో పెద్ద ప్రయోజనాలను సాధించవు. ద్వితీయ భాషా బోధనలోనే వీటి ఉపయోగం పోయింది. మాతృ భాషా బోధనలో రాసే భాషకు సంబంధించిన పద్ధతులను బోధించాల్సి ఉంటుంది. వర్ణక్రమం, పదజాలం, వాక్య నిర్మాణ ప్రయోగ రీతులూ మాతృభాషా బోధనలో ఉండాల్సిన అంశాలు. ఆధునిక భారతీయ భాషల్లో మాట్లాడే భాషకూ, రాసే భాషకూ మధ్య కచ్చితమైన విభజన లేనప్పటికీ, మాట్లాడే భాషలో ఉండే అన్ని నిర్మాణ రీతులూ రాసే భాషలో ఉండకపోవచ్చు అన్న విషయం గమనించగలం. అట్లాగే రాసే భాష, మాట్లాడే భాషలో లేని కొన్ని నిర్మాణాలను ఏర్పరచుకోవచ్చు లేదా (పాత వాటిని) కొనసాగించవచ్చు. పాశ్చాత్య భాషల కన్నా, భారతీయ భాషల్లో మాట్లాడే భాష – రాసే భాషల మధ్య ఎక్కువ భేదాలు ఉన్నట్లు నేను గమనించాను. పాశ్చాత్య భాషల్లో అధికశాతపు అక్షరాస్యత వల్ల, మాట్లాడే – రాసే శైలుల పరస్పర

సంకర్షణ, సంబంధాల కారణంగా - వాటి మధ్య అంతరాలు తొలగి పోయాయి. మాట్లాడే భాష - రాసే భాషలలోని తేడాలను వివరించే పాఠ్యాంశాలను ప్రథమ భాషాబోధకుల కోసం, తయారు చేయవచ్చు. ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వారి తెలుగు ఫౌండేషన్ కోర్సులో, ఇటువంటి పాఠ్యాంశాల రూపకల్పనకు ప్రయత్నం జరిగింది. ముఖ్యులైన తెలుగు రచయితల శైలీ భేదాలను పరిచయం చేసే ప్రయత్నం ఆ పాఠ్యాంశాల్లో జరిగింది. దీనికి సంబంధించి ఇంకా ఎంతో కృషి చేయవచ్చు.

ఇటీవల వరకూ భాషా శాస్త్రం మాట్లాడే భాష పట్ల ఎక్కువ మక్కువ చూపేది. భారతీయ భాషల్లో వచ్చిన ఆధునిక భాషా ఉద్యమాలకు భాషా శాస్త్రం ఒక సైద్ధాంతిక పరమైన మద్దతును ఇచ్చింది. ఆంధ్రలో గిడుగు రామమూర్తిగారు 1911లో ప్రారంభించి, గ్రాంధిక వాదులకు వ్యతిరేకంగా సమరం సాగించారు. ఈ వ్యావహారిక భాషా ఉద్యమం సుమారు ఆరు దశాబ్దాల పైగా సాగి, చివరకు ఆధునిక వాదుల విజయంతో ముగిసింది. అన్ని విశాల ఉద్యమాల రీతిగానే, ఆధునిక భాషోద్యమంలోనూ కొన్ని ''అతివాద ధోరణు''లు ఉన్నవి. మాట్లాడే భాష - రాసే భాషల మధ్య ఏదయినా తేడా వస్తే మాట్లాడే రూపమే తప్పకుండా ప్రామాణికం అవుతుందని, కొందరు రచయితలు వాదించారు. బాగా పేరున్న తెలుగు రచయిత్రి ఒకరితో, నేను ఈ విషయంలో వివాదంలోకి దిగాను. మాట్లాడే - రాసే భాషల మధ్య అంతరం అన్నది చాలా మామూలు విషయమనీ, ఇది ఆ రెంటి మధ్య ఉండే ప్రాయోజిక భేదాలను బట్టి ఉంటుందనీ నేను వివరించాల్సి వచ్చింది.

తెలుగు రచయితలలో కర్మణి వాక్యాల పట్ల సాధారణ వైముఖ్యం ఉన్నది. కొన్ని పత్రికలలో ఈ వాక్య నిర్మాణం మీద నిషేధం ఉన్నది. కర్మణి వాక్యాలు ''మాట్లాడే భాష''లో రావు కాబట్టి, వాటిని రాయకూడదని చెబుతుంటారు. ''మాట్లాడే భాష - రాసే భాషలు'' మీద చర్చ, పరిశోధనల వల్ల, భారతీయ భాషా శాస్త్రజ్ఞుల ముందు, ఒక నూతన పరిశోధనా రంగం ద్వారాలు తెరుచుకున్నది. చాలా భారతీయ భాషలలోని పాఠశాలలు, పత్రికలు, పుస్తకాలలో గ్రాంథిక భాష స్థానే, ఆధునిక భాషా శైలి ఉపయోగంలోకి వచ్చింది.

ఆధునిక రచనా భాష, మాట్లాడే భాషతో సంపర్కం వల్ల, సజీవంగా ఉంటుంది. అయితే రచనాభాష పద సంపన్నత కోసం ప్రాచీన భాషమీద కూడా ఆధారపడి ఉంటుంది. అందువల్ల ప్రాచీన, ఆధునిక శైలుల మధ్య సంకర్షణను మనం పరికించవచ్చు. పాఠ్య

పుస్తక రచయితలకూ, పుస్తక ప్రచురణ సంస్థలకూ వచన రచనా శైలుల విషయమై మార్గదర్శక సూత్రాలను రూపొందించడంలో భాషా శాస్త్రజ్ఞుల పాత్ర అవసరమౌతుంది.

భాషా శాస్త్ర విజ్ఞానం ఉపయోగపడే మరో రంగం నిఘంటు నిర్మాణం. పదజాలాన్ని అవగతం చేసుకోవడం, సందర్భోచితమైన ప్రయోగం అన్నవి అసంకల్పితంగా జరిగేవి కావు. ఆధునిక తెలుగు భాషలో సైతం, ఒక పదాన్ని సందర్భోచితంగా ఉపయోగించేందుకు ఆ పదం పరిపూర్ణ అర్థ విస్తృతి తెలిసి ఉండాలి. శైలీ పరమైన సొబగులు కూడా తెలిసి ఉండాలి. అటువంటి నిఘంటువుల కోసం పదాల అర్థాలను అధ్యయనం చేయడంతో పాటు, పదాల మధ్య సంయోజన సుముఖతనూ, సంయోజన విముఖతనూ కూడా పరిపూర్ణ స్థాయిలో పరిశీలన జరపాలి. సరయిన పదాన్ని సరయిన సందర్భానికి ఎంచుకోవడంలో ఇటువంటి కోశాలు ఉపయోగపడతాయి. భారతీయ భాషల్లో దురదృష్ట వశాత్తూ, ఇటువంటి నిఘంటువుల కొరత ఉన్నది. భారతీయ భాషలు బాగా వెనుకబడి ఉన్న రంగాల్లో ఇది ఒకటి. అయితే ఇటువంటి నిఘంటువుల అవసరాన్ని సంబంధిత ఆచార్యులు అధికారులు గుర్తించక పోవడం ఆందోళన కలిగిస్తున్నది.

భాషావసరాలు అధికంగా ఉన్న సంస్థలు తమ కార్యక్రమాల్లో భాషా శాస్త్ర జ్ఞానాన్ని ఉపయోగించుకోవచ్చు. పాలనా వ్యవస్థలో భాషాప్రణాళికా రచన ఇటువంటిదే. ప్రతి రాష్ట్రానికి ఒక అధికార భాష ఉన్నది; కొన్ని రాష్ట్రాల్లో అధికార భాషా సంఘాలూ ఉన్నాయి. ఈ రాష్ట్ర పాలకులు ఏనాడూ భాషా శాస్త్రానికీ, సాహిత్యానికీ మధ్య భేదాన్ని గుర్తించ లేదు. భాషా శాస్త్రజ్ఞులే ఇందుకు తగినవారు అయినా, వారిని ఇట్లాంటి పదవుల్లోకి రానీయకుండా జాగ్రత్తపడ్డారు. ఈ పరిస్థితికి కారణం భాషా శాస్త్రం గురించిన స్పృహను కల్గించడంలో ఆ శాస్త్రజ్ఞుల వైఫల్యం కావచ్చు లేదా పాలకుల దుర్భేద్యమైన అజ్ఞానం కావచ్చు; లేదా ఈ రెండు కారణాలూ కావచ్చు.

అనేక భాషల్లో ప్రస్తుతం బోలెడన్ని ప్రాంతీయ పత్రికలు వెలువడుతున్నాయ్. ఈ పత్రికలలో వ్యక్తీకరణ బలంగా ఉండేట్లు భాషా శాస్త్రజ్ఞుడు తన సలహాలు, సూచనల ద్వారా సహాయం అందించవచ్చు. భాషా ప్రయోగంలో విలేకరులకు శిక్షణ ఇవ్వవచ్చు.

ప్రాచీన భాష అయినా, ఆధునిక భాష అయినా; మాట్లాడే భాష అయినా, రాసే భాష అయినా – వీటిని ఏ రంగంలో ఉపయోగించినా, భాషా శాస్త్ర విజ్ఞానం అత్యంతావశ్యకమైన పరికరం అవుతుంది. ఆధునిక వ్యవస్థలో భాషా ప్రయోగం బాగా పెరిగినందున, భాషా శాస్త్ర విజ్ఞాన వినియోగం కూడా అంతగానూ పెరగాలి. అయితే ఈ విషయంలో ఇందుకు

భిన్న స్థితిని మనం గమనించవచ్చు. మీ అందరినీ ఒకటి కోరుతున్నాను. మీకు ఇష్టమైన సైద్ధాంతిక పరిశీలనతో పాటు, భాషా ప్రయోగం గురించి ఆలోచించేందుకు కొంత సమయం కేటాయించండి . ఇది తక్షణ అవసరమే కాక మన ఒక విద్యావర్గంగా మనం గలిగేందుకూ అవసరమే.

భాషా శాస్త్రంలో ఈ శాఖకు తగినంత చరిత్ర ఉన్నది. అనేక ప్రత్యేక అంశాలలో సుశిక్షితులైనవారు ఈ శాఖలో ఉన్నారు. సామాజిక భాషా శాస్త్రం, సైకోలింగ్విస్టిక్స్, న్యూరోలింగ్విస్టిక్స్, ఇన్‌స్ట్రుమెంటల్ ఫొనెటిక్స్, ఆడియాలజీ, స్పీచ్ పాథాలజీ, అనువాద సిద్ధాంతం, భాషా బోధన అంశాలకు సంబంధించిన ప్రత్యేక నిపుణులు ఈ శాఖలో ఉన్నారు. వీటితో పాటు భాషా శాస్త్రంలో సాంప్రదాయిక రంగాలైన; వర్ణ, పద వాక్య నిర్మాణాలలో శిక్షణ పొందిన వారూ ఉన్నారు, ఒక రంగం కన్నా ఎక్కువ రంగాలలో ప్రావీణ్యం ఉన్న జ్ఞానఖనులూ ఈ శాఖలో ఉన్నారు. తగిన ప్రోత్సాహం, ఆదరణ కల్పిస్తే, వారు అద్భుతాలు సృష్టించగలరు. ప్రయోజనాత్మకమైన పాఠ్య ప్రణాళికలను వారు సృజించగలరు. అట్టి కృషి విస్తృత సమాజాభివృద్ధికి దోహదం చేస్తుంది.

(1996 మార్చి 15-16 తారీకుల్లో ఉస్మానియా విశ్వవిద్యాలయ భాషా శాస్త్ర శాఖ Languages: A multi d sc'plinary approach అని నిర్వహించిన సదస్సులో చేసిన ముఖ్య ప్రసంగానికి శిష్య మిత్రుడు కాచినేని రామారావు తెలుగు సేత Covergence and Divergence : A d'a ect approach to the growth of knowledge అనే శీర్షికతో)

# పత్రికల భాష - ప్రమాణీకరణ

తెలుగు పత్రికలకు సాధారణ భాష కన్నా భిన్నంగా ఒక భాష ఉందనీ దానికి ప్రమాణీకరణ అవసరమనీ ఈ శీర్షిక సూచిస్తున్నది.

తెలుగు పత్రికల భాషను గురించి అంత విరివిగా కాకపోయినా కొన్ని అధ్యయనాలు వచ్చాయి. వాటిని అన్నిటినీ ఇక్కడ పట్టిక ఇయ్యటం కుదరదు. కానీ కొన్నిటినైనా ప్రస్తావించటం అవసరం.

డా॥ వి. లక్ష్మణరెడ్డి తెలుగు జర్నలిజం అవతరణ వికాసాలు అనే అంశంపై తూమాటి దొణప్పగారి పర్యవేక్షణ కింద నాగార్జున విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి డాక్టరేట్ పొందాడు. ఈ సిద్ధాంత గ్రంథం 1985లో అచ్చు అయింది. కొత్తపల్లి వీరభద్రరావు గారి పర్యవేక్షణలో చంద్రశేఖర్ 1982లో తెలుగు పత్రికల శీర్షికలు - భాషా పరిశీలన అనీ 1989లో తెలుగు దినపత్రికల భాష - ఆధునీకరణ అనీ క్రమంగా ఎం. ఫిల్., పి. హెచ్. డి. డిగ్రీల కోసం పరిశోధించి కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి డిగ్రీలు పొందాడు. అనంతపురంలో ఎచ్. ఎస్. బ్రహ్మానంద పర్యవేక్షణలో సుంకర కుమారదేవి తెలుగు దినపత్రికల భాష-స్వరూప ప్రయోగాలు అనే అంశంపై, పరిశోధించి 1983లో శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం నుంచి డిగ్రీ పొందింది. ఎల్. విజయకృష్ణారెడ్డి వార్తా పత్రికలలో నూత్న పరికల్పన అనే అంశంపై ప్రతాపరెడ్డి పర్యవేక్షణలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి 1993లో డిగ్రీ పొందాడు. డా. జి. చెన్నయ్య తెలుగు పత్రికల్లో భాషా సాహిత్య స్వరూపం అనే విషయంపై ఆచార్య గోపీ గారి పర్యవేక్షణ కింద ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి 1996లో డిగ్రీ పొందాడు. ఇంకా ఇతర విశ్వవిద్యాలయాల్లో కూడా కొందరు పరిశోధించి ఉండవచ్చు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం భాషా శాస్త్ర శాఖ వారు 1978లో ప్రసార సాధనాల్లో భాష అనే అంశంపై అఖిల భారత సదస్సు నిర్వహించారు. ఎన్ని లోపాలున్నా రెండు పత్రికా భాషా నిఘంటువులు, ఒకటి తె.వి.వి. వారిది (1995) రెండు ప్రెస్సు అకాడమీ వారిది (1998) వచ్చాయి. వీరి పరిశీలన పద్ధతుల మధ్య భేదాలున్నా వీరందరూ గుర్తించిందేమిటంటే : పత్రికల భాష సాధారణ వ్యవహార భాష నుంచే నిష్పన్నమైనా వారి ప్రయోగంలో కొన్ని కొత్త భాషా విశేషాలు నిర్మాణంలోనూ, ప్రయోగంలోనూ

ప్రవేశించాయని. అయితే ఈ నిర్మాణ, ప్రయోగ విశేషాలు పత్రికా సామాన్యాలా ? లేక ఏ పత్రికకు ఆపత్రికకే విశేషాలా ? అనే విషయం మీద పరిశోధన జరగలేదు. ఆ విషయం తెలియాలంటే ఒక్కో పత్రికా భాష గురించి విశాల కాల పరిధిని గ్రహించి విస్తృతంగా పరిశోధిస్తే చెప్పవచ్చు. అయితే ఇక్కడో విశేషం ఉంది. పత్రికోద్యోగుల్లో Mobi ity is the rule. ఒక పత్రికలోనే స్థిరంగా ఉండేవారి సంఖ్య అతి స్వల్పం. పత్రికోద్యోగుల్లో పత్రికల మధ్య మానవ వనరుల వినిమయం చాలా అధికంగానే ఉంది. ఇది పత్రికల భాషలో ఏకత్వానికి దోహదం చేస్తుంది.

సాధారణ వ్యవహార భాష నుంచి పత్రికా రచనా భాష ఏర్పడే మాట నిజమే అయినా, పత్రికా భాష ఇతర రంగాల వ్యవహార భాషను ప్రభావితం చేసే మాట కూడా నిజమే. రాజకీయ కార్య కలాపాలలో నిమగ్నుడైన కార్యకర్త మాట్లాడే భాష తాను చదివే పత్రిక భాష వల్ల ప్రభావితం కావటం కూడా మన అనుభవంలోని విషయమే. ఈనాటి విశ్వ విద్యాలయాల్లో పరిశోధకుల్లో అనేకులు తమ పరిశోధక వ్యాసాల్లో, గ్రంథాల్లో పత్రికా భాషా సదృశమైన పద రూపాలను వాక్య రీతులను విరివిగా వాడటం నేను గమనించాను. ఇతరులు ఉపన్యాసాల్లో చేసే ప్రయోగాలను, రచనల్లో వాడే భాషా ప్రయోగాలను పత్రికల వారు తమ భాషలోకి మార్చే పద్ధతిని కూడా మనం గమనించవచ్చు. ఇవన్నీ వేరు వేరుగా పరిశోధించి నిగ్గు తేల్చాల్సిన విషయాలు. అయినా స్థూలంగా మనం ఒక విషయం చెప్పవచ్చు. ఆధునిక వ్యవహార భాషను, దానిపై ఆధారపడ్డ ఆధునిక రచనా భాషను తెలుగు పత్రికలు విపరీతంగా ప్రభావితం చేస్తున్నాయి. వారి వారి రచనా మార్గాలు, ప్రయోజనాలు భిన్నమైనా రంగనాయకమ్మగారి వాడుక భాషే రాస్తున్నామా ? రవ్వా శ్రీహరిగారి వాడుక భాషలో అపప్రయోగాలు అనే పుస్తకాలు ఈ విషయంలో కొంత సాక్ష్యాన్ని అందిస్తున్నాయి. వాక్య నిర్మాణంలో కనిపించే అంశాలను నేను అక్కడక్కడా కొన్ని వ్యాసాల్లో గుర్తించి ఎత్తి చూపాను. బూదరాజు రాధాకృష్ణగారి వంటి పండితులు తాము పనిచేస్తున్న పత్రికల వారిని సంస్కరించ డానికి ప్రయత్నిస్తున్నా తపోశక్తి, మనోశక్తి వంటి సంధిరూపాలు, మిశ్రమ సమాసాలు విరివిగానే పత్రికా భాషలో కనిపిస్తున్నాయి. అవి అక్కడితో ఆగవు. ఇతరేతర రచనా వ్యవహారాల్లోకి వెంటనే పాకుతున్నాయి.

ఈ పై ఉపోద్ఘాతం సారాంశం ఏమిటంటే నేటి పత్రికల భాషను గురించి ఏం చెప్పినా, ఏం చేసినా ఆధునిక భాషను గురించి చెప్పినట్టే, చేసినట్టే. పత్రికల భాష అనే తీగెను కదిలిస్తే ఆధునిక రచనా భాష, ఆధునిక వ్యవహార భాష అనే డొంకలు కదులుతాయి. ఇక ప్రమాణీకరణ విషయం చూద్దాం. ఈ మాటను భాషా శాస్త్రంలోనూ, బయటా వేరు

వేరు అర్థాల్లో వాడుతున్నారు. భాషా ప్రయోగ వైవిధ్యాన్ని తగ్గించి భాషను ఏకోన్ముఖం చేసే ప్రయత్నాన్ని ప్రమాణీకరణం అంటాం. ఇది అనుకున్నంత తేలిక కాదు. ఇతర భాషల సంగతేమో కాని తెలుగులో ఇది బహుకష్టసాధ్యం అనిపిస్తున్నది. అందుకు కారణాలు అనేకం.

ఇందుకు నాకు కనిపిస్తున్న ఒక ప్రధాన కారణం మన వ్యావహారిక భాషోద్యమ సంప్రదాయం. వ్యావహారిక భాషోద్యమం మనకు నిజానికి ఒక సంప్రదాయాన్ని ఇయ్యలేదు. అది చేసింది సంప్రదాయ విచ్ఛేదమే. వ్యావహారిక భాషోద్యమం తప్పు అని నా ప్రతిపాదన కాదు. సంప్రదాయ విచ్ఛేదమూ తప్పు కాదు. భాష నియత వ్యవహారం. రచనా భాషలోనూ ఆ నియతి అవసరం, నియతి సహజంగానూ ఉండవచ్చు, ఏర్పర్చుకోనూ వచ్చు. మాట్లాడే భాషలో అది సహజంగా ఏర్పడుతుంది. రచనా భాష మాట్లాడే భాష కన్నా భిన్నం కనుక, దానిపై ప్రభావాలు వివిధం కనుక, ప్రయోజనాలు విభిన్నం కనుక రచనా భాషలో ఏకత్వం సహజంగా ఏర్పడదు. మానవ ప్రయత్నం అవసరం. మాట్లాడినట్లు రాయాలనే వాదం ఏకత్వాన్ని ఏర్పడనీయదు. ఇందుకు కూడా కారణాలు అనేకం.

అందరం ఒకే రకంగా మాట్లాడం. ఉచ్చారణలోనూ, పదాల ఎన్నికలోనూ, వాక్య విన్యాసంలోనూ ఈ భేదాలు కనిపిస్తాయి. ఇవి మనిషికీ మనిషికీ భేదిస్తాయి. వీటిని ఉత్పాదన భేదాలు (Production differences ) అందాం.

ఉచ్చారణలోనూ ఇతరత్రానూ కనిపించే ఈ భేదాలను గుర్తించడం ఒక పట్టాన సాధ్యమయ్యేది కాదు. ఈ గుర్తించటంలో కూడా వ్యవహర్తల మధ్య భేదాలుంటాయి. వీటినే Perceptual differences - గ్రహణ వైవిధ్యం - అందాం.

తెలుగులో అచ్చుల ఉచ్చారణ ఇందుకు ఒక తగిన ఉదాహరణ. తెలుగులో బీరు - బీర, పేడు - పేడ, గూడు - గూడ, గోడు - గోడ, కంపు - కంప అనే మాటల జంటల్లో ఒకే రకంగా రాసిన మొదటి అచ్చుల్లో ఉచ్చారణ భేదం ఉంది. దీన్ని వ్యవహర్తలందరూ గుర్తించరు. కొన్నిటిని వ్యవహర్తలు గుర్తిస్తారు. ఉచ్చరించినట్టు రాయాలంటే ఈ భేదాలను రాయాలి. కాని ఎవరూ రాయరు. కాని తాటి + ఆకు అనే చోట జరిగే సంధిని రాయాలంటారు. అప్పుడే వేరే గుర్తు కోసం వెతుక్కుంటాం. ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారి తెలుగు వర్ణ పరిగణన పద్ధతిలో ఈ అచ్చును గుర్తించారు. వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు ఇందుకు లిపిని కల్పించారు. ఇక్కడ చిక్కేమిటంటే తెలుగులో అచ్చుల్లో సంధి వల్ల వచ్చే ఉచ్చారణ భేదాలను గుర్తించి వేరే లిపిని

సూచించాలంటే నలభైకి పైనే గుర్తులు కావాల్సి ఉంటాయి. ఉచ్చారణలో జరిగే సంధిని రాతలో చూపించకపోతే కొంప మునుగుతుందా ?

తెలుగులో ఇ, ఈ, ఎ, ఏ అనే తాలవ్యాచ్చుల ముందు *య* అనే హల్లు *ఉ, ఊ, ఒ, ఓ* అనే ఓష్ఠ్యాచ్చుల ముందు వ అనే హల్లు వికల్పంగా చేరుతాయి. అందువల్ల తెలుగు వారు ఇది - *యిది, ఈక - యీక, ఎందుకు - యెందుకు, ఏరు - యేరు ఉంది - వుంది, ఊరు - వూరు, ఒకటి - వొకటి, ఓపిక - వోపిక* అనే విధంగా ఉచ్చరిస్తారు. వ్యావహారిక భాషావాదం రాకముందు కూడా ఈ ఉచ్చారణ భేదాన్ని గుర్తించారు. పాత కైఫీయత్తులలో ఈ ద్విరూపత కనిపిస్తుంది. వ్యావహారిక భాషా వాదం వచ్చిన తరువాత వీటి వాడుక ఎక్కువయ్యింది. ఈ ఉచ్చారణ భేదం వికల్పం కనుక రాతలో చూపించక్కర లేదు. అంటే ఆగమంగా వచ్చిన హల్లును రాతలో సూచించటం వల్ల భాషా రచనలో వచ్చే సౌకర్యమూ లేదు; సూచించక పోవడం వల్ల ఉచ్చారణలో వచ్చే చిక్కులు లేవు. పైగా తెలుగు సంధిలో అదనంగా వచ్చిన హల్లును అదనపు లోపంగా కూడా చెప్పుకోవాలి. ఈ తెచ్చుకోటం ఎందుకు? లోపం చెప్పుకోవటం ఎందుకు ?

తెలుగు రచనలోను ఈ అదనపు *య*, వలు అంత నియతంగా కనపడవు. చలం, రంగనాయకమ్మ, ఆధునిక పత్రికా రచయితల్లో ఇంకా చాలా మంది అదనపు *వ* కారాన్ని సూచిస్తున్నారు. గాని *య*కారాన్ని వదిలేస్తున్నారు. వారిలో కొందరు సంస్కృతం మాటను ఈ వడ్డింపు నుంచి తప్పిస్తున్నారు. మరి కొందరు వాక్య మధ్యంలో అదనపు వ కారాన్ని చూపించి వాక్యాదిని, వదిలేస్తున్నారు. అదనపు *య* కారాన్ని రాచమల్లు రామ చంద్రారెడ్డి గారొక్కరే నియతంగా వాడినట్లు కనిపిస్తుంది. పాతతరం రచయితల్లో దేవులపల్లి కృష్ణ శాస్త్రి, శ్రీ శ్రీ ప్రభృతులు ఈ అదనపు య, వ లను వాడినట్లు లేదు.

నియమ ధ్వంసమే వ్యావహారిక భాషా స్వరూపం అయిన దశలో ఇవి తెలుగు రచనలో విరివిగా చేరాయి. ఉచ్చారణ విధేయంగా రాయటం అనే పేరుతో అచ్చులను రాయటంలో ఉన్న ఏక సూత్రతను భగ్నం చేశారు. ఉచ్చారణ విధేయంగా రాయటం ఒక భ్రమ అని గుర్తించలేకపోయారు.

సంస్కృత పదాలను తెలుగు లిపిలో రాసేటప్పుడు వాటి ముక్కు మొహం ఏర్పర్చరానంత చిత్రిక పట్టిన ఘట్టాలున్నాయి.

సంస్కృతంలో రాసే *ఋ, ౠ* లను పదాదిన వచ్చినప్పుడు రాయటం మానేశారు. *రు* అనే రాస్తున్నారు. హల్లుతో వచ్చినప్పుడు కొందరు రాస్తున్నారు కొందరు రాయ

గూడని చోట రాస్తున్నారు. మరికొందరు శబ్ద స్వరూపాన్ని గుర్తించలేనంత రాస్తున్నారు. శత్రువు, మిత్రుడు అనో చోట్ల శతృవు, మితృడు అని రాస్తున్నారు. రంగనాయకమ్మ గారు 'కృత్రిమంగా' అనే శబ్దాన్ని కుత్రిమంగా అని రాస్తారు. ఉప్పల లక్ష్మణరావు గారు '్ర' అనే గుర్తును ఎప్పుడూ 'రేఫం'గానే రాస్తారు. వడ్డెర చండీదాసులో కూడా ఇటువంటి భాషావైపరీత్యాలు విపరీతంగా ఉన్నాయి.

త్య, ద్య అనే సంస్కృత వ్యంజన సంయోగాలు తెలుగు వారి ఉచ్చారణలో చ్చ - జ్జ అనే విధంగా చకార,జకార, ద్విత్వోచ్చారణాలుగా మారతాయి. ఉచ్చారణ విధేయంగా రాయాలనే ఛాదస్తం కొద్దీ *సత్యం* అనే మాటను *సత్తెం, సచ్చెం, సచ్యం* అని మూడు విధాలుగానూ, *పద్యం* అనే మాటను, *పద్దెం, పజ్యెం, పజ్జం* అని మూడు విధాలుగానూ రాస్తున్నారు. *శ,* ష, స ల భేదాలను పూర్తిగా వదిలేస్తున్నారు. కొందరు కొంత వరకు పాటిస్తున్నారు.

ఇక సంస్కృత సంధుల్లో సంస్కృత భాషా నియమాలు పాటించడం ఎప్పుడో మానేశారు, *తపోశక్తి, తపోఫలం* వంటి సంధి రూపాలకు అంతమే లేదు.

నేటి తెలుగులో కనిపించే వర్ణక్రమాఽవ్యవస్థకి ప్రధాన కారణం ఉచ్చారణ విధేయంగా రాయాలనే ఛాదస్తం. ఉచ్చారణ విధేయంగా రాయటం సాధ్యమూ కాదు, అవసరమూ లేదు. ఆధునిక ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని, భాషా సంప్రదాయాలను గుర్తుంచుకొని కొన్ని నియమాలను పాటించటం కష్టం కాదు. ఉదాహరణకు ఈ కింది మార్గదర్శక సూత్రాలను పాటించవచ్చు.

1. తెలుగు మాటలకు మొదట అధిక య, వలను రాయటం మానుకోవాలి. 'య కారంబును, వు, వూ, వొ, వోలును తెలుగు మాటలకు మొదట లేవు'. అనే బాల వ్యాకరణ సూత్రాన్ని ఈ అర్థంలో అను సంధించుకోవాలి.
2. సంస్కృత పదాల వర్ణక్రమాన్ని ఆ భాషా వ్యాకరణాన్ని అనుసరించే పాటించాలి.

ఈ పద్ధతి వల్ల పదరూపాల్లో ఏకతను సాధించటమే కాక తెలుగులో ఇప్పటి వరకూ ప్రచురంగా ఉన్న గ్రంథాలను అర్థం చేసుకోటానికి పనికి వస్తుంది. ప్రసిద్ధాంధ్ర సంస్కృత నిఘంటువులలో మాటలు వెతుక్కోవటం సులభ సాధ్యం అవుతుంది.

ఈ సందర్భంలో వ్యావహారిక భాషోద్యమం వ్యాపింప జేసిన కొన్ని అపోహలను, నిరర్థక వాదాలను పరీక్షకు పెట్టి వదిలెయ్యటం అవసరం.

ఉచ్చరించినట్టు రాయటం అనే వాదంలో అసంగతత్వాన్ని పైన గమనించాం. మాట్లాడే భాషే రాయాలనటం మరో నిరర్థక వాదం.

మాట్లాడే భాషకు, రాసే భాషకు వేరు వేరు సౌకర్యాలు, అసౌకర్యాలు (పరిమితులు), ప్రయోజనాలు ఉన్నాయి. భాషా సమాజాలు పెద్దవైనప్పుడు వారి ఆవాసాలు దూరమవుతాయి. అప్పుడు మాట్లాడే భాషలోనే అన్నివేళలా భావప్రకటన సాధ్యం కాదు. రాసే భాష దూరాన్ని అధిగమిస్తుంది. ఒక కాలంలో ఒక జాతి సంపాదించిన జ్ఞానాన్ని మరో కాలానికి అందించటానికి మాట్లాడే భాషకు శక్తి చాలదు. మాట్లాడే భాషలో విషయ నిక్షేప విక్షేపాలకు మానవమేధా, జ్ఞాపక పరిమితులున్నాయి. విషయ వైపుల్యాన్ని, కాలాంతరంలో పరిమితులు లేకుండా అందించడానికి రాసే భాష శక్తి మంతమవుతుంది. మాట్లాడే భాషలో విషయ పునరుక్తి విషయ సమ్యక్ గ్రహణానికి అవసరం అవుతుంది. దీన్నే మనస్తత్త్వ శాస్త్రంలో రీ-ఇన్‌ఫోర్సుమెంటు (reinforcement) అంటారు. రాసే భాషలో ముందు వెనుకలకు చూపు తిప్పే సౌకర్యం వల్ల విషయ పునరుక్తి అవసరం ఉండదు. సంక్షిప్తత సాధ్యం అవుతుంది. రాసే భాషలో విషయ గ్రహణకు పట్టికలు, ఫార్ములాలు, పటాలు, యాంత్రిక ఊహ చిత్రాల (mode s) సాయం వల్ల గహన విషయ ప్రతిపాదన, గ్రహణ-సులువవుతాయి. మాట్లాడే భాషలో ఈ సౌకర్యాలు లేకపోవటం వల్ల, గహన విషయ ప్రతిపాదనకు ఆటంకాలు ఎక్కువ. మానవ జాతి జ్ఞాన గ్రహణ క్రమంలో సాధించుకున్న అమూల్య సాధనం రాసే భాష. ఈ సౌకర్యాలను గమనించకుండా మాట్లాడినట్టు రాయటం అనే మూఢ విశ్వాసాన్ని పట్టుకు వేలాడటం అభివృద్ధి నిరోధకతత్వం అవుతుంది.

అయితే మాట్లాడే భాష సర్వశక్తిహీనమయినదా ? దాని ప్రయోజనం లేదా అనే ప్రశ్నలు కూడా వేసుకోవాలి.

మనిషికి జ్ఞానం ఎంత అవసరమో వినోదం, భావావేశం, మానవ సంబంధాలు మొ॥ అంతే అవసరం. కళలు, సాహిత్యం ఈ అవసరాల కోసం వచ్చినాయి. మాట్లాడే భాషలో వ్యక్తమయినంత శక్తిమంతంగా ఇవి రాసే భాషలో వ్యక్తం కావు. అందువల్ల మాట్లాడినట్టే రాయటానికి అవరోధాలు ఉన్నా వాటిని అధిగమించటానికి ప్రయత్నించి రాసే భాషను మాట్లాడే భాషకు అతి సన్నిహితంగా తీసుకెళ్ళే ప్రయత్నం చేయాలి. జ్ఞానాన్ని అధిక ప్రజలకు అందించాలంటే మాట్లాడే భాష ద్వారానే చేయాలి. పాలకులు పారదర్శకంగా ఉండాలంటే మాట్లాడే భాష ద్వారానే సాధ్యం. ఇద్దరు మనుషుల ప్రత్యక్ష సంభాషణలో

వ్యక్తమయినంత భాషా తీవ్రత రాసే భాషలో సాధ్యం కాదు. మాట్లాడే భాష, రాసే భాషల సౌకర్యాలూ, పరిమితులు గ్రహించి వాటిని సరైన పద్ధతుల్లో మానవ కళ్యాణానికి వాడుకోటం సరి అయిన పద్ధతి.

భాషలో ప్రకృతి ప్రత్యయాలను, పదాలను, వాటి పరస్పర సంబంధాలను వ్యాకర్తలు విశ్లేషించి చూపిస్తారు. దీన్నే వ్యాకరణం అంటాం. ఇట్లాంటి వ్యాకరణం భాషా వ్యవహర్తలు భాషా సంపాదన క్రమంలో నిర్మించుకుంటారని, ఇదే భాషా వ్యవహారానికి మూలకందం అనీ భాషా శాస్త్రజ్ఞులంటారు. ఈ వ్యాకరణం ఎట్లా ఉంటుందో ఎవరికీ తెలీదు. తెలుసుకునే వీలు కూడా లేదు. అయితే ఈ అమూర్త అలిఖిత వ్యాకరణానికి నమూనాగా వ్యాకర్తలు లిఖిత వ్యాకరణాన్ని నిర్మిస్తారు. భాషా ప్రయోగంలో మెలకువలన్నీ భాషా వ్యవహర్తలకు అజ్ఞాతంగా తెలుసుననీ, ఆ అజ్ఞాత జ్ఞానాన్ని వ్యక్తం చేయటం వ్యాకర్తల కర్తవ్యమనీ ఈ సిద్ధాంతం చెపుతుంది. *వ్యవహర్తలకున్న భాషా నిర్మాణ, ప్రయోగ దక్షతలన్నీ వ్యాకరణం వ్యక్తం చెయ్యాలని భాషా శాస్త్రం పెట్టుకున్న లక్ష్యంలో భాగం ఇది. అయితే నిర్మాణాన్ని గురించి చెప్పినంతగా ప్రయోగాన్ని గురించి భాషా శాస్త్రం చెప్పలేదు.* అందువల్ల భాషా ప్రయోగంలో కొన్ని అపోహలు తెలుగులో ప్రచారంలో ఉన్నాయి. కర్మణి వాక్యాలు, యత్తదర్థక వాక్యాలు తెలుగు భాషకు అసహజమని, వాటిని పత్రికల్లో నిషేధించాలనీ పూర్వ పత్రికా సంపాదకులు గట్టిగా నమ్మారు. భాషకు ఇవి అసహజం అనే వాదమే లోప భూయిష్ఠమైనది. గ్రామీణుల భాష సహజమైనది. పత్రికల్లో చదివే భాష అసహజమైనది. సైన్సు పుస్తకాల్లో ఇంకా అసహజమైనది - ఇట్లా ఈ వాదాన్ని పెంచుకుంటూ పోవచ్చు. మనుషులు దిగంబరంగా ఉండటం సహజమైనది, వస్త్రధారణ అసహజమైనది. అపక్వాహారం సహజమైనది, పక్వాహారం అసహజమైనది. గుహల్లో నివసించడం సహజమైనది, ఇళ్ళు కట్టుకోటం అసహజమైనది. అరణ్య వాసం అత్యంత సహజం, నగరవాసం అసహజం ఈ సహజ-అసహజ వాదం ఇట్లా ఎంత దూరమైనా పొడిగించవచ్చు. ఇది ఎంత అసంబద్ధమో చూపించడానికి ఇది చాలు.

ఏ భాషలో అయినా రెండు వాక్య భేదాల మధ్య అర్థసామ్యం ఉన్నప్పుడు ప్రయోగ భేదం ఉంటుంది. ప్రయోగ భేదాన్ని సరిగ్గా గమనించక ఒకటి సహజం ఇంకొకటి అసహజం అనుకోటం అజ్ఞానం లేక అమాయకత్వం. చాలా నాగరిక భాషల్లో కర్త్రర్థక వాక్యాలు (Active sentences) కర్మణ్యర్థక వాక్యాలు (passive sentences) ఉంటాయి. ఇవి తుల్యార్థకాలే కాని, అన్ని సందర్భాల్లోనూ పరస్పరాదేశ యోగ్యాలు కావు. వీటి ప్రయోగయోగ్యతలో భేదాలున్నాయి. కర్తృప్రాధాన్యం లేనప్పుడో, కర్తజ్ఞాతం

కానప్పుడో, వక్తృశ్రోతల మధ్య దూరం ఎక్కువ ఉన్నప్పుడు సంభాషణేతర, అసాధారణ విషయ భాషా వ్యవహారంలో కర్మణి వాక్యాలు తెలుగులో ప్రయోగార్హాలు. ఉపన్యాసాల్లోనూ శాస్త్ర విషయాల్లోనూ తెలుగులో కర్మణి వాక్యాలు ప్రయోగార్హాలు. ఇతరత్రా వీటి విషయం చర్చించి ఉండటంవల్ల వీటిని గురించి ఇక్కడ ఉదాహరణలతో విస్తరించటం లేదు. (చూ. తెలుగు వాక్యం రెండో ముద్రణ, 1999).

అట్లాగే తెలుగులో యత్తదర్థక (ఏ-ఆ) వాక్య నిర్మాణం, క్రియాజన్య విశేషణ వాక్య నిర్మాణం కొన్నిచోట్ల సమానార్థకాలు. *ఆమె కట్టుకొన్న చీర కంజీవరంలో కొన్నది* అన్నా *ఆమె ఏ చీరకట్టుకొన్నదో అది కంజీవరంలో కొన్నది* అన్నా అర్థం ఒకటే. రెండో రకం వాక్యం ఉన్నత విషయం నివేదనంలో, ఆవేశ పూరితంగా (emotional) చెప్పేటప్పుడు వాడతాం. ఈ రకం వాక్యాలు కథల్లో, కవిత్వంలో, సినిమాల్లో ఎక్కువ కనిపిస్తాయి, వినిపిస్తాయి. ఈ పద్ధతిలో వాక్య ప్రయోగ రహస్యాలు పరిశీలించి గ్రహించాలి గాని, ఒక్కో వాక్య నిర్మాణానికి పిచ్చి పేర్లు పెట్టి వాడగూడదని నిషేధాలు విధించటం కనీసం భాషావేత్తలు చెయ్యగూడని పని. భాషా నిర్మాణ ప్రయోగ రహస్యాలు భేదించి ప్రయోగ యోగ్యతను గమనించి అదునెరిగి సందర్భోచితంగా వాడుకోడం భాషా ప్రయోగ చణులు చెయ్యదగిన పని.

ప్రమాణీకరణలో మాండలికాన్ని ఏం చెయ్యాలి ? అని మరో ప్రశ్న ఉదయిస్తుంది. ప్రమాణ భాష – ప్రజా భాష అనే మాటలు వాడేవారు మనసుల్లో ఒక్కోసారి ఈ భావనలకు కొన్ని విలువలను ఆపాదిస్తున్నారు. ప్రజాభాష, ప్రజా కళలు, ప్రజా గాయకుడు, ప్రజాకవి-వంటి మాటలు కొన్ని రాజకీయ అభిప్రాయాల వారు కొన్ని ప్రత్యేకార్థాల్లో వాడతారు. అక్కడ విలువలు ఆపాదించడం వారి వాడకంలో ఒక భాగం. శాస్త్రంలో అట్లాంటి విలువలు ఉండవు. ప్రమాణ భాష మాండలిక భాష కన్నా ఎక్కువా కాదు, తక్కువా కాదు. అయితే అన్ని ప్రాంతాల వారికీ అవసరమైనది, వాడుకలో ఉన్నది ప్రమాణ భాష. ప్రాంతాలకు పరిమితమైనది మాండలికం. ప్రమాణ భాషకు రాతతో ఎక్కువ పని. మాండలిక భాషకు మాట్లాడటంతో ఎక్కువ పని. ప్రమాణ భాష మాట్లాడేవారు మాండలిక భాష కూడా మాట్లాడ తారు. ఈ రెండూ ఒకరినే ఆశ్రయించే అవకాశం ఉంది. ఒక్కోసారి ఒక దాని నుంచి ఇంకొక దానిలోకి మారే అవకాశం ఉంది. ముఖ్యంగా అవసరాన్ని బట్టి పదాలు ఒక వైపు నుంచి మరో వైపు చేరవచ్చు. ఏ భాషా భేదంలో అయినా ఇంకో భాషా భేదం నుంచి పదజాలం ప్రవహించవచ్చు. దాన్ని పనిగట్టుకుని ఆపక్కర్లేదు. ప్రాంతీయతా ముద్ర

ఉన్నది మాండలికం. ప్రాంతీయతను అతిక్రమించినది ప్రమాణ భాష. ప్రాంతీయతా ముద్ర అవసరం లేని పాఠ్య గ్రంథాలలోను, శాస్త్ర గ్రంథాల్లోనూ, పత్రికా వార్తల్లోనూ, సంపాదకీయాల్లోనూ ప్రమాణ భాష వాడతాం. పూర్వం అంజయ్య ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రిగా ఉన్నప్పుడు ఆయన ఉపన్యాసాలు 'ఈనాడు' పత్రికలో ఆయన మాట్లాడే భాషలో రిపోర్టు అయేవి. ప్రాంతీయతా ముద్ర అధికంగా ఉన్న వారి మాటలను ఆ ప్రాంతీయ భాషలలోనే రిపోర్టు చెయ్యటం వల్ల ఆయన చెప్పదల్చుకున్న దానికి సన్నిహితంగా ఉంది. సామాన్య సూత్రంగా కాక విశేష ప్రయోగంగా ఇట్లాంటివి చెయ్యటం వల్ల నష్టం లేదు. అట్లాగే ఈనాటి దినపత్రికలకు ప్రాంతీయానుబంధాలు అదనపు పత్రికగా ఇస్తున్నారు. వాటిల్లో అంత ఎక్కువగా కాదు గాని కొంత ప్రాంతీయతా ముద్ర ఉంటున్నది. కొన్ని హైదరాబాదు పత్రికలలో అసలు పత్రికలో ప్రధాన శీర్షికలలో కూడా ఉర్దూ పదాలక్కడక్కడా వాడు తున్నారు. అంత ఇబ్బంది పెట్టేవి కాకపోతే ఫరవాలేదు. ఉర్దూ మాటలకన్నా పత్రికల శీర్షికలలో ఇంగ్లీషు మాటలే ఎక్కువ ఇబ్బందికరంగా ఉన్నాయి. 1999 సెప్టెంబరు 18 *వార్త హైదరాబాదు,* అనుబంధ పత్రికలో 'ఇసి ఆదేశాలను తుంగలో తొక్కిన రవాణా శాఖ జీవో జారీ' అనీ అదే రోజు *ఈనాడులో* 'ఆంధ్ర సర్కారు ఏసియస్ ఈబీలకు మానవ హక్కుల కమీషన్ నోటీసులు' అనీ 2000 జనవరి 14 ఈనాడులో 'టరమ్ డిపాజిట్లలో పెట్టుబడులకు ఎన్. బి. యఫ్. సీలకు ఆర్‌బి ఐ అనుమతి' అనీ అదే రోజు అదే పత్రికలో అదే పేజీలో 'ఎబిసీ ఎల్ వినతిని తిరస్కరించిన డి ఆర్ టి' అనీ ఉన్నాయి. సంక్షిప్తీకరించిన ఇంగ్లీషు పదబంధాలు తెలుగు లిపిలో వార్తాంశాన్ని చెప్పిన అందనీయవు.

ప్రతిభాషలోనూ జాతీయాలు, నుడికారాలు ఉంటాయి. ఇవి మాట్లాడే భాషకు అందం, అలంకారం. కానీ ప్రమాణ భాషలో ఆ అలంకారాలే ఇబ్బంది పెడతాయి. ప్రమాణ భాషకు విషయ నివేదనం ముఖ్యం. అలంకారం, చమత్కారాలు గుణాలు కావు. అవే సాధారణ సంభాషణలో గుణాలవుతాయి. జాతీయాల్లో మాటల విడివిడి అర్థాలకు మొత్తం కలిపితే వచ్చే అర్థానికి పొంతన ఉండదు. అందరి భాషలలోనూ ఇవి ఉండాల్సిన అవసరం లేదు. ఉండకపోవచ్చు. తెలుగులో ఇంగ్లీషులో లాగా జాతీయాల నిఘంటువులు లేవు. (ఇటీవల డా. ఎం. విజయలక్ష్మి ఒక జాతీయాల నిఘంటువు అచ్చు వేసింది). జాతీయాలు సామాన్య భాషను కవిత్వం వైపు నెడతాయి. కవిత్వం ముఖ్య విషయ నివేదనకు ఆటంకం ! కవిత్వం మనిషిని అర్థగ్రహణ నుంచి మరోవైపుకు లాక్కుపోతుంది. తెలుగు పత్రికలలో ఇవి మరీ ఎక్కువ. పూర్వం ఇచ్చిన వార్తాంశంలో 'తుంగలో తొక్కు' అనే జాతీయ నగర వాసులకు అర్థం కావాలని లేదు. *ఈనాడు* 1999 సెప్టెంబరు 18

పత్రికలో 'ప్రాంతీయ భాషా పత్రికలకు పాఠకుల పెద్ద పీట' అనే శీర్షిక ఉంది. ఆంధ్రభూమి 1994 సెప్టెంబరు 22 పత్రికలో 'కార్మికుల ప్రయోజనాలను కాలరాస్తున్న పాలకులు' అనీ అదే రోజు ఆంధ్రభూమిలో 'ఆకట్టుకున్న ఓపెన్ కోర్ట్-యజమానుల గుండెల్లో రైళ్ళు' అనీ శీర్షికలున్నాయి. *కాలరాచు*, *గుండెల్లో రైళ్ళు* అనేవి అందరికీ చప్పున అర్థమవుతాయనుకోను. అదీకాక ఇవి ఆలోచనలను సూటిగా వెళ్లనీయకుండా పక్కదారులు పట్టిస్తాయి. జాతీయాలు భాషకు సర్వత్రా అలంకారాలు కాదు. ఇవి భాషను కవిత్వం చేసే మసాలా దినుసులు. ప్రమాణ భాషకు ఇవి వర్జ్యాలు.

ఈనాటి పత్రికల భాషలో ఈనాటి కవిత్వంలో లాగా చమత్కారాలు ఎక్కువ. ప్రతీకలు ఎక్కువ. అంత్యప్రాసలు సరేసరి. 1999 సెప్టెంబరు 18న *ఈనాడులో* 'చక్కెర బంధంలో బి.జె.పి' అనీ, అదే రోజు *వార్తలో* 'విద్యుత్ తరంగాల్లో దేశం ఉక్కిరి బిక్కిరి' అనీ అదేరోజు వార్తలో ఇంకో చోట 'వాజ్‌పేయి ప్రతిష్ఠకు సుగర్‌గేట్ తాళం' అనే శీర్షికలు ఉన్నాయి. *చక్కెర బంధం* అనే మాట ప్రస్తుతం. *చక్రబంధం* అనేది స్ఫూర్తి. ఈ స్ఫూర్తి లేకపోతే *చక్కెరబంధం* అనే మాటకు అర్థం లేదు.

రెండో శీర్షిక *విద్యుత్ తరంగాలు* లేవు. ఒట్టి కల్పన. ఉచిత విద్యుత్తును వాగ్దానం చేసిన కాంగ్రెసు వారి మాటలు *విద్యుత్తరంగాలు*. అవి తెలుగుదేశం వారిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయట ? ఆఖరి శీర్షికలో *షుగర్‌గేట్* అనే మాట ఇతరత్రా లేనే లేదు.

బిజెపి వారు పంచదార ఎగుమతి పాలసీకి సంబంధించిన వార్త ఇది. సుగర్ గేట్‌కి తాళం అంటే ఎగుమతులు ఆపివేస్తున్నారని. సుగర్‌గేట్ అనే మాటలో మళ్లీ ఆ అమెరికన్ సంయుక్త రాష్ట్రాల ప్రెసిడెంట్ నిక్సన్ కాలంలో వాటర్‌గేట్ అనే ప్రాంతంలో ప్రత్యర్థుల టెలిఫోన్‌లు దొంగతనంగా విన్నారన్న వాదుకు ఇది సూచన. ఇంత కవిత్వం, చమత్కారం ఈ శీర్షికలో ఇమిడ్చాడు శీర్షికాకర్త. ఇది కవిత్వమవుతుందేమో కాని వార్త మాత్రం కాదు. ఇక అంత్య ప్రాసలకు ఉదాహరణలు ఏ రోజు పత్రిక తెరచినా కొల్లలు. *ఈనాడు* నగరాను బంధంలో ఇవి ఎందువల్లనో ఎక్కువ కనిపిస్తాయి. వార్తల నుంచి చదువరులను పక్కదారులను పట్టించే జాతీయాలు, చమత్కారాలు, అంత్యప్రాసలపై పత్రికల వారు మారటోరియం విధించుకోటం అవసరం !

ప్రమాణీకరణ అనగానే ప్రధానంగా గుర్తు వచ్చేది పద నిర్మాణం, పదాల ఎన్నిక. ఈ రెండూ పత్రికల వారు నిత్యం చేసే పని. ఆ సమయానికి అవసరమైన పదాలను వెంటనే సృజించుకోవాలి. పత్రికలలో పనిచేసే వారంతా పండితులు కారు. కానక్కరలేదు.



వారు సృజించే శబ్ద రూపాలు చాలాసార్లు వ్యాకరణ విరుద్ధంగా ఉంటాయి. వాటిని ఏం చేయాలి. ఇంగ్లీషులో discrimination అనే మాటలకు వివక్ష, విచక్షణ అనే రెండు మాటలు పత్రికల వారు వాడుతున్నారు. ఈ రెండింటికీ ఆ అర్థం లేదు. మనం చాలా తరచుగా వాడే పౌర హక్కులు అనే సమాసం తప్పు. అగ్నిమాపక దళం అనే సమాసం తప్పు. మానవ వనరులు అనేది వైరి సమాసం. విద్యుదీకరణం, ప్రైవేటీకరణం అని రోజూ పత్రికల్లో కనిపించే మాటలు అసాధువులు. రవ్వా శ్రీహరిగారి నడిగితే పత్రికల వారు సృజించే ప్రతి మాటా తప్పేనంటారు. వీటిని ప్రమాణీకరించడం ఎట్లా ? ఉన్న వ్యాకరణ నియమాలను ఉల్లంఘించకుండా శబ్ద సృజన సాధ్యం కాదు. కావ్య భాషలోనే అట్లాంటివి జరగ్గాలేనిది పత్రికల భాషలో వీటిని ఆపటం ఎవరి తరం ? తప్పులు చెయ్యకుండా సృజన, కల్పన అనేవి సాధ్యం కావు. పద సృజన, పద కల్పన కూడా అంతే. వ్యాకరణోల్లంఘనను పండితులు ఎప్పుడూ ప్రతిఘటిస్తూనే ఉంటారు. కొత్త పదాలు అవసరమైన వారు ఉల్లంఘిస్తూనే ఉంటారు. ఈ ఘర్షణను నివారించలేం, శబ్ద కల్పనను ఆపనూ లేం. ఈ రెండిటినీ సమన్వయించుకుంటూ, ప్రమాణీకరణ వైపు సాగటమే కర్తవ్యం.

ఇక ఒకే అర్థంలో భిన్న పదాలు వాడుకలో ఉంటే దేన్ని ఎన్నుకోవాలి ? అనేది ఇంకో సమస్య. ఉదాహరణకు Summit talks అంటే శిఖరాగ్ర చర్చలు, అని వాడుతున్నారు. ఇంగ్లీషులో కొండకొమ్ము ఆధారంగా ఏర్పడ్డ అలంకారిక పదం ఇది. దీని అర్థం ఉన్నత స్థాయి చర్చలు అని. రెండు పదాలూ వాడుకలో ఉండవచ్చు. సైన్సు పుస్తకాల్లో బొగ్గు పులుసు గాలి, కర్బన ద్వి ఆమ్ల జనిదం అనే రెండు మాటలు Carbon dioxide అనే మాటకు వాడతారు. ఈ రకమైన భిన్న పదాలు ఆధునీకరణ చెందుతున్న భాషలో ఉండటంలో ఆశ్చర్యమూ లేదు, అందుకు విచారించనూ అక్కర్లేదు. కాలంలో ఏదో ఒకనాడు ఏదో ఒకటి స్థిరీకృతమయ్యే అవకాశం ఉంది.

అసలు సమస్య ఒకే మాటగాని, మాటలుగాని వివిధార్థాల్లో వాడటం. అతివాది, తీవ్రవాది, ఉగ్రవాది అనే మాటలను విప్లవకారులకు, టెర్రరిస్టులకు విచక్షణ లేకుండా వాడటం కనిపిస్తుంది. అట్లాగే ఒకే శబ్దం భిన్న సంయోజనల్లో భిన్నార్థాలు ఇయ్యటం కూడా ఉంది. ప్రాథమిక విద్య అంటే elementary education. ప్రాదమిక సౌకర్యాలు అంటే basic amenities. ప్రాథమిక హక్కులు fundamental rights. ప్రాథమిక సమాచారం అంటే preliminary report. ఇంగ్లీషులో ఉన్న అర్థచ్ఛాయా భేదాలు తెలుగులో

పెరిగిపోయాయి. ఇంగ్లీషులో print, broadcast, telecast అనే మాటలన్నిటికీ *ప్రసారం* అనే వాడుతున్నాం.

ఇంగ్లీషు భాషలో పదాల మధ్య అర్థచ్ఛాయా భేదాలు త్వరగా ఏర్పడుతున్నాయి. తెలుగులో ఈ భేదాలు అంత వేగంగా ఏర్పడటం లేదు. పరిభాషలోనే కాదు ఇతరత్రా కూడా ఇదే పరిస్థితి కనిపిస్తుంది. ఇంగ్లీషులో పదాలకు ప్రయోగస్థైర్యం ఎక్కువ కనిపిస్తుంది. తెలుగులో పదాల వాడుకలో ద్రవస్థితి ఎక్కువ కనిపిస్తున్నది. ఇది భాషా లక్షణమా ? ఇది తాత్కాలికమా ? శాశ్వత లక్షణమా ? తెలీదు. బహుశా పత్రికలవారు, భాషా పండితులు కలిసి ఆలోచించవలసిన సమస్య. ఒకవేళ, ఇవి భాషల, భాషా వ్యవహర్తల నైజగుణాలే అయితే ఇందుకు మార్గాంతరాలు ఆలోచించవలసి ఉంది. సమానార్థక పదాల మధ్య అర్థచ్ఛాయా భేదాలను నిరూపించే నిఘంటువులు ఇంగ్లీషులో కొల్లలుగా ఉన్నాయి. తెలుగులో అసలే లేవు. ఈ స్థితి భాషా లక్షణ సూచకమా ? తెలీదు.

ఈ ప్రశ్నలకు సమాధానాలు ఏవైనా ఇవి ఆలోచించవలసిన సమస్యలు అని గుర్తించాలి. ఈ ఆలోచన బహుశా చాలా కాలం కిందటే జరిగి ఉండాల్సింది. ఇప్పటికైనా ప్రెస్సు అకాడమీ వారు ఈ రకపు ఆలోచనను ప్రారంభించడం శుభసూచకం.

1999 అక్టోబరు 4వ తేది ప్రెస్సు అకాడమీ
వారు విశాఖలో చేయించిన ప్రసంగం

# తెలుగు రాయటంలో వచ్చే చిక్కులు, పరిష్కారాలు

భాష ప్రధానంగా మనం నోటితో చేసే ధ్వనుల రూపంలో ఉంటుంది. మనుష లందరూ మాట్లాడతారు గనక మానవ సమాజాలన్నిటికీ భాష ఉంది. వాటిల్లో కొన్ని సమాజాలకు, అంటే కొన్ని భాషలకు మాత్రమే లిపి ఉంది. కొన్ని సమాజాల వారు మాత్రమే నోటితో చేసే ధ్వనుల రూపంలో ఉన్న భాషకు చేత్తో గీసే, లేదా చేత్తో రాసే గుర్తులు కల్పించారు; ధ్వనుల రూపంలో ఉన్న భాషకు కల్పించిన గుర్తులనే లిపి అంటారు.

ఇప్పటికీ లిపులు లేని భాషలు చాలా ఉన్నాయి. మన దేశంలోనే లిపిలేని భాషా సమాజాలున్నాయి. ఒక భాష మాట్లాడే మనుషుల సమూహాన్ని భాషా సమాజం అంటారు. ఉదాహరణకు నీలగిరి కొండల్లో నివసించే *తొడ* అనే భాషాసమాజం వారికి లిపి లేదు. అట్లాగే అరకులోయకు దగ్గరలో నివసించే *'కొండ'* అనే భాషా సమాజం వారికి లిపి లేదు. అట్లాగే సంతాలీలు, గోండులు, కోయలు - ఇట్లా చాలా సమాజాల వారికి లిపిలేదు.

లిపిలేని మానవ సమాజాలకన్నా లిపి ఉన్న మానవసమాజాలు అభివృద్ధికర దశలో ఉండడం మనం తేలికగా గమనించవచ్చు. అందుకు కారణం ఊహించడం కూడా తేలిక. ఒక తరం వారు తమ తరంలో సంపాదించిన విజ్ఞానాన్ని తమ తరవాతి తరం వాళ్ళకీ అందించే ఉత్తమమైన సాధనం లిపి. కనీసం ఇప్పటివరకూ ఇదే మేలైన సాధనం. అట్లా పోనుపోను *తరవాత* తరవాత తరాల వారికి తమ పూర్వుల విజ్ఞాన సంపద అందుతుంది. దాని ఆధారంతో తరవాత వాళ్ళు ఇంకా ముందుకి పోతారు. మానవజాతి అభివృద్ధికి లిపి ఇట్లా దోహదకారి (ఉపయోగకారి) అవుతుంది.

ప్రపంచంలో లిపులు చాలా రకాలున్నాయి. ఉద్దేశించిన వస్తువుతో దగ్గరి సంబంధం ఉన్న లిపిని చిత్ర లిపి అంటారు. ప్రాచీన ఈజిప్టుల లిపి, మనదేశంలోని హరప్పా, మొహంజోదారో నాగరికత వారి లిపి అట్లాంటిదేనంటారు. చైనావారి లిపి కూడా ఆ రకపు చిత్ర లిపి నుంచే పరిణామం చెందిందంటారు.

భారతదేశపు భాషలకు - వాటి లిపులకు ఉన్న సంబంధం ధ్వని సంబంధమైనది అంటే మన దేశంలో లిపులకు వస్తువులకు సహజ సంబంధం లేదు. మనిషి నోటితో

చేసే ధ్వనులకు మాత్రమే అవి గుర్తులు. తేడాలున్నప్పటికీ ఐరోపా వారి లిపుల పద్ధతీ అదే.

ఏ లిపిలో అయినా ఉచ్చారణలో ఉన్న అన్నిరకాల ధ్వనులకూ గుర్తులుండవు ప్రధాన ధ్వనులకు మాత్రమే గుర్తులుంటాయి. అయితే భాషకన్నా లిపి ఆలస్యంగా మారుతుంది. అందువల్ల లిపికీ, ధ్వనికీ ఉన్న సంబంధం కాలక్రమేణా దూరమౌతుంది. అదృష్టవశాత్తు భారతీయ భాషాలిపుల్లో ఈ వ్యత్యాసం చాలా తక్కువ. అసలు వ్యత్యాసం లేకపోలేదు. ఇంగ్లీషు వంటి భాషల్లోలాగా ప్రతి మాటకీ అక్షరక్రమం నేర్చుకోవలసినంత విపరీతంగా భారతీయ భాషలకీ, వాటి లిపులకీ వ్యత్యాసం ఏర్పడలేదు. ఇంగ్లీషు భాషలో ఒక కొత్త మాటను నేర్చుకోవడమంటే ఆ మాటలో ఏ అక్షరాలుంటాయో కూడా నేర్చుకోవాలి. దీన్నే ఇంగ్లీషులో ''స్పెల్లింగు'' (spelling) అంటారు. ఇంగ్లీషులో ఒక కొత్త మాట వచ్చినప్పుడు ''హౌ డూ యూ స్పెల్ ఇట్'' (How do you spell it) అనేది సాధారణమైన ప్రశ్న. తెలుగులో ఇట్లాంటి ప్రశ్న మనకు వినపడదు. ఈ మాటలకు స్పెల్లింగేమిటి ? అని ఒక తెలుగుమాట గురించి అడిగితే ఆశ్చర్యపడతారు కూడా. తెలుగులో అక్షరక్రమం ఒకసారి నేర్చుకుంటే దాదాపు ఏ కొత్త మాటనైనా రాయడం నేర్చుకున్నట్టే. అయినా దాదాపు అనటం వలన తెలుగు రాతలో కూడా కొద్దికొద్ది చిన్నచిన్న చిక్కులున్నట్లు గుర్తించవచ్చు. అట్లాంటి కొన్ని సమస్యల్ని ఈ క్రింద నేర్చుకుందాం.

మాటల్ని రాయడంలో తెలుగు మాటలకు కొన్ని చిక్కులూ, సంస్కృతం మాటలకు ఇంకో రకపు చిక్కులూ, ఇంగ్లీషు మాటలకు మరో రకం చిక్కులూ రాతరూపాల్లో కన్పిస్తాయి. వాటిని గురించి విడి విడిగా తెలుసుకుందాం.

తెలుగు లిపిలో *అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ* అనే అక్షరాలు అచ్చులకు గుర్తులు. వీటిల్లో *ఐ, ఔ* లు ఉచ్చారణలో *అయ్, అవ్* లుగా వినపడతాయి. తెలుగులో ఏ హల్లుకైనా అచ్చు చేర్చడం అలవాటు. అందువల్ల అయి, అవు అని కూడా రాస్తుంటారు. ఈ కింది మాటలను జంటలను చూస్తే ఈ రాత భేదాలు తెలుసుకోవచ్చు:

అయింది - ఐంది, అవుతుంది - ఔతుంది, పయిన - పైన, అయినా - ఐనా, అయితే - ఐతే

వీటిల్లో రెండు రకాల అక్షరక్రమాలు కనిపిస్తాయి. ఇందులో తప్పొప్పుల ప్రసక్తి లేదు. ఏదో ఒకటి ఎన్నుకోవల్సి వస్తే అట్లా ఎన్నుకోవడానికి కొన్ని కారణాలు చూపించవచ్చు. అచ్చుతో మొదలయ్యే పదాల్లో *ఐ, ఔ*ల కన్నా *అయి, అవు* రూపాలు

పూర్వపువి. ఈ రెండిట్లో ఏది రాసినా చదివేటప్పుడు భేదం ఏమీ రాదు. కాబట్టి పూర్వపు రూపాలయిన *అయి, అవు* రాయడమే తేలిక, సౌకర్యం. కాని హల్లులతో మొదలయ్యే పదాలలో ఐత్వం, ఔత్వం ఎక్కువమంది రాస్తున్నారు. అంటే పైన, కౌలు అనే శబ్దాలను పయిన, కవులు అని రాయడం అసౌకర్యం. కవులు వంటి మాటల్లో కవి+లు అని అనుకునే ప్రమాదం కూడా ఉంది. పైగా ఈ రకం మాటలు నిఘంటువుల్లో పైన, కౌలు అనే కనిపిస్తాయి.

తెలుగులో *ఇ, ఈ, ఎ, ఏ* లు ఒక రకం అచ్చులు. *ఉ, ఊ, ఒ, ఓ* లు ఇంకో రకం అచ్చులు. ఈ రెండు రకాల అచ్చులకు ఉచ్చారణ (పలికేతీరు) లో భేదం ఉంది. *ఇ, ఈ, ఎ, ఏ*లను పలికేటప్పుడు నాలుక ముందుభాగం పైకి కదుల్తుంది. *ఉ, ఊ, ఒ, ఓ*లను పలికినప్పుడు నాలుక వెనుకభాగం అంగిలివైపు కదుల్తుంది. కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే కాని ఈ తేడా అందరూ గుర్తించలేరు. ఇంతకన్నా తేలికగా గుర్తించే తేడా ఒకటుంది. *ఉ, ఊ, ఒ, ఓ*లు ఉచ్చరించినప్పుడు పెదవులు గుండ్రంగా, ముందుకు కదులుతాయి. *ఇ, ఈ, ఎ, ఏ*లను ఉచ్చరించినప్పుడు పెదవులు అట్లా ముందుకు రావు. వ్యాకరణాల్లో *ఇ, ఈ, ఎ, ఏ*లను తాలవ్యాచ్చులనీ, *ఉ, ఊ, ఒ, ఓ*లను ఓష్ఠ్యాచ్చులనీ అంటారు. వాటి ఉచ్చారణను బట్టే ఈ పేర్లు పెట్టారు. ''తాలువు'' అంటే నోటిలో పైన గట్టిగా తగిలే భాగం దగ్గర ఏర్పడే ధ్వని కాబట్టి తాలవ్యం అనే పేరు వచ్చింది. ''ఓష్ఠం'' అంటే పెదవి. పెదవుల కదలికను ప్రధానంగా గుర్తించటం వల్ల *ఉ, ఊ, ఒ, ఓ* లకు ఓష్ఠ్యాచ్చులని పేరు వచ్చింది.

*ఇ, ఈ, ఎ, ఏ*లతో మొదలయ్యే పదాలకు ముందు ఉచ్చారణలో '*య*'కారం చేరుతుంది. ఉ, ఊ, ఒ, ఓలతో మొదలయ్యే పదాలకు ముందు ఉచ్చారణలో '*వ*' కారం చేరుతుంది. (పూర్వ వ్యాకరణాలు *య*కారాన్ని తాలవ్యమనీ, కారాన్నీ ఓష్ఠ్యమనీ గుర్తించారు) దాన్నే రాతలో సూచిస్తే ఇట్లా ఉంటుంది :

| | | | |
|---|---|---|---|
| *ఇల్లు - యిల్లు* | *ఈత - యీత* | *ఎక్కడ - యెక్కడ* | *ఏరు - యేరు* |
| *ఉంది - వుంది* | *ఊరు - వూరు* | *ఒకటి - వొకటి* | *ఓడ - వోడ* |

మొదటి వరసకన్నా, రెండో వరస ఉచ్చారణకి ఎక్కువ దగ్గర అని ఎక్కువమంది అనుకుంటారు. మొదటి వరుస ఉచ్చారణకి దూరం కాదు. రాత గుర్తులకు ఉచ్చారణ మనం ఇచ్చుకున్నదే. అచ్చులతో రాసినా హల్లులతో పలకటానికి అభ్యంతరం ఏమీ లేదు. అంటే ఇల్లు, ఊరు అని రాసి చదివేటప్పుడు యిల్లు, వూరు అని చదవటానికి అడ్డు

వచ్చేదేమీ లేదు. అచ్చుతో మొదలయ్యే పదాన్ని అచ్చుతోనే రాయడం వల్ల కింద తెల్పిన సౌకర్యాలున్నాయి.

1. తెలుగులో ఇప్పుడు దొరికే నిఘంటువులలో ఈ మాటలు అచ్చుతోనే దొరుకుతాయి. కొన్ని తెలియని మాటలకు నిఘంటువులు ఉపయోగించటం భాష నేర్చుకునే వారికి అవసరం.

నిఘంటువుల్లోనే ఈ మాటల్ని హల్లుతో ఎక్కించకూడదా ? అని అడిగే వీలుంది. అట్లాంటి నిఘంటువు తయారయ్యేదాకా నిఘంటువులు చూడడం మానుకోము. పైగా మాటకున్న ప్రధాన రూపాన్ని నిఘంటువులో ఒకచోట ఇచ్చి వాటిని పలికే తీరులో భేదాన్ని అక్కడే సూచించడం ఒక సంప్రదాయం. అన్ని ఉచ్చారణ భేదాల్ని ప్రధాన భేదాలుగా ఇస్తే నిఘంటువుల పరిమాణం పెరిగిపోతుంది.

2. సంధి అంటే రెండు పదాలను కలిపేసి కొన్ని మార్పుల్ని చేసి పలకటం, పలికినట్టు రాస్తే రాయడం. తెలుగు సంధిలో అచ్చుల మధ్య సంధి చాలా ముఖ్యమైనది. అచ్చుతో ముగిసేమాట తర్వాత, అచ్చు మొదలయ్యే మాట వచ్చినప్పుడు వెనుకటి మాటలో చివరి అచ్చు పోతుంది. వాడు+ఎక్కడ అన్నప్పుడు ఉచ్చారణలో పూర్వపు మాటలో చివరి ఉత్వం జారిపోయి వాడెక్కడ అని పలుకుతారు, రాస్తారు. ఇట్లాంటి సంధిలో యెక్కడ అని రాస్తే య కారం పోతుందని కూడా అధికంగా చెప్పుకోవాలి. మళ్లీ నిజంగా యకారంతో మొదలయ్యే మాటలకు యకారం పోదు. కనీసం రాతలో అట్లాపోయినట్లు చూపించరు. అతడు+యోగ్యుడు అన్నచోట యకారాన్ని ఉంచాలి. ఉచ్చారణను అనుసరించి రాస్తున్నాం అనుకునే రచయితల్లో, కూడా కొన్నిసార్లు అచ్చుతోనూ, కొన్నిసార్లు హల్లుతోనూ రాస్తున్నారు. ఉదాహరణకి చలంగారి 'మ్యూజింగ్స్'లో నుంచి కొన్ని వాక్యాలు చూడండి :

''అందుకనే అంటాను యెన్ని మతాలు, యెన్ని సోషలిజములు మానవజాతి సమానత్వాన్ని బోధించినా, సనాతనుల తెలివి వొప్పుకోవలసి వచ్చినా సరేకాని, మీరే మనుషులయితే, నేను కాను'' (పే. 110)

''ఇంతకీ లేని సౌందర్యాన్ని నేను చూస్తున్నానా : వున్న సౌందర్యానికి మీరు అంధులైనారా ? ఎవరు తేల్చగలరు ? వుంటే ఆ ఈశ్వరుడు తప్ప ! (పే. 111)

అట్లాగే రంగనాయకమ్మగారి 'పెట్టుబడి' అన్న గ్రంథంలోని ఈ వాక్యాలు చూడండి. ''దోపిడి అంటే ఏమిటి ? వర్గభేదాలు ఏమిటి ? అవి ఎందుచేత ఏర్పడుతున్నాయి ? వర్గ

భేదాలు నిజంగా ఉన్నాయా ? కార్మికులంతా ఒక వర్గంగా పెట్టుబడిదారులంతా ఒక వర్గంగా ఎందుచేత ఉన్నారు ? మంచి పెట్టుబడిదారులే ఉండరా ? (పే. 2)

పై రచయితలు యి, యీ, యె, యే లకన్నా వు, వూ, వొ, వో లు ఎక్కువ వాడారని మీరు గమనించారు.

కొన్నిచోట్ల అచ్చుతోనూ, కొన్నిచోట్ల హల్లుతోనూ రాసేకన్నా, అన్నిచోట్ల అచ్చులు రాస్తే రచనలో క్రమత్వం ఉంటుంది. క్రమత్వం అంటే అన్నిచోట్ల ఒకే పద్ధతిని పాటించడం.

వచ్చు, వద్దు, వరస వంటి మాటలు, ఉచ్చారణలో వొచ్చు, వొద్దు, వొరసగా వినిపిస్తాయి. కొంతమంది వీటిని ఒచ్చాడు, ఒద్దు అని అచ్చుతో కూడా రాస్తున్నారు. వచ్చాడు, వద్దు, వరస అనే రూపాల్నే రాసి ఉచ్చారణలో తమకు వీలైన విధంగా ఉచ్చరించుకోవచ్చు. వాడు అనే మాటకు ఉచ్చారణలో ఆడు, ఓడు, వోడు అనే భేదాలు కన్పిస్తున్నాయి. కొంతమంది మంచాడు అంటే మరికొంతమంది మంచోడు అంటారు. మావాడు అనే రూపానికి మావోడు అని కూడా అంటారు. ఇక్కడ కూడా ఆ మాండలికాన్ని సూచించడానికి రచనలో అవసరమైతే తప్ప వాడు అని రాయడమే ఒక పద్ధతిగా ఉంటుంది. పూర్వపు భాషలో అరసున్నలు, బండి 'ఱా'లు ఉండేవి. అతి ప్రాచీన కాలం నుంచి వీటికి ఉచ్చారణ లేదు. నిన్నమొన్నటి వరకు వీటిని రాయాలని తెలుగు క్లాసులో పట్టు పట్టేవారు. ప్రాచీన కావ్యభాషలో వాటి అవసరం ఉంటే ఉండవచ్చు. కాని ఈనాటి భాషలో ఇవి ఎవరో తప్ప ఎవరూ రాయడం లేదు. ఇప్పటి భాషలో అవి నిర్వహించే ప్రయోజనాలు ఏమీ లేవు. కాబట్టి వీటిని వదిలివేయడం మంచిది. అక్కఱు, ఆఱు, ఇద్దఱు, పిఱికి, మఱ్ఱి, పెఱ్ఱి అని మాటలలో బండిఱా రాయక్కర్లేదు. అరసున్న ఉన్న మాటలకూ, లేని మాటలకూ ఒకప్పుడు ఉచ్చారణ భేదం ఉండేది. వీడు - పట్టణం, వీఁడు - ఇతను అయితే మనకు కావ్య భాషా రచన ఏర్పడేటప్పటికే అరసున్న ఉచ్చారణ పోయినట్లు పరిశోధకులు నిరూపించారు. అట్లాగే అర-సగం, అఱ - గది. అనే మాటల మధ్య ఉచ్చారణ భేదం. అర్థభేదం ఉండేవి. వీటి మధ్యన ఉచ్చారణ భేదం చాలా పూర్వమే పోయింది. ఇట్లాగ రాత భేదం ద్వారా ఈ మాటల మధ్య భేదం చూపించవలసిన అవసరం లేదు. అంటే ఆఁట, ఈఁగ, చీఁకటి, కోఁతి, తెలుఁగు, వాఁడు వంటి మాటలను అరసున్నతో రాయక్కర్లేదు.

వెనకటి భాషలో *క్రింద, క్రొత్త, త్రాగు, త్రోవ, ప్రక్క, బ్రతుకు* వంటి మాటల్లో

వ్రావడి సూచించే ధ్వని పోయింది. ఉచ్చారణలో, రాతలో దీన్ని వదిలి వేయవచ్చు. కాని కొందరు ఉచ్చారణలో చాలా అరుదుగా, బహుశా సంఘంలో తమ ఉన్నత స్థానాన్ని నిరూపించుకొనే ఉద్దేశంతో వాడుతుంటారు. అట్లాంటి సంభాషణని సూచించటానికి తప్ప దీనికి వేరే ప్రయోజనం లేదు. *వ్రాయు, వ్రాత* అనే మాటల్లో *ర* కారం పోలేదు. *వ* కారమే పోయింది. *వ్రాశాడు* అని రాస్తే శిష్టవ్యావహారికమనీ, *రాశాడు* అని రాస్తే గ్రామ్యమనీ మనలో ఇంకా కొందరు అనుకుంటున్నారు. పూర్వులు అంటే సుమారు 50 ఏళ్ళ క్రితం రాశాడు అని ఉచ్చరించినా *వ్రాశాడు* అనే రాసేవాళ్ళు. ఇటీవలి కాలంలో చాలామంది *రాశాడు* అనే రాస్తున్నారు. నిఘంటువులో *వ్రాయు* అనే రూపమే ఉన్నా, *వ్రాయు* అని రాసి *రాయు* అని చదవడం కష్టం. *రాశాడు, రాత* అని రాయడమే ఎక్కువ ఆమోదాన్ని పొందిన పద్ధతి. అయితే *చేవ్రాలు* అనే మాట చేరాలు అని కాలేదు.

*చేయి, చెయ్యి, గోయి, గొయ్యి, నేయి, నెయ్యి, పూవు, పువ్వు* అనే రెండు రకాల రూపాలు ఉచ్చారణలోనూ రాతలోనూ కన్పిస్తున్నాయి. వారి వారి ఉచ్చారణలను అనుసరించి ఏ రకం రూపాలను రాసినా ఒకటే. కాని నిఘంటువుల్లో మొదటి వరస రూపాలే కన్పిస్తాయి. మొదటి వరస పదాలే రాసి రెండో రకంగా ఉచ్చరించినా అభ్యంతరం లేదు. కొందరు *పండ్లు, గుడ్లు, కోళ్ళు, వాళ్ళు* అనే వాటిని ఉచ్చారణ విధేయంగా రాస్తే, *పండ్ళు, గుడ్ళు, కోళ్ళు, వాళ్ళు* అని రాయాలి. కాని మొదట విధంగా రాసినా ఇంకో రకంగా ఉచ్చరించలేం. వత్తుగా రాసిన *ల*కారానికి ఈ మాటల్లో *ళ* కారంగానే ఉచ్చరించక తప్పదు. అందువల్ల *ల*కారమే రాసుకోవచ్చు.

తెలుగులో *తాటి+ఆకు* అనేది కలిపితే వచ్చే మాటను తాటాకు అని రాస్తున్నారు. కాని నిజానికి ఉచ్చారణ 'ఆ' కాదు. కానీ ఈ రెంటినీ కలిపితే వచ్చే ధ్వనిని సూచించటానికి తెలుగులో గుర్తు లేదు. గుర్తు ఉంటే మంచిదే. కాని గుర్తులేనప్పుడు ఆ ధ్వనిని ఆ మాటల వాడకాన్ని బట్టి గుర్తించాల్సిందే కాని వేరే మార్గం లేదు. తెలుగు క్రియల్లో కూడా ఈ రకపు చిక్కు ఉంది. చెప్పు అనే క్రియకు, జరిగిన కాలాన్ని సూచించేటప్పుడు కొందరు చెప్పాడు అనీ, మరికొందరు చెప్పేడు అని రాస్తున్నారు. రెంటికీ ఉచ్చారణ దాదాపు ఒకటే. గోదావరి, ఆపైన విశాఖ జిల్లాల రచయితలు చెప్పేడు అని రాస్తే, కృష్ణా, గుంటూరు, ఇంకా ఇతర జిల్లాల వాళ్ళు చెప్పాడు అని రాస్తున్నారు. ఈ రెండిట్లో ఏది రాసినా అదనపు సౌకర్యమూ లేదు. నష్టమూ లేదు.

పూర్వపు తెలుగులో అంటే గ్రాంథికం అనే కావ్యభాషలో పదం చివర వచ్చే ము

శబ్దంలో ఈనాడు ఉకారం పోయి మకారం మాత్రమే మిగిలింది. దాన్ని సున్నతో సూచిస్తున్నారు. చాలా కొద్దిమంది మాత్రం, ఇంకా పదంచివర ము రాస్తున్నారు. మేము, మనము వంటి మాటలలోను, ము కి పూర్వం దీర్ఘముంటేనూ, అంటే *గులాము* వంటి మాటల్లోనూ, నడుము, ఉడుము వంటి మూడక్షరాల మాటల్లో నడిమి అచ్చు ఉంటే ము రాస్తున్నారు. ఒకవేళ సున్న రాసినా, బహువచనంలో గులాములు, నడుములు, ఉడుములు అనే ము ఉన్న ఉచ్చారణ వినిపిస్తున్నది. చివర సున్నతో రాసిన మాటలు తెలుగైనా, సంస్కృతమైనా ఇప్పుడు మనకున్న నిఘంటువుల్లో అవి చివర ము తో కనిపిస్తాయి. అందరి ఉచ్చారణలోనూ, దాదాపు అందరి రాతలోనూ సున్న కనిపిస్తుంది. సున్నతో రాయడం సౌకర్యం.

ఋ, ౠ, ఌ ౡ లు తెలుగులో సంస్కృతం నుంచి తెలుగులోకి వచ్చిన మాటల్లో కన్పిస్తాయి. సంస్కృతం నుంచి తెలుగులోకి వచ్చిన మాటల్లో మరెక్కడా కన్పించవు. ఒక్క కుప్తం అనే మాటలో తప్ప. కాని దీన్నందరూ క్లుప్తం అనే రాస్తున్నారు. ఋ, ౠలతో వచ్చిన మాటలు మాత్రం చాలా ఉన్నాయి. ఋషి, ఋతువు, కృష్ణుడు, దృష్టి, తృష్ణ వంటి చాలా మాటల్లో ఈ ఋత్వం కనిపిస్తుంది. కొంతమంది మాత్రం రుషి, రుతువు అని రాస్తున్నారు. చాలామంది హల్లు మీద రాసే ఋత్వాన్ని అంటే కృష్ణుడు, దృష్టి, కృషి వంటి మాటల్లో ఋత్వం రాస్తున్నారు. వీటిల్లో కూడా ఉచ్చారణని అనుసరించి ఋత్వం తీసేసి క్రుష్ణుడు, ద్రుష్టి, క్రుషి అని రాస్తున్నారు. ఉదాహరణకు వుప్పల లక్ష్మణరావుగారి బతుకు పుస్తకంలో ఈ ధోరణి కనిపిస్తుంది. (విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజయవాడ, 1983). తెలియని సంస్కృతం మాటలకు నిఘంటువుల్లో అర్థాలు వెతుక్కోవలసిన అవసరం చాలా ఉంటుంది. అందువల్ల సంస్కృతం మాటల వర్ణక్రమం మార్చకుండా ఉండడమే మంచిది. అయితే ఋత్వం లేనిచోట కొందరు ఋత్వం పెడుతున్నారు. ఉదాహరణకి శత్రువు, ధ్రువతార అనే మాటల్లో ఋద్వం బదులు క్రావడే ఉండాలి. సంస్కృతం మాటల్లో ఆజ్ఞ, జ్ఞాపకం, ప్రజ్ఞ, యజ్ఞం, విజ్ఞానం అనే మాటలను అగ్నె, గ్నాపకం (గ్యాపకం), ప్రగ్న, యగ్నం, విగ్నానం అని ఉచ్చరించే వారున్నారు. అయినా చాలామంది ఈ మాటలను సంస్కృత పద్ధతిలో మొదటి విధంగా రాస్తున్నారు. ఒకరూ అరా పలికే పద్ధతిలో రాయాలి అనుకున్నా, అన్ని మాటలనూ అట్లా రాయడం లేదు. ఇక్కడ కూడా సంస్కృతంలో అక్షర క్రమమే రాసి మన పద్ధతిని ఉచ్చరించుకోవచ్చు.

'శ' వర్ణం తెలుగులోకి వచ్చిన సంస్కృతం మాటల్లోనే కనిపిస్తుంది. ఈ శ, స ల

భేదం ఉచ్చారణలో చాలామందికి వినపడదు. అయినా తెలుగులో ఉదాహరణకి దురాశ, శీతాకాలం, ఆశీస్సు, వశంలో వచ్చిన శ వర్ణానికి బదులుగా సవర్ణం ఎక్కువమంది రాయడం లేదు. ఇది తెలుగు రాయడం నేర్చుకునే విద్యార్థులను కొంత ఇబ్బంది పెట్టే సమస్య. దీన్ని జాగ్రత్తగా పరిశీలించడం ద్వారా, సందేహం వచ్చినప్పుడు మంచి నిఘంటువులో చూడ్డం ద్వారా అభ్యాసం చేసుకోవల్సిందే. శ, షల భేదం పాటించకపోతే తెలుగు రాయడం బాగా వచ్చినట్టుగా లెక్కకట్టడం లేదు. ఇది కష్టపడి నేర్చుకోవాల్సిన ఒక అంశం.

తెలుగు వర్ణమాలలో వత్తు అక్షరాల పేరుతో, ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ అనేవి ఉన్నాయి. ఇవి సంస్కృతం నుంచి వచ్చిన మాటల్లోనే ఎక్కువగా ఉంటాయి. వీటిలో భ, ధ అనేవి ఎక్కువ మాటల్లో వస్తాయి. ఝ తక్కువ మాటల్లో వస్తుంది. వీటి ఉచ్చారణ ఈ తరంలో సన్నగిల్లిపోతున్నది. అయినా తెలుగు రాసేటప్పుడు ఈ మాటల్ని సరిగ్గా చూపించకపోతే వాటిని తప్పులుగానే చాలామంది పరిగణిస్తున్నారు. వాటిని కొంచెం కష్టపడే నేర్చుకోవాల్సి ఉంది. ఈ అక్షరాలను అవసరం లేని చోట ఉపయోగించడం కూడా తప్పే అవుతుంది. ఉదాహరణకి భాద, బారం, ధారం, ఘాలి, భావి వంటి *మాటల్లో పొల్లు ఉండవలసిన చోటలేదు.* సంస్కృతం మాటలను తెలుగులో రాసేటప్పుడు థ, ధలకు తెలుగువారి ఉచ్చారణలో భేదం తక్కువ. రాతలోనూ భేదం తక్కువే. మొదటి దానికి పొట్టలో చుక్క ఉంది అంటారు.

ఉదాహరణకు అతిది, గ్రంథం, రథం, ప్రదమం, కద వంటి మాటల్లో ఉన్నటువంటి థ కారానికి పొట్టలో చుక్కపెట్టడం మరచిపోకూడదు. ఇది నేర్చుకోవడానికి కూడా నిఘంటువు సాయపడుతుంది.

సంస్కృతంలో ':' అనే గుర్తును విసర్గ అంటారు. ఇది దుఃఖం, ప్రాతఃకాలం, అంతఃకరణ వంటి మాటల్లో ఉంది. దుఃఖం అనే మాటను మాత్రం కొందరు విసర్గ తీసివేసి దుక్కం, దుఖ్ఖం అని రాస్తున్నారు. ఒక పద్ధతి ప్రకారం విసర్గ ఉన్న అన్ని మాటల్లోనూ విసర్గ రాయడమే మంచిది.

సంస్కృతం మాటల్లో వచ్చే 'త్య' అనే వర్ణాల కూర్పుకు తెలుగులో త్తె అనే చ్చె అనీ ఉచ్చారణ భేదాలు వేరు వేరు ప్రాంతాల్లో ఉన్నాయి. అట్లాగే 'ద్య' అనే కూర్పుకు ద్దె అనీ ద్య కి ద్దె, జ్య అనీ ఉన్నాయి. ఈ కింది మాటల్లో భేదాలను గుర్తు పట్టవచ్చు.

సత్యం, సత్తెం, పచ్చెం పద్యం, పద్దెం, పజ్జెం, పజ్యం.

తెలుగులో ఈ రకాల త్య, ద్య సంస్కృతం నుంచి విరివిగా వచ్చినందున వాటిని

భేదాలు నిజంగా ఉన్నాయా ? కార్మికులంతా ఒక వర్గంగా పెట్టుబడిదారులంతా ఒక వర్గంగా ఎందుచేత ఉన్నారు ? మంచి పెట్టుబడిదారులే ఉండరా ? (పే. 2)

పై రచయితలు యి, యీ, యె, యే లకన్నా వు, వూ, వొ, వో లు ఎక్కువ వాడారని మీరు గమనించారు.

కొన్నిచోట్ల అచ్చుతోనూ, కొన్నిచోట్ల హల్లుతోనూ రాసేకన్నా, అన్నిచోట్ల అచ్చులు రాస్తే రచనలో క్రమత్వం ఉంటుంది. క్రమత్వం అంటే అన్నిచోట్ల ఒకే పద్ధతిని పాటించడం.

వచ్చు, వద్దు, వరస వంటి మాటలు, ఉచ్చారణలో వొచ్చు, వొద్దు, వొరసగా వినిపిస్తాయి. కొంతమంది వీటిని ఒచ్చాడు, ఒద్దు అని అచ్చుతో కూడా రాస్తున్నారు. వచ్చాడు, వద్దు, వరస అనే రూపాల్నే రాసి ఉచ్చారణలో తమకు వీలైన విధంగా ఉచ్చరించుకోవచ్చు. వాడు అనే మాటకు ఉచ్చారణలో ఆడు, ఓడు, వోడు అనే భేదాలు కన్పిస్తున్నాయి. కొంతమంది మంచాడు అంటే మరికొంతమంది మంచోడు అంటారు. మావాడు అనే రూపానికి మావోడు అని కూడా అంటారు. ఇక్కడ కూడా ఆ మాండలికాన్ని సూచించడానికి రచనలో అవసరమైతే తప్ప వాడు అని రాయడమే ఒక పద్ధతిగా ఉంటుంది. పూర్వపు భాషలో అరసున్నలు, బండి 'ఱా'లు ఉండేవి. అతి ప్రాచీన కాలం నుంచి వీటికి ఉచ్చారణ లేదు. నిన్నమొన్నటి వరకు వీటిని రాయాలని తెలుగు క్లాసులో పట్టు పట్టేవారు. ప్రాచీన కావ్యభాషలో వాటి అవసరం ఉంటే ఉండవచ్చు. కాని ఈనాటి భాషలో ఇవి ఎవరో తప్ప ఎవరూ రాయడం లేదు. ఇప్పటి భాషలో అవి నిర్వహించే ప్రయోజనాలు ఏమీ లేవు. కాబట్టి వీటిని వదిలివేయడం మంచిది. అక్కఱ, ఆఱు, ఇద్దఱు, పిఱికి, మఱ్ఱి, పెఱ్ఱి అని మాటలలో బండిఱా రాయక్కర్లేదు. అరసున్న ఉన్న మాటలకూ, లేని మాటలకూ ఒకప్పుడు ఉచ్చారణ భేదం ఉండేది. వీడు - పట్టణం, వీఁడు - ఇతను అయితే మనకు కావ్య భాషా రచన ఏర్పడేటప్పటికే అరసున్న ఉచ్చారణ పోయినట్లు పరిశోధకులు నిరూపించారు. అట్లాగే అర-సగం, అఱ - గది. అనే మాటల మధ్య ఉచ్చారణ భేదం. అర్థభేదం ఉండేవి. వీటి మధ్యన ఉచ్చారణ భేదం చాలా పూర్వమే పోయింది. ఇట్లాగ రాత భేదం ద్వారా ఈ మాటల మధ్య భేదం చూపించవలసిన అవసరం లేదు. అంటే ఆఁట, ఈఁగ, చీఁకటి, కోఁతి, తెలుఁగు, వాఁడు వంటి మాటలను అరసున్నతో రాయక్కర్లేదు.

వెనకటి భాషలో *క్రింద, క్రొత్త, త్రాగు, త్రోవ, ప్రక్క, బ్రతుకు* వంటి మాటల్లో

క్రావడి సూచించే ధ్వని పోయింది. ఉచ్చారణలో, రాతలో దీన్ని వదిలి వేయవచ్చు. కాని కొందరు ఉచ్చారణలో చాలా అరుదుగా, బహుశా సంఘంలో తమ ఉన్నత స్థానాన్ని నిరూపించుకొనే ఉద్దేశంతో వాడుతుంటారు. అట్లాంటి సంభాషణని సూచించటానికి తప్ప దీనికి వేరే ప్రయోజనం లేదు. *వ్రాయు, వ్రాత* అనే మాటల్లో *ర* కారం పోలేదు. *వ* కారమే పోయింది. *వ్రాశాడు* అని రాస్తే శిష్టవ్యావహారికమనీ, *రాశాడు* అని రాస్తే గ్రామ్యమనీ మనలో ఇంకా కొందరు అనుకుంటున్నారు. పూర్వులు అంటే సుమారు 50 ఏళ్ళ క్రితం రాశాడు అని ఉచ్చరించినా *వ్రాశాడు* అనే రాసేవాళ్ళు. ఇటీవలి కాలంలో చాలామంది *రాశాడు* అనే రాస్తున్నారు. నిఘంటువులో *వ్రాయు* అనే రూపమే ఉన్నా, *వ్రాయు* అని రాసి *రాయు* అని చదవడం కష్టం. *రాశాడు, రాత* అని రాయడమే ఎక్కువ ఆమోదాన్ని పొందిన పద్ధతి. అయితే *చేవ్రాలు* అనే మాట చేరాలు అని కాలేదు.

*చేయు,* చెయ్యి, *గోయు, గొయ్యి, నేయు,* నెయ్యి, *ప్రూవు,* పువ్వు అనే రెండు రకాల రూపాలు ఉచ్చారణలోనూ రాతలోనూ కన్పిస్తున్నాయి. వారి వారి ఉచ్చారణలను అనుసరించి ఏ రకం రూపాలను రాసినా ఒకటే. కాని నిఘంటువుల్లో మొదటి వరస రూపాలే కన్పిస్తాయి. మొదటి వరస పదాలే రాసి రెండో రకంగా ఉచ్చరించినా అభ్యంతరం లేదు. కొందరు *పండ్లు, గుడ్లు, కోళ్ళు, వాళ్ళు* అనే వాటిని ఉచ్చారణ విధేయంగా రాస్తే, పండ్ళు, *గుడ్ళు, కోళ్ళు, వాళ్ళు* అని రాయాలి. కాని మొదట విధంగా రాసినా ఇంకో రకంగా ఉచ్చరించలేం. వత్తుగా రాసిన *ల*కారానికి ఈ మాటల్లో *ళ*కారంగానే ఉచ్చరించక తప్పదు. అందువల్ల *ల*కారమే రాసుకోవచ్చు.

తెలుగులో *తాటి+ఆకు* అనేది కలిపితే వచ్చే మాటను తాటాకు అని రాస్తున్నారు. కాని నిజానికి ఉచ్చారణ 'ఆ' కాదు. కానీ ఈ రెంటినీ కలిపితే వచ్చే ధ్వనిని సూచించటానికి తెలుగులో గుర్తు లేదు. గుర్తు ఉంటే మంచిదే. కాని గుర్తులేనప్పుడు ఆ ధ్వనిని ఆ మాటల వాడకాన్ని బట్టి గుర్తించాల్సిందే కాని వేరే మార్గం లేదు. తెలుగు క్రియల్లో కూడా ఈ రకపు చిక్కు ఉంది. చెప్పు అనే క్రియకు, జరిగిన కాలాన్ని సూచించేటప్పుడు కొందరు *చెప్పాడు* అనీ, మరికొందరు *చెప్పేడు* అని రాస్తున్నారు. రెంటికీ ఉచ్చారణ దాదాపు ఒకటే. గోదావరి, ఆపైన విశాఖ జిల్లాల రచయితలు చెప్పేడు అని రాస్తే, కృష్ణా, గుంటూరు, ఇంకా ఇతర జిల్లాల వాళ్ళు చెప్పాడు అని రాస్తున్నారు. ఈ రెండిట్లో ఏది రాసినా అదనపు సౌకర్యమూ లేదు. నష్టమూ లేదు.

పూర్వపు తెలుగులో అంటే గ్రాంథికం అనే కావ్యభాషలో పదం చివర వచ్చే ము

శబ్దంలో ఈనాడు ఉకారం పోయి మకారం మాత్రమే మిగిలింది. దాన్ని సున్నతో సూచిస్తున్నారు. చాలా కొద్దిమంది మాత్రం, ఇంకా పదంచివర ము రాస్తున్నారు. మేము, మనము వంటి మాటలలోను, ము కి పూర్వం దీర్ఘముంటేనూ, అంటే *గులాము* వంటి మాటల్లోనూ, నడుము, ఉడుము వంటి మూడక్షరాల మాటల్లో నడిమి అచ్చు ఉంటే ము రాస్తున్నారు. ఒకవేళ సున్న రాసినా, బహువచనంలో గులాములు, నడుములు, ఉడుములు అనే ము ఉన్న ఉచ్చారణ వినిపిస్తున్నది. చివర సున్నతో రాసిన మాటలు తెలుగైనా, సంస్కృతమైనా ఇప్పుడు మనకున్న నిఘంటువుల్లో అవి చివర ము తో కనిపిస్తాయి. అందరి ఉచ్చారణలోనూ, దాదాపు అందరి రాతలోనూ సున్న కనిపిస్తుంది. సున్నతో రాయడం సౌకర్యం.

ఋ, ౠ, ఌ ౡ లు తెలుగులో సంస్కృతం నుంచి తెలుగులోకి వచ్చిన మాటల్లో కన్పిస్తాయి. సంస్కృతం నుంచి తెలుగులోకి వచ్చిన మాటల్లో మరెక్కడా కన్పించవు. ఒక్క కుప్తం అనే మాటలో తప్ప. కాని దీన్నందరూ క్లుప్తం అనే రాస్తున్నారు. ఋ, ౠలతో వచ్చిన మాటలు మాత్రం చాలా ఉన్నాయి. ఋషి, ఋతువు, కృష్ణుడు, దృష్టి, తృష్ణ వంటి చాలా మాటల్లో ఈ ఋత్వం కనిపిస్తుంది. కొంతమంది మాత్రం రుషి, రుతువు అని రాస్తున్నారు. చాలామంది హల్లు మీద రాసే ఋత్వాన్ని అంటే కృష్ణుడు, దృష్టి, కృషి వంటి మాటల్లో ఋత్వం రాస్తున్నారు. వీటిల్లో కూడా ఉచ్చారణని అనుసరించి ఋత్వం తీసేసి క్రుష్ణుడు, ద్రుష్టి, క్రుషి అని రాస్తున్నారు. ఉదాహరణకు వుప్పల లక్ష్మణరావుగారి బతుకు పుస్తకంలో ఈ ధోరణి కనిపిస్తుంది. (విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజయవాడ, 1983). తెలియని సంస్కృతం మాటలకు నిఘంటువుల్లో అర్థాలు వెతుక్కోవలసిన అవసరం చాలా ఉంటుంది. అందువల్ల సంస్కృతం మాటల వర్ణక్రమం మార్చకుండా ఉండడమే మంచిది. అయితే ఋత్వం లేనిచోట కొందరు ఋత్వం పెడుతున్నారు. ఉదాహరణకి శతృవు, ధృవతార అనే మాటల్లో ఋద్వం బదులు క్రావడే ఉండాలి. సంస్కృతం మాటల్లో ఆజ్ఞ, జ్ఞాపకం, ప్రజ్ఞ, యజ్ఞం, విజ్ఞానం అనే మాటలను అగ్నె, గ్నాపకం (గ్యాపకం), ప్రగ్న, యగ్నం, విగ్నానం అని ఉచ్చరించే వారున్నారు. అయినా చాలామంది ఈ మాటలను సంస్కృత పద్ధతిలో మొదటి విధంగా రాస్తున్నారు. ఒకరూ అరా పలికే పద్ధతిలో రాయాలి అనుకున్నా, అన్ని మాటలనూ అట్లా రాయడం లేదు. ఇక్కడ కూడా సంస్కృతంలో అక్షర క్రమమే రాసి మన పద్ధతిని ఉచ్చరించుకోవచ్చు.

'శ' వర్ణం తెలుగులోకి వచ్చిన సంస్కృతం మాటల్లోనే కనిపిస్తుంది. ఈ శ, స ల

భేదం ఉచ్చారణలో చాలామందికి వినపడదు. అయినా తెలుగులో ఉదాహరణకి దురాశ, శీతాకాలం, ఆశీస్సు, వశంలో వచ్చిన శ వర్ణానికి బదులుగా సవర్ణం ఎక్కువమంది రాయడం లేదు. ఇది తెలుగు రాయడం నేర్చుకునే విద్యార్థులను కొంత ఇబ్బంది పెట్టే సమస్య. దీన్ని జాగ్రత్తగా పరిశీలించడం ద్వారా, సందేహం వచ్చినప్పుడు మంచి నిఘంటువులో చూడ్డం ద్వారా అభ్యాసం చేసుకోవల్సిందే. శ, షల భేదం పాటించకపోతే తెలుగు రాయడం బాగా వచ్చినట్టుగా లెక్కకట్టడం లేదు. ఇది కష్టపడి నేర్చుకోవాల్సిన ఒక అంశం.

తెలుగు వర్ణమాలలో వత్తు అక్షరాల పేరుతో, *ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ* అనేవి ఉన్నాయి. ఇవి సంస్కృతం నుంచి వచ్చిన మాటల్లోనే ఎక్కువగా ఉంటాయి. వీటిలో *భ, ధ* అనేవి ఎక్కువ మాటల్లో వస్తాయి. ఝ తక్కువ మాటల్లో వస్తుంది. వీటి ఉచ్చారణ ఈ తరంలో సన్నగిల్లిపోతున్నది. అయినా తెలుగు రాసేటప్పుడు ఈ మాటల్ని సరిగ్గా చూపించకపోతే వాటిని తప్పులుగానే చాలామంది పరిగణిస్తున్నారు. వాటిని కొంచెం కష్టపడే నేర్చుకోవాల్సి ఉంది. ఈ అక్షరాలను అవసరం లేని చోట ఉపయోగించడం కూడా తప్పే అవుతుంది. ఉదాహరణకి భాద, బారం, ధారం, ఘాలి, భావి వంటి *మాటల్లో పొల్లు ఉండవలసిన చోటలేదు.* సంస్కృతం మాటలను తెలుగులో రాసేటప్పుడు ద, ధలకు తెలుగువారి ఉచ్చారణలో భేదం తక్కువ. రాతలోనూ భేదం తక్కువే. మొదటి దానికి పొట్టలో చుక్క ఉంది అంటారు.

ఉదాహరణకు అతిథి, గ్రంథం, రథం, ప్రథమం, కథ వంటి మాటల్లో ఉన్నటువంటి థ కారానికి పొట్టలో చుక్కపెట్టడం మరచిపోకూడదు. ఇది నేర్చుకోవడానికి కూడా నిఘంటువు సాయపడుతుంది.

సంస్కృతంలో ':' అనే గుర్తును విసర్గ అంటారు. ఇది దుఃఖం, ప్రాతఃకాలం, అంతఃకరణ వంటి మాటల్లో ఉంది. దుఃఖం అనే మాటను మాత్రం కొందరు విసర్గ తీసివేసి దుక్కం, దుఖ్ఖం అని రాస్తున్నారు. ఒక పద్ధతి ప్రకారం విసర్గ ఉన్న అన్ని మాటల్లోనూ విసర్గ రాయడమే మంచిది.

సంస్కృతం మాటల్లో వచ్చే 'త్య' అనే వర్ణాల కూర్పుకు తెలుగులో త్తె అనే చ్చె అనీ ఉచ్చారణ భేదాలు వేరు వేరు ప్రాంతాల్లో ఉన్నాయి. అట్లాగే 'ద్య' అనే కూర్పుకు ద్దె అనీ ద్య కి ద్దె, జ్య అనీ ఉన్నాయి. ఈ కింది మాటల్లో భేదాలను గుర్తు పట్టవచ్చు.

సత్యం, సత్తెం, పచ్చెం పద్యం, పద్దెం, పజ్జెం, పజ్యం.

తెలుగులో ఈ రకాల త్య, ద్య సంస్కృతం నుంచి విరివిగా వచ్చినందున వాటిని

అట్లాగే మార్చకుండా ఉంచడం మంచిది. బాగా అలవాటయిన సత్యం, పద్యం వంటి మాటలకు ఎట్లా రాసినా అర్థం చేసుకోవచ్చుగాని ఇతర చోట్ల వెంటనే పద స్వరూపాన్ని గుర్తు తెచ్చుకొని అర్థం చేసుకోవడం కష్టమవుతుంది. ఆజ్యతనాంధ్ర అని రాస్తే ఆద్యత నాంధ్ర అని ఉద్దేశించినట్టు చప్పున బోధపడదు. త్స అనే సంస్కృత వర్ణాల కూర్పుకు తెలుగులో 'చ్చ' అనే ఉచ్చారణ ఉంది. *సంవత్సరం* అనే మాటకు *సంవచ్చరం* అని ఉచ్చరిస్తారు. రాతలో మొదటిదే కనిపిస్తుంది.

ఇంగ్లీషు మాటలు తెలుగులో రాసేటప్పుడు కొన్ని చిక్కులు వస్తాయి. తెలుగు రాతలో సూచించడానికి వీల్లేని ధ్వనులు కొన్ని ఇంగ్లీషులో ఉన్నాయి.

map, bat, cap అనే మాటల్లో అచ్చును తెలుగులో సూచించడం కష్టం. మేప్, బేట్, కాప్ అని రాస్తున్నారు. మరికొందరు మాప్, మాట్, కాప్ అని రాస్తున్నారు. మొదటి అక్షరానికి యావత్తు ఇచ్చి మ్యాప్, బ్యాట్, క్యాప్ అని మరికొందరు రాస్తున్నారు. న్యాయం, వాక్యం, సన్యాసి, సూర్యం వంటి చోట్ల వచ్చే యావత్తులాగా ఈ ఇంగ్లీషు మాటలలో రాసే యావత్తును ఉచ్చరించకూడదు. ఒకటి కన్నా ఎక్కువ హల్లుల కూర్పుతో వచ్చే మాటల్లో అచ్చును సూచించడానికి యావత్తును రాసే అలవాటు తెలుగులో లేదు. class, glass వంటి మాటలను క్లాసు, గ్లాసు అనే రాస్తారు. క్ల్యాసు, గ్ల్యాసు అని ఎవరూ రాయరు. అయినా ఇక్కడి అచ్చు ఉచ్చారణ map, bat వంటి మాటల్లో ఉచ్చారణలాంటిదే.

ఇంకో విషయం గుర్తుంచుకోవాలి. ఇంగ్లీషు, హిందీ వంటి భాషలలో హలంతమైన మాటలు ఎక్కువ. వాటిని తెలుగులో పొల్లు అక్షరాలతో చూపించవచ్చు. క్లాస్, గ్లాస్, పెన్, పెన్సిల్, టేప్, నోట్, పేపర్, మ్యాప్, హ్యాట్‌పై మాటలనే అజంతంగా (అంటే పదం చివర అచ్చును చేర్చి) క్లాసు, గ్లాసు, టేపు, పేపరు, మ్యాపు, హ్యాటు, నోటు, పెన్ను, పెన్సిలు అని రాయవచ్చు.

చాలా మాటలకు పదం చివర 'ఉ' అనే అచ్చు చేరిస్తే రాతలో అక్షరానికి కొమ్ము చేర్చి చూపించవచ్చు. ఇది తెలుగువారి ఉచ్చారణలో సహజంగా కనిపించే విషయం. అసలు మూల భాషలోలాగా హలంతంగానూ ఉచ్చరించవచ్చు. తెలుగువారి అలవాటు ననుసరించి అజంతంగానూ ఉచ్చరించవచ్చు. రెండు పద్ధతులనూ రాతలో చూపించవచ్చు. లేదా రాతలో ఒకే పద్ధతిని అనుసరించి, ఉచ్చారణ వారి ఇష్టానుసారంగా చెయ్యవచ్చు.

శాస్త్ర విషయాలను గురించి రాసేటప్పుడు వివిధ భాషల్లోని పదాలను వాడాల్సిన అవసరం వస్తుంది. పదాల ఉచ్చారణలోనూ, రాతలోనూ, ఏక సూత్రత (un formity)

నిర్దిష్టత (exactness ) కావాలని ఆయా శాస్త్రాల్లో ఆరితేరినవాళ్ళు కోరుకుంటారు. ఆ సందర్భాల్లో ఉపయోగించిన మాటనూ మూల పదాల ఉచ్చారణకు సాధ్యమైనంత దగ్గరగా ఉండేటట్లు రాయడం మంచిది.

ఇంగ్లీషు వంటి భాషలలో నుంచి హలంత శబ్దాలను తెలుగులోకి తెచ్చుకునేటప్పుడు తెలుగులో ఉ అనే అచ్చును చివర చేరుస్తామని చెప్పుకున్నాం. కాని అన్ని మాటలకూ చివర ఉ చేరదు. కొన్నిటికి ఇ చేరుతుంది. ఉదాహరణకు ఈ కింది ఇంగ్లీషు మాటలను ఇంగ్లీషు, తెలుగు రాతల్లో క్రమంగా చూడండి :

చర్చ్ - చర్చి, వాచ్ - వాచి, కోచ్ - కోచి, మేచ్ - మేచి, మార్చ్ - మార్చి, జార్జ్ - జార్జి, బ్రిజ్ - బ్రిడ్జి, జజ్ - జడ్జి

చ్ - జ్ లు అంతంలో వచ్చే మాటలకు ఉ బదులు ఇ చేరడం ఇందులో గమనించవచ్చు. పైన ఇచ్చిన మాటలో *బ్రిడ్జి, జడ్జి* అనే మాటలను గమనించండి. ఇంగ్లీషు స్పెల్లింగులో *d* అనే అక్షరం ఉన్నా దానికి ఉచ్చారణలో ప్రమేయం లేదు. కాని తెలుగులో అదే అక్షరానికి సమానంగా *డ* అనే అక్షరాన్ని ఈ మాటల్లో వాడుతున్నాం. ఈ మాటల్ని ఈ *డ* అనే అక్షరం లేకుండా రాస్తే, ఆ మాటలుగా గుర్తించడం కష్టం కూడా. అంటే బ్రిజ్ అని రాస్తే బ్రిడ్జి అనిగాని, జజ్ అని రాస్తే జడ్జి అని గాని చప్పున గుర్తించడం కష్టం.

(ఇట్లాంటి వాటిని తెలుగు రాత ప్రకారం ఉచ్చరిస్తే ఇంగ్లీషులో spelling pronunc ation అంటారు. రాసినట్లు ఉచ్చరించే పద్ధతి అని అర్థం. ఉచ్చారణకూ రాతకూ తేడా ఎక్కువ్వుంటే ఈ పద్ధతి విచిత్రంగా ఉంటుంది. దాదాపు ఉచ్చరించినట్టు రాసే తెలుగు వాళ్ళకి రాసినట్టు ఉచ్చరించడంలో విచిత్రం ఏమీ కనబడదు. కాని ఇంగ్లీషు ఉచ్చారణకూ రాతకూ ఉన్న విపరీతమైన తేడా అందుకు కారణం).

ఇంగ్లీషులో మాటలను తెలుగులో రాసేటప్పుడు ఎన్నో చిక్కులు ఎదురవుతాయి. కొన్ని రకాల అచ్చులకు హల్లులకు తెలుగులో గుర్తులు లేవు. ఉదాహరణకు ఈ మాటలు గుర్తించండి : బోటిల్, బాటిల్ (Bottle), (Zoology) జు ఆలజీ.

తెలుగులో రాసే అలవాటును బట్టి వీటిని నేర్చుకోవాల్సిందేకాని, అన్నిటికీ కలిపి ఒక ప్రయోజనకరమైన లక్షణం చెప్పడం కష్టం.

భాష రాస్తున్నప్పుడు 'ఏం తప్పు చేస్తున్నామో' అని భయపడడం సరైన పద్ధతికాదు. మనం చెప్పదల్చుకున్నది సమర్థంగా చెపుతున్నామా లేదా అని చూసుకోవడమే సరైన

పద్ధతి. నలుగురూ ఒప్పుకునేది ఒప్పు, ఎవరూ ఒప్పుకోనిది తప్పు. మనం రాసే వాటిలో కొన్నిటిని గురించే పూర్తి తప్పు అనీ, పూర్తి ఒప్పు అనీ చెప్పగలుగుతాము. చాలా వాటి విషయంలో అట్లా చెప్పలేము. ఇది తప్పు అని నిర్ణయించేకన్నా, ఈ విధంగా రాస్తే ఇంతకన్నా బాగుంటుంది అని చెప్పడం మంచి పద్ధతి.

తెలుగులో సమర్థులైన రచయితలు రాసిన రచనలు చదివితే మంచి భాష రాయటం అలవాటవుతుంది. అందువల్ల మంచి రచనలు ఎక్కువ చదవాలి. శ్రీరంగం శ్రీనివాసరావు; దేవులపల్లి కృష్ణశాస్త్రి, గుడిపాటి వెంకటచలం, కొడవటిగంటి కుటుంబరావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, త్రిపురనేని గోపీచంద్, బుచ్చిబాబు మొదలైన రచయితలు ఈ కాలపు తెలుగును సమర్థంగా రాశారు. వాళ్ళ రచనలు చదివితే మంచి తెలుగు రాయడం నేర్చుకోవచ్చు.

ఒక భాషను చాలా మంది మాట్లాడేప్పుడు అందరు మాట్లాడేది ఒకే రకంగా ఉండదు. కొందరు మాట్లాడే భాష మరి కొందరు మాట్లాడే భాషకన్నా వేరుగా ఉంటుంది. ఉదాహరణకు ఉభయగోదావరి మండలాల్లోనూ, విశాఖ, విజయనగర ప్రాంతాలలోనూ అలా, ఇలా, ఎలా అంటారు. కృష్ణా గుంటూరు మండలాలలో 'అట్లా' ఇట్లా, ఎట్లా అంటారు.

తెలంగాణా జిల్లాల్లో *వచ్చిండు* అంటే రాయలసీమలో *వచ్చినాడు* అని, మిగతా చోట్ల *వచ్చాడు* అని అంటారు. ఇట్లాంటి తేడాలను మాండలిక భేదాలు అంటారు. రాసేటప్పుడు వీటిలో ఏది రాయాలి ? అని అడుగుతుంటారు. దీనికి చప్పున సమాధానం చెప్పడం కష్టం. మనం రాసే విషయాన్ని బట్టి, ఎవరికోసం ఉద్దేశించాం అనే దాన్ని బట్టి సమాధానం ఉంటుంది. కవిత్వంలో ప్రాచీన భాష, మాండలిక భేదాలు, ఇంకా ఇతరమైన భేదాలు చాలా వాడతారు. కల్పనా సాహిత్యంలో అంటే - కథల్లో, నవలల్లో సందర్భాన్ని బట్టి మాండలిక భేదాలు వాడతారు. కాని, అన్ని రకాల ప్రజల్ని ఉద్దేశించి చేసిన రచనల్లో అందరికీ అర్థమయ్యే భాష వాడతారు. అట్లాంటి భాషను సామాన్య భాష అనీ, ప్రామాణిక భాష అనీ అంటారు. అందరికీ అర్థమయ్యే సామాన్య భాషను కొన్ని మార్పులతో రాస్తే ప్రామాణిక భాష అంటారు. రాసే అవసరాలున్న సమాజంలో అందరూ రాయడానికి ఒప్పుకున్న ఒక భాష ఉంటుంది. ఈ భాష కొన్ని మండలాల భాషతో దగ్గరి సంబంధమున్నా ఏ ఒక్కరి సొంతం కాదు. ప్రామాణిక రచనా భాష అనేది మాట్లాడే భాష నుంచే ఏర్పడుతుంది. ఎవరి వాడుక భాషను వారు పూర్తిగా రాస్తే ఆ భాష వాడని వారికి

అభిప్రాయ గ్రహణం కష్టం అవుతుంది. సాహిత్య రచన వేరు. సాహిత్యేతర రచన ఎక్కువ ప్రాంతాల వారికి అర్థం కావాలసిన అవసరం ఉంటుంది. అట్లా అందరికీ అందుబాటులో ఉన్న భాషను ప్రామాణిక భాష అంటారు. అందరూ రాయటానికి ఒప్పుకున్న భాష కాబట్టి ఆ భాషలో ఏకత్వం ఉంటుంది. అందరికీ అందుబాటులో ఉంటుంది కాబట్టి వారి వారి అలవాట్లు చేరడం వల్ల భిన్నత్వమూ ఉంటుంది.

ఒక్కోసారి రెండు మాటల్ని - అవి నామాలు కావచ్చు, క్రియలూ కావచ్చు - చూపించి ఇందులో ఏది ప్రామాణికం అని అడుగుతుంటారు. ఏదో ఒకటే ప్రామాణికమయి ఉండాలన్నట్టు. రెండూ ప్రామాణికం కావచ్చు. కొందరు చెప్పాడు అని రాస్తే కొందరు చెప్పినాడు అని రాస్తారు. రెండూ ప్రామాణికమే. ప్రామాణికత అనేది కొన్ని వ్యాకరణాలు, గ్రంథాలు, కొందరు వ్యక్తులూ నిర్ణయించేది కాదు. సామాజికులు సమాజంలో తలెత్తిన కొన్ని పరిస్థితుల వల్ల పరస్పరాంగీకారంతో నిర్ణయించుకొనేది. అందరూ రాయడానికి ఇష్టపడేది, ఇతరులు రాస్తే ఒప్పుకొనేది ప్రామాణిక భాష.

ఆంధ్రప్రదేశ్ (బి. ఆర్. అంబేద్కర్) సార్వత్రిక విశ్వవిద్యాలయం వారి
బి. ఏ. తెలుగు మౌలికాంశాల పాఠ్యగ్రంథంలో మొదటి పాఠం. - 1984.

# భాషా ప్రయోగౌచితి

## 5.1 ప్రవేశిక

పత్రికా రచనలో వాడే భాషను వ్యావహారిక భాష అంటున్నాం. కాని, ఇక్కడ గమనించాల్సిన విషయం ఒకటుంది. మాట్లాడే భాషను సాధారణంగా వ్యావహారిక భాష అంటాం. మాట్లాడినట్లే రాస్తే దాన్ని కూడా వ్యావహారిక భాషే అనవచ్చు. కానీ, ప్రపంచంలో రాయటం కూడా ఉన్న భాషల్లో, మాట్లాడే భాషకూ రాసే భాషకూ, పద్ధతుల వల్లా, ప్రయోజనాన్ననుసరించీ కొన్ని భేదాలు వస్తాయి. మాట్లాడేవన్నీ రాసే భాషలో ఉండక్కర్లేదు, ఉండవు కూడా. అట్లాగే, రాసేవన్నీ మాట్లాడే భాషలో ఉండక్కర్లేదు. దీన్నే ఇంకొక రకంగా చెబితే, మాట్లాడే భాషలో ఉండేవి మాత్రమే, రాసే భాషలో ఉండాలన్న నియమం లేదు. ఉదాహరణకు : *'నీకు మొన్న పరిచయం చేశానే ఆ అబ్బాయే పెళ్ళికొడుకు'* ఈ రకపు వాక్యం మాట్లాడే భాషలో కన్పిస్తుంది. రాసే భాషలో *'నీకు పరిచయం చేసిన అబ్బాయి'* అనే పద్ధతిలో మారుతుంది. అట్లాగే కొన్ని వాక్యాలూ, వాక్య పద్ధతులూ, ప్రయోగాలూ రాసే భాషలో అవసరం కావచ్చు. వాటిని వాడడానికి సంకోచం అక్కర్లేదు. అట్లాంటి కొన్ని పద్ధతులను గురించి ఈ భాగంలో తెలుసుకుందాం.

## 5.2 కర్త, కర్మ, క్రియాంశ ప్రధాన వాక్యాలు

వాక్యంలో ప్రాధాన్య వివక్షను అనుసరించి మూడు పద్ధతుల్ని మనం చెప్పుకోవచ్చు. సాధారణంగా వాక్యంలో కర్త, కర్మ, క్రియ అనే మూడు అంశాలను తీసుకుంటే వాక్యాలని కర్త ప్రధాన వాక్యాలు, కర్మ ప్రధాన వాక్యాలు, క్రియాంశ ప్రధాన వాక్యాలు అని మూడు రకాలుగా విభజించవచ్చు. సాధారణ వాక్యాల్లో చాలా భాగం కర్త ప్రధాన వాక్యాలు. 'ఆయన అన్నం తిన్నాడు' అనేది సాధారణ వాక్యం. ఇందులో కర్తకు ప్రాధాన్యం ఉంది. అయితే మిగతా వాటికి ప్రాధాన్యం లేదని కాదు. కర్తను మించిన ప్రాధాన్యం లేదు. అట్లాంటి ప్రాధాన్యం మిగతా పదాలకు ఇవ్వాల్సిన అవసరం భాషా వ్యవహారంలో, ముఖ్యంగా రచనా భాషా వ్యవహారంలో వచ్చే అవకాశం ఉంది. ప్రయోగాల సంగతి తరువాత చూద్దాం. నిర్మాణం కోసం పై వాక్యాన్ని చూడండి. ఆ వాక్యాన్ని అన్నం తినబడింది - (ఆయన చేత)- 'అన్నం ఆయన చేత తినబడింది' అంటే కర్మ ప్రధాన వాక్యం అవుతుంది. 'ఆయన అన్నం తినడం జరిగింది' అంటే అది క్రియాంశ ప్రధాన వాక్యం అవుతుంది.

ఈ రెండు రకాల వాక్యాలూ అంటే - కర్మ ప్రధాన, క్రియాంశ ప్రధాన వాక్యాలు తెలుగు భాషకు అసహజాలనీ, వీటిని నిషేధించాలనీ కొందరు అంటారు. పైన ఉదహరించిన వాక్యాలు అసహజంగా ఉన్నాయి. అందువల్ల ఈ అసహజ వాక్యాల వాడకం ఎందుకూ ? అని అడగవచ్చు. వాక్య సందర్భంలో ఇమడని మాట ఎట్లా అసహజమో. వ్యవహార సందర్భంలో ఇమడని వాక్యం కూడా అంతే అసహజం, తగిన సందర్భం ఉన్నప్పుడు అసహజంగా కన్పించినవే సహజంగా కన్పించవచ్చు. ఒక దినపత్రిక స్త్రీలకు ప్రత్యేకించిన పేజీలో ఈ వాక్యాలున్నాయి.

'' ఒక పురుషుడు చదువుకుంటే అతని వరకే ఆ విద్య పరిమితం. అదే స్త్రీ చదువుకుంటే ఆ కుటుంబానికంతా పరిమితమవుతుంది''.

పరిమితమనే మాట మొదటి వాక్యంలో సందర్భోచితంగా ఉంది. రెండవ వాక్యంలో అసందర్భంగా ఉంది. బహుశా ఇక్కడ పర్యాప్తమవుతుంది అనే అర్థంలో పరిమితం అనే మాటను వాడినట్లు అర్థమవుతుంది.

ఇప్పుడు, ఈ ఉదాహరణలు చూడండి :

ఒక తెలుగు మాస పత్రికలో 'లవ్ సైకాలజీ' అనే శీర్షికలో ఈ వాక్యం ఉంది :

''ప్రేమించబడడం అన్నిటికన్న గొప్పది. ప్రేమించే హృదయం లేకుండా ప్రేమించబడడం కల్ల''

ఒక విమర్శ పుస్తకంలో ''ఈ అంశం ఈ వ్యాసంలో ఇంతకు ముందు సూచించబడింది కూడా'' అనే వాక్యం ఉంది. ఒక నవలలో . . .. . ''దుకాణాలన్నీ మూసివేయబడ్డాయి'' అనే వాక్యం ఉంది.

అన్నం తినబడింది అనే వాక్యంతో పోల్చుకుంటే ఈ పైన ఉదహరించిన వాక్యాలేవీ అసహజంగా కన్పించటం లేదు. దీనికి కారణం పైన ఉపయోగించిన కర్మ ప్రధాన వాక్యాలు సందర్భోచితంగా ప్రయోగించబడ్డాయి. పై వాక్యాన్ని వివరిస్తూ వాడిన ఈ పూర్వపు వాక్యం కూడా కర్మ ప్రధాన వాక్యమే. అ.దువల్ల వాక్యాల ప్రయోగాల్లో సందర్భ శుద్ధి చూసుకుని ప్రయోగించాలి అని తెలుస్తుంది. ఈ కర్మ ప్రధాన వాక్యాల్ని కర్మణి వాక్యాలని, బడు వాక్యాలని అంటుంటారు. వీటి అవసరం మాట్లాడే భాషలో ఉండకపోవచ్చు. రాసే భాషలో అవసరమైన కొన్ని సందర్భాలను స్థూలంగా తెలుసుకుందాం :

1. కర్త ఎవరో తెలియనపుడు - ఒక పురాతనమైన కట్టడాన్ని ఎవరు నిర్మించారో నిర్మింపజేశారో తెలియనప్పుడు - *ఈ కోట పదహారో శతాబ్దంలో నిర్మించబడింది'* అనవచ్చు.

ఎన్‌కౌంటర్ హత్యలను గురించి రాస్తున్న వ్యాసంలో ''అతను చనిపోలేదు - చంపబడ్డాడు' అన్న వాక్యం ఉండవచ్చు.

డిటెక్టివ్ నవలలో పరిశోధిస్తే కాని తెలియని హంతకుడు చేసింది అనే అర్థంలోనూ పై రకం వాక్యం రావచ్చు.

2. కర్త ఎవరో చెప్పదలచుకోనప్పుడు, లేక చెప్పటం అవసరం లేదనుకున్నప్పుడు:

'' ఇక్కడ పాలు అమ్మబడును, ఇక్కడ పిండి రుబ్బబడును, ఇల్లు అద్దెకివ్వబడును'' అనే వాక్యాలు మహానగరాల్లో సర్వసాధారణంగా కనిపిస్తాయి. ఇక్కడ కర్తకు ప్రాధాన్యం లేదు. అందువల్ల విషయ ప్రాధాన్యం వల్ల ఇలాంటి వాక్యాలు కన్పిస్తాయి. ఇందులో అసహజమేమీ లేదు.

అట్లాగే హెచ్చరిక చేయబడింది, వార్త పంపబడింది అనే చోట్ల కర్తను గురించి చెప్పదలచుకోకపోవడం కన్పిస్తుంది.

3. వక్తే కర్త అయినప్పుడు మాటిమాటికీ తన్ను గురించి చెప్పుకోవడం ఎబ్బెట్టుగా ఉంటుందని ఈ రకపు వాక్యాన్ని ఆశ్రయించవచ్చు. పైన ఉదహరించిన విమర్శ ఉదాహరణ అలాంటిది.

4. కొన్ని చోట్ల కర్త, కర్మ లకు కాకుండా అసలు విషయానికే ప్రాధాన్యం ఇవ్వాలన్నప్పుడు కూడా ఈ వాక్య ప్రయోగం ఉండవచ్చు. పైన ఉదాహరణలో ''ప్రేమించబడడం'' అనేది కూడా అలాంటిదే.

ఈ కర్మ ప్రధాన వాక్యాల ప్రయోగం సాధారణ దైనందిన సంభాషణ వ్యవహారంలో కనపడదు. సభలూ, సమావేశాల్లోనూ, పత్రికా రచనల్లోనూ, ఉన్నత తాత్త్విక, సాంస్కృతిక శాస్త్ర విషయ సందర్భాల్లోనూ కన్పిస్తుంది. తెలుగులో ఈ రకపు వాక్యాలు సకర్మక క్రియ ఉన్న వాక్యాలకే వస్తుంది. సంస్కృతం, హిందీ వంటి భాషల్లో సకర్మక, అకర్మక క్రియలు రెండింటికీ ఈ రకపు నిర్మాణ ప్రయోగాలున్నాయి. కొన్ని భాషల్లో వీటి ప్రయోగం ఎక్కువ ఉండవచ్చు. శాస్త్ర రచన బాగా అభివృద్ధి చెందిన భాషల్లో ఈ

ప్రయోగాలు కన్పిస్తాయి. అక్షరాస్యత అధికంగా ఉన్న సమాజంలో కూడా ఈ ప్రయోగాల ఆధిక్యం ఎక్కువ కన్పిస్తుంది. తెలుగులో అక్షరాస్యత తక్కువ. శాస్త్ర రచనలూ తక్కువ. అందువల్ల తెలుగు రచనా భాషలలో వీటి ప్రయోగాన్ని సందర్భ శుద్ధితో వాడుకోవడం నేర్చుకోవాలి.

ఇప్పుడు క్రియాంశ ప్రధాన వాక్యాలను గురించి ఆలోచిద్దాం. క్రియలను స్థితి బోధక క్రియలనీ, గతి బోధక క్రియలనీ విభజించవచ్చు. ఒక వస్తువు లేక ప్రాణి అస్తిత్వాన్ని, చలన రాహిత్యాన్ని, గుణాన్ని, స్థితిని బోధించే క్రియల్ని, స్థితి బోధక క్రియ లంటారు. గతి బోధక క్రియల్లో వ్యాకరణ గ్రంథాల్లో చెప్పే వ్యాపారం, చలనం మొదలైనవి ఉంటాయి. వీటికి కాల ప్రాధాన్యం ఉంటుంది. పైన చెప్పిన క్రియాంశ ప్రధాన వాక్యాలు ఈ గతి బోధక క్రియలకే సాధ్యం. ''నేను అన్నం తినటం జరిగింది'' అనే వాక్యం వ్యాకరణ సమ్మతమే కానీ, (ప్రయోగం సంగతి ప్రస్తుతానికి వాయిదా వేద్దాం) ''మా ఇల్లు విశాఖపట్నంలో ఉండడం జరిగింది'' అని అనడం వ్యాకరణ సమ్మతం కాదు.

క్రియలో ఉన్న ఈ గతి అంశం వేరు చేసి, దానికి వేరే క్రియను కల్పించి చెబితే, వాటిని క్రియాంశ ప్రధాన వాక్యాలని అంటున్నాం. జరుగు, తటస్థించు, సంభవించు అనే క్రియలు తరచుగా ఈ వాక్యాల్లో కన్పిస్తాయి. ఈ వాక్యాలు కారణమేమిటో తెలియదు కానీ, ఇటీవల రచనా భాషలో ఎక్కువగా కన్పిస్తున్నాయి. ఎంత ఎక్కువగా కన్పిస్తున్నాయంటే మాట్లాడే భాషలోకి కూడా వచ్చేటంతగా. ఉపన్యాసధోరణిలో మాట్లాడే వ్యవహర్తల భాషా ప్రయోగంలో ఈ మాటలు ఎక్కువగా కన్పిస్తాయి. అయితే బడు వాక్యాలపై కొందరు మేధావులు విధించిన నిషేధం ఈ వాక్యాల ప్రాచుర్యానికి ఒక కారణమైతే కావచ్చు. ఈ వాక్యాల్లో కూడా కర్మ ప్రధాన వాక్యాల్లో లాగే కర్తకు ప్రాధాన్యం తగ్గుతుంది. కర్త ప్రాధాన్యాన్ని తగ్గించే ఒక వ్యూహం మీద నిషేధం ఉండటం వల్ల బహుశా ఈ రెండో వ్యూహానికి ప్రాధాన్యం పెరిగి ఉండవచ్చు. ఈ రకపు వాక్యాల్ని కూడా సాధారణ దైనందిన వ్యవహారంలో ఎక్కువగా వాడరు. అయితే, కర్త ప్రమేయం ఏమంత లేదు అని చెప్పేటప్పుడు ఈ రకపు వాక్యాలు కొంత ప్రయోజనకరం అవుతాయి. ''నేను మైసూరు వెళ్ళినపుడు భారతీయ భాషల సంస్థకు వెళ్ళటం జరిగింది'' అనే వాక్యంలో నేను ఆ సంస్థకు ప్రత్యేకంగా పనిగట్టుకుని వెళ్ళలేదనీ, ముందుగా అనుకోకుండా వెళ్ళాననీ వక్త చెపుతున్నట్లుగా మనం గ్రహించవచ్చు. అయితే దీన్ని కూడా సందర్భశుద్ధి లేకుండా ఉపయోగిస్తే అసహజంగా కన్పిస్తుంది.

## 5.3 వాక్య ప్రయోగాలు : ఆమోదయోగ్యత

1. ''నీకు మొన్న పరిచయం చేశానే అతనే పెళ్ళికొడుకు''.
2. ''నీకు ఏ అబ్బాయిని పరిచయం చేశానో ఆ అబ్బాయే పెళ్ళికొడుకు''.
3. ''నీకు పరిచయం చేసిన అబ్బాయి పెళ్ళికొడుకు''.

పై మూడు రకాల వాక్యాల్నీ ఒకే అర్థంలో వాడుతారు. మొదటిది మాట్లాడే భాషలోనే కనిపిస్తుంది అనుకుందాం. రెండు, మూడు రచనా భాషలో కన్పిస్తాయి. మూడో రకపు వాక్యాన్ని గురించి వివాదం లేదు. రెండో రకపు వాక్యమే తెలుగు పద్ధతి కాదని కొందరు ఈసడించుకుంటారు. ఇది తెలుగు పద్ధతి అవునా, కాదా అనే చర్చ జోలికి పోకుండా ఈ వాక్యాల అవసరాన్ని మనం గమనిద్దాం. మూడో రకపు వాక్యం సాధ్యం కాని సందర్భాలు కొన్ని ఉన్నాయి. ''నేను ఏ అమ్మాయితో సినిమాకు వెళ్ళానో, ఆ అమ్మాయి'' అనవచ్చు. అదే అర్థంలో ''నేను సినిమాకు వెళ్ళిన అమ్మాయి'' అనలేము. అంటే కొన్ని కొన్ని సందర్భాల్లో రెండవ రకపు వాక్యం రచనా భాషలో అవసరం అవుతుందన్నమాట. ఈ వాక్యాలు వాడేటప్పుడు కొన్ని జాగ్రత్తలు అవసరం. ఈ వాక్యాలను రొటీన్ విషయాలకు వాడితే అసందర్భంగా ఉంటుంది. ''నేను ఏ కాయితం కోసం పొద్దుటినుంచి వెతుకుతున్నానో ఆ కాయితం ఇప్పుడు కన్పించింది'' అనే వాక్యం వ్యాకరణ సమ్మతమే కానీ, సందర్భశుద్ధి లేనిది. అంత చిన్న విషయానికి ఇంత పెద్ద వాక్యం అవసరం కాదు. కొన్ని సందర్భాల్లో దీని ప్రయోగం సందర్భోచితంగా ఉంటుంది '' ఏ ప్రజల విముక్తి కోసం విప్లవవీరులు త్యాగాలు చేశారో ఆ ప్రజలు వారి నుంచి స్ఫూర్తి పొందుతున్నారు'' - ఈ రకపు వాక్యాలను అవసరం వచ్చినపుడు సందర్భశుద్ధిని తెలుసుకుని వాడటం రచనలో అవసరం.

మాట్లాడే భాషలో లేని ఓ పద్ధతి రాసే భాషలో మొదలైంది. ఉదాహరణకి ఒక దినపత్రిక హైదరాబాదు నగర అనుబంధ సంచికలో ఈ వాక్యం చూడండి : ''అధికారులు ప్రభుత్వానికి మధ్యలోపిస్తున్న సమన్వయం''. ఇదే వాక్యాన్ని 'అధికారులకీ ప్రభుత్వానికీ మధ్య లోపిస్తున్న సంబంధం' అని కూడా రాయవచ్చు. ఈ రకపు వాక్యాలను గురించిన చర్చ రంగనాయకమ్మ గారు రచించిన ''వాడుక భాషే రాస్తున్నామా'' అనే పుస్తకంలో విపులంగా ఉంది. ఈ పుస్తకంలోనూ కొన్ని వ్యాసాల్లో ఈ విషయం చర్చించబడింది.

## 5.4 ప్రసంగ క్రియలు

మామూలుగా మాట్లాడే భాషలో సాధారణంగా ఒకరన్న మాటను కోట్

(అనుకరణం) చేసినపుడు అన్నారనో, చెప్పారనో అంటాం. పత్రికలో ఎంతో మంది ఉపన్యాసాలనీ, ప్రకటనలనీ వారు చెప్పినట్లుగా రాయాల్సి ఉంటుంది. వారు చెప్పిన విషయాల్ని కొన్ని సార్లు రాయాల్సి ఉంటుంది. ఒక్క రెండు క్రియలతోటే అన్ని ప్రకటనలనూ, ఉపన్యాసాలనూ వర్ణించటం కుదరదు. అందువల్ల ఉద్ఘాటించారు, ప్రకటించారు, తెలియపరచారు, పేర్కొన్నారు అనే విధంగా రకరకాల క్రియలు ఉపయోగిస్తారు. అయితే ఈ క్రియ వాడేటప్పుడు ఆ క్రియలో అర్థానికి, ప్రసంగంలో విషయానికీ పద్ధతికీ సంబంధం పొసిగిందా లేదా చూసుకోవాలి. ''విద్యుత్తుపై పన్ను పెంచక తప్పలేదని ముఖ్యమంత్రి ఉద్ఘాటించారు'' అని రాస్తే అసందర్భంగా ఉంటుంది. అదే క్రియను 'మధ్యనిషేధాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ ఎత్తివేసేది లేదని ముఖ్యమంత్రి ఉద్ఘాటించారు'' అంటే సందర్భోచితంగా ఉంటుంది.

## 5.5 వాడకూడని సదృశీకరణలు

భాషా వ్యవహారంలో ఒక వస్తువుకో, పనికో, భావానికో, మరో వస్తువునో, పనినో, భావాన్నో, సంకేతంలా చేసి మాట్లాడే పద్ధతి ఒకటుంది. సాధారణ భాషలోనే 'అతను చాలా పైకి వెళ్ళాడు' అంటే కొండమెట్లో, చెట్టు కొమ్మనో ఎక్కిపైకి వెళ్ళాడనో కాక, సమాజం కోరుకుంటున్న, లేదా అనుకుంటున్న వాంఛనీయమైన స్థితిని పొందాడు అని అర్థం. అట్లాంటి స్థితిని పొందటానికి పైకి వెళ్ళడం అన్నది సంకేతంగా ఉంది. అట్లాగే 'పతనమయ్యాడు' అంటే నడుస్తూ నడుస్తూ కింద పడ్డాడు అని కాక సమాజ దృష్టిలో అవాంఛనీయం అనుకుంటున్న స్థితిని పొందాడు అని అర్థం. ఈ రకమైన ప్రయోగాలు భాషంతా వ్యాపించి ఉంటాయి. భాషలో మాటలకు కొత్త అర్థాలు కల్పించే పద్ధతి కూడా ఇదే. ఇట్లాంటి దాన్ని 'తెలుగులో సదృశీకరణం' అందాం. ఇంగ్లీషులో 'metaphor sat on అంటారు. అయితే ఆధునిక భాషలో ఇట్లాంటి పదాలు కొన్ని అధికారికంగా ప్రయోగించబడి అర్థప్రేరణ శక్తిని కోల్పోయి చురుగ్గా నడిచేశైలికి బరువయ్యే ప్రమాదం ఉంది. అట్లాంటి కొన్ని ఉదాహరణలు చూద్దాం. అందులో మరీ ఎక్కువగా కన్పిస్తున్న ఒక క్రియ 'అద్దంపట్టు'. ఈ మాట వాడేటప్పుడు అద్దమనే వస్తువు స్పృహ కూడా ఉండకపోవచ్చు. ఒక పత్రిక ఉత్తరాల శీర్షికలో 'కొడుకూ కూతురు కద వాస్తవానికి అద్దం పట్టినట్లుంది' అని ఉంది. ఈ రకపు వాక్యాలు పాఠకుల ఉత్తరాల్లో ఎప్పుడూ కన్పిస్తుంటాయి. ఈ వాక్యం ఏ కదను గురించైనా చెప్పవచ్చు. ఈ 'అద్దం పట్టడం' అనేది మొదట ఎలా వచ్చిందో తెలియదు కానీ, ఇటీవల మరీ ప్రయోగాలు పెరిగిపోయాయి. అట్లాంటి వాటిలో

మరో క్రియ ''చోటు చేసుకొను'' అన్నది. బహుశ ఇది ఇంగ్లీషులో to take place అనే క్రియకు మారుగా వచ్చి ఉండవచ్చు. కానీ చాలాసార్లు దీని ప్రయోగం అర్థవంతంగా కనపడదు.

'పద్యం స్థానంలో వచన కవిత్వం చోటు చేసుకుంది' అన్నామనుకోండి. ఇక్కడ స్థానం అనే ప్రయోగం వల్ల చోటు చేసుకోటానికి కొంతైనా సార్థక్యముంది. ఇటీవల రచనలో ఒకచోట అచ్చయిన ఈ వాక్యం చూడండి.

ఆయన జీవితంలో ఎన్నో ప్రధాన ఘట్టాలు చోటుచేసుకున్నాయి.

ఘట్టాలు సంభవిస్తాయి, జరుగుతాయి. కాని ఈ 'చోటు చేసుకోవటం' ఏమిటి ? ఒక వారపత్రికలో 'మందకొడితనం చోటు చేసుకుంటోంది' అన్న వాక్యం ఉంది. ఒక్కడ ఉద్దేశించింది. 'వ్యాపిస్తున్నది' అని. అట్లాంటిదే మరొకటి 'వెలుగుచూచు' అనే క్రియ. ఒక తెలుగు పత్రికలో ఈ వాక్యం చూడండి - 'నాంపల్లి రైల్వే స్టేషనులోని పాన్‌షాపు యజమాని మహ్మద్‌గౌస్‌కు ఖైరతాబాద్ నివాసి మహ్మద్ లతీఫ్ తరచుగా కర్నాటక వెళ్ళే రైళ్ళలో మద్యం తెచ్చి ఇస్తున్న విషయం వెలుగుచూసింది'. ఈ విషయాన్ని వెలుగు సాయం లేకుండా చెప్పలేమా ? ఇక్కడ కేవలం ఉద్దేశించింది ఆ సమాచారం బయట పడింది అని. ఈ కింది వాక్యం చూడండి :

''తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట కాలంలో అట్టడుగు ప్రజానీకం నుంచి కవులూ, కళాకారులూ ఎదిగి వచ్చి విముక్తమైన అద్భుత ప్రజా సృజనాత్మకతకి అద్దం పట్టినట్లు శ్రీకాకుళోద్యమంలో కూడా ఎందరో కవులూ, కళాకారులూ వెలుగు చూశారు''.

ఈ జాతికి చెందిన పదజాలమే రూపుదిద్దుకొను, రూపొందు అన్నటువంటివి. ఇట్లాంటివే మరికొన్ని క్రియలు రాజ్యమేలు, తీర్చిదిద్దుకొను, పాదులు తీయు మొదలైనవి.

### 5.6 వాక్య నిర్మాణం - కొన్ని విశేషాలు

మాట్లాడే భాషలో వాక్యాలు చిన్నవిగా ఉంటాయి. వాటి పద క్రమంలో సాధారణ పద్ధతికి అనుగుణంగా ఉంటుంది. వాక్యం పెద్దదైనపుడు దగ్గరగా వచ్చిన పదాల మధ్య వక్త ఊహించని అర్థాలు వాక్యంలో రావడానికి వీలుంది. వాక్యాలలో పదాల మధ్యన వ్యాకరణ సంబంధాలను అతిక్రమించి ఉచ్చారణలో కానీ, రాతలో కానీ, వచ్చిన వరుసలో సాహిత్యం వల్ల అనుకున్న అర్థాలని మించిన అర్థాలు వచ్చే ప్రమాదం ఉంది. ఉచ్చారణ లోనూ, సంభాషణలోనూ వీటిని సవరించుకునే అవకాశం ఉంటుంది. సంభాషణలో

వక్త, శ్రోత ఎదురెదురుగా ఉన్నప్పుడు వివరణ ద్వారా సవరించుకుంటారు. రాతలో ముందుగానే ఎడిట్ చేసుకోవటం అవసరం. ఉదాహరణకు పత్రికలో ఎన్నికల సందర్భంగా వచ్చిన వాక్యం చూడండి :

''నక్సలైట్లు కూడా ఓటింగులో పాల్గొంటే తీవ్ర పరిణామాలు ఎదుర్కొనవలసి వస్తుందని హెచ్చరికలు జారీ చేయటంతో ఉత్తర తెలంగాణాలోనే వార్ ప్రాబల్య గ్రామాలు ఇరుకున పడ్డాయి''.

ఈ వాక్యం ఉత్తర తెలంగాణా పరిస్థితితో ఎక్కువ పరిచయం లేని వారికి వెంటనే అర్థం కావటం కొంత కష్టం. నక్సలైట్లు కూడా - ఓటింగులో పాల్గొంటే - అనే మాటలకు ఈ లేఖకుడు సంబంధాన్ని ఉద్దేశించలేదు. రాతలో దగ్గర దగ్గరగా రావడం వల్ల ఉద్దేశించని సంబంధం వచ్చే ప్రమాదం ఉంది. 'నక్సలైట్లు కూడా' - అనే పదబంధం అన్వయించవలసింది - 'హెచ్చరికలు జారీ చేయటంతో' - అనే పదబంధంతో. అందువల్ల 'నక్సలైట్లు కూడా' అనే పదాన్ని 'హెచ్చరికలు జారీ చేయటంతో' అనే పదబంధానికి ముందు తీసుకొచ్చి పెడితే అనుకున్న అర్థం స్పష్టంగా ఉంటుంది. ఈ పై వాక్యం వ్యాకరణ విరుద్ధం కాదు. అర్థబోధక సామర్ధ్యంలో కుంటుపడింది.

ఒక నవలలో ఈ వాక్యం చూడండి : ''శవాన్ని హాస్పటల్ అధికారులు తీసుకుని పోవచ్చు అని అన్నా అక్కడ ఉండే వార్డుబోయ్‌లు అటకాయించారు''. ఈ వాక్యంలో 'హాస్పటల్ అధికారులు' అనే నామవాచకం 'తీసుకుపోవచ్చు' అనే క్రియ ఒకదాని పక్కన ఒకటి వచ్చాయి. రెంటికీ ఉద్దేశించని సంబంధం చదివిన వెంటనే వస్తుంది. ఇక్కడ 'హాస్పటల్ అధికారులు' అన్న మాటను 'అన్నా' క్రియకు ముందు చేరిస్తే ఈ ఉద్దేశించని అర్థం రాదు. ఇప్పుడు మార్చిన వాక్యం చూడండి : 'శవాన్ని తీసుకుపోవచ్చునని హాస్పటల్ అధికారులు అన్నా అక్కడ ఉండే వార్డుబోయ్‌లు అటకాయించారు.

తెలుగులో ఒక మనిషి చేసే పనులను ఆ చేసిన వరుసలో చెప్పటం కోసం వాక్య పద్ధతి ఒకటి ఉంది. ఇట్లాంటి పద్ధతి చాలా భాషల్లో కన్పిస్తుంది దీన్ని ఇంగ్లీషులో 'ser'al verb consturct on , తెలుగులో 'వరుస క్రమ క్రియా నిర్మాణం' అనవచ్చు. '' ఆయన బజారుకు వెళ్ళి అయిదు గంటలకి ఇంటికి తిరిగి వచ్చారు'' అనే వాక్యంలో ఆ వ్యక్తి చేసిన రెండు పనులను కాలంలో జరిగిన క్రమంలో పేర్కొన్నారు. అయితే ఒక్కొక్కసారి ఈ క్రియలు మరీ దగ్గరగా వస్తే పూర్వ క్రియకూ తర్వాత క్రియకూ భౌతిక ప్రపంచంలో లేదా సామాజిక ప్రపంచంలో ఉన్న సంబంధాల వల్ల ఇక్కడ వేరే అర్థాలు రావచ్చు. 'అతను

వ్యాకరణం పుస్తకం చదివి నిద్రపోయాడు' అనే వాక్యంలో నిద్రకు కారణం వ్యాకరణ పుస్తకం చదవటం అనే అర్థం కూడా వచ్చే వీలుంది'. ' ఆమె భర్తతో పోట్లాడి పుట్టింటికి వెళ్ళింది' అన్న వాక్యంలో భర్తతో పోట్లాడడం అన్నది పుట్టింటికి వెళ్ళడానికి కారణంగా తోచవచ్చు. ఈ రకపు వాక్యాలు ప్రయోగించేటప్పుడు ఉద్దేశించని అర్థాలు రాకుండా జాగ్రత్త పడాల్సి ఉంటుంది. అట్లా కాకుండా ఉండాలంటే దగ్గరగా వచ్చిన ఆ రెండు క్రియల మధ్యన ఇంకేదైనా పదబంధం చేర్చి ఆ సంబంధాన్ని అడ్డుకోవచ్చు. ఉదాహరణకు ఈ రెండు వాక్యాల్లో భేదం చూడండి :

ఆమె ఆఫీసుకు జడవేసుకుని వెళ్ళింది.

ఆమె జడవేసుకుని ఆఫీసుకు వెళ్ళింది.

మొదటి వాక్యంలో అలంకరణ విధానానికి ప్రాధాన్యం వచ్చింది. రెండవ వాక్యంలో పనుల వరకే ప్రాధాన్యం. పత్రికల్లో మనం వెతికితే అనుకోని అర్థాలు వచ్చే వాక్యాలు ఇట్లాంటివి చాలా దొరుకుతాయి.

## 5.7 పద, వాక్య ప్రయోగాల్లో పాటించాల్సిన జాగ్రత్తలు

పద ప్రయోగంలోనూ, వాక్య నిర్మాణంలోనూ తీసుకోవాల్సిన కొన్ని జాగ్రత్తలను ఇంతవరకూ పరిశీలించాం. ఇవి సాధారణంగా నేటి వచనంలో ఇతరత్రా కూడా కన్పిస్తాయి. ఈ రచయితలే దృశ్య శ్రవణ మాధ్యమాలకి రాస్తారు. కాబట్టి అక్కడ కూడా ఇలాంటి విశేషాలే కన్పిస్తాయి. అయితే ఒక్కొక్కసారి మాట్లాడినట్లు అన్పించటం కోసం మాట్లాడే భాషలోని కొన్ని చిన్నచిన్న నిర్మాణ రీతులు ఉపయోగించవచ్చు. వార్తా పఠనంలో కాగా, అయినా, ఇకపోతే, అనే సమాచారాల మధ్య సంబంధాలను సూచించే మాటల వాడకం కన్పిస్తుంది. అంతకు మించి భాషలో లిఖిత శ్రవ్య, దృశ్య మాధ్యమాల మధ్యన నిర్వహించే ఆడవాళ్ళు కానీ, మగవాళ్ళు కానీ, జంటలు కానీ ఎదురుగా ఉన్న ప్రేక్షకులను ఉద్దేశించి వాళ్ళకు గిలిగింతలు కల్గించేందుకు మాట్లాడే భాషా రీతులను వాడుకుంటున్నారు. వీటిని కోర్సు ద్వారా కాకుండా ప్రత్యేక శిక్షణ ద్వారా కానీ, వాటిని నిశితంగా పరిశీలించటం ద్వారా కానీ అవసరం అయితే నేర్చుకోవచ్చు. అయితే ఆ రీతులన్నీ ఇంకా పుట్టుక దశలోనే ఉన్నాయి. కనుక వాటి మీద మనం ఇప్పుడే తీర్పులు చెప్పలేం.

వాక్య నిర్మాణ ప్రయోగాల్లో కొత్తరీతులు అనేపేరుతో అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వారి *ప్రసారమాధ్యమాల కోసం రాయడం* అనే కోర్సులో (1997) మొదట అచ్చయింది.

# భాషోద్యమాలు : వ్యావహారిక భాష

ప్రపంచంలో భాషలన్నిటికీ లిపిలేదు. లిఖితస్థితి ఉన్న భాషా సమాజాల్లోనే భాషా ఉద్యమాలు కనిపిస్తున్నై. భాషోద్యమం రచనా భాషకు సంబంధించింది మాత్రమే అని భాషా సమాజాలను పరిశీలిస్తే తెలుస్తుంది. భాషోద్యమం అంటే ఏమిటి ? భాషోద్యమాలు ఎందుకు వస్తాయి ? అనే ప్రశ్నలు ఈ ప్రసంగవ్యాస పరిధిలోవే. దీనికి పూర్వరంగంగా, విషయాన్ని కొంచెంలోతుగా అర్థం చేసుకోటానికి వీలుగా మౌఖిక లిఖిత భాషల మధ్య వ్యత్యాసాన్ని పరిశీలిద్దాం.

మౌఖిక భాష ప్రధానంగా అత్యధిక భాగం ప్రత్యక్ష ప్రయోజన లక్షితమైనది. వాక్యాల్లో మనం వ్యక్తం చేసే అభిప్రాయం, విషయ నివేదనకో, విషయ సంపాదనకో, కార్యాచరణకో ఉద్దేశించబడింది. ప్రత్యక్ష విషయ (భావ) గ్రహణ మౌఖిక భాషా లక్ష్యం కాగా మౌఖిక భాషా వ్యవహారంలో భాష కూర్పు మీద దృష్టి అంతగా ఉండదు.

అయితే ఇందుకు ఒకే అపవాదం ఉంది. మనుషులకు సౌందర్య దృష్టి సహజమైనది. తన చుట్టూ తనకుద్దిష్టం కాని ప్రకృతిలోనే ఎవరో ఎవరికోసమో ఉద్దేశించినట్టుగా సుందర దృశ్యాల్ని చూడటానికి, శ్రావ్య సంగీతాన్ని వినటానికలవాటుపడ్డ మనిషి తనకందుబాటులో, సాగే గుణమున్న (flex b e) భాష అనే వస్తువు ఉన్నప్పుడు దాన్ని సౌందర్య ప్రతిపాదనకోసం ఉపయోగించటం ఆశ్చర్యం కాదు. అందువల్ల ప్రతి భాషా సమాజంలోనూ సాహిత్యం అని మనం పిలిచే భాష కూర్పు ఉంటుంది. (ఇక్కడ సౌందర్యం, సాహిత్యం అనే మాటల నిర్వచనాల తీగెలు కదిలించను).

సాహిత్య రచనలో భాష మీద దృష్టి ఉంటుంది. ప్రత్యక్ష ప్రయోజనాన్ని మించి ఉండటంవల్ల సాహిత్యం లిఖితస్థితి లేకుండా కూడా మొదటి పరిసరాన్ని దాటి భిన్న కాలాలకు విస్తరించగలదు. జానపద గేయాలు, గాథలు ఇట్లాంటివి. మౌఖిక భాషలో నిక్షిప్తమయ్యే విషయానికి మనుషుల జ్ఞాపకశక్తి ఒక పెద్ద పరిమితి. లేఖన సంప్రదాయంలేని భాషా సమాజాల సాంకేతికాభివృద్ధి అతి ప్రాథమికంగా ఉంటుంది. అభివృద్ధి చెందిన సమాజానికి లిఖిత భాష చాలా ముఖ్యమైన అంగం.

మాట్లాడే భాషకు వక్తృశ్రోతలు ప్రత్యక్షంగా ఉండాలి. దీని స్థితికి దేశ కాలపరిమితి ఉందన్నమాట. భిన్నకాలాలకూ భిన్న ప్రాంతాలకూ అందాలంటే అంచెలంచెలుగా మళ్ళీ

మనుషులే అందించాలి. దానివల్ల చాలా చిక్కులున్నై. పరిమితమైన మనిషి జ్ఞాపక శక్తి మీద ఆధారపడాల్సి రావటం వల్ల భాషలో నిక్షిప్తం చేసే విషయ పరిమాణం (quantity of information) అత్యంతం పరిమితమై ఉంటుంది. అంతేకాదు, మనిషి జ్ఞాపకశక్తి విషయ గుణాన్ని (quality of information) కూడా మార్చవచ్చు.

లిఖిత భాష ఈ పరిమితులను దాటుతుంది. విషయ పరిమాణానికి పరిమితు లుండవు. భాషా ప్రసారానికి దేశకాలావధులుండవు. అంతేకాక తొలిసారి నిక్షేపించిన విషయం మారకుండా ఉంటుంది. Accuaracy దెబ్బతినదు.

ఇదేగాక ఇంకో విశేషం ఉంది. మౌఖిక భాషా స్థితికి స్థిరత్వం లేదు. ధ్వనివాహకమైన భాష త్వరగా గాలిలో కలిసిపోతుంది. అందువల్ల విషయ గ్రహణ త్వరగా జరగాలి. లిఖిత భాష విలంబ విషయ గ్రహణాన్ని (delayed comprehension) సహిస్తుంది. ఇప్పుడు చదివిన వ్యాసాన్ని ఇప్పుడే అర్థం చేసుకోవాల్సిన అవసరంలేదు. ఇంకో నెలతరువాత అర్థం చేసుకోవచ్చు.

మౌఖిక భాషలో వ్యక్తీకరణ, ఎడిటింగు దాదాపు ఒకేసారి జరుగుతై. ఒకసారి ప్రయోగించిన తరువాత ఎడిటింగు కవకాశం లేదు. లిఖితభాషలో వాక్యాలనుగాని, వాక్య సముదాయాలనుగాని ముందు వెనుకలు చాలాసార్లు చూసుకొని సవరించుకొనే అవకాశం ఉంటుంది. ఆ అవకాశం టెక్నాలజీ పెరిగే కొద్దీ ఇంకా ఎక్కువయింది. విషయ నిక్షేపంలోనూ, విషయ గ్రహణలోనూ లిఖిత భాషకు విలంబ క్షమత్వం అనేది గుర్తించ దగిన ముఖ్యాంశం. దీనివల్ల మౌఖిక, లిఖిత భాషా స్వరూపంలో ప్రయోగంలో భేదం ఉంటుంది. అందువల్ల రాసే భాషకు మాట్లాడే భాషతో సంపూర్ణసామ్యం ఉండదు. మౌఖిక, లిఖిత స్థితుల్లో, పరిసరాల్లో, సందర్భాల్లో ఉన్న భేదంవల్ల ఈ భేదం వస్తుంది. ఇది సహజమైనది. అందువల్ల రాసేభాషను మాట్లాడినట్టు లేదే అని ఈసడించటం అంత సమంజసంగా కనిపించదు.

భాషా సమాజానికి ఒక సంస్కృతి ఉంటుంది. బహుకాలంగా లేఖన సంప్రదాయం ఉన్న సమాజానికి చిరకాలంగా ఏర్పడ్డ సాంస్కృతిక సంప్రదాయాలు, భాషా సంప్రదాయాలూ ఉంటై.

ఉదాహరణకు తెలుగుభాషా సమాజానికి వేయి సంవత్సరాల సాహిత్య రచనా సంప్రదాయం ఉంది. ఏ సంప్రదాయమైనా నూటికి నూరుపాళ్లూ అంత కాలం అట్లాగే ఉండదు. తయారయిన ఒక వ్యవస్థలో కొన్ని అంశాలు నష్టమవుతూనే ఉంటే మరికొన్ని అంశాలు కొత్తగా చేరుతూ ఉంటై. ఇది వివరణ అక్కరలేని సత్యం. భౌతిక,

సాంస్కృతిక, భాషా వ్యవస్థలన్నిటిలోనూ ఇది నిత్యం జరిగే పని. మౌఖిక భాషా వ్యవస్థలో ఈ పని కొంత వేగంగా జరుగుతుంది. లిఖిత భాషా వ్యవస్థలో ఈ పని కొంత ఆలస్యంగా జరుగుతుంది. ఉదాహరణకు తెలుగుకావ్య భాషా సంప్రదాయాన్నే తీసుకోండి. నన్నయ్య భాషలో ''నూరేండ్లం గోలెన్, యోజనంబున గోలెన్, నినుజూచినయప్పట గోలెన్'' అని కోలెన్‌అనే విభక్తి ప్రత్యయాన్ని దేశకాలబోధకనామాల మీద పర్యంతార్థంలో ఉంది. తరువాత భాషలో, ముఖ్యంగా నన్నెచోడ తిక్కనల భాషలో '' ఎఱిగిన కోలెను. చూచిన కోలెను, గోగ్రహణంబునంగోలె, కనుచూపుకోలె'', అని క్రియాజన్య విశేషణాల మీద, వ్యాపారార్థకనామాల తరువాత ఈ ప్రత్యయం కనిపిస్తుంది. ఆ మేరకు కావ్యభాషా వ్యవస్థలో మార్పుజరిగింది. ఈ కావ్య భాషలో వివిధ కాలాల్లో శబ్దరూపాల్లోనూ, అర్థాల్లోనూ జరిగిన మార్పుల్ని గిడుగు రామమూర్తిగారు బాలకవి శరణ్యంలోనూ, సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శనంలోనూ విశేషంగా చర్చించారు. విశేషచరిత్ర ఉన్న ఏభాషా వ్యవస్థలోనైనా ఇట్లాంటి మార్పులు కనిపిస్తయ్.

లిఖిత భాష అనే అర్థంలో రచనాభాష అనే మాటను ఇప్పుడు వాడుతున్నాం. ఆ అర్థంలోనే ఈ వ్యాసంలో వాడతాను. రచనాభాషకూ, మౌఖిక భాషకూ స్థితి, పరిసర, సందర్భభేదాలవల్ల వచ్చే వైషమ్యాలను గుర్తిస్తూనే రెంటికీ ఎక్కువ పోలికలున్న ప్రాచీన కాలాన్ని ఊహించడం తార్కికంగా సాధ్యమే. ఏదో ఒక కాలంలో ఈ రెండు భాషలూ అతి సన్నిహితంగా ఉన్నయ్యనుకుందాం. తరువాత కొంతకాలానికి అనుసరించటానికి వీలయిన ఒక సంప్రదాయం ఏర్పడుతుంది. మౌఖిక భాషతో సామ్యం ఉంచుకుంటూనే తద్భిన్నమైన భాషా వ్యవస్థ ఏర్పడుతుంది. దీన్నే సంప్రదాయీకరణం అందాం. దీన్ని ఇంగ్లీషులో sty izat on అనీ, దాన్ని అనుసరించి శైలీకరణం అని తెలుగులో వ్యవహరిస్తున్నారు. ఒక రకంగా సంప్రదాయీకరణం, వ్యవస్థీకరణం ఒకే రకమైన వ్యాపారాలు. తెలుగు రచనా భాషలో తొమ్మిదో శతాబ్ది నుంచీ సంప్రదాయీకరణానికి ప్రత్యక్ష సాక్ష్యం దొరుకుతుంది. సంప్రదాయీకృతం కాని లిఖిత భాషావ్యవస్థ ఉండదనుకుంటాను. నిజానికి మౌఖిక సాహిత్య భాషలోనూ ఈ సంప్రదాయీకరణం కనిపిస్తుంది. ''అనగా అనగా ఒక రాజుండేవాడు'' అనే వాక్యం మౌఖిక సాహిత్యంలో సంప్రదాయీకరణకు ఒక ఉదాహరణ. రచనా భాషలో యక్షగానాలు, సంకీర్తన సాహిత్యం, శాసన భాష, ఉత్తరాల భాష – ఇవన్నీ సంప్రదాయీకరణకు లక్ష్యాలే. ఆ మాటకొస్తే రామమూర్తి, అప్పారావుగార్ల 'ఉన్నూ'ల భాష సంప్రదాయీకృతమైన భాష.

సంప్రదాయానుసరణం వల్ల పదాలూ, పదరూపాలూ, వాక్య పద్ధతులూ తత్కాల మౌఖిక భాషావిరుద్ధంగా రచనా భాషలో కనిపిస్తయ్. వర్ణ క్రమ రచన (స్పెల్లింగు) లోనూ కనిపిస్తయ్. విద్వాన్ విశ్వంగారి 'మాణిక్యవీణ'లో బండి 'ఱా' ఇట్లాంటిదే. మాట్లాడే భాషలో తరచుగా లోపించే ఉత్తమ పురుష క్రియాంత ప్రత్యయం 'ను' రచనాభాషలో ప్రత్యక్షం కావటం ఇందుకే. ఉత్తరం ముగిస్తూ 'ఇట్లు' అని రాయటం సంప్రదాయీకరణ ప్రభావమేనని గుర్తించటం కష్టం కాదు. ఇది తెలుగు భాషకు ప్రత్యేకమైనది కాదు. ఇంగ్లీషు భాష రచనలో ఉత్తమ పురుషలో I ప్రయోగం మౌఖిక భాషా సామాన్యం కాదు. మౌఖిక భాషలో కనిపించే me మాండలికేతర భాషలో కనిపించదు. ఇట్లా ఏ కాలంలో అయినా మాట్లాడే భాషకూ రచనా భాషకూ గుర్తింపదగిన వైషమ్యం ఉంటుంది. ఇందులో తప్పొప్పుల ప్రసక్తి లేదు. ఉచితానుచితాల ప్రమేయం లేదు. ఉన్న స్థితి ఇది.

చారిత్రక వాస్తవాల పరిశీలన మిషతో గ్రాంథిక భాషావాదాన్ని దొంగచాటుగా రంగ ప్రవేశం చేయిస్తున్నానన్న అనుమానం రావచ్చు మీకు. గ్రాంథిక, వ్యావహారిక భాషా వాదాలను శాస్త్ర దృష్టితో పునః పరిశీలించుకోవలసిన అవసరాన్ని మాత్రమే మీకు తెలియజేయ దల్చుకున్నాను. గ్రాంథిక, వ్యావహారిక భాషా వాదాలకు కాలం చెల్లినట్టుగానే భావిస్తున్నాను. జువ్వాడి గౌతమరావు 24 ఏళ్ళ క్రితం జయంతి పత్రికల్లో అన్నట్టుగా, భాషా లడాయికీ పేర్లు సరిగ్గా కుదరలేదు. వాక్య నిర్మాణంలో జాతీయతా ముద్రతో రచించే గ్రాంథిక భాషా ఉంది, అందుకు విరుద్ధంగా రాసే వ్యావహారిక భాషా ఉంది. గ్రాంథిక, వ్యావహారిక భాషా భేదాలను అన్ని వేళలా స్పష్టంగా వేరుపరచి చూపలేం.

గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావుగార్లు శిష్ట వ్యావహారిక భాష అనే పేరుతో ఒక రకపు రచనా భాషను ప్రవేశపెట్టారు. ఉదాహరణకు గురజాడ అప్పారావుగారి వచన శైలి చూడండి.

''గత కాలములో నవమూష్టం పారాయణం చెయ్యడమందు నిపుణులయిన బ్రాహ్మణ వుద్యోగస్థులు రయితును, రట్రను పరిపాటిగా ఒక స్వారస్యమైన తిట్టును తిట్టుతూ వచ్చేవారు. ఇప్పుడైనా కడపెడలను ఆ శబ్దం వినబడడం కద్దు. ఈనాడు కొందరు పండితులూ, కవులూ అట్టిదియే గ్రామ్యోక్తి వొకటి గ్రామ్యభాషను గురించి వినియోగించుదురు.''

గురజాడ అప్పారావుగారి దృష్టి కొత్త గ్రాంథిక భాషను ప్రవేశపెట్టటమే అనేది స్పష్టంగానే తెలుస్తుంది. ''వాడుక భాషలో నుంచి సులభసాధ్యమైన వొక కొత్త గ్రాంథిక భాషను కల్పించుకుంటే శాస్త్రులుగారికి యేమికొరత ?'' అన్నారాయన.

గురజాడ అప్పారావుగారు ''బ్రాహ్మణాదులు వాడుకొనే నాగరికమైన భాష'' అన్నా, ఆయన రాసింది వాడుక భాష కాదని గుర్తించటం కష్టం కాదు. ప్రాచీన రచనా భాషా రూపాలను, ఆధునిక వ్యవహార భాషను కలగలిపి ఒక కొత్త గ్రాంథిక భాషను తయారు చెయ్యటమే ఆయన ఉద్దేశించింది. శిష్ట వ్యావహారికం పేరుతో ఇంతవరకు ఎవరు రాసిందయినా కచ్చితమైన అర్థంలో మౌఖిక వ్యవహార భాష కాదు. మౌఖిక భాషలో లేని ప్రాచీన నామ క్రియాదులు కొన్ని రకాల వాక్య భేదాలు రచనా భాషలో ఉంటై. మౌఖిక భాషలో లేని క్లుప్తత, సంక్షిప్తత, రచనా భాషలో ఉంటై. కొందరి రచన మౌఖిక వ్యవహారానికి చాలా దూరంగా ఉంటుంది.

ఉదాహరణకి శ్రీ శ్రీగారి ఈ శైలి చూడండి : ''పశ్చాద్దృక్కుల ప్రగల్భ ఘోషలకు లక్ష్యపెట్టక మానవ మహోదయం దిక్కుగా క్రాంతి రథం కదలి పోతుంది. తొలి నుంచీ తెలుగు జాతి ప్రగతి మార్గంలో అగ్రేసరంగానే నిలిచింది. అవాంతరాలకు జడిసి ఆగిపోవడం గాని, అనర్థాలకు లొంగి అలిసిపోవటం గాని గతంలో జరగలేదు. ఆగతంలో జరగబోదు. సుస్థిరమూ, సుస్పష్టమూ అయినా ఈ విశ్వాసమే ఇక్కడ మనందరిని ఏకత్రపరిచిందని ఘంటాపదంగా హెచ్చరిస్తున్నాను.'' ఈ రకమైన భాష ఎవరి నోటంట అయినా వింటే రాసింది చదువుతున్నట్టుగానో, అప్పజెప్పుతున్నట్టుగానో అనుకుంటాం. శ్రీ శ్రీగారు 1955 ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ సమావేశంలో రాసుకొచ్చి చదివిన అధ్యక్షోపన్యాసంలో భాగం ఇది.

అట్లాగే శ్రీ శ్రీగారి చరమ రాత్రిలో ఈ వాక్యాలు వినండి :

''ఆరు నెలలు అహోరాత్రాలు జాగ్రత్సుషుప్తులలో ఎడతెగని యోచనా తరంగాలలో నా నిశ్చయాన్ని స్నానం చేయించాను. ఆరు నెలల అవబృథ స్నానంలో పవిత్రీకృతమైన నా అందమైన, నా ఆడుకునే, నా తిరుగులేని భయంకరమైన సంకల్పాన్ని ఈ రాత్రి ఆచరణలో పెడుతున్నాను.''

అయితే, వ్యావహారిక భాషోద్యమం ప్రయోజనమేమిటి ? ఈ ఉద్యమం ఒక నిర్ణీతమైన కాలంలో ఎందుకొచ్చింది ? అసలు ఉద్యమమంటే ఏమిటి ? భాషోద్యమాలు పూర్వం ఉన్నాయా ? ఇట్లాంటి ప్రశ్నలు తలెత్తుతై. ఈ సందర్భంలో భాషకూ సమాజానికి ఉన్న సంబంధాన్ని కూడా మనం అర్థం చేసుకోవాలి.

భాష మానవుల సాంఘిక వ్యాపారానికి అతి ముఖ్యమైన సాధనం. భాష లేకపోతే మానవజాతి సాధించిన అభివృద్ధి అంతా సాధ్యం కాదు. మానవులు భాషను సంఘ

జీవనంతోపాటు సాధించుకున్నారు. భాష ఎట్లా పుట్టింది ? అనే ప్రశ్న మనకు ప్రస్తుతం అనవసరం. మనకు తెలిసిన చరిత్ర బట్టి చూస్తే ప్రపంచంలో ఎక్కడా ఎప్పుడూ భాష లేని మానవ సమాజం ఉన్నట్టు సాక్ష్యం లేదు. అందువల్ల భాషకూ సమాజానికి ఉన్న సంబంధాన్ని గురించి అంతగా ఘోషించి చెప్పక్కర్లేదు. ఆ సంబంధం స్వభావాన్ని గురించి మాత్రం చెప్పుకోవాలి.

మానవజాతి అభివృద్ధి కొన్ని దశల వారీగా జరిగిందని సూచించారు. ఆ దశల మూలతత్త్వాన్ని విశదీకరిస్తూ మార్క్సు, ఏంగెల్సులు ''ప్రతి దశలోనూ సమాజానికి ఆర్థిక పునాది ఉంటుంది. ఆ పునాది మీద నిర్మితమైన రాజకీయ, సాంస్కృతిక వ్యవస్థ ఉపరితల నిర్మాణంగా ఉంటుంది. రెండు నిర్మాణాలు పరస్పర పోషకంగా, రక్షకంగా ఉంటై. ఒక దశ నుంచి ఇంకో దశకు సమాజం మారేప్పుడు ముందు పునాది మారుతుంది. దాని మీద ఏర్పడ్డ ఉపరితల నిర్మాణమూ తరవాత మారుతుంది. ఈ మార్పు వర్గపోరాటం వల్ల సాధ్యమవుతుంది'' అని అన్నారు. దీన్ని గురించి ఏ ప్రాథమికమైన మార్క్సిస్టు మూలగ్రంథం చూసినా తెలుసుకోవచ్చు.

సామాజిక అభివృద్ధిలో అత్యంత ప్రముఖ పాత్ర వహించే భాష స్థానం ఎక్కడ అనే ప్రశ్న ఉద్భవిస్తుంది N. Y. Marr అనే సోవియట్ భాషా శాస్త్రజ్ఞుడు దీన్ని గురించి ఆలోచించి కొన్ని సిద్ధాంతాలు చేశాడు. భాషను ఆర్థిక వ్యవస్థమీద ఆధారపడ్డ ఉపరితల నిర్మాణంలో భాగంగా గుర్తించాడు. భాషకు వర్గదృష్టిని అంటగట్టాడు. దీని విషయమై సోవియట్ శాస్త్రజ్ఞులలో తర్జన భర్జనలు జరిగినై. మార్క్సు, లెనిన్ సిద్ధాంతాల భాష్యకారుడు జోసెఫ్ స్టాలిన్ ఈ వివాదంలో పాల్గొని, కొన్ని సందేహాలను నివారించి, భాషా సమాజాలను గురించిన సదవగాహనకు గట్టి ప్రాతిపదిక వేశాడు. ఆయన వివరణ సారాంశం ఇది :

''సామాజిక దశలలో ఒక దశ నుంచి ఇంకో దశకు పరివర్తన నెమ్మదిగా జరగదు. శాంతియుతంగా జరగదు. ఒక వర్గం తమ మీద పెత్తనం చేస్తున్న వర్గాన్ని బలవంతాన అధికారాన్నుంచి తొలగించి, పునాదిని మారుస్తుంది. ఒక దశ పునాదితో పాటు, దానిమీద నిర్మితమైన ఉపరి నిర్మాణం కూడా కూలిపోతుంది. కొత్త ఆర్థిక వ్యవస్థ పునాదిగా కొత్త ఉపరి నిర్మాణం సాగుతుంది. ఇదంతా విప్లవ కార్యాచరణ వల్ల సాగుతుంది.'' భాష ఉపరితల నిర్మాణంలో భాగమయితే ఆర్థిక వ్యవస్థ మారినప్పుడల్లా భాషలో మార్పు రావాలి. ఆ మార్పు విప్లవకరమైన మార్పు కావాలి. అంటే, పాత రాజకీయ వ్యవస్థలాగే పాత భాషా యంత్రాంగం భ్రష్టమైపోవాలి. కొత్త పునాది మీద కొత్త భాషా యంత్రాంగం నిర్మితం కావాలి. ఇట్లాంటివేవీ భాష విషయంలో జరిగినట్లు ఆధారాలు లేవు. భాష ఒక

వర్గం చేతిలో ఆయుధం కావాలి. భాషకు వర్గ స్వభావం ఉండాలి. పీడిత వర్గం పీడక వర్గ భాష మీద యుద్ధం ప్రకటించాలి. కాని, భాషకు ఈ విధమైన వర్గస్వభావం ఉన్నట్టు మనకు దాఖలా లేదు. భాషను ఉపరితల నిర్మాణంలో భాగంగా భావించటం పొరపాటు. భాషకు వర్గస్వభావం లేదు. భాషను కొన్ని అంశాలలో ఉత్పత్తి పరికరాలతో పోల్చవచ్చు. ఉత్పత్తి పరికరాలకు వర్గస్వభావం లేదు. ఏ వర్గమైనా దాన్ని ఉపయోగించుకోవచ్చు. అయితే, ఉత్పత్తి పరికరం వస్తూత్పత్తి చేస్తుంది. భాషకు అట్లాంటి సామర్థ్యం లేదు.

భాష మారని పదార్థం కాదు. భాష మారుతుందని వాదించక్కర్లేని సత్యం. అందులో మార్పును పదార్థ అస్తిత్వంలో భాగంగా పరిగణించే మార్క్సిస్టులు భాషలో మార్పులు అలక్ష్యం చేయటం అసాధ్యం. అయితే, భాషలో మార్పులు సామాజిక రంగంలో లాగా దశల వారీగా, అంటే విప్లవాత్మకంగా రావు. క్రమ పరిణామ పద్ధతిలో వస్తయ్. అదీగాక భాషలో వచ్చే మార్పులకూ, ఆర్థికమైన పునాదికీ సంబంధం లేదు. ఉదాహరణకు కొన్ని ద్రావిడ భాషల్లో ప్రాచీన ద్రావిడ 'క' కారం 'చ' కారం అయింది. ఇది తెలుగు, తమిళాలలో జరిగింది. కన్నడంలో జరగలేదు. దీనికి కారణభూతమైన, లేక సమాంతరమైన ఆర్థిక వ్యవస్థలో మార్పును చూపించలేము. ఇంగ్లండులో ఫ్యూడల్ వ్యవస్థ భగ్నమైన వెంటనే భాషలో మార్పులు రాలేదు. భాషా వ్యవస్థలో మార్పులు ఆర్థిక, రాజకీయ, సామాజిక కారణాల వల్ల రావు.

అయితే భాషకూ, సమాజానికీ ఏ విధమైన సంబంధం ఉంది ? అనే ప్రశ్న అట్లాగే మిగిలి ఉంది. సమాజంలో మార్పులు భాషలో ప్రతిఫలించవా ?

భాషకు వ్యాకరణ నిర్మాణం, ధ్వని వ్యవస్థా ఉన్నయ్. వాటిలో వచ్చే మార్పులకు ఆర్థిక వ్యవస్థ ప్రత్యక్ష కారణం కాదు. భాషలో ఉన్న మూలధాతువుల్లో, ప్రత్యయాల్లో వచ్చే మార్పులకు సామాజిక కారణాలుండవు. కాని కాంక్రీట్ లెవల్లో సామాజిక కారణాల వల్ల కొన్ని మార్పులు వస్తయ్. పాత మాటలకు కొత్త అర్థాలు రావచ్చు. ఇంతకు ముందు లేని కొన్ని కొత్త సమాస కల్పనలు జరగొచ్చు. ఇతర భాషా సంపర్కం వల్ల కొత్త మాటలు భాషలో చేరవచ్చు. కాని భాషలో కొత్త సూత్రాలు సామాజిక కారణాల వల్ల ఏర్పడవు.

ఇటీవల కాలంలో కొన్ని ధ్వనుల మార్పులకు సామాజిక కారణాలు చూపించారు కొందరు. భాషా వ్యవహర్తలు కొన్ని రకాలు భాషా రూపాలను అనుసరించటానికి, లేక వాడటానికి సామాజిక కారణాలుండొచ్చు. తెలుగులో చకారాది పదాలు కొందరి ఉచ్చారణలో సకారాదిగా ఉన్నయ్. ఆది సకారోచ్చారణ గౌరవప్రదం కాదని తోస్తే

వ్యవహర్తలు గౌరవ సంపాదన ప్రయత్నంలో చకారోచ్చారణని గ్రహించవచ్చు. ఈ రకమైన మార్పులు అన్ని భాషల్లోనూ గమనించవచ్చు. ఈ రకమైన మార్పులు ఒకే దశలో ఉన్న సామాజికవ్యవస్థలోనే వ్యవహర్తల మానసిక ప్రవృత్తులననుసరించి జరగవచ్చు. మార్క్సిస్టుల అర్థంలో ఈ రకమైన మార్పులకు వర్గ స్వభావం లేదు. అంటే, వర్గ వైరుధ్యం లేదు.

ఈ సందర్భంలోనే వర్గ మాండలికాల విషయం కూడా కొంచెం ఆలోచించాలి. ఒక భాషా సమాజంలోనే ఉన్న భాషా భేదాలను ప్రాంతీయ భేదం కాకపోతే వర్గ మాండలికాలని వ్యవహరిస్తాం. ఇక్కడ వర్గాలంటే సామాజికమైన వర్గభేదాలే. అయితే, ఇవి మార్క్సిస్టులు ఆర్థిక వ్యవస్థ వివరణలో ఉపయోగించే వర్గాలు కావు. పూజారులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, రైతులు, కూలీలు, చదువుకున్న వాళ్లు, చేపలు పట్టేవాళ్లు, ఉప్పరి పనివాళ్ళు, మేదర పనివాళ్లు, ఇట్లా రకరకాల పనిపాటల వాళ్ళలో భాషా భేదాలుండ వచ్చు. వీటిని వర్గ మాండలికాలనే అంటాం. కాని, ఈ వర్గాలు ఆర్థిక వైరుధ్యమున్న వర్గాలు కావు. వర్గ పోరాటం ప్రసక్తి భాషా విషయంలో రాదు.

అయితే, భాషోద్యమాల మాటేమిటి ? అసలు ఉద్యమాలంటే ఏమిటి ? ఉద్యమానికి ఒక పనిని ప్రారంభించటం, ఒక పనికి పూనుకోడం అనే నైఘంటుకార్థాలున్నై. దీనికి సమానార్థకంగా ఇంగ్లీషులో movement అనే మాటను ఉపయోగిస్తున్నారు. ఆ మాటకు ఇక్కడ సరిపడే అర్థం ఒకరు కాని, కొందరు కాని ఒక లక్ష్యసాధన కోసం అదే పనిగా ప్రయత్నించటం అని అర్థం చెప్పుకోవచ్చు. అయితే, ఎక్కువగా ఎక్కువ మంది కలిసి చేసిన ప్రయత్నాన్నే ఉద్యమం అని నేటి వాడుక. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, విశాలాంధ్రోద్యమం, భారత స్వాతంత్ర్యోద్యమం - ఇట్లాంటివి. ఈ దృష్టితో ప్రాచీన కాలంలో భాషోద్యమాలు ఉన్నాయా ? అంటే కొంచెం తీరిగ్గా వెతకాలి. నన్నయ్య తెలుగులో కవితారచన చెయ్యటం, తిక్కన తెలుగు పలుబళ్ళు వాడటం భాషోద్యమాలుగా కొందరు సూచిస్తుంటారు. ఆధునికార్థంలో అవి ఉద్యమాలు కావు. వాటికి సామూహిక కార్యాచరణ లేదు. శివకవుల సాహిత్యాన్ని ఉద్యమం అనొచ్చునా ? శివకవులు ఒక మతాన్ని అవలంబించే కవులే కావచ్చు. వాళ్ళు జాను తెలుగును ఆదరించిన వాళ్ళే కావచ్చు. వాళ్లది భాషోద్యమం కాదు. అసలు ఉద్యమం కాదు. శివకవులంతా ఒక ప్రాంతం వాళ్ళూ, సమకాలికులూ కాదు. వాళ్ళు కలిసి కట్టుగా వ్యవహరించిన దాఖలా లేదు. అందువలన ఒక లక్ష్యసాధన కోసం సామూహికంగా జరిగిన ప్రయత్నంగా శివకవుల కవిత్వాన్ని, కవితాతత్త్వాన్ని భావించలేం. మనం ఈనాడు ఇస్తున్న అర్థంలో మొదటి భాషోద్యమం వ్యావహారిక భాషోద్యమమే.

ఇంతకు ముందే అనుకున్నట్టుగా వ్యావహారిక భాషోద్యమం రచనా భాషకు సంబంధించింది. రచనా భాషగా ఏ రకమైన భాష వాడాలి అనే సమస్యను దృష్టిలో పెట్టుకొని వచ్చింది వ్యావహారిక భాషోద్యమం. ఇది ఆధునికార్థంలో ఉద్యమం. ఇది కొందరు వ్యక్తుల సామూహిక యత్నం. సామినేని ముద్దు నరసింహ నాయుడుగారు తమ హిత సూచని ద్వారా ఈ ప్రచారం సాగించినట్టు మనకు దాఖలాలున్నై. ఒక పత్రికలో కొందరు వ్యక్తులు అవసరం. ఆ తరువాత గిడుగు, గురజాడ, యేట్సు, శ్రీనివాస అయ్యంగారు, కాలక్రమేణ మరికొందరు ఈ ప్రయత్నంలో చేరారు. ఈ ఉద్యమం ఇంకా బలం పుంజుకొని తరవాత చాలామంది తరవాత కాలాల్లో ఉద్యమంలో చేరారు. పత్రికా రచయితలు ఈ ఉద్యమాన్ని సమర్థించారు. ఆధునిక రచయితలు, భావకవులు, నవ్య కవులు ఈ ఉద్యమాన్ని బలపరిచారు. కాబట్టి, దీనికి ఉద్యమ స్వభావం ఉంది. అయితే, ఈ ఉద్యమం ఎందుకొచ్చింది ? ఈ సమయంలోనే ఎందుకొచ్చింది ?

ప్రాచీన సమాజంలో రచనా భాషగా తెలుగు సాహిత్యంలోనే కనిపించేది. రకరకాల శాస్త్రాలు సాహిత్యంలో భాగంగానే పరిగణ్యమవుతూ ఉండేవి. పైపెచ్చు అవి పద్యాల్లో కూడా ఉండేవి. ప్రాచీన కాలంలో భాషా ప్రయోగం అంటే సాహిత్య భాష అనే అర్థం. ఈ సాహిత్యభాష మనకు అందుతున్నప్పట్నుంచే సమకాలీనమైన వాడుక భాషకు భిన్నంగానే ఉంది. కావ్యభాషేతరంగా మనకు ప్రాచీన కాలం నుంచి దొరుకుతున్నది శాసన భాష. తొమ్మిదో శతాబ్ది నుంచి శాసనాలు దొరికినై. 11వ శతాబ్దం నుంచి కావ్య భాష దొరుకు తున్నది. ఈ రెంటికీ వైరుధ్యం ఉంది. శాసన భాష సామాన్య జనానికుద్దేశించింది కాబట్టి ఆనాటి వాడుక భాషతో దానికి సామ్యాలెక్కువ. కావ్యభాష ఎప్పుడూ సామాన్య భాషగా ఉపయోగపడలేదు. కావ్యేతర ప్రయోజనాలకు కావ్య భాష ఉపయోగించలేదు.

అప్పకవీయం, చింతామణి వంటివాటికి రాసిన వ్యాఖ్యానాల్లో వాడుక భాష ఉందనీ, కావ్యేతర వచన రచనకు వాడుక భాష ప్రయోగించటం నిజమైన సంప్రదాయం అనీ గిడుగు రామమూర్తిగారు వాదించారు. అయితే, ఈనాడు మనమనుకుంటున్న వాడుక భాష కాదు. కావ్య భాషేతర ప్రయోగాల్ని కూడా కావ్య భాషతోపాటు వాడటానికి అభ్యంతరం లేని ఒకానొక శైలి ఇందులో కనిపిస్తుంది. నియమాలు సడలించిన గ్రాంథిక భాషనే వ్యావహారిక భాషగా రామమూర్తిగారు ప్రపంచం ముందు పెట్టి దబాయించారు. ఆధునిక భాషా వ్యవహారం నుంచి ఏర్పడ్డ రచనా భాషగాని, యూరపియన్ నాగరిక సమాజాల్లో లాగా ప్రామాణిక భాషగాని ఏర్పడలేదు. అందుకు కారణం ఆ అవసరం అంతగా ఏర్పడలేదు. అందుకు కారణం ఆనాటి సామాజిక వ్యవస్థే.

రాచరిక పరిపాలనా వ్యవస్థలో ప్రభుత్వానికి ప్రజలతో ప్రమేయం పన్నులు వసూలు చెయ్యటమే. ఎక్కువమంది ప్రజలకు భాషా ప్రయోజనం సాధారణ దైనందిన వ్యవహారమే. సాహిత్యభాషగా రెండు మూడు రకాల సంప్రదాయాలుండేవి. 1. జానపద సాహిత్యంగా నేడు చెలామణిలో ఉన్న సాహిత్యం వాడే భాష. వ్యావహారిక భాషకు భిన్నమైన వ్యవస్థీకృతాంశాలు ఇందులో గమనించొచ్చు. కూర్పరి భాషా పరిచయాన్ని బట్టి ఇందులోనూ కొన్ని కావ్య భాషారూపాలు సందు చేసుకోవచ్చు. 2. అత్యధిక వ్యవస్థీకృతమైన సాంప్రదాయిక సాహిత్య భాష. ఇది బాగా చదువుకున్నవాళ్ళు రచనకుపయోగించే భాష. ఇందులో మాండలిక భేదాలు జానపద భాషలోలాగా ఎక్కువ ఉండవు. అంటే, ఈ భాషలో ప్రాంతీయతాముద్ర తక్కువ. ఈ రెండు ధ్రువాల మధ్యలో కొన్ని రకాల అంతరువులను గమనించవచ్చు. వాటిల్లో కొన్ని కావ్య భాషకు దగ్గరగా ఉండేవి. కొన్ని జానపద భాషకు సన్నిహితంగా ఉంటై. యక్షగానాలు, సంకీర్తన సాహిత్యం సాంప్రదాయిక కావ్యభాషకు సన్నిహితం. అట్లాగ లక్షణ గ్రంథాల వ్యాఖ్యలు కూడా. కొన్ని రకాల తత్త్వాలు, భారత రామాయణాలు పాటలుగా కూర్చిన సాహిత్యం జానపద సాహిత్య భాషకు ఎక్కువ దగ్గరగా ఉంటై. కొన్నిరకాల ప్రమాణాలను నిర్మించుకొని ఈ సాహిత్య సంప్రదాయాల్ని పరిశీలిస్తే ఈ సాహిత్య రూపాల అన్యోన్య అంతరాల్ని లెక్కగట్టడం సాధ్యమవుతుంది. వీటన్నిటికీ పరస్పర సాన్నిహిత్యం ఉన్నా, ప్రత్యేక వ్యవస్థలున్నై. ఆ వ్యవస్థలను నిరూపిస్తే వ్యవస్థీకరణ విధానం styl'zat'on గురించి ఇంకాస్త ఎక్కువ తెలుసుకోవచ్చు. అయితే, ఇదంతా సాహిత్య భాషగానే మనం గుర్తించాలి సాహిత్యేతర రచనా భాష ప్రాచీన కాలంలో దాదాపు లేదనే చెప్పాలి. ఆ అవసరాలు కలుగలేదు. ఉన్న అవసరాలకు – అంటే ఉత్తరాలు రాయటానికీ, దేవుడిగుళ్ళో శాసనాలు చెక్కించటానికి రాసేవాడి ఇష్టాన్ని బట్టి ఏదో భాష ఉండేది కాని, కొన్ని సామాన్య లక్షణాలతో ప్రణాళికాబద్ధమైన రచనా వ్యాసంగం ఉండేది కాదు.

బూర్జువా సమాజంలో పాత సమాజం కన్నా భాషతో ఎక్కువ అవసరం. భాషను భిన్నావసరాలకు ప్రయోగించాలి. పాఠ్య గ్రంథాలు, సైన్సు పుస్తకాలు, ఇంతకు పూర్వం లేని కథ, నవల వంటి సాహిత్య రూపాలు, సాహిత్యేతర రాజకీయాది శాస్త్రాలు మొదలైనవన్నీ ఆధునికావసరాలు. వీటన్నిటికీ అధిక ప్రచారం అవసరం. తాటాకు పుస్తకాల వేగం చాలదు. అందువల్ల అచ్చు యంత్రం రాక తప్పదు. అధిక సంఖ్యలో భాష అధిక లిఖిత ప్రయోజనాలకు వాడే అవసరం కలిగింది. పత్రికారచన ప్రారంభమయింది. ఈ మార్పులన్నీ గతశతాబ్ది చివర్లో ప్రారంభమయ్యినై.

ఈ మార్పుల వేగాన్ని, మూలాన్ని, స్వరూపాన్ని గుర్తించి సాంప్రదాయిక విద్యావంతులు సాంప్రదాయిక కావ్యభాషే అన్నిటికి పనికొస్తుందనుకున్నారు. నవలలు, కథలు కావ్య భాషలో రాశారు. పాఠ్యగ్రంథాలు, సైన్సు పుస్తకాలు అదే భాషలో రాశారు. పత్రికా రచనకూ అదే భాష పని కొస్తుందనుకున్నారు. వాదించారు, పట్టు పట్టారు. భాషలోనూ, సమాజం లోనూ వస్తున్న మార్పులను అర్థం చేసుకున్న విద్యావంతులు ప్రాచీన కావ్య భాష ఇందుకు సరిపోదు. ఆ భాషా నియమాలు ఆధునిక వచన రచన కనర్థదాయకాలని గ్రహించారు. ఇదే గ్రాంథిక, వ్యావహారిక భాషా వివాదాలుగా చరిత్రకెక్కింది.

వ్యావహారిక భాషోద్యమం బూర్జువా సమాజపు అవసరాల కోసం వచ్చింది. ప్రాచీన రచనా నియమాలను ఛేదించి, ఆధునిక అవసరాలకు సరిపోయే రచనా భాషను - నిజానికి భిన్న రచనారీతులను - ఏర్పర్చుకోటానికి ఈ ఉద్యమం సౌకర్యం కలిగించింది. మనలో ఇంకా ఫ్యూడల్ ఆలోచనా విధానం చావలేదనటానికి బూర్జువా సంస్కృతి అయినా సంపూర్ణంగా వ్యాపించలేదనటానికి ఈ నాటికీ గ్రాంథిక భాషావాదులుండటం ఒక పెద్ద సాక్ష్యం. ఇప్పటికీ కొన్ని పాఠ్య గ్రంథాల రచన ప్రాచీన కావ్యభాషా సన్నిహితమైన భాషలోనే జరుగుతున్నది. అయితే, ప్రజల అభిరుచులు తీవ్రంగా మారిన ఈ కాలంలో కావ్య భాషలో రచించిన వచన రచనలకు ఏ టెక్స్టు బుక్కుగానో పెడితే తప్ప ఆదరణ లభించటం లేదు. అందువల్ల వ్యావహారిక భాషోద్యమ ప్రయోజనం నెరవేరినట్లే.

రచనా భాష, వాడుక భాష ఒకేరకంగా ఉండవని ప్రత్యేకంగా వాదించాల్సిన పనిలేదు. శబ్ద జాలంలోను, వ్యాకరణరూపాలు, అంశాల ఎన్నికలోనూ, వాటి విస్తరణలోనూ కొన్ని భేదాలు ఉండక తప్పదు. కావ్య భాష రాసేటప్పుడు ఎక్కడ నియమాలు మారుతున్నాయో అన్న స్పృహ రచయిత ఆలోచనలను కట్టివేస్తుంది. తనకు తెలియని వ్యాకరణ సూత్రాలను గుర్తుంచుకొని రాయాలి. ఆధునిక రచనా భాషలో రచయిత వాడే వ్యాకరణం రచయితకు చాలావరకు సొంతం. మిగతాది అప్రయత్నంగా నేర్చుకునేది. ఆధునిక రచనా భాష ఆధునిక వ్యవహార భాషా వ్యాకరణ మూలకమై ఉండాలనటంలో సామంజస్యం ఇది. ప్రాచీన కావ్యభాష అన్ని రకాల వచన రచనలకూ సరిపోతుందనుకోవటం సాంప్రదాయిక విద్యావంతులు చేసిన పెద్ద పొరపాటు. దీన్నుంచి ఆధునిక విద్యావంతులు ఒక గుణ పాఠం నేర్చుకోవాల్సి ఉంది.

ఆధునిక రచనా భాషను, ఒక రకమైన ప్రామాణిక భాష అనదగిన భాషను తయారు చెయ్యటంలో పత్రికల పాత్రను తక్కువ అంచనా వెయ్యలేము. నేటి తెలుగు రచన మీద పత్రికల ప్రభావం విపరీతంగా ఉంది. ఎంత విపరీతంగా ఉందంటే, తెలుగు పత్రికలు

మాత్రమే చదివే ఈనాటి కొందరు యువకులు తమ అభిమాన పత్రికా భాషనే మాట్లాడుతున్నారు. మళ్లీ రచన చేస్తే అదే భాష వాడుతున్నారు. అందువల్ల రచనా భాషే పత్రికా భాష అనుకొనే ప్రమాదం ఏర్పడింది. కథలకూ, సైన్సుకూ, రాజకీయాలకీ, కరపత్రాలకూ, భాషా సంబంధి వ్యాసాలకూ, టెక్స్టు పుస్తకాలకూ, పిచ్చాపాటీ తేలిక వ్యాసాలకూ, సాహిత్య విమర్శలకూ, యూనివర్శిటీ థీసీస్సులకూ ఒకే రకపు పత్రికా భాష పనికొస్తుందనే భ్రమలో నేటి వచన రచయితలున్నట్టు కనిపిస్తున్నది.

మనకు పత్రికలంటే ప్రధానంగా వార్తా పత్రికలే. కొన్ని రకాల ఇతర పత్రికలున్నా అవి కూడా రచనా పద్ధతి విషయంలో వార్తా పత్రికలవంటివే. అందుకు భిన్నమైన పత్రికలున్నా వాటి ప్రభావం తక్కువ. నేటి రచనా భాషను రూపొందించటంలో ఈ వార్తా పత్రికల ప్రభావం విపరీతంగా కనపిస్తున్నది. అందుకు విచారించాల్సిన పనిలేదు. కాని, అన్ని విషయాలకూ వార్తా పత్రికల శైలి పని కొస్తుందనుకోటంలోనే వస్తుంది చిక్కు. తెలుగు వార్తా పత్రికలే అన్ని రకాల విజ్ఞాన వ్యాప్తిని కలిగిస్తున్నై. సైన్సు వ్యాసాలు, సాహిత్య వ్యాసాలు వార్తా పత్రికల ద్వారా అందుతున్నై. ఆ ప్రభావంతో తెలుగులో సైన్సు పుస్తకాలు వచ్చినా, సాహిత్య గ్రంథాలు వచ్చినా, అటు గ్రాంథికంలో అయినా ఉంటున్నై, లేకపోతే ఇటు పత్రికల శైలిలో అయినా ఉంటున్నై. వ్యావహారిక భాషలో రచించిన తెలుగు పి.హెచ్.డి. సిద్ధాంత వ్యాసాలు కొన్ని చూస్తే ఈ విషయం చాలా స్పష్టంగా తెలుస్తుంది.

మనకు కావ్యభాషా సంప్రదాయం నుంచి సంక్రమించిన ఒక దురభ్యాసం ఉంది. ఏది చెప్పినా అలంకారికంగా చెప్పటం. గ్రాంథికంలో రచించిన కొన్ని గ్రందాల్లో ఈ శైలిని గుర్తుపట్టవచ్చు. ఈ ఆలంకారిక శైలి ఒక కొత్త రూపంతో ఆధునిక వచన రచనలో కెక్కింది. ఆకర్షకరంగా ఉండటం కోసం పత్రికల్లో ఉత్తేజపూరితమైన శైలి వాడతారు. కాని, విషయ ప్రధాన గ్రంథాల్లో ఆవేశం, ఉత్తేజం, అలంకారం పనికి రావు. నిరలంకారంగా తేలికైన, మాటలతో చెప్పడమే ఉచితం. అవసరమున్నా లేకపోయినా కవిత్వం లాంటి శైలి వాడటం నేటి వచన రచనలో అధికంగా కనిపిస్తుంది. ఇది ఎంత ఎక్కువయిదంటే దీనికోసం మరో ఉద్యమం అవసరమా ? అనిపిస్తున్నది.

వ్యావహారిక భాషోద్యమం తన పనిని పూర్తి చేసుకున్నది. ఎవరో కొన్ని పెద్ద తలకాయలను వదిలేస్తే సరి అయిన ఆలోచనా క్రమంలో ఉన్న వారెవరూ ఇప్పుడు తెలుగు వచనం కావ్యభాషలో రాయటం లేదు. ఒకళ్ళిద్దరున్నా వాళ్ళను ప్రాచీన కాలపు అవశేషులుగా గుర్తించి వదిలెయ్యటం మంచిది.

గ్రాంధిక భాష మీద ఇప్పుడు కత్తిదుయ్యటం లేని శత్రువు మీద యుద్ధానికి సన్నద్ధం కావటం. అభివృద్ధి చెందుతున్న సమాజావసరాలకు అనుగుణంగా భాషాభివృద్ధి చేసుకోటమే నేటి అవసరం. ఇందుకు మనం చేసుకోవాల్సిన పనులను ఒకసారి గుర్తు చేసుకోటం ఈ సందర్భంలో అవసరంగా భావిస్తున్నాను.

1. తెలుగు భాషా లక్షణాల మీద, వాక్య పద్ధతి మీద, శైలీ భేదాల మీద పరిశోధనలను ప్రోత్సహించటం.

2. రకరకాల రచనావసరాలకు అనుగుణంగా శైలీ భేదాల్ను రూపొందించుకోటం.

3. తెలుగు రచనాభాషలో కనిపించే శబ్దాలకు అర్థచ్ఛాయలను నిర్దిష్టంగా వివరించే నిఘంటువును తయారుచేసుకోవటం.

4. భాషను గురించి సరి అయిన ఆలోచనలను ఎక్కువగా వ్యాప్తి చెయ్యటం.

ఇవి భాషాపరంగా మనం చేసుకోవలసిన కొన్ని ముఖ్యమైన పనులు.

కె. కె. రంగనాథాచార్యులు (సం) నూర్లేళ్ల తెలుగు నాడు, హైదరాబాదు :
ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ, 1984 నుంచి.

# మాతృభాషను రక్షించుకుందాం

తెలుగు భాషకు అన్ని వైపుల నుంచి ప్రమాదాలు ఎక్కువవుతున్నాయి. తెలుగు భాషాభిమానులు తగిన చర్యలు తీసుకోకపోతే కొన్నాళ్లకు తెలుగు అనేది లేకుండా పోవచ్చు. భాషకు పుట్టుక ఉన్నట్టే మరణం కూడా ఉండొచ్చు. బహుశః తెలుగు ఇప్పుడిప్పుడే మరణించకపోవచ్చు గాని తెలుగు పేరుతో మిగిలింది మనం అనుకునే తెలుగుతో పోలికలేని పరిస్థితి రావచ్చు. చరిత్రలో అట్లాంటి ఘట్టాలు లేకపోలేదు. భాషా మిశ్రమాల వల్ల ఏర్పడ్డ భాషలు అంగవికలురతో సమానం.

అయితే ''మాతృభాష నేర్చుకోకపోతే ఏం ? ఏం కొంప మునిగింది ? సెంటిమెంటు కోసం మాతృభాష నేర్చుకోవాలా ?'' వంటి ప్రశ్నలు మనకెదురవుతాయి, మాతృభాషపై సెంటిమెంటు, భక్తి, ప్రేమ ఉండటం నేరం కాదు. కాని మాతృభాషను రక్షించుకోవాలనటం కేవలం సెంటిమెంటల్ వ్యవహారం మాత్రం కాదని మనవి చెయ్యదల్చుకున్నాను.

భాషాశాస్త్రజ్ఞులు భాషను అర్థం చేసుకోటానికి చాలా కాలంగా ప్రయత్నిస్తున్నారు. వాళ్ల ఆలోచనలో ఉన్నది మాతృభాషగా వ్యవహరించే భాషే. మాతృభాష అంటే ప్రజలు తమ ఆలోచనలు అన్ని విధాలా వ్యక్తీకరించగల భాష. దీనికి మాతృభాష అనే పేరులో అర్థస్ఫూర్తి కన్నా సెంటిమెంటుకు అవకాశం ఇచ్చే పద సంయోజన ఉంది. ఇప్పుడు దాని పేరు మార్చుకోవాల్సిన అవసరం లేదు గాని అర్థ స్పష్టత ఏర్పర్చుకోవాలి. మాతృభాష తొలుత తల్లి దగ్గర నేర్చుకునేదే అయినా తల్లిభాషకే పరిమితం కాదు. కుటుంబం బయట నుంచి కూడా నేర్చుకుంటాం. భాషకు ఎన్ని రకాల నిర్వచనాలున్నా అవి అన్నీ అసమగ్రాలే. నిర్వచనాల్పై అంత పట్టింపు అక్కర్లేదు. కొన్ని నిర్వచనాలకు లొంగనంత మాత్రాన వాటిని గురించి తెలుసుకోటం మానం. అధ్యయనానికి నిర్వచనం ఒక ఆరంభం మాత్రమే.

భాషకూ భాషేతర భావ ప్రకటన సాధనాలకూ మధ్య ఉన్న భేదాలను అధ్యయనం చెయ్యటం ద్వారా భాషను గురించి తెలుసుకోవచ్చు. అందులో భాషకు మాత్రమే ఉన్నట్లు లక్షణాలు చెప్పబడుతున్నాయి. భాషలో చెప్పే భావాలకు దేశకాలావధుల్లేవు. భాషలో చెప్పే భావాలకు సత్యనిబద్ధత లేదు. భాషలో వాక్యాలకు గరిష్ఠ పరిమితి లేదు. ఆ మాట కొస్తే వాక్య దైర్ఘ్యానికి కూడా పరిమితి లేదు. ఇవన్నీ వేరు వేరు లక్షణాలుగా చెప్పినా వీటి అన్నిటి మూల తత్త్వం ఒకటే. దాన్నే హాకెట్ openness అనీ, ఛామ్‌స్కీ nf n ty అనీ

అన్నారు. ఈ రెంటినీ కలిపి *'అనవధికత'* అనవచ్చు. ఈ *అనవధికతనే* మరో కోణం నుంచి చెపితే సృజనశక్తి (creativity) అనవచ్చు. సృజనశక్తి అంటే అభావాన్ని భావించటం, ఒక్కోసారి భావనను రూపించటం. దీన్నే కల్పనశక్తి అనవచ్చు. మొదటే అనుకున్నట్టుగా ఈ శక్తి మాతృభాషలోనే ఉంటుంది. అయితే మనవాళ్లు కొందరు ఇంగ్లీషులోనో, ఉర్దూలోనో కవిత్వం చెప్పటం లేదా అని అడగొచ్చు. అయితే అది కవిత్వం అని ఆ భాషా వ్యవహర్తలు అంగీకరించాలి. అట్లాంటి అంగీకారాన్ని పొందగలిగితే, బహుశా వాళ్ళు పరభాషను మాతృభాషలాగే నేర్చుకొని ఉంటారు. ఇక్కడ కవిత్వం గురించి చెప్పటం కవిత్వం ఒక్కటే సృజనాత్మక వ్యాపారమని కాదు. అందరికీ తెలిసిన వ్యాపారమని.

పిజిన్ (pidg'n), క్రియోల్ (creole) వంటి భాషల్లో కవిత్వం ఉండకపోవటం కూడా గుర్తించదగింది. మొదటిది సంకరభాష, రెండోది సరళీకృత సంకుచిత భాష.

మనిషికీ, జంతువుకూ ప్రధానభేదం సృజనాత్మకత. అందుకవకాశమిచ్చేది భాష. భాష అంటే పైన చెప్పిన అర్థంలో మాతృభాష. మానవుల సృజనశక్తికి భాష ఒక వేదిక, ఒక సాధనం. స్వభాషపై తగిన పట్టులేకపోతే ఆ వ్యక్తి సృజనశక్తి కుంటుపడుతుంది. ఇంగ్లీషు మీడియం స్కూళ్లలో చదువుకునే విద్యార్థులకు ఏ భాషా అధీనంలో ఉండదు. ఏ భాషనూ క్రియేటివ్‌గా ఉపయోగించలేరు. వీళ్లు చివరికి డబ్బు సంపాయించే యంత్రాలుగానో, మందిపై పెత్తనం చేసే ప్రభుత్వోద్యోగులుగానో తయారవుతారు. వివిధ విషయాలను వివేచించి నూత్నాంశాలను ఆవిష్కరించే శక్తి వీళ్లకుండదు. వీరిలో కాస్త తెలివైన వాళ్లు బహుళజాతి సంస్థల వ్యాపార ప్రయోజనాలకుపయోగపడినంతగా దేశ ప్రజలకుపయోగ పడరు.

సారాంశంగా చెప్పుకుంటే మనిషిలో సృజనాత్మకతకు దోహదం చేసేది మాతృభాష. కనుక మాతృభాషను క్షుణ్ణంగా నేర్చుకోవాలి. కొత్త ఆలోచనలు చెయ్యాలంటే మాతృ భాష నేర్చుకోవాలి.

ప్రధాన యంత్రాంగాల్లో భాషలన్నీ సమానమే కావచ్చు. మౌలికమైన వ్యక్తీకరణ విధానాలు అన్ని భాషల్లోనూ కనిపించవచ్చు. అయితే అన్ని విషయాల్లోనూ భాషలు సమానం కాదు. పదనిర్మాణంలో సంస్కృతానికి ఎక్కువ సౌకర్యాలున్నాయి. ఆ పదనిర్మాణ రీతుల్ని భారతీయ భాషలు గ్రహించాయి. సమాన, పద కల్పన సౌకర్యాల వల్ల సాంకేతిక పద నిర్మాణంలోనూ, వివిధార్థచ్ఛాయల్లో సమానార్థక పదాల నిర్మాణంలోనూ సంస్కృతం తెలుగుకు ఉపయోగించింది. సంస్కృతం అవసరానికి పనికి వచ్చిన పెన్నిధి. ఇప్పుడు, ఈ

ఆధునిక సాంకేతిక యుగంలో సంస్కృతాన్ని వెలివేయాలనటం సాధ్యమయ్యేది కాదు. ఆ అవసరమూ లేదు. సంస్కృతం ఏ సామ్రాజ్యవాద సంస్కృతినీ ప్రతిబింబించదు. సంస్కృతంలో భాషా నిర్మాణ రీతులతోనే మనకు పని. భావజాలంతో మనకంత పనిలేదు. సంస్కృతంతో పొత్తు ప్రాచీన సమాజ పునరుద్ధరణ కోసం కాదు, నవ భావవ్యక్తీకరణ కోసం. అందువల్ల ఇవాళ తెలుగంటే సంస్కృతం మూలధనంగా ఉన్న తెలుగు అనే. మాతృభాషను నేర్చుకునే పద్ధతిని భాషాశాస్త్రజ్ఞులు acqu'sition అంటారు. ఇది సహజ స్థితిలో నేర్చుకునే విధానం. పిల్లలు చాలా చిన్నతనం నుంచే మాతృభాష మాట్లాడటం నేర్చుకుంటారు. దాదాపు ఐదేళ్ల ప్రాయానికే మాతృభాషలో ఉన్న వాక్య నిర్మాణ రీతుల్ని స్వాధీనం చేసుకుంటారని నోమ్ ఛామ్‌స్కీ అంటారు. అంతేకాక తన పరిసరంలో ఉన్న భాషా వ్యవహారాన్ని గమనించి దాని నుంచి సూత్రాలు నిర్మించుకుంటారని ఛామ్‌స్కీ ప్రతిపాదన. పిల్లలకు పుట్టుకతోనే భాషా సంపాదన సాధనం Language acquisition dev'ce. ఒకటి ఆధీనంలో ఉంటుందనీ, అది అలిఖిత వ్యాకరణాన్ని నిర్మిస్తుందనీ ఆయన ప్రతిపాదన. వివరాల్లో వివాదాంశాలున్నా భాషా సంపాదన అనుకరణ ద్వారా కాక సృజనాత్మక వాక్య ప్రయోగం ద్వారా జరుగుతుందనీ, అట్లాంటి వాక్యనిర్మాణ దక్షత, సదసద్వాక్య నిర్మాణ వివేచన కలిగించే *యంత్రాంగం* పిల్లలకు అంటే మానవులకు పుట్టుకతో వస్తుందనేది ఛామ్‌స్కీ ప్రధాన ప్రతిపాదన. అంటే అది మానవ జీవ స్వభావమన్నమాట (biological endowment) మాతృభాషా సంపాదన, మాతృభాషా ప్రయోగం సృజనాత్మక వ్యాపారాలుగా ఛామ్‌స్కీ పరిగణించారు. అంతేగాక ఇది మానవుల ప్రత్యేక లక్షణంగా (spec'es specific) గా కూడా పరిగణించారు. మాతృభాషా సంపాదన వ్యవహర్త సొంతంగా వ్యాకరణం నిర్మించుకోటం ద్వారా చేస్తాడు. చిన్నప్పుడే పరభాషను నేర్చుకుంటే ఇదే పద్ధతి - అంటే అలిఖిత వ్యాకరణ నిర్మాణ పద్ధతి ద్వారా జరుగుతుందని ఊహించవచ్చు. అప్పుడా పిల్లలు రెండు భాషలకు వ్యాకరణాలు నిర్మించుకుంటారు. వీళ్లు రెండు భాషల్లోనూ సమాన సృజనశక్తిని పెంపొందించుకుంటారు. దాంట్లో ఎక్కువ తక్కువలుంటే ఉండొచ్చు. తేల్చే ప్రమాణాలు లేవు.

మాతృభాషా వ్యవహర్తలు భాషలో వాక్య నిర్మాణ రీతులు మాత్రమే నేర్చుకుంటారను కోకూడదు. వాటిని తప్పకుండా నేర్చుకుంటారు. ప్రయోగవైచిత్రిని, వైవిధ్యాన్నీ కూడా నేర్చుకుంటారు. పాత హాస్యోక్తులను ఆనందిస్తారు. కొత్త వాటిని సృజిస్తారు. సామెతలు ప్రయోగిస్తారు, కొత్త సామెతలను సృజిస్తారు. జాతీయాలు, పలుకుబళ్లు అర్థవంతంగా వాడతారు. భాషలో ఉండే సదృశీకరణ పద్ధతులను (metaphorizat'on processes)

పదస్థాయి నుంచి వ్యవహార ఖండికల స్థాయి వరకు వ్యవహర్తలు పాతవి గ్రహిస్తారు. కొత్తవి సృజిస్తారు. అంతేకాదు, భాషలో లయాత్మక స్పృహ కూడా భాషా వ్యవహర్తల కుంటుంది. పదాల ఎన్నికలో ధ్వని సమత, అర్థపుష్టిపై దృష్టి ఏర్పడుతుంది. ఇవన్నీ సృజన వ్యాపారాలే. అయితే వీటిని ఐదేళ్లలోపునే మనుషులంతా సంపూర్ణంగా గ్రహిస్తారను కోను. బహుశా మరికొంత కాలం (ఎంత కాలం అని చెప్పలేం.) పడుతుంది. జీవితాంతం సాగుతుందా ? మధ్యలో ఆగిపోతుందా అనే దాన్ని గురించి ఇదమిత్థమని చెప్పలేం. ఈ రకపు భాషా సృజన వ్యాపారం విద్యార్థి దశలో ఎక్కువ జరగటం చూస్తాం. అంటే సహజ పద్ధతిలో కాక, శిక్షణ పద్ధతిలో సాగుతుంది. భాషా శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన acquisit'on (సహజ సంపాదన) చాలదనీ, conscious learn ng (స్పృహతో కూడి శిక్షణ) అవసరం అనీ తేలుతుంది. చాలాకాలంగా భాషా పరిశోధకులు భాషంటే మాట్లాడే భాషే అనుకున్నారు. అంతేకాదు, మాట్లాడే భాషను అక్షరాల్లో పెడితే రాసే భాష అవుతుందను కున్నారు. ఇందుకు కారణాలనేకం. అవన్నీ ప్రస్తుతం మనకవసరం లేదు గానీ స్థూలంగా కొంత తెలుసుకుందాం.

ప్రపంచంలో అన్ని భాషలనూ మాట్లాడతారు. కొన్ని భాషలకే లిపి ఉంది. అన్ని భాషలకూ సరిపడే సిద్ధాంతాలను ప్రతిపాదించాలన్నా, సర్వభాషా నిర్మాణ సూత్రాలను నిర్వచించాలన్నా, అన్ని భాషలకూ వ్యాకరణ పద్ధతులను తయారు చేయాలన్నా మాట్లాడే భాషలనే ప్రధానంగా గ్రహించాలి. ఈ పద్ధతి కొంత ప్రజాస్వామికంగా కనిపించింది. రాసే భాషలకే వ్యాకరణం ఉంది. మాట్లాడే భాషలకు ఒక పద్ధతీ పాడూ లేదు అనే ప్రాచీన స్థితి నుంచి మాట్లాడే భాషలకు నియమ నిష్ఠలున్నాయి, వ్యాకరణం ఉంది అనటం ఒక పెద్ద గెంతు. ఈ దృష్టి మన దేశంలో వ్యావహారిక భాషోద్యమానికి బాగా పనికొచ్చింది. అంతేకాదు, మాట్లాడటం సహజం, రాయటం కృత్రిమం అనే వాదం వరకూ వచ్చింది. మాట్లాడే భాషకు భిన్నంగా ఉన్నదంతా కృత్రిమమనో, తప్పు అనో ముద్ర వేసే వరకూ ఈనాటి వ్యావహారిక భాషలో ''అభివృద్ధి'' సాధించారు. చారిత్రకావసరం కోసం వచ్చిన ఏ ఉద్యమమైనా కాలాంతరంలో వెర్రి తలలు వెయ్యొచ్చు. ప్రస్తుతం తెలుగులో సాంప్రదాయిక వ్యావహారిక భాషావాదుల వాదనలు ఈ స్థితిలోనే ఉన్నాయి. వీళ్లతో పేచీ పడటం ప్రస్తుతం నా పని కాదు. కాని ఈ దృష్టి సమగ్రం కాదని మాత్రం చెప్పక తప్పదు.

ఒక జాతి అభివృద్ధిలో భాష నిర్వహించే పాత్రను గురించి ప్రత్యేకంగా వివరించక్క ర్లేదు. అందులో లిఖితభాష పాత్ర అమోఘమైనది. ఒక కాలంలో ఒక జాతి సంపాదించిన విజ్ఞానాన్ని, చేసిన సృజనను, లిఖిత భాష భద్రపరచి కాలాంతరంలో తరవాత తరాలకు

అందిస్తుంది. దాన్పై మరింత చేర్చే అవకాశం మలి తరాలకు వస్తుంది. భాషలో చెప్పే భావాలకు దేశకాలవధుల్లేవు అన్నాం. అయితే భాషా ప్రసారానికా పరిమితులున్నాయి. ఏ యంత్రసాయం లేని రోజుల్లో భాషా ప్రసారం వక్తృశ్రోతల సామీప్యానికే పరిమిత మయింది. లిఖిత వ్యవస్థ ఈ పరిమితిని అధిగమించే అవకాశం భాషకు ఇచ్చింది. విస్తృత భాషా సమాజాలకు ఈ లిఖిత వ్యవస్థ అవసరం కూడా అయింది. సమాజ విస్తృతికీ, అభి వృద్ధికీ లిఖిత భాషకీ ప్రత్యక్ష సంబంధం ఉంది. గిరిజన భాషలకు, సమాజాలకు రాసే భాష లేదు. సమాజాభివృద్ధీ లేదు.

విస్తృత సమాజాల్లో రాసే భాష 'మాట్లాడే భాషా రెండూ ఉంటాయి. ఈ రెంటికీ వేరు వేరు పరిమితులున్నాయి. వేరు వేరు ప్రయోజనాలున్నాయి. ఈ రెంటికీ ఇచ్చి పుచ్చుకునే సంబంధాలుంటాయి. అందువల్ల రాసే భాషకూ, మాట్లాడే భాషకూ తప్పని సరిగా సామ్యాలుంటాయి. కాలక్రమంలో వేరుదారుల్లో పయనించటం వల్ల భేదాలు కూడా ఉంటాయి. వీటిని శాస్త్ర దృష్టితో అర్థం చేసుకోవాలిగాని, ఒకటి సహజమైనది వేరొకటి కృత్రిమమైనది అనుకోటం హ్రస్వదృష్టి.

రాసే భాష ఉన్న సమాజాల్లో విద్యాబోధకు పాఠ్యాంశాలు రాసే భాషలో ఉంటాయి. మనకు కొంత కాలంగా రాసే భాష అంటే ప్రాచీన కావ్యభాష. ప్రాచీన కాలంలో లిఖిత భాషకు సాహిత్యమే ప్రధాన ప్రయోజనంగా ఉండేది. అది ఒకానొక రకమైన సాహిత్యం మాత్రమే. అందుకే అది కేవల కావ్యభాష. సంకీర్తన, పద సాహిత్య భాష, యక్షగాన భాష, శాసనభాష, కైఫీయత్తుల భాష, వ్యాఖ్యానాల భాష ప్రధాన సంప్రదాయంలో భాగాలుగా కాక సమాంతర సంప్రదాయాలుగా ప్రాచీన కాలం నుంచీ ఉన్నాయి. రచనా వైవిధ్యానికి, పాలనాది రాజకీయ, సాంఘికావసరాలకి మనకు సాంప్రదాయికంగా వచ్చిన ఏ ఒక్కపద్ధతీ చాలదు. ఆధునికావసరాలకు ఆధునిక రచనా భాషనొకదానిని తయారు చేసుకోవాల్సిన అవసరం వచ్చింది. అది మాట్లాడే భాష పునాదిగా, పైన పేర్కొన్న సాంప్రదాయిక రీతుల సహకారంతో తయారవుతున్నది. ఈ దశలో ఏకవాక్యత ఉండకపోవచ్చు. అది దోషమూ కాదు, అసహజమూ కాదు. ఆధునిక రచనా భాషకు అనేక రచనారీతులను ఇముడ్చుకో గలిగిన శక్తి ఉంది. ఒకవేళ ఈ శక్తి చాలకపోతే మనకున్న అన్ని వనరులనూ, అంటే మాట్లాడే భాషతో సహా అన్ని సాంప్రదాయిక రీతులనూ వీలైనంతగా కొల్లగొట్టి ఆ శక్తిని సంపాదించాలి. ఇతర భాషల నుంచి గ్రహించగూడదని కాదు. అత్యావసరమైనప్పుడు ఎట్లాగూ తప్పదు, అవసరానికి మించి పరభాషలకు పెత్తనమిస్తే పేనుకు పెత్తనమిచ్చినట్లు అవుతుంది.

ఇంగ్లీషు మీడియం స్కూళ్లు ఆ పని బాగా చేస్తున్నాయి. కేంద్రం వారు మూడు భాషల సిద్ధాంతం, హిందీకిచ్చిన పెత్తనం వల్ల ఇదే పని ఇంకో వైపు నుంచి జరుగుతున్నది. అర్ధ శతాబ్ది కాలంగా మనకు సంక్రమించిన రాష్ట్ర ప్రభుత్వాల నిర్లక్ష్యం ఈ పరిస్థితిని అనుమతించాయి. అగ్నికి ఆజ్యం పోసినట్లు తెలుగు విద్యావంతుల అలసత్వం తోడయింది. తెలుగు భాషపై ఆసక్తి ఉన్న విద్యావంతులుగా ఇప్పుడు మన కర్తవ్యాలేమిటి ? తెలుగును రక్షించుకోవాలి. తెలుగు పిల్లలను తెలుగు పౌరులుగా తయారు చేసుకోవాలి. తెలుగు రాష్ట్రంలో తెలుగు వాతావరణాన్ని కలిగించాలి. ఇందుకు పరిమిత పరిధుల్లోనూ, విస్తృత రంగాల్లోనూ ఏకకాలంలో కృషి చెయ్యాల్సి ఉంది. ఎవరి పరిధుల్లో వారు కృషి చేస్తూనే తమ శక్తియుక్తులను ఏకోన్ముఖం చెయ్యాల్సి ఉంది. వలస పాలకులు మనకు ఇంగ్లీషు ఇస్తే, మనం వారికన్నా ముందుకు పోయి ఇంగ్లీషు మీడియం స్కూళ్లను ఏర్పర్చుకున్నాం. వీటిని ప్రజాస్వామ్య పద్ధతులతో నిరోధించాలి. వాటిని తగ్గించే మార్గాలను అన్వేషించాలి. తెలుగు పిల్లలకు తెలుగు తప్పనిసరిగా నేర్పే అవకాశాలను కల్పించాలని ఈ స్కూళ్ల పైన వత్తిడి వచ్చేట్లు చెయ్యాలి. అది ఒక వైపు తల్లి తండ్రుల నుంచి రావాలి. మరోవైపు ప్రభుత్వం నుంచి రావాలి. ఆచరణయోగ్యమైన ప్రతిపాదనలను వారి దృష్టికి తీసుకురావాలి. ఇదే సందర్భంలో తెలుగు అధ్యాపకులుగా మన కర్తవ్యాల గురించి ఆలోచించాలి. పాఠశాలా, కళాశాలా, విశ్వవిద్యాలయాల పాఠ్యాంశాలను పునః పరిశీలించి తగిన మార్పులు చెయ్యాలి.

మనం చాలాకాలంగా ఒక వైపు సాహిత్య బోధనకూ, భాషా బోధనకూ తేడా గమనించటం లేదు. మరోవైపు భాషా బోధనకూ, వ్యాకరణ బోధనకూ వ్యత్యాసం చూపించటం లేదు. సాహిత్యం తప్పకుండా చదవాల్సిందే. సాహిత్యం మానసికావసరం. భాష భౌతికావసరం. సాహిత్య రచన, పఠనాలపై అందరికీ ఆసక్తి ఉండక్కర్లేదు. భాష అందరికీ అవసరమైనది. తెలుగు పాఠ్యాంశాలలో వచన రచనపై చూపించవలసిన శ్రద్ధ చూపిస్తున్నామా ? అని మనం ఆత్మ విమర్శ చేసుకోవాలి. వచనంలో మనకు అనేక రచనా భేదాలున్నాయి. వాటిలో కొన్ని రకాలు ఇంకా అభివృద్ధి చెందాల్సి ఉన్నా, ఈపాటికే అభివృద్ధి చెందినవి ఉన్నాయి. ఉదాహరణకి మనకు నిర్దిష్ట శాస్త్ర వచనం అంత స్పష్టంగా ఏర్పడలేదు. అలంకారాలు, వ్యంగ్య సూచనలు, అనేకార్థ బోధలు లేకుండా విషయ ప్రధాన వచనం రాయలేక పోతున్నాం, పత్రికల పతాక శీర్షికలు చూడండి. వాటిల్లోపదాల విరుపులు చూడండి. వార్తా కథనం చూడండి. తెలుగు పత్రికలు కవిత్వ వచనం రాయటంలో పోటీ పడుతున్నాయి. సాహిత్య వ్యాసాలు చూడండి. సిద్ధాంత వ్యాసాలు చూడండి కాస్త

కవిత్వం, మరికొంత కథ, బోలెడు ఊకదంపుడు కనిపిస్తుంది. అర్థాంతర బోధలూ, చమత్కారాలూ, సభంగాభంగా శ్లేషలూ వచనానికి వన్నె తెచ్చేవి అనుకొంటున్నాం. అలంకారికత మంచి వచనానికి గీటురాయి అనుకుంటున్నాం. శాస్త్ర వచనంలో ఇవి అర్థ నిర్దిష్టతకు ఆటంకాలని మనం ఇంకా గుర్తించలేదు. దిన పత్రికా వ్యాసానికి పరిశోధక పత్రానికి భేదం చూపించలేక పోతున్నాం. దీని విషయమై చెప్పవలసింది చెయ్యవలసిందీ చాలా ఉంది. శాస్త్ర సంక్షిప్తతకు, నిర్దిష్టతకూ కొంత కొంత గ్రాంథికమే నయం. శాస్త్ర సంక్షిప్తత అంటే ప్రకరణానికి అవసరమైనదంతా చెప్పటం. అవసరమైనది మాత్రమే చెప్పటం. అర్థాంతర బోధ, వ్యంగ్య వైభవమూ వగైరా లేకపోవటం, హాస్య, చతురోక్తులు లేకపోవటం, చెప్పింది తార్కికంగా, సహేతుకంగా ఉండటం, శాస్త్ర వచనం ద్వారా మనం ఆశించేది వినోదం కాదు. మనోల్లాసం కాదు, హృదయాహ్లాదం కాదు, విజ్ఞానం.

తెలుగులో అందరూ కవిత్వం రాయరు, చదువుకున్నవాళ్లంతా వచనం రాస్తారు. ఆ వచనంలో రకరకాల సంప్రదాయాలు కొన్ని ఏర్పడి ఉన్నాయి. కొన్ని ఇంకా ఏర్పడాల్సి ఉన్నాయి. సాహిత్య వచనం (creative prose) లో మనకు కొన్ని శైలీ భేదాలు ఉన్నాయి. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, చలం, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, విశ్వనాథ సత్యనారాయణ, నార్ల వంటి రచయితల వచన రచనలను శైలి కోసం అధ్యయనం చెయ్యాల్సిన, చేయించాల్సిన అవసరం ఉంది. తెలుగు పత్రికల సంపాదకీయాలలో, ఇతర కాలమ్స్‌లో కొన్ని వచన రీతులేర్పడ్డాయి. ఇవి రచనా రీతులు. వీటిని సవిమర్శకంగా బోధించే లక్ష్యాలతో పాఠ్య భాగాలుగా చేర్చవచ్చు. పాలనా రంగంలో భాషకు కూడా నిర్దిష్టత అవసరం. విషయబోధ ప్రధానం. ఇప్పటి వరకు తెలుగు అమలులో భాష విషయంలో వస్తున్న చిక్కులను అధ్యయనం ద్వారా పరిష్కరించుకోవాలి. ఇట్లా వివిధ రంగాలలో భాషా ప్రయోగంలో జరిగిన అభివృద్ధి ఎంత ? జరగాల్సింది ఎంత ? అని బేరీజు వేసుకొని ముందుకు సాగాలి.

ఇతర భాషల దురాక్రమణ నుంచి తెలుగును రక్షించుకుందాం. తెలుగు భాషా ప్రయోగాన్ని అన్ని రంగాలకూ విస్తరింపజేద్దాం. తెలుగులో ఇంకా ఏర్పడని రచనా రీతులను ఏర్పర్చుకుందాం. తెలుగు భాష సర్వతోముఖాభివృద్ధి కోసం ప్రయత్నిద్దాం.

వార్త 1996

# మాతృభాష - ప్రజాస్వామ్యం

భారతదేశాన్ని ఆంగ్లేయులు పరిపాలించటమనేది ఒక చారిత్రక వాస్తవం. వాళ్ళు రాకపోతే భారతదేశం ఎట్లా ఉండేది అనే విషయం ఇప్పుడూహించలేం. వాళ్ళు రాకముందు భారతదేశం ఇప్పుడు మనం అనుకునే అర్థంలో ఒక దేశంగా ఉండేదని చెప్పలేం. సరిహద్దులు సరిగ్గా నిర్ణయించ లేకపోయినా ఈ ఉపఖండంలో నివసించే ప్రజల్లో కనీసం ఒక తరంలో కొన్ని సాంస్కృతిక సామాన్యాంశాలుండేవని గుర్తించగలం. వివిధ ప్రాంతాల మధ్య మేధా వ్యాపార సంబంధాలుండేవి. ముఖ్యంగా శాస్త్ర, సాహిత్య, సృజన విశ్లేషణలు సంస్కృతం ద్వారా జరిగేవి. భాషా నిర్మాణాంశాలను పరిశీలిస్తే సంస్కృతంలో కొన్ని సౌకర్యాలున్నాయి. నూతన పద సృష్టి అవలీలగా సమర్థంగా చేసే ప్రక్రియలున్నాయి. వివిధాంశాలను వివిధచ్ఛాయల్లో వ్యక్తీకరించే వాక్య భేదాలున్నాయి. అవి సహజంగా వచ్చాయా? నిరంతర ప్రయోగ పరిణామక్రమ సంపాదితమా? అనే ప్రశ్నలకు మనకు సరైన సమాధానాలు దొరకవు, సంస్కృతం భారతీయులకు చరిత్ర ప్రసాదించిన వరం. అయితే ఏ కారణం వల్లనో కాని ప్రజా వ్యవహారంలో నిలవలేకపోయింది. పండిత వ్యవహారంలో కూడా ఇంకా ఎక్కువ కాలం మనుగడ సాగించగలదని నమ్మకం లేదు. అందువల్ల నేడు సంస్కృతం దేశ ప్రజల మధ్య ఏ తరంలోనూ సంబంధాలు సాగించగల భాషగా పనికిరాదు. అయితే ఈ దేశభాషలతో దాని కున్న అత్యంత సాన్నిహిత్యం వల్ల మూలధనంగా పనికి వస్తుంది. ఇదేం తక్కువ సౌకర్యం కాదు. శాస్త్ర సాంకేతికావసరాలకు తగిన నూతన పదసృష్టికి ఈ భాష బాగా వినియోగిస్తున్నది. ఆంగ్లేయుల పాలనలో ఇంగ్లీషును పాలకులు మన నెత్తిన రుద్దారు. ఇంగ్లీషువాళ్ళు మననుద్ధరించటానికి ఇంగ్లీషును ప్రవేశపెట్టలేదు. మనను సులభతరంగా మన అంగీకారంతో దోచుకోవటానికే ప్రవేశపెట్టారు. ఇందులో ఎవరికీ భేదాభిప్రాయం లేదు. ఇంగ్లీషు వాళ్ళు వెళ్ళిపోయారు. ఇంగ్లీషు భాష మిగిలింది. ఇంగ్లీషు భాష వ్యవహరించే మేధావి వర్గం మిగిలింది. ఇంగ్లీషు ద్వారా జరిగే పాలనా యంత్రాంగమూ, విద్యాబోధన పద్ధతీ మిగిలాయి. ఏభైయేళ్ళుగా అదే సాగుతున్నది. బహుశా ఇంకా ఎన్నాళ్ళు సాగుతుందో చెప్పలేము. సాగనిస్తే ఎన్నాళ్ళయినా సాగుతుంది. సాగనియ్యాలా? మార్చాలా? అనేదే మనముందున్న సమస్య.

ఇది సెంటుమెంటుకి సంబంధించిన విషయం కాదు. దేశభక్తికి సంబంధించిన సమస్య కాదు. దేశ ప్రజల సమగ్ర పురోభివృద్ధికి సంబంధించిన వ్యవహారం. తమ

అభివృద్ధి కోసం, మనుగడ కోసం తామెన్నుకున్న ప్రతినిధులు తమ కోసం ఏం చేస్తున్నారో తెలుసుకోవల్సిన అవసరం ఉంది. వాళ్ళు తమను కష్టాల నుంచి గట్టెక్కిస్తున్నారో, నట్టేట్లో పుట్టి ముంచుతున్నారో తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. ఈ సందర్భంలో ఇంగ్లీషు భాషను గురించి రాగ ద్వేష రహితంగా కొన్ని విషయాలు మాట్లాడుకోవటం మంచిదనుకుంటాను. వివిధ దేశాలకు వ్యాపించటం వల్ల వివిధ సందర్భాలకూ, ప్రయోజనాలకు విస్తరించటం వల్ల ఇంగ్లీషుకు కొన్ని సౌకర్యాలు ఏర్పడ్డాయి. ముఖ్యంగా శాస్త్ర సాంకేతిక విజ్ఞానం ఇంగ్లీషులో ఎక్కువగా లభ్యమవుతున్నది. ప్రపంచంలో జరిగే అనేక సంఘటనల సమాచారం ఇంగ్లీషు ద్వారా అందుతుంది. శాస్త్ర సాంకేతికాభివృద్ధి ఇంగ్లీషు ద్వారా ప్రపంచమంతా వ్యాపిస్తున్నది. ఇది ఇప్పటి ప్రపంచ భాష అని ఇష్టం ఉన్నా లేకపోయినా మనం ఒప్పుకు తీరాల్సిందే. ఈ పరిస్థితిని మనం మార్చలేం. అట్లా అని సంబంధాలు తెంచుకొని దూరంగానూ కూర్చోలేం. అంటే ఇంగ్లీషుకు దేశ బహిష్కారం విధించలేం. ఈ పరిస్థితుల్లో మనం ఏంచెయ్యగలం? ఈ సందర్భంలో భాషల తత్త్వాలను గురించి మరికొంత విచారించాలి. భాషలకు నిర్మాణ, ప్రయోగ, సందర్భాలేకాక వాటిని ఆవరించి కొన్ని భావాలుంటాయి. అవి వ్యవహర్తల మనస్సుల్లో అల్లిబిల్లిగా అల్లుకొని ఉంటాయి. భాషకు ఒక విశిష్ట చరిత్ర ఉంటే భావాలు మరింత సాంద్రంగా ఉంటాయి. ఉదాహరణకు సంస్కృతాన్నే తీసుకోండి. కొందరికి అది దైవ భాష. ఆ భాషకు మంత్ర శక్తి ఉంది. ఆ భాషలో ఉన్న పదాలను వాక్యాలను యదాతథంగా ఉచ్చరిస్తే పుణ్యం వస్తుంది. ప్రపంచ భాషలన్నికంటే ఇది చాలా గొప్పది. ఇది ఒక రకం భావచట్రం. సంస్కృతం ఉన్నత వర్గాల భాష. ఇది శూద్రులపై అగ్రవర్ణాలు పెత్తనం చెయ్యటానికి ఉపయోగించింది. దీన్ని వ్యవహారంలో ఉంచటమంటే అగ్రవర్ణాధిపత్యాన్ని సాగించటమే. ఇది మరొక భావచట్రం. వీటి నిజానిజలను గురించి చర్చించటం ఇప్పటి నా సమస్య కాదు. ఆ చర్చ ఒక పక్కన వేరే జరుగుతుంది. భాషా నిర్మాణ వ్యవస్థలతో సంబంధం లేకుండా భాషను గురించి, భాషా శక్తిని గురించి భాషా ప్రయోజకత్వాన్ని గురించి భాషచుట్టూ కొన్ని భావాలు ఆవరించి ఉంటాయి. వీటి సమాహారాన్ని ఇంగ్లీషులో 'అయిడియాలజీ' అంటారు. తెలుగులో సంభావ్యాలు అందాం. మొదటే చెప్పినట్లుగా వీటికి భాషా నిర్మాణానికి అట్టే సంబంధం లేదు. వీటిని అశాస్త్రీయమనో, అభివృద్ధి నిరోధకమనో పక్కకు తోసేస్తే లాభం లేదు. కళ్ళు మూసుకుంటే మాయమయిపోవు. ఇవి మనం తప్పనిసరిగా పరిగణించాల్సిన సామాజిక వాస్తవికతలు.

ఇప్పుడు ఇంగ్లీషు చుట్టూ అల్లుకున్న సంభావ్యాలను పరిశీలించండి. ఇంగ్లీషు శాస్త్ర భాష. ఇంగ్లీషులో చెప్పిన భావాలను తెలుగులో చెప్పలేం. ఇంగ్లీషు మనకు చారిత్రకంగా సంక్రమించిన వరం. శాస్త్రబోధన ఇంగ్లీషులోనే జరగాలి. ఇదొక పద్ధతి. ఇంగ్లీషు సామ్రాజ్యవాదుల భాష. ఇంగ్లీషును ఈ దేశంలో నిలవనియ్యటం మన బానిసత్వానికి చిహ్నం. దీన్ని వెంటనే బయటికి పంపిచెయ్యాలి. ఇదొక భావధోరణి. ఇంగ్లీషు మాట్లాడేవాళ్ళు, ధారాళంగా మాట్లాడేవాళ్ళు చాలా తరచుగానే కనిపిస్తారు. వాళ్ళను చాలా మెచ్చుకోలుగా చూస్తాం. విస్మయంతో చూస్తాం. కన్యాశుల్కం వచ్చి నూరేళ్ళు దాటింది. అందులో గిరీశం ఇంగ్లీషు మిళాయించిన తెలుగు మాట్లాడి అమాయక జీవితాలతో ఆడుకుంటాడు. తెలివితేటలు లేకపోయినా ఇంగ్లీషు మాట్లాడటం వచ్చినందువల్ల కొందరు పైకి రాగలిగితే, తెలివితేటలుండీ ఇంగ్లీషు రానందున నష్టపోతున్నవారు చాలా మంది ఉన్నారు. ఈ పరిస్థితిని ఇట్లాగే సాగనియ్యాలా?

పాలనా రంగం విషయం కొంత చూద్దాం. ప్రభుత్వం చేసే పనులు ప్రజలకు తెలియాలి, ప్రజల మనోభీష్టాలు పాలకులకు తెలియాలి. ప్రజలు ప్రభుత్వాలకు, ప్రభుత్వాలను రక్షించే రక్షక భటవర్గానికి విధేయంగా ఉండటం ప్రజాస్వామ్యం కాదు. ప్రజాస్వామ్య వ్యవస్థలో ఉప వ్యవస్థలన్నీ ప్రజలకు విధేయంగా ఉండాలి. ఇప్పుడట్లా ఉందా? లేదని అందరికీ తెలిసిందే. అయితే ఇట్లా ఎందుకుంది? ఇందుకు ఎన్నో కారణాలను అన్వేషించగలం. అసలు మూలకారణం ప్రజలకు ప్రభుత్వానికీ మధ్య భావప్రసారం లేదు. మన ముఖ్యమంత్రిగారు చాలాసార్లు ప్రస్తావిస్తున్న పారదర్శకత లేదు. భావ ప్రసారం లేనిచోట పారదర్శకత ఉండదు.

మన ప్రజాస్వామ్యంలో ప్రజల పాత్ర పరిమితం కావటానికి పాలనా భాష వేరు, ప్రజల భాష వేరు కావటమే. స్వపరిపాలన ఏర్పడి అర్ధశతాబ్దం గడిచినా ఈ పరిస్థితి మారకపోవటం మన దౌర్భాగ్యం. మన అలసత, బహుశా మన అసమర్థత కారణాలను కుంటాను. ఎక్కడో ఒకచోట ఒక నిప్పురవ్వ వెలిగించాలి. ఇందుకు బహుముఖంగా ఉద్యమం నిర్మించాలి. ప్రజలను చైతన్యవంతం చేయాలి. పాలన తమ భాషలోనే జరగాలని ప్రభుత్వాన్ని నిలదీయాలి. అందుకే ఆ లక్ష్యంతోనే మాతృభాషా సంస్థ పేరుతో కొందరం పరిమిత శక్తితో ప్రయత్నం చేస్తున్నాం. అది అట్లా ఉంచండి. అయితే నిరక్షరాస్యత నిండుగా ఉన్న దేశంలో ప్రజల భాషలో పరిపాలన సాగినా సమాచారం ప్రజల వరకూ పోయేదెట్లా? ప్రజల కోరికలూ, ఆలోచనలూ ఏలినవారికి చేరేదెట్లా? ప్రభుత్వం వారికి సమాచారం మౌఖిక ప్రసారం ద్వారా అందించటానికి రేడియో దూరదర్శన్ వంటి

సాధ్యాలున్నాయి. ప్రజలకో?? లిఖితంగా జరగాలి. అందువల్ల అక్షరాస్యత అమలు ప్రజాస్వామ్యంలో తప్పనిసరి అవుతుంది. ఇక వ్యావహారిక భాష విషయానికి వస్తే దీని విషయంలో చాలా అపోహలు, అస్పష్టత, అవగాహనా రాహిత్యం చాలా మందిలో కనిపిస్తాయి. రాసే భాష మాట్లాడే భాషకన్నా భిన్నంగా ఉండకూడదని చాలా మంది అంటున్నారు. భిన్నంగా ఉండక తప్పదు. భిన్న సందర్భాలకు వాడే భాషలో భేదాలున్నట్లే భిన్న ప్రయోజనాలకు వాడే భాషలో భేదాలుంటాయి. ప్రభుత్వ శాసనాలు, చట్టాలూ, చట్టాలకు చేసే సవరణలు, ప్రత్యేకవివరణలు ప్రజల భాషలోనే ఉండాలనటం కుదరదు. సంభాషణలో ఒకరు చెప్పింది ఇంకొకరికి వేరే రకంగా అర్థం అయితే వక్త దాన్ని సవరిస్తాడు. అది నిత్యం ప్రత్యక్షంగా జరిగే పని. అస్పష్టత, అనుకోని అర్థాలు రావటం, భిన్నార్థాలు రావటం భాషా నిర్మాణంలోనే ఉంది. మాట్లాడే భాషలో ఇది అధికంగా ఉంటుంది. రాసే భాషలో బిగింపు, కుదింపు ఉండాలి. కొన్ని సాధారణ పదాలకుండే అర్థాలను మార్చుకొని పునర్నిర్వచించుకోవాల్సి రావచ్చు. అర్థ స్పష్టత కోసం, నిర్దిష్టత కోసం చాలా సార్లు వాడుకలోని మాటలే వాడుకోవాల్సి ఉంటుంది. కొత్తగా తయారు చేసుకోవాల్సి ఉంటుంది. మాట్లాడే భాషలో వ్యక్తి, శ్రోత ప్రాధాన్యం, మగ్నత ఎక్కువ. చట్టాల్లోను, శాసనాల్లోనూ, ప్రభుత్వ ఉత్తర్వుల్లోనూ వ్యక్తి ప్రమేయం ఉండకూడదు. విషయైక దృష్టే ఉండాలి. న్యాయ నిర్ణయాలకీ, న్యాయ శాస్త్రానికీ శాసనాలకీ వాడే భాషలో బిగింపు కుదింపు ఉంటాయి గనుక, ఈ భాష సామాన్య భాషకన్నా భిన్నంగా ఉంటుంది. భాషా ప్రయోగంలో నిర్దిష్టత కోసం పరిశ్రమించాల్సి ఉంటుంది. అందువల్ల తప్పనిసరిగా ఈ భాష తెలుగే అయినా ప్రజా భాష కాదు. అంటే మాట్లాడే భాష కాదు. రాసే భాష. న్యాయ నిర్ణయాలు, ప్రభుత్వ శాసనాలు మొదలైనవాటిలో నిర్దిష్టత అవసరం. అస్పష్టత, అర్థాంతర బోధ వాటి ప్రయోజనాన్ని దెబ్బ తీస్తాయి. వివాదాలకు దారి తీస్తాయి. అందు వల్ల అవి అట్లాగే ఉండాలి. అంటే ప్రజల భాషకన్నా భిన్నంగా కుదింపు బిగింపు రాసే భాషలో ఉండాలి. ఇట్లాంటి వాటిల్లో పదాలు, పదబంధాలు ప్రజల దైనందిన భాషలో వాడే పదాలకన్నా భిన్నంగా ఉంటాయి. అట్లా ఉండటం ప్రయోజనకరం కూడా. అయితే ఈ సమాచారం ప్రజలకు అవసరం లేదా ? అవసరమేకాని ఆ రూపంలో కాదు. వాటిని ప్రజల భాషలో విపులీకరించి విశదీకరించే యంత్రాంగం వేరే కావాలి. అది ప్రభుత్వ సమాచార శాఖ వారు ప్రచురించే కరపత్రాలు, పత్రికలు, గ్రంథాల ద్వారా చేయవచ్చు. లేక ఆయా రంగాల నిపుణులు ప్రజల కోసం పత్రికలలో రాయనూ వచ్చు. దృశ్య శ్రవణ సమాచార ప్రసార సాధనాలలో ప్రసంగాల ద్వారాను చేయవచ్చు.

శాస్త్ర రంగాలలో శాస్త్రవేత్తల పరిశోధనలు ప్రజల భాషలో ఉండవు. పరిశోధకుల భాషలోనే ఉంటాయి. ఆయా శాస్త్రాలు తెలిసినవారికే అర్థమవుతాయి. ఆ శాస్త్ర విషయాలను సామాన్యులకు అందించే గ్రంథాలు వేరుగా ఉంటాయి. వీటిని ఇంగ్లీషులో 'పాపులర్ సైన్స్' గ్రంథాలంటారు. మూలశాస్త్ర గ్రంథాలు, శాస్త్ర పరిచయ గ్రంథాలు ఒకే భాషలో ఉండవు. అంటే ఒకే భాషా శైలిలో ఉండవు. ఈ భేదం గమనించక అన్నీ పత్రికల భాషలోనే ఉండాలనే అమాయక వ్యావహారిక భాషావాదులు మనకు అక్కడక్కడ కనిపిస్తారు. శాస్త్ర గ్రంథాలు, శాస్త్ర పరిచయ గ్రంథాలు రెండూ కూర్చగల శక్తి కొందరు శాస్త్రకారులకు ఉంటే ఉండవచ్చు. అప్పుడైనా ఈ పాఠ్యాలు వేరుగానే ఉంటాయి. శాస్త్ర కారులు కానివారికి ఈ రెండవ శక్తి ఉంటే ఉండవచ్చు. అప్పుడు శాస్త్ర విషయాలను అర్థం చేసుకునే శక్తి, అర్థం చేసుకునే నైపుణ్యం అతను ప్రత్యేకంగా అభ్యసించి ఉంటాడు. అన్నిటికీ ఒకే భాష పనికొస్తుందనుకోవటం, అట్లాంటి భాష పత్రికల్లో రాసేదో మరోదో కావాలనుకోవటం అంటే అన్నీ ఒకే భాషలో రాయాలనటం అతర్కితవాదం. అవిచారిత భాషణం.

వార్త, 1997 అక్టోబరు 23

# ఆధునిక భాష - భాషాధునీకరణ

భాషా శాస్త్రం ప్రకారం భాషలన్నీ సమంగా శక్తిమంతమైనవే. దాని అర్థం మూలధాతువులో అంటే భాషా యంత్రాంగంలో పటిష్ఠమైన భాషలు, పేలవమైన భాషలు అనే భేదం ఉండదని, ఈ రకమైన అవగాహన ఈ శతాబ్దపు ప్రారంభంలో మాట్లాడే భాషలపై చేసిన పరిశోధనల మీద ఆధారపడి ఉంది. మాట్లాడే భాషకు ఉన్న అనేక పరిమితులలో స్టోరేజ్ పరిమితి ఒకటి. భాషలో వాక్యోత్పత్తి యంత్రాంగం - దాన్నే స్థూలంగా వ్యాకరణం అంటాం. - బహుశః అన్ని భాషలకు దాదాపు సమానం కావచ్చు. కానీ లిఖిత వ్యవస్థ ఉన్న భాషలలో స్టోరేజ్ ఫెసిలిటీ వల్ల మాట్లాడే భాషకన్న రాసే భాష సంపన్నమైనది. దీనికి కారణాలు ఊహించడం కష్టం కాదు. రాసే భాషలో లిఖిత వ్యాకరణాలు ఉంటాయి. వాటివల్ల పద వాక్యోత్పత్తి ప్రక్రియలను అధికోపయోగంలో పెట్టవచ్చు. రకరకాల కోశాలు ఉంటాయి. అవి పద సంపదను భద్రపరుస్తాయి. రాసే భాషలో భాషను వివిధ సందర్భాలలో ప్రయోగించిన పత్రాలు, గ్రంథాలుంటాయి. వాటివల్ల భాషను ప్రయోగించే విస్తృతావకాశాలు, సందర్భోచిత శైలీ భేదాలు'' అందుబాటులో కొస్తాయి.

పై వివరణను బట్టి భాషా సమీకరణను గురించి కొన్ని విషయాలు తెలుసుకోవచ్చు,.., అవి ఇవి : 1. నవీకరణ అనేది లిఖిత భాషకు సంబంధించినది. 2. భాషాభివృద్ధికి నిల్వ వనరులు అవసరం. అవి రాసే భాషలోనే సాధ్యం. 3. అభివృద్ధి చెందిన సమాజాలలో భాషా ప్రయోగ సందర్భాలు పెరుగుతాయి. ప్రయోగరీతులు పెరుగుతాయి. పద సంపద పెరుగుతుంది. అర్థ వైశిత్యం, అర్థచ్ఛాయా భేదాలు పెరుగుతాయి. ఇట్లాంటి అవసరాలు పెరిగిన సమాజాన్ని అభివృద్ధి చెందిన సమాజమనీ, అట్లా అభివృద్ధి చెందిన సమాజానికి అనుగుణంగా పెరిగిన భాషలను అభివృద్ధి చెందిన భాషలని అంటాం.

ఆధునిక నాగరికతా దృష్టితో చూచినట్లయితే, అందులోను ప్రధానంగా ఆర్థిక, సాంకేతిక, అభివృద్ధి దృష్ట్యా చూస్తే, స్థూలంగా యూరోపియన్ భాషలు అభివృద్ధి చెందిన భాషలనీ, ఆధునికీకృత భాషలనీ గుర్తించగలం. ఆధునిక భారతీయ భాషలు ఈ విషయంలో వెనకబడి ఉన్నాయనేది స్పష్టమే. ఈ భాషల్లో ఒకటైన తెలుగు పరిస్థితి కూడా అంతే.

ప్రాచీనాంధ్రం ప్రధానంగా సాహిత్య భాష, మనకు సాంప్రదాయికంగా అందిన

గ్రంధాలన్నీ అన్నీ కాకపోయినా చాలా వరకు సాహిత్య గ్రంథాలు. అందులోని భాషను కావ్య భాష అని పిలుస్తాం. ప్రాచీనాంధ్ర కావ్యభాషను ఆధునిక కాలంలో గ్రాంధిక భాషగా వ్యవహరించారు. ప్రాచీనాంధ్రంలో కావ్య భాషేతర సంప్రదాయరీతులు సంకీర్తనల్లోను, యక్షగానాల్లోను, ఆ తరువాత వచ్చిన స్థానిక చరిత్ర గ్రంధాలలోనూ కనిపిస్తాయి. ప్రధానమైనది కావ్య సంప్రదాయమే. ఇతర సంప్రదాయాలు కూడా కావ్య భాష నుంచి ఎంత దూరం జరిగినా కావ్యభాషను ప్రామాణికంగా ఎన్నుకున్నవే. ఇంకోరకంగా చెప్తే, కావ్యేతర సంప్రదాయాలు మాట్లాడే భాషకన్నా, కావ్యభాషకే సన్నిహితాలు.

సాహిత్యేతర రచనా సంప్రదాయాలు మనకు చాలాకొద్ది. తెలుగులో శాస్త్ర సంప్రదాయం అసలు లేనట్టే. లౌకిక సంప్రదాయాల్లో మనకు అందింది శాసన భాషా రచనా సంప్రదాయమే. ఆ శాసన భాషలోను కొన్ని పద్యాలు. వచన శాసనాల్లో భాష ఏ విధంగానూ అభివృద్ధి చెందిన భాషా స్థితికి సంకేతం కాదు. అదీగాక ప్రాచీన సమాజంలో విస్తృతమైన భాషాస్థితీ, ఉన్నతమైన భాషాస్థితీ ఒక్క కావ్య భాషకే ఉన్నాయి.

రాజ్య పరిపాలన ఆంగ్లేయుల హస్తగతమైన తరువాత ముఖ్యంగా ప్రథమ భారత స్వాతంత్ర్య సమరంగా అభివర్ణిస్తున్న 1857 సంవత్సరపు తిరుగుబాటు తరువాత భారతదేశం ఒక ప్రత్యక్షపాలన కింద వచ్చి పాలన సంబంధమైన సంస్కరణలు చేయడానికి తగిన పరిస్థితులేర్పడ్డాయి. వాటిలో భాగంగానే సమాజ సంస్కరణలు కూడా మొదలైనాయి. దీంట్లో భాగంగా భాషా సంస్కరణ అవసరమైంది. మొత్తం సమాజం అభివృద్ధి చెందే క్రమంలో ఆధునికమయ్యే సమయంలో భాషా సంస్కరణావశ్యకతను తెలుగు మేధావులు కూడా గమనించారు. ఇందుకు ఒక బలమైన ఉదాహరణ సామినేని ముద్దు నరసింహం నాయనిగారి హితసూచని (1852...?). ఈ గ్రంథంలో సాంఘిక సంస్కరణలతో పాటు భాషా సంస్కరణావశ్యకతను తెలుగుదేశపు మేధావులు చాలాకాలం క్రితమే గుర్తించినట్లు గ్రహించగలం. ఈ భాషా సంస్కరణోద్యమాన్ని వ్యావహారిక భాషోద్యమం అని కూడా పిలుస్తారు.

ఆధునిక సమాజపు అవసరాలకు కావ్యభాష చాలదని అందరూ గ్రహించిందే. కావ్య భాష సాహిత్య రచనకు ఉద్దేశించింది. విస్తృత భాషా ప్రయోగంలో సాహిత్య భాష ఒకరీతి. అది అన్నిటికీ సరిపోతుందన్న భ్రమ వాటి భాషా వేత్తలకు ఎవరికీ లేదు. విస్తృతావసరాల కోసం సాహిత్యేతర భాష కావాలని వాటి పండితులందరూ గుర్తించారు. ఆ భాష ఎట్లా వస్తుందనే దాని మీదనే అభిప్రాయ భేదాలు. ఒక వర్గం పండితులు ఆ రకపు ఆధునిక

భాష ప్రాచీన భాషని సంస్కరించుకోవడం ద్వారా తయారు చేసుకోవచ్చునన్నారు. వారిని గ్రాంథిక భాషా వాదులన్నారు. మరికొందరు పండితులు ఆధునిక రచనా భాష ఆధునిక వ్యవహార భాష నుంచే రావలసి ఉంది – అని వాదించారు. వీరిని వ్యావహారిక భాషావాదులన్నారు. గ్రాంథిక భాషావాదులు కూడా భాషా సంస్కరణను కోరిన వారే అన్న సంగతి మనం తరచూ మరచిపోతుంటాం. రెండు వాదాల వారు సంస్కరణ ప్రియులే. దేన్ని ఎలా సంస్కరించాలనే దగ్గరే భేదం. గ్రాందిక భాషా వాదులు వ్యవహారం నుంచి భాషను స్వీకరించక తప్పదు. వ్యావహారిక భాషా వాదులు భాషకున్న విస్తృతావసరాల దృష్ట్యా ప్రాచీన భాషాపదాలను కొన్ని వాక్యరీతులను త్యాగం చేయలేరు. గ్రాంథిక, వ్యావహారిక భాషావాదుల మధ్య – తీవ్రవాదుల్ని వదలివేస్తే – ప్రధాన భేదం ప్రయాణపు దిశ మాత్రమే. దీన్నే ఓరియంటేషన్ భేదం అనవచ్చు.

ఒక కాలంలో ఈ విషయాలను ఒప్పించడానికి సాధ్యం కాలేదు. గ్రాందిక వ్యావహారిక భాషావాదులు ఆయుధాలు లేని పోరాటం చేశారు. ఈ పోరాటంలో కొక్కొండ వెంకట రత్నం, జయంతి రామయ్య, పానుగంటి లక్ష్మీనరసింహారావు మొదలైనవారు గ్రాంథిక భాషావాదంలో ప్రముఖులుగా కనిపిస్తారు. వీరికి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి అండ బాగా ఉండేది. విక్రమదేవ వర్మ లాంటి ఇతర సంస్థానాధీశులు కూడా గ్రాంథిక భాషా వాదాన్ని సమర్థించారు. గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు, బుర్రా శేషగిరి రావు వంటి వారు వ్యావహారిక భాషావాదాన్ని తీవ్రంగా ప్రచారం చేశారు.

వ్యావహారిక భాషోద్యమానికి ఆనాటి భాషా శాస్త్ర దృక్పథం చాలా తోడ్పడింది. గత శతాబ్దపు చారిత్రక భాషా శాస్త్రవేత్తలు భాషా పరిణామ సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. దాని వల్ల భాషలో మార్పు అనివార్యం అనే విషయం స్థాపితమైంది. అందుకే వ్యావహారిక భాషా వాదుల వ్యాసపరంపరలో ఎక్కడో ఒక చోట 'భాష మారుతుంది' అనే వాక్యం కనబడుతుంది. ఇది చారిత్రక భాషాశాస్త్ర ప్రభావం. గిడుగు రామమూర్తిగారు 1910-12 సంవత్సరాలలో విశాఖపట్నంలో ఉపాధ్యాయ పరిషత్‌లో ఇచ్చిన ఉపన్యాసాల్లో ఈ విషయాన్నే నొక్కి చెప్పారు. ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు పాశ్చాత్యుల వలస వాదంలో భాగంగా ఆయా దేశాలలో లిఖితస్థితిలేని అనేక భాషలను అధ్యయనం చేశారు. ముఖ్యంగా ఆఫ్రికన్ భాషల మీద అమెరికన్ – ఇండియన్ భాషల మీదా ఈ పరిశోధన విస్తృతంగా జరిగింది. దీని వల్ల భాషలను గురించిన శాస్త్రీయ అవగాహన పెరగడంతో పాటు మాట్లాడే భాషకు కూడా పటిష్ఠమైన వ్యాకరణ వ్యవస్థ ఉంటుందని పరిశోధకులకు అర్థమైంది. గిడుగు రామమూర్తిగారు 1911 ప్రాంతానికే సవర భాషకు వాచకాలు రచించారని,

1931కి సవర భాషకు వ్యాకరణం రచించారనీ తెలుసుకుంటే, భాషాశాస్త్ర దృక్పథ ప్రభావం వ్యావహారిక భాషావాదంపై ఏ విధంగా పడిందీ అర్థమవుతుంది. ఆధునిక భాషాశాస్త్ర పాఠ్య గ్రంథాలలో భాషకు ఇచ్చిన నిర్వచనాలన్నీ మాట్లాడే భాషను దృష్టిలో పెట్టుకుని ఇచ్చినవేనని మనం గ్రహించాలి. ఈ శతాబ్దపు పూర్వార్థ భాగంలో వీర గ్రాంథిక భాషావాదులు ఉండేవారు. ప్రతి రచనా కావ్యభాషలాగే ఉండాలనే వారు. ఇప్పుడు వీర వ్యావహారిక భాషావాదులున్నారు. రాసింది ప్రతిదీ మాట్లాడినట్లే ఉండాలంటారు. ఈ రెండూ తీవ్రవాదాలు మాత్రమే కాదు. ఏ మాత్రమూ ఆచరణ సాధ్యం కాని భ్రమలు. భాషా వృద్ధికి ప్రధానంగా కావలసింది భాషా ప్రయోగ విస్తృతి. అంటే అన్ని రంగాలలోను, అవసరమైన అన్ని సందర్భాలలోను తెలుగు భాషను ఉపయోగించడం. ఒకప్పుడు కావ్య భాషే అన్ని రచనా భేదాలకు పనికివస్తుందని కొందరనుకున్నట్లుగా నేడు పత్రికా భాషే అన్నిటికీ పనికి వస్తుందనుకునేవారు ఉన్నారు. ఇందుకు భాషా వ్యవస్థా నిర్మాణంలో వివిధ సమాచార ప్రసారంలో వీరికున్న అదృశ్యాధికారం కారణం. ఈ పరిస్థితికి పటిష్ఠమైన విద్యా వ్యవస్థ (ఎకడమిక్ స్ట్రక్చర్) లేకపోవడం ఒక కారణం. తెలుగులో శాస్త్ర రచన అంతగా పెరగలేదు. శాస్త్ర రచనకు భాషా నిర్దిష్టత అవసరం. ఇది రచన ద్వారా కొంత సాధ్యం.

పరిభాషను రకరకాల కోశాల రూపంలో నిర్దేశించుకోవడం అవసరం. రకరకాల కోశాలంటే, వివిధ శాస్త్ర పరిభాషా నిఘంటువులు. వివిధ అర్థచ్ఛాయలను సోదాహరణంగా వివరించే ప్రయోగ కోశాలను తెలుగులో నిర్మించుకోవలసి ఉంటుంది. ఇవిగాక అనేక శాస్త్రాలలోను వివిధ సందర్భాలలో వాడే భాషా భేదాలను నిరూపించే వ్యాకరణ గ్రంథాలు కావలసినదే. ఇవన్నీ జరిగిన నాడు తెలుగు భాష ఆధునికావసరాలకు తగిన భాష అవుతుంది. ఇతర భాషల సంగతి ఏమో కాని, తెలుగులో ఇట్లాంటి పనులు జరగడానికి తగిన వనరులున్నా, అంతగా జరుగుతున్నట్లు కనబడడం లేదు. తెలుగు ఎకాడమీ, తెలుగు విశ్వవిద్యాలయం వంటి సంస్థలు అన్ని రాష్ట్రాలలోనూ లేవు. ఈ వనరులన్నీ ఉపయోగించుకొని అవసరమైన కోశ వ్యాకరణాల నిర్మాణం జరిగితే తెలుగు భాషను ఆధునికం చేయడం కష్టమేమీ కాదు.

ఆంధ్రజ్యోతి, సాహిత్య వేదిక, 1998 జనవరి 26.

# శైలిలో ఏకరూపత

సమాజపు అవసరాలనుబట్టి రాసేభాషలో కూడా భేదాలుంటాయి. ప్రాచీన భాషలో కావ్యభాష, శాసన భాష ఒకటిగా ఉండవు. ఒక సంప్రదాయం ఏర్పడ్డ తరువాత అనంతర గ్రంథకర్తలు అదే సంప్రదాయాన్ననుసరించి గ్రంథాలు రాస్తారు. ప్రాచీన కావ్యభాషా సంప్రదాయం మొన్న మొన్నటి వరకు అట్లాగే సాగింది. ప్రాచీన కాలంలో ప్రత్యేకంగా వచన గ్రంథాలు లేవు. పద్యగద్యమిశ్రమమైన చంపూ కావ్యాల్లో గద్య భాషకూ పద్య భాషకూ భేదం ఉండదు. మహాభారతంలో కాని, ఇతర ప్రబంధాల్లోకాని వచన భాగాన్ని చూడండి. గద్య పద్య భాగాల్లో భాష ఒకటిగానే ఉందని గుర్తిస్తారు.

## గద్య కావ్యాల్లో వచనం :

అనంతరం గద్యకావ్యాలు వచ్చినాయి. గద్యకావ్యాల్లో భాష పద్యాల్లో కన్నా సరళంగా ఉంటుంది. కథాకథనం మీద దృష్టి ఉండటం వల్ల ఇట్లా జరిగింది. అయినా వ్యాకరణ నిర్మాణ దృష్ట్యా ఆ భాష అంతకు ముందటి సంప్రదాయానికి చెందిందే. సముఖము వేంకట కృష్ణప్పనాయకుడి జైమిని భారతము (17 శతాబ్దం) లో నుంచి ఈ భాగాన్ని చూడండి :

'' ఇవ్విధంబున మహావ్యధం బరితపించుచున్న నన్ను రూక్షేక్షణంబుల నిరీక్షించుచు హర్యక్షంబు వాల విక్షేపణంబుల నప్పళించుచు, మనుష్య భాషణంబుల గర్వించుచు నన్ను నుద్దేశించి నాచేబడిన జంతువుంగృతాంతువానినంత వానినైన బలవంతంబున విడిపింప దలబంటి, నీ శిష్యుండును నీవును నింటికి జనుండని నిరాశంబుగా బలికిన గ్లేశంబున నా శిశువుం బాసిపోవం జాలక, బాలకవిహీనులగు మానవులకు నౌర్ధ్వ దైహికంబులు లేవు గావున నీవు మచ్ఛరీరంబు కబళంబుగొని సుతశరీరంబు విడువుమనిన...''

కథన శైలి ఉన్నా ప్రధానంగా ఇది కావ్య భాషా శైలి అని దీన్ని గుర్తుపట్టగలం. పై వచనంలో అరసున్నలు 'కచటతప'లతో మొదలయ్యే మాటలు, గజడదబలతో మొదలు కావటం, భాషణంబులు, నిరాశంబు, శరీరంబు అని ప్రాచీన రూపాల వాడకం, రూక్షేక్షణంబులు, ఔర్ధ్వ దైహికంబులు వంటి సామాన్య పాఠకుల కర్థంకాని సంస్కృతం మాటల ప్రయోగం. ఈ లక్షణాల వల్ల ఇది ప్రాచీన శైలి అని గుర్తుపట్టగలం.

వ్యాకరణం విషయంలో కూడా ప్రాచీనత కనిపిస్తుంది. పరితపించుచున్న, నిరీక్షించుచు వంటి క్రియలు, నన్ను నుద్దేశించి, మానవులకు నౌర్ధ్వ దైహికంబులు వంటి సంధులు 'విశేషణంబులన్' వంటి ప్రాచీన విభక్తి రూపాలు ఉన్నాయి. ఈ రకమైన వచనం సాహిత్య భాషా సంప్రదాయంలో భాగంగా ఉండేది.

## ఆధునిక శైలికి దారితీసిన వచన సంప్రదాయం

సామాన్య పాఠకుల నుద్దేశించి రచించే వచన సంప్రదాయం ఒకటి వేరుగా ఉండేది. ఉదాహరణకు తాతాచార్ల కథల్లో వచనం చూడండి :

'' ఉత్తరాది సీమలో ఒక గ్రామంలో అన్నదమ్ములు యిద్దరు బ్రాహ్మలు. వీరు విభాగములై యిల్లు వాకిలి రెండూ పంచుకున్నారు. వారి పెరట్లో ఒక బావి వున్నది. ఆ బావి తొలి కట్టించడమునకు సుమారు నూరు వరహాలు పట్టును. అవి యేమిటికంటే – ఆ భూమి చట్టుగనుకనున్నూ, వూలులేనిది గనుకనున్నూ, బహులోతున నీళ్ళు గలది గనుకనున్నూ, ఆ ప్రాంతం వూళ్ళలో రెండు వూళ్ళకు, మూడు వూళ్ళకు అటువంటి బావి ఒకటి కలిగి వుండును. గనుక యీ అన్నదమ్ములు యిద్దరున్ను తమ పెరడు పంచుకునేటప్పుడు తమ్ముడ్డి పాలికి వారి పెరట్లో నుంచి వీరి పెరట్లోకి వక కంత దోవ పెట్టుకుని నీళ్ళు వాడుకుంటూ వుండిరి''.

ఈ పై వచనంలో సరళత ఉంది. అర్థంకాని గొట్టు మాటల్లేవు. ప్రాచీన సంధి రూపాలు లేవు. కాగా 'నున్నూ' వంటి కొత్త వ్యాకరణ ప్రత్యయం ఎక్కువగా కనిపిస్తున్నది. 'వుండును, వుండిరి, పట్టును' వంటి ప్రాచీన క్రియలు ఇంకా కనిపిస్తున్నాయి. మాట్లాడే భాషనుంచి ఏర్పడ్డ రచనాభాషగా దీన్ని గుర్తించవచ్చు.

ఈ సంప్రదాయాన్నే గిడుగు రామమూర్తిగారు, గురజాడ అప్పారావుగారు పాటించి, దీన్ని శిష్ట వ్యావహారిక శైలి అన్నారు. ఈ వచనం రాసేవారికి సాహిత్య పరిచయం కూడా ఉంటుంది. కనుక కొన్ని ప్రాచీన పదాలు, పదరూపాలు దొర్లుతుంటాయి. ఈ శైలి ఆధునిక శైలికి దారితీసింది.

## ప్రాచీన వచన భాషా చట్రంలో ఈనాటి వాక్యాలూ, పలుకుబళ్ళ ప్రయోగం

అయితే ప్రాచీన భాషలో సంధి నియమాలు సడలించి, ప్రాచీన పదాలు తగ్గించి, మాట్లాడే భాష వాక్య నిర్మాణం, సంభాషణారీతి వాక్యాలు, చిన్న వాక్యాలు ప్రవేశపెట్టి ప్రధానంగా వ్యాకరణంలో మాత్రం ప్రాచీనతను నిలుపుకుంటూ ఆధునికులు కొందరు వచనం రాశారు. ప్రాచీన భాషా చట్రాన్ని ప్రధానంగా నిలుపుకుంటూ మాట్లాడే భాషలోని

పలుకుబళ్ళను రచనలో కెక్కించడం ఈ మార్గం. ఉదాహరణకు పానుగంటి లక్ష్మీనరసింహా రావుగారి సాక్షి వ్యాసాల్లో నుంచి ఈ భాగాన్ని చూడండి :

'' ఎక్కడజూచిన దేశభక్తులే! బజారులో దేశభక్తులు, మంద బయట దేశభక్తులు, చెఱువునొడ్డున దేశ భక్తులు, పశువుల సంతలో దేశభక్తులు, మేదర గూడెంలో దేశభక్తులు, మాలపల్లిలో దేశభక్తులు, ఇంటిలో దేశభక్తులు, దొడ్డిలో దేశభక్తులు, వాకిటిలో దేశభక్తులు, రైలు స్టేషనులో దేశభక్తులు, నేల యీనినట్లందరు దేశభక్తులు - వందలు వేలు లక్షలు - ఇందరు దేశభక్తులు మన దేశముననున్న తరువాత మన దేశమున కింక గౌరతయేమి? ఇంకను దేశమునకు దురవస్థ ఏమి ? ఏమియు లేదు. ఇదియు స్వతంత్ర రాజ్యము. ఇదియే స్వర్గ లోకము.''

ఈ పై వచన భాగం సంభాషణలోని వాక్య నిర్మాణ రీతికి దగ్గరగా ఉంది. చిన్న వాక్యాలు, అయితే ఆ సంధులూ, అరసున్నలూ, బండి 'ఱ' లు కొద్దిపాటి ప్రాచీన రూపాలు. దీన్ని ప్రాచీన వచనశైలికి సన్నిహితం చేసినాయి. ఈ ప్రాచీన చట్రాన్ని వదలకుండా మాట్లాడే భాషా లక్షణాన్ని రాసే భాషలోకి దించిన వారున్నారు. విశ్వనాథ సత్యనారాయణగారి వచన భాగాన్ని చూడండి :

''మఱి పద్యమునకు గద్యమునకు భేదమేమి ? నేటి విమర్శలు చిత్ర చిత్రములుగా నుండును. తొలుత పాట పుట్టినదనియు, తరువాత పద్యము వచ్చినదనియును, నిది యొక యనుక్రమణిక. నిజానికి మొదటనే గద్యమున్నది. అందఱును గద్యములోననే మాటాడెదరు. పాటలలో మాటాడరు. పద్యములలో మాటాడరు.''

ఈ పై వచనంలో ప్రశ్న అడగటం, సమాధానం లక్షణం. అట్లాగే మాట్లాడే భాషలో వాక్యాలు చిన్నవిగా ఉంటాయి. ఆ లక్షణాలుండటాన నేటి భాషకు ఇది దగ్గరయింది. అయితే మాట్లాడే భాషను ప్రాచీన భాషా చట్రంలోకి ఇరికించటం వల్ల ఇది ఆధునిక వచనం కాలేకపోయింది. అరసున్నాలూ, బండిఱాలూ అట్లానే ఉన్నాయి. ఒక నియమంగా మధ్యలో వచ్చే అచ్చులకు 'య' కారం రాయటం, సంధులు పాటించటం, ప్రాచీన భాషా క్రియలు వాడటం అనే అంశాల వల్ల దీనికి ప్రాచీనతా స్వరూపం వచ్చింది.

## ఈనాటి రచనా భాషలో కనిపించే ప్రాచీన భాషా లక్షణాలు

ఆధునిక భాషలో రచిస్తున్న, ప్రాచీనతా ముద్రను వదిలించుకోలేని దశ కూడా తెలుగు వచనంలో ఉంది. రచనా భాష మాట్లాడే భాష నుంచి తయారు కావాలన్న

తొలినాటి పెద్దలు, గిడుగు, గురజాడల వచనంలో ప్రాచీన భాషా విశేషాలు స్పష్టంగా కనిపిస్తాయి. ' ఆంధ్ర పండితభిషక్కుల భాషా భేషజం'లో గిడుగు రామమూర్తిగారి ఈ వచనం చూడండి :

''చరిత్ర జిజ్ఞాసకు దొరికేసాధన సామగ్రి వంటిదే భాషా జిజ్ఞాసకు దొరికేదిన్ని. ఇప్పుడు మేము వ్రాస్తూ ఉన్న వ్యాసము మా అలవాటు చొప్పున మా తెలుగు భాషలో రచిస్తూ ఉన్నాము. మా ఉత్తర ప్రత్యుత్తరములు కూడా ఈ భాషలోనే వ్రాస్తాము. సంభాషించినప్పుడున్నూ ఈ తెలుగే వాడుతాము. అయినా అన్ని విధములయిన వ్రాతలలోను, సంభాషణలలోను మా భాష ఏమీ భేదము లేకుండా, ఎల్లప్పుడూ ఒక్కలాగున ఉంటుందని ఒప్పుకోలేము . . . దేశమునుబట్టి, జాతిని బట్టి, వృత్తినిబట్టి, మతమును బట్టి, విద్యనుబట్టి, వయస్సును బట్టి, నాగరికతను బట్టి, ఎంతో కొంత వ్యత్యాసము ఏర్పడక తప్పదు. అయినా నేటి నాగరికుల తెలుగులో సాధర్మ్యము అధికముగాను వైషమ్యము తక్కువగాను ఉన్నందున దానిని విశేషించి ప్రత్యేకించి సగటున అనగా మొత్తము మీద పరీక్షించి ఒక్కలాటిదే అనవచ్చును''.

ఆధునిక వచన రచనాభాష ఏర్పడే విధానాన్ని ఎంతో శాస్త్రీయంగా వివరించారు రామమూర్తిగారు, పై భాగంలో. అయినా వచనం చూడండి. ప్రాచీన లక్షణాలను వదిలించుకోలేని అశక్తత కనిపిస్తుంది. ఎక్కడో కొన్ని అధికారిక ప్రతులలోనూ, టీకల్లోనూ కనిపించే ' ఇన్నీ, ఉన్నూనూ'ల భాష ఆధునిక వచనలక్షణం అనుకున్నారు. 'వ్రాస్తాము వ్రాత' అనే రాశారు కాని, 'రాస్తాము, రాత' అని రాయలేకపోయారు. *'వాడుతాము'* అని రాశారు కాని *'వాడతాం'* అని రాయలేదు. వ్యాసము, వ్యత్యాసము వంటి మాటల్లో 'ము' అనే అక్షరానికి బదులు సున్న రాయలేదు. ' ఉత్తరములు' అని పూర్వభాషా బహువచనమే రాశారుగాని, ఇప్పటివిధంగా ' ఉత్తరాలు' అని రాయలేదు. 'దేశమును బట్టి ' అని పూర్వ వ్యాకరణ బద్ధరూపం రాశారుగాని 'దేశాన్ని బట్టి' అని రాయలేదు. ఈ విధంగా ప్రాచీన భాషా లక్షణాలు ఆధునిక వచనపు తొలినాళ్ళలో కనిపిస్తూనే ఉండేవి.

వచనంలో ఆధునికాంశాల ప్రాచుర్యం పెరిగి ఈనాటి వచనం ఏర్పడింది. ఈనాటి వచనం ఈనాటి మాట్లాడే భాషకు అతిసన్నిహితంగా ఉంటుంది. చలంగారి 'స్త్రీ' నుంచి ఈ వచన భాగాన్ని చూడండి :

''అన్నిటికన్నా - విద్యకన్నా - ముఖ్యం స్త్రీ స్వతంత్ర ఆర్జన, మనుష్యుల్ని గానీ, దైవాల్నిగానీ అణగదొక్కాలంటే ఆర్థిక అసహాయత్వం ముఖ్య సూత్రం. అందుచేతనే స్త్రీ

ముఖ్యంగా బానిస అయింది, తాను సంపాయించుకునే శక్తిలేక. తన పొట్టపోషించుకోడానికి తగిన పని స్త్రీ సంపాయించిందా ఈ పురుష ప్రపంచం నేలకూలందన్నమాటే . విద్య ఐనా స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఇయ్యకపోతే వృథా :''

ఇది ఈనాటి వచనానికి ఒక నమూనా, అయితే ఇందులో ''విద్య, స్వతంత్ర ఆర్జన, ఆర్థిక అసహాయత్వం, ఆర్థిక స్వాతంత్ర్యం'' అనే మాటలు మామూలు సంభాషణలో ఉండకపోవచ్చు. రచనా భాషలో సంస్కృత పదాల వాడకం హెచ్చు. సంస్కృత పదాల వాడకానికి రెండు కారణాలున్నాయి. ఒకటి-కొన్ని రకాల భావాల వ్యక్తీకరణకు సంస్కృతం మాటలు ప్రయోగించటం చదువుకున్న తెలుగువాళ్ళకు మొదటినుంచీ అలవాటు. రెండు-సంస్కృత శబ్దాలు తెలుగు రచనకు గౌరవాన్ని పెంచుతాయని ఒక అవ్యక్తపు నమ్మకం.

ఆధునిక వ్యవహారంలో - అంటే రచనా వ్యవహారంలో ఉన్న సంస్కృతం మాటలు వాడకుండా రాయలేం కాని ప్రత్యేకంగా ఎంచి ఎంచి ప్రాచీన కావ్యాల్లో మాత్రమే దర్శనమిచ్చే పదాలను వాడటం ఆధునిక వచన రచనకు గుణంకాదు.

అయితే ఒక్కోసారి వాతావరణం కోసం ప్రాచీన భాషా పదాలు, సంస్కృత పదాలు ఆధునిక వచనంలో కనిపిస్తాయి. ఉదాహరణకు కృష్ణశాస్త్రిగారి ఈ వచనభాగాన్ని చూడండి:

''అంతంత దూరం నుంచి విరివిపణి కలకలం ! చిరుగంటల మోతల వంటి విరివెలదుల నవ్వుల రవళులతో కలిసిపోయి, దూర మేఘ గర్జన వంటి విటరాయుల సరసుల కల కంఠరవాలు వినబడతాయి. అంతలో పువ్వుల అంగడి తెరువు ప్రవేశిస్తాము. ఎంత పెద్ద తెరువు ! ఎన్ని అంగళ్లు ! అక్కడ అపర సంధ్యాకాశం అవనికి జారినట్టు, ఇక్కడ ఇంద్రధనస్సులు విరిగిపడ్డట్టు. అక్కడ రకరకాల అంచుల రంగుల పావడాల జిలుగువన్నెల వసనాలు పల్లెవాటుల అచ్చరలు మంజరులై, మాలికలై సమావేశమయినట్టు.''

- పై వచనంలో విరివిపణి, విరివెలది, రవళి, విటరాయుడు, కంఠరవం, తెరువు, అపర సంధ్యాకాశం, అవని, వసనం, అచ్చ, మంజరి - అనే మాటలు ప్రాచీన భాషనుంచి తెచ్చుకున్నవి.

పూర్వ ప్రబంధ వర్ణనల్లో పుష్పలావికల వర్ణనం అని ఒకటుండేది. పుష్పలావికలు అంటే పూలమ్ముకునేవాళ్లు. వాళ్లతో నర్మగర్భంగా (రెండర్థాల మాటలతో) మాట్లాడినట్టు కవులు వర్ణించే వారు. ఆ వాతావరణం తీసుకురావాలనే దృష్టితో కృష్ణశాస్త్రిగారు పై మాటలు వాడారు. ఇట్లా వాతావరణ సృష్టికోసం, అవసరం కోసం, రచనకు.గౌరవం కల్పించటం

కోసం ఆధునిక వచన రచనలో సంస్కృతం మాటలు, ప్రాచీన భాషా పదాలు కనిపిస్తాయి. వీటిని ఆధునిక వచన రచనలో భాగాలుగానే గుర్తిస్తున్నాం. ఇతర భాషల నుంచీ, సంస్కృతం నుంచీ, ప్రాచీన భాష నుంచీ అవసరమైన పదజాలాన్నీ తెచ్చుకొని వాడుకోవటం ఆధునిక వచన రచనకు వ్యతిరేకంకాదు. తగినట్లు వాడుకోవటం రచయిత నేర్పుని బట్టి ఉంటుంది. క్రియా రూపాలూ, విభక్తులూ, ఇతర ప్రత్యయాలూ, శబ్దరూపాలూ, వాక్యనిర్మాణం ఆధునికమైతే వచన రచన ఆధునికమవుతుంది. ప్రాచీన భాషా పదాలు అవసరం కొద్దీ వాడుకోవటం ఆధునిక రచనలో నలిగిన సంప్రదాయమే. తొలినాటి రచనల్లోలాగా ప్రాచీన ఆధునిక లక్షణాల మిశ్రం కానీయకుండా ఉండటం ఆధునిక వచన రచన చేసేవారు తీసుకోవలసిన జాగ్రత్త.

ఆం.ప్ర. (అంబేద్కర్) సార్వత్రిక విశ్వవిద్యాలయ
మౌలికాంశాల పాఠ్యగ్రంథంలో 21వ పాఠం, 1984.

# శైలిలో వాక్యాల కూర్పు

భాషను ప్రయోగించే పద్ధతిని శైలి అంటారు. ఒక్కో వ్యవహర్తకు ఒక్కోతీరు కొన్ని ఊతపదాల వాడుక, ఒకరకమైన ఎత్తుగడ ఉంటాయి. ఇవన్నీ కలిపి అతని శైలి అవుతుంది. కొంతమంది ప్రతిమాటకీ ఒక సామెత వాడేసి మాట్లాడేవాళ్ళున్నారు. కొంతమందికి ''అన్నమాట'', ''అన్నట్లు'' అని వాక్యం చివర సంధించటం అలవాటు. కొంతమందికి ''అప్పుడేమో'', ''మరేమో'' అని ప్రతి మాటకీ ఏమో శబ్దాన్ని సంధించటం అలవాటు. పల్లెటూరి భాషలో మరికొన్ని రకాల ఊతపదాలూ, బూతులూ భాషలో అలవాటుగా దొర్లుతాయి. ఇవన్నీ ఆయా వ్యక్తుల భాషా శైలీభేదాలుగానే గుర్తించాలి. ఈ శైలీభేదాలను శాస్త్రజ్ఞులు భిన్న పద్ధతుల్లో విశ్లేషించి చూపించారు.

మాట్లాడే భాషలో లాగానే రాసే భాషలోనూ శైలీభేదాలు ఉంటాయి. అవి పదాల్లోనూ, పదబంధాల్లోనూ, వాక్య వాక్యాంశాల్లోనూ, వాటి ప్రయోగ క్రమంలోనూ ఉంటాయి. వీటిని సాహిత్యంలో గుర్తించారు. కవిత్వంలో నన్నయ అక్షర రమ్యత, తిక్కన నాటకీయత, శ్రీనాథుని ప్రౌఢ పదగుంఫనం, పోతన శబ్దాలంకార ప్రియత్వం, అల్లసానివారి అల్లిక జిగిబిగి, వసుచరిత్రకారుని శ్లేషప్రౌఢి, కృష్ణశాస్త్రి గారి లలిత లలిత పదవిన్యాసం, శ్రీ శ్రీగారి వార్షుకాభ్రముల ప్రళయ ఘోష లాంటి శబ్ద ఘోష – ఇవన్నీ శైలీభేదాల్ని సూచించే వర్ణనలే.

ఈ కోర్సులో మన ప్రధాన గమ్యం తెలుగుభాషా శక్తిని గ్రహించి వచన రచనలో ప్రయోగించటం. రచనాభాషే (రాసేభాషే) ప్రధాన లక్ష్యం.

వచన రచనలో శైలిని గురించి పూర్వపు పాఠాలలో తొలినుంచీ కొంత పరిచయం చేస్తూ వచ్చాము. చాలా పాఠాలకు చదివే అభ్యాసంలో ఆధునిక వచన రచనల్లోని కొన్ని ముఖ్యభాగాలను ప్రవేశపెట్టాము. ఆ భాగాలలో వచనశైలిని గురించి కొన్ని విషయాలు మీ దృష్టికి తెచ్చాము.

ఉదాహరణకు మొదట వుప్పల లక్ష్మణరావుగారి 'బతుకు పుస్తకం'లో నుంచి కొంతభాగం చదివారు. అది ప్రధానంగా జీవిత చరిత్ర కావటం వల్ల అందులో మీకు కనిపించేది కథన శైలి. జరిగిన సంఘటనలను ఆ వరసలో చెప్పుకుపోయే శైలీ పద్ధతి కథన శైలి. ఆ తరువాత ఇంగ్లీషు, తెలుగు కలగలిపిన హాస్యశైలి పురాణం సీతగారి 'ఇల్లాలి ముచ్చట్లు' లోది. వీరేశలింగంగారిని గురించి, రాజ్యలక్ష్మమ్మగారిని గురించీ

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి వ్యాసాలు రెండు చదివారు. ఆయన శైలిలో కాల్పనికత, ఆత్మీయత, ఆవేశం కనిపిస్తున్నాయని ఉదహరించాము. మునిమాణిక్యంగారి ఉత్తరంలో మనకంటె కొంచెం ముందటికాలపు సాంప్రదాయక కుటుంబాల్లో ఉత్తరం రాసేటప్పుడు వాడే శైలి చూశారు, అట్లాగే కుటుంబాల్లోవ్యవహరించే సంభాషణశైలి చదివారు. నాయని కృష్ణకుమారిగారి 'కాశ్మీర దీపకళిక'లో సాంప్రదాయకమైన నమ్మకాలు' కాల్పనికత కలగలిసిన శైలి చూశారు. విశదమైన, స్పష్టమైన, మొహమాటంలేని సూటి వాక్యాలతో కూర్చిన పదునైన శైలిని రంగనాయకమ్మగారి 'సినిమాల్లో స్త్రీ పాత్రలు' అనే వ్యాసంలో చూశారు. ఆవేశంతో కూడిన ఆవేదన వ్యక్తమయిన శైలి నార్ల వెంకటేశ్వరరావుగారి ''దుష్టగ్రహకూటమి'' అనే సంపాదకీయ వ్యాసంలో చూశారు. గోరాశాస్త్రి గారి 'పత్రికారచనలో అనుభవాలు-జ్ఞాపకాలు' అనే వ్యాసంలో సూటిగా చురుగ్గా ఉన్న వాక్య శైలిని చూశారు. రంగనాయకమ్మగారి రచనలో వెక్కిరింపుతో వచ్చిన హాస్యం, గోరాశాస్త్రిగారి రచనలో ప్రతిసమాధానాల్లో (రిపార్టీ) వచ్చిన హాస్యం మీరు గమనించే ఉంటారు. నిత్య జీవితంలో అమాయకపు సంభాషణలోంచి వచ్చిన హాస్యం రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 'మోసం'లో చూశారు.

రాసే భాషలో శైలి ప్రధానంగా పదప్రయోగం మీదా, వాక్యప్రయోగం మీదా ఆధారపడి ఉంటుంది. ఈ రెండింటినీ ఒక్కోసారి విడదీయటం కష్టమైనా, అధ్యయన సౌలభ్యం కోసం పాఠాల్లో వేరుచేశాము. కిందటి పాఠంలో పదప్రయోగ మూలకమైన శైలీభేదాలు చూశారు. ఈ పాఠంలో వాక్యాల కూర్పు శైలీభేదాలను ఎట్లా సృష్టించగలదో తెలుసుకుంటారు. తెలుగులో సాధ్యమైనవన్నీ ఈ పాఠంలో చెప్పటానికి వీలులేకపోయినా కొన్ని ముఖ్యమైన పద్ధతులను పరిచయం చేస్తాము. ఒకసారి కొన్ని పద్ధతులను పరిచయం చేసిన తరువాత మిగతా పద్ధతులు మీరే గమనించగలుగుతారు.

### విషయం : వ్యాఖ్య

వాక్యం కొంత విషయాన్ని (information) తెలియపరుస్తుంది. అదే వాక్యంలో ఆ విషయం మీద వ్యాఖ్య జోడిస్తే ఆ వాక్యంలో విషయం - వ్యాఖ్య రెండూ ఉన్నట్టు. ఉదాహరణకు శ్రీశ్రీ గారి ఈ కింది వాక్యం చూడండి :

''మన రాజ్యాంగంలో పౌరహక్కుల్ని ఇంకేదేశమూ ప్రజలకియ్యలేదనడం అతిశయోక్తికాదు''.

''మన రాజ్యాంగంలో పౌరహక్కుల్ని ఇంకేదేశమూ ప్రజలకియ్యలేదు'' - అనే

విషయాన్ని వ్యక్తం చేసే వాక్యభాగం. అతిశయోక్తి కాదు అనేది వ్యాఖ్య. అనడం అనేది హైఫెంటినీ కలిపే మాట.

ఒట్టి విషయ వ్యక్తీకరణతో తృప్తిపడక దానిమీద వ్యాఖ్య కూడా చేర్చటం సంపాదకీయ శైలిలో అవసరం రావచ్చు. ఉదాహరణకు ఆంధ్రపత్రిక 1984 ఫిబ్రవరి 15 నాటి దినపత్రిక సంపాదకీయంలో ఈ వాక్యాలున్నాయి :

అ. ఆయన కార్మిక నాయకులలో కూడ ప్రథముడని ఈ సందర్భంలో జ్ఞాపకం చేసుకోవటం *సముచితంగా ఉంటుంది.*

ఆ. కాంగ్రెసుకు చెందనివారు సయితం త్యాగాలు చేశారని ఈ తరుణంలో మరోసారి *గుర్తుచేసుకోవచ్చు.*

ఇ. ఆయన అనుకున్నట్లు కాకపోయినా కాంగ్రెసు నామరూపంగా మిగిలి నిజానికి నశించిపోయిందంటే *సత్యదూరం కాదు.*

ఈ. రాజకీయవాదులలో ఎక్కువమంది తమ త్యాగాల ద్వారా, ప్రజలకి చేసిన సేవ ద్వారా కాకుండా ధనబలంతో సాధ్యం అయిన ప్రచారం వగయిరాల ద్వారా ఎన్నికలలో గెలువ గలుగుతున్నారంటే *అంగీకరించని వారుండరు.*

పైన ఏటవాలు అచ్చులో కనిపించేది వ్యాఖ్య. ఈ వాక్యాలలో చాలాసార్లు అంటే, అని అనటంలో అనే విధంగా ఒక పదం విషయాన్నీ, వ్యాఖ్యలనూ కలుపుతుంది. అప్పుడు రచయిత విషయాన్ని, తాను వ్యక్తీకరించిన పద్ధతిని సమర్థించుకోవటం కోసం వ్యాఖ్యానిస్తున్నట్లు గుర్తించగలము. అట్లాంటిది లేనప్పుడు, ప్రత్యక్షంగా ఆ వాక్యం చెప్పే విషయం మీద వ్యాఖ్యగా గుర్తించగలము. ఈ రకమైన వ్యాఖ్యలూ, సమర్థింపులూ చాలా తరచుగా ఒక వ్యాసంలో వాడితే రచనలో మొహమాటం పెరుగుతుంది. శైలి మందకొడిగా తయారవుతుంది.

ఉదాహరణకు రాచమల్లు రామచంద్రారెడ్డి గారి శైలి నిర్మొహమాటమైన చురుకైన శైలి. ఒక సంపాదకీయంలో ఆయన వాక్యాలు చూడండి :

'' ఉత్తమ సాహిత్యానికి జన్మస్థానం సమాజ జీవితమైనట్లే దాని గమ్యస్థానం కూడా సమాజ జీవితమే ''.

ఈ వాక్యం చివర '' . . . .. అని నాకనిపిస్తుంది'', ''. . . . .. అనటంలో అతిశయోక్తి లేదు'', ''అనుకోవటం సమంజసమే'' వంటి వ్యాఖ్యాప్రాయమైన సమర్థనలు చేర్చి చూడండి. ఆ శైలిలో ఉన్న చురుకుదనం తగ్గుతుంది. మొహమాటం పెరుగుతుంది.

అయితే ఈ రకపు వాక్యాలను గడుసుదనం నింపి వాడుకున్నారు రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు.

''మానవులంటూ ఉండటంవల్లనే, వారు సంఘజీవులుగా ఉండటం చేతనే, కథలంటూ పుట్టాయని నేననుకొంటున్నాను''. ఈ పై వాక్యంలో వ్యాఖ్య తను సత్యమని నమ్మినదాన్ని చెప్పుతూ, 'నేననుకొంటున్నాను' అని చేర్చడం కేవలం గడుసుదనం కోసమే. అంటే ఆ వ్యాఖ్య చేర్చకపోయినా దాన్ని (అంటే truth value ని ) శంకించే వీలులేదు. అయినా ఆ వ్యాఖ్య చేర్చటం వల్ల ఇది కేవలం నా అభిప్రాయం మాత్రమే సుమా అని చెపుతున్నట్లు పైకి కనిపిస్తుంది. కాని ఇది శంకించటానికి వీలులేని చారిత్రక సత్యం అని అసలు అభిప్రాయం.

## ప్రశ్నల కూర్పు

ప్రశ్నల ప్రధానోద్దేశం అవతలి వ్యక్తి నుంచి సమాధానాలు రాబట్టడం. అయితే ఒక్కోసారి నిశ్చయంగా చెప్పే అభిప్రాయాన్నే ప్రశ్న రూపంలో చెబుతాము. అప్పుడా ప్రశ్నకు సమాధానాన్ని ఆశించము. ఈ రకమైన కూర్పు ద్వారా రచయిత ఉద్వేగాన్ని వ్యక్తం చేయవచ్చు.

రాచకొండ విశ్వనాథశాస్త్రి గారు ఈ కింది వచనభాగంలో ప్రశ్నవాక్యాలను పేర్చిన పద్ధతిని గమనించండి :

'' . . . .. . దిగేక ఆయన ఆ రావణుణ్ణి అడిగిందేమిటి ? రావణాసురుణ్ణి మానం ప్రాణం ఇచ్చేయమన్నాడా ? అతగాడి రాజ్యం అడిగాడా ? అతగాడి అంతఃపురంలోని ఆడవార్ని ఇమ్మని అడిగాడా ? దేశంలోని ధాన్యరాసులన్నీ ఇచ్చి తీరాలన్నాడా ? బొక్కసంలోని బంగారం అంతా ఇచ్చేస్తే కానీ వీల్లేదన్నాడా ?''

ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానం 'లేదు' అనేది పాఠకులకు తెలిసిందే. అయితే పాఠకుల్లో ప్రత్యేకమైన ముద్ర కలిగించటం కోసం రచయితలు ఈ రకం వాక్యాల పరంపర వాడతారు. ఇట్లాగే నిఘంటువుల పాఠం చివర ఇచ్చిన అభ్యాసంలో కృష్ణశాస్త్రిగారు ఈ రకం ప్రశ్నావాక్యాలను వాడి ఆవేశాన్ని వ్యక్తం చేసిన తీరును ప్రదర్శించాం. 10వ ఖండిక, 16వ పాఠం కిచ్చిన అభ్యాసంలో నార్ల వెంకటేశ్వరరావుగారి సంపాదకీయంలో ఈ వాక్యాలున్నాయి :

'వైజ్ఞానిక శాస్త్రాలు ఎంతగా పురోగమిస్తేనేమి ? ఎన్నెన్ని సృష్టి రహస్యాలను సభ్య

మానవుడు ఛేదిస్తేనేమి ? చంద్రమండల యాత్రకై సన్నాహాలు సాగుతుంటే మాత్రమేమి? అంగారక గ్రహంలో అడుగు పెట్టడం సుసాధ్యమైన సమయం ఆసన్నమయితే మాత్రమేమి? పాత పంచాంగాలనే ప్రామాణిక శాస్త్రాలుగా పరిగణించే వారున్నారు ! . . . .''

ఈ రకంగా ప్రశ్నార్థక వాక్యాలు వరుసగా గుప్పించటానికీ ఉద్వేగానికీ సంబంధం గుర్తించగలం. రచయితలు చాలా తరచుగా వాడుకునే పద్ధతి ఇది. అయితే వీటిని వాడుకోవటంలో సంయమనం లేకపోతే ఒక రకమైన విసుగు పుడుతుంది.

## ఒకే రకపు వాక్య, వాక్యాంశాల పేర్పు

రచయిత ఆవేశాన్ని వ్యక్తీకరిస్తూ రచనకు ఉద్వేగాన్ని చేకూర్చే పద్ధతి, ఒకే రకపు వాక్యాంశాల్ని కాని, క్రమంగా వాడటం, ఈ వాక్యాల మధ్య సాధారణంగా తూగు (balance) ఉంటుంది. ఉదాహరణకు చలంగారి వాక్యాల పేర్పును చూడండి :

''వీళ్ళందరి అధ్యక్షుడూ మీ దేవుడు, మీ డబ్బుకి దాసుడు, మీ నంగి పూజలకీ, స్వార్థ ప్రార్థనలకీ వశ్యుడు. దొంగభక్త పరాధీనుడు''.

అట్లాగే అదే ఖండికలో ఇంకోచోట చూడండి.

'' ఇన్ని బాంబులు కురుస్తున్నా, ఇన్ని మరఫిరంగులు మోగుతున్నా, ఇన్ని చెరసాలలు నిండుతున్నా, ఇంకా విశదం కాలేదా మీకు - పాత పద్ధతులు విశ్వాసాలు, ధర్మాలు ఓ మూల నుంచి కూలిపోతున్నాయని, ఇంక లాభంలేదని , మీ ఆటలు ఇక సాగవని ?''

## పదాలు, పదబంధాలు గుప్పించడం

పైన చూపించిన దానితో సమానమయినదే ఇది. అయితే ఈ పద్ధతిలో పదాలు, పదబంధాలు అర్థ సాన్నిహిత్యం ఉన్నటువంటివి ఎక్కువ వాడటం వల్ల రచనకు వేగం వస్తుంది. పదబంధాలకు సాధారణంగా వ్యాకరణ సామ్యం ఉంటుంది. ఈ రకపు పద్ధతి చలంగారి రచనలో సర్వసాధారణం. ఆయనకు ఈ పద్ధతి ఇష్టమైనదిగా కనిపిస్తున్నది. ఈ కింద ఇచ్చే ఉదాహరణం వల్ల ఈ విషయం స్పష్టంగా గమనించగలం. ఈ ఉదాహరణలన్నీ శ్రీశ్రీ గారి మహాప్రస్థానానికి చలంగారు రాసిన యోగ్యతాపత్రం నుంచి తీసుకున్నవే దీన్ని బట్టి చలంగారికి ఈ రకపు శైలి ఎంత ఇష్టమో తెలుస్తుంది.

అ. ''సులభంగా, సూటిగా చెప్పేసి ఇంత ధ్యానానికీ, మౌనానికీ, కార్యానికీ విజయాలకీ వ్యవధి ఇస్తే చాలదా ? అని చలం కోర్కె''

ఆ. '' ఆ పని స్త్రీలూ చెయ్యరు. దేశనాయకులూ చెయ్యరు, కవులూ చెయ్యరు ఎంకీ, శ్రీశ్రీ తప్ప''

ఇ. ''అబద్ధాలతో స్తోత్రాలతో, వంచనలతో, అనుకూల దుష్ట ప్రచారంతో, ఆత్మశ్లాఘనలతో దేశం మీదపడి బతుకుతున్న ఈ parasite కవివరేణ్యులు శ్రీశ్రీని విమర్శించడానికి సాహసిస్తున్నారు''

ఈ. ''తెలుగు కవిత్వాన్ని ఖండించి, దీవించి, ఊగించి, శాసించి రక్షించే అపూర్వశక్తి మీ చేతిలో పుస్తకం''

ఉ. ''పాతపదాలూ, డిక్షన్, వర్ణనలూ, అలంకారాలు, ఛందస్సు, ఉపమానాలు, పద్ధతులు, ఆచారాలు, కవిత్వంలోనూ, జీవితంలోనూ, ఇంక మళ్ళీ లేవకుండా వాటి నడ్డి విరక్కొట్టాడు శ్రీశ్రీ''.

పై వాక్యాల్లో కీ, తో, అనే ప్రత్యయంతో వచ్చే పదబంధాల ఆధిక్యాన్ని, వాటి మధ్య నుండే అర్థ (భావ) సామ్యాన్ని గుర్తించే ఉంటారు. అట్లాగే 'ఇ' తో అంతమయ్యే 'ఖండించి, దీవించి, ఊగించి, శాసించి' అనే క్రియల మధ్య ఉన్న ధ్వని, అర్థ, రూప సామ్యాలు గుర్తించదగినవి. వీటివల్ల రచనకు సమకూరిన వేగం స్పష్టంగా గుర్తించగలం.

ఈ రకంగా పదాలు, పదబంధాలు ఒక క్రమంలో గుప్పించటం చలంగారి శైలిలో ఎక్కువ కనిపిస్తుంది.

### రచయిత తానుగా కాక ఇంకొకరుగా చెప్పటం

తెలుగు రచయితల్లో ఈ ధోరణి చలంగారిలోనే ఎక్కువగా కనిపిస్తుంది. ఉదాహరణకి పై యోగ్యతా పత్రంలోనే ఇట్లా రాశారు :

''తన కవిత్వానికి ముందుమాట వ్రాయమని శ్రీశ్రీ అడిగితే, కవిత్వాన్ని తూచే రాళ్ళు తన దగ్గర లేవన్నాడు చలం. తూచవద్దు. అనుభవించి పలవరించమన్నాడు శ్రీశ్రీ.

''చలం చూశాడు. మాట్లాడాడు. కాని శ్రీశ్రీని ఎరగడు''.

ఈ రకపు వాక్యాలు 'యోగ్యతాపత్రం'లో ఇంకా ఉన్నాయి.

ఒక రచయిత తానే రాసేటప్పుడు 'నేను', 'నా' అని ఉత్తమ పురుష వాడటం సాధారణం. అసాధారణత కోసం రచయితలు ప్రథమ పురుష వాడవచ్చు.

మహాభారతావతారికలో నన్నయ్య గారు 'తనకిష్టుడు' అని నారాయణభట్టు గురించి చెప్పారు. ''నన్నయ్య భట్టు దక్షతన్'' అని ఎవరో చెపుతున్నట్టుగా రాశారు. అయితే

ఈ రకపు అలవాటు ఇటీవల ఇంగ్లీషు నుంచే ఎక్కువగా తెలుగు వచనానికి పాకినట్టుంది. విషయ ప్రాధాన్య వ్యక్తీకరణ (objectivity) కోసం ఉత్తమ పురుష బదులు ప్రథమ పురుష వాడటం ఇంగ్లీషులో ఉంది. అదే నేటి తెలుగులోకి పాకినట్లు కనిపిస్తుంది.

విజ్ఞాన సంబంధమైన, శాస్త్రసంబంధమైన పరిశోధక వ్యాసాల్లో ఈ సంప్రదాయం ఇంగ్లీషులో ఉంది. తెలుగులోకి ఈ సంప్రదాయం ఇంగ్లీషునుంచే వచ్చి ఉండాలి. పరిశోధక వ్యాసం కాకుండా ఆవేశంతో, ఉద్వేగంతో రాసినప్పుడు కూడా ఈ పద్ధతిని వాడటం ఇక్కడ విశేషం. ఇట్లా ఉద్వేగవంత (emotional) రచనల్లో రచయిత 'నేను' అని వాడకుండా ప్రథమ పురుష (Ist person) వాడటం చాలా అరుదు. చలంగారు కాక ఇతరులెవరూ ప్రయోగించినట్టు లేదు.

## కుండలీకరణ పద్ధతి

ఒక విషయాన్ని చెపుతూ దానితో అంత సన్నిహిత సంబంధంలేని విషయాన్ని చెప్పాల్సివచ్చినపుడు ప్రధాన విషయంతో సంబంధంలేని విషయాన్ని కుండలీకరణాల్లో ఉంచటం ఇటీవల సంప్రదాయం. కుండలీకరణాలు (brackets) మాట్లాడే భాషలో ఉండవు. అంటే కుండలీకరణ పద్ధతి పూర్తిగా లిఖిత భాషాపద్ధతిగా గ్రహించాలి.

కుండలీకరణ పద్ధతి రెండు ప్రధాన ప్రయోజనాలకు ఉపయోగపడుతున్నది. ఒకటి చెప్పిన విషయాన్ని ఇంకా వివరించటానికి, రెండు : ప్రధాన విషయానికి ప్రత్యక్ష సంబంధంలేదని చెప్పటానికి.

చలంగారి ఈ వాక్యం చూడండి :

'' ఇది మహాప్రస్థానం సంగతి కాదు. ఇదంతా చలం గొడవ. ఇష్టం లేనివాళ్ళు యీ పేజీలు తిప్పేసి (దీంట్లో మీ సెక్సుని ఉద్రేకించే సంగతులు ఏమీలేవు) శ్రీ శ్రీ అర్ణవంలో పడండి''.

చలంగారు ఒక సమాజం అంగీకరించని కాలంలో స్త్రీ పురుష సంబంధాల్ని సమర్థిస్తూ కథలూ, నవలలూ రచించారు. ఆ కాలపు (సుమారు 1924-1950) మధ్యతరగతి విలువలను భంగపరిచేవిగా ఆ రచనలుండేవి. ఆ విషయం ఈ కుండలీకరణంలో ఉంచిన వాక్యంలో సూచనప్రాయంగా ప్రస్తావించబడింది. ఆ వాక్యం లేక పోయినా చెప్పదల్చుకున్న అసలు విషయాన్ని గ్రహించటానికి ఆటంకం లేదు. అయితే దానితో ఈ విషయం ఇంకాస్త పెరుగుతుంది.

రాచమల్లు రామచంద్రారెడ్డిగారు ఈ వాక్యాల్లో కుండలీకరణాలు వివరణకోసం వాడారు.

''ఠాగూర్ భగవంతుణ్ణి సౌందర్యమూర్తి (సుందరమయిన మూర్తి కాదు - సౌందర్యమే మూర్తి అయిన వాడు) గా భావించుకొని ఆ భగవంతుణ్నే సౌందర్య వాదంలోకి లాక్కొచ్చినాడు''.

''భావ కవిత్వమంటే ప్రేమ కవిత్వమనే పరిమితమయిన అర్థంలోకాక, లలితమైన కవిత్వం అనే విస్తృతార్థంలో తిలక్‌కు అన్వయించుకోవలసి వుంటుంది. (అనగా ఇంగ్లీషులోని lyrical Poetry కి పర్యాయపదంగా)''.

ఈ పద్ధతి కవిత్వంలోకి కూడా ఎక్కింది ఇంగ్లీషులో E.E. Commings అనే ఆయన ఈ పద్ధతి బాగా వాడుకున్నాడు. శ్రీశ్రీ కవిత్వంలో ఈ కుండలీకరణ పద్ధతి తరచుగా కనిపిస్తుంది. ఇ. ఇ. కమింగ్స్ రాసిన పద్యానికి శ్రీశ్రీ చేసిన అనువాద భాగాన్ని చూడండి

| | | |
|---|---|---|
| ప్లేటో చెప్పాడు | చెప్పేడు వాడికి | ట్సే తప్పకుండా |
| వాడికి (విన్నాడు | (నమ్మేడు కాదు | చెప్పేడు జనరల్ |
| కాదు నమ్మేడు | వాడు విన్నాడు | (చిత్త శ్రీమతీ) |
| కాడు) జీసస్ | కాడు) లావ్ | షెర్మనీ చెప్పేడు |

## డాష్ పద్ధతి

ఇది కూడా కుండలీకరణ పద్ధతి లాంటిది. చెప్పదల్చుకున్న విషయంలో భాగం చెప్పిన వాక్యంలో మర్చిపోయినట్టుగా చివర చేర్చటానికి ఈ డాష్ పద్ధతి వినియోగిస్తారు. రాచమల్లు రామచంద్రారెడ్డి గారి ఈ వాక్యం చూడండి :

''కొంతవరకు రొమాంటిక్ కవులందరినీ అనుభూతివాదులే అనవచ్చు - వాళ్ళలో వివిధ దశలు లేక పోయినా''.

అట్లాగే రంగనాయకమ్మగారి వాక్యాలు చూడండి :

''చాలాసార్లు దీన్ని నిజంగానే నమ్ముతాం కూడా - సైన్సు విజ్ఞానం తగినంతగా లేక''

''సినిమా అన్నదాంట్లో (అది ఏరకం సినిమా అయినా) - కథ అనేది ఎప్పుడూ హీరోని గొప్పచేసే పద్ధతిలోనే నడుస్తూ వుంటుంది - అతను ముప్పై ఏళ్ల వయసులో మెట్రిక్ పాసయినా సరే.''

డాష్ తరువాత ఇచ్చిన వాక్యాంశం అసలు వాక్యంలోనే ఇమడ్చవచ్చు. కాని ఆ అంశానికి ప్రాధాన్యం ఇయ్యటం కోసం ఇట్లా ఇవతలికి లాగి వేరుచేసి చూపిస్తాం.

పెద్ద పెద్ద వాక్యాల వాడకం వల్ల ఒక శైలి, చిన్న చిన్న వాక్యాల వాడకం వల్ల ఇంకో శైలి, సంబోధనల వల్ల, సంభాషణల వల్ల మరోరకం శైలి ఏర్పడతాయి. కొన్ని రకాల వాక్యాలు ఎక్కువగా వాడటం వల్ల కూడా శైలీభేదాలు ఏర్పడుతాయి. ఇట్లా వాక్యాల కూర్పు వల్ల రకరకాల శైలీ భేదాలను కల్పించుకోవచ్చు. భాషా శక్తిని గ్రహించి ప్రయోగిస్తే ఎన్నో భేదాలు సాధించుకోవచ్చు. అవి రచనకు వైవిధ్యాన్ని (variety) సమకూరుస్తాయి. చదివే వారిలో ఆసక్తిని పెంచుతాయి. మంచి వచనం రాయాలనుకునేవారు ఈ శైలీ భేదాలను,ప్రయోజనాలనూ గుర్తించుకోవాలి.

ఆంధ్రప్రదేశ్ (అంబేద్కర్) సార్వత్రిక విశ్వవిద్యాలయ
మౌలికాంశాల పాఠ్యగ్రంథంలో 17వ పాఠం 1984.

# చలంగారి భాషా ప్రయోగం - ఒక చిరు పరిశీలన

ఒక రచయిత భాషను గురించి పరిశీలన చేస్తున్నామంటే ఆ రచయిత భాషలో ప్రత్యేకత ఉండాలి. చలం భాషలో ఏదో ప్రత్యేకత ఉందని చలం గారి రచనలు చదివిన వారంతా ఒప్పుకున్న విషయం. పదే పదే చెప్పుతున్న విషయం కూడా. అయితే ఆ ప్రత్యేకత ఏమిటి అనే విషయంలో మన ఆలోచనలు ఇంకా స్పష్టపడలేదు. బహుశా అందుకు అవసరమైన పనిముట్లు అంతగా చేతికి అందుబాటులోకి రాకపోవటం కారణం కావచ్చు. ఇప్పటికైనా అంత పదునైన పనిముట్లు సిద్ధంగా ఉన్నాయని చెప్పలేం.

ఒక రచయిత భాషను గురించి సమగ్రంగా పోనీ ఒకపాటి సమగ్రంగా అయినా - పని కొచ్చే విషయాలు చెప్పాలంటే ఆ రచయిత రచనలన్నీ పరిశీలించాలి. అందులోనూ ఆ రచయిత వివిధ ప్రక్రియల్లో రాసినపుడు ఇంకా అవసరం. ఎందుకంటే ప్రక్రియలను బట్టి భాష ఉంటుంది. చలంగారి వ్యాసాల్లో భాషకూ, నాటకాల్లో భాషకూ, కథలు, నవలల్లో భాషకు భేదాలు కనిపిస్తాయి. చలంగారు ఒకటి అరా పుస్తకాలు రాసి ఊరుకున్నవాడు కాదు. జీవితమంతా రచనే ప్రధాన వ్యాసంగంగా (తను చేసే ఉద్యోగం కన్నా) గడిపిన రచయిత, అందులోనూ ఒక లక్ష్యంతో రాసిన రచయిత, తక్కువ రాసి ఊరుకోడు. నిరంతరాన్వేషణలో ఉండే రచయిత ఎప్పుడూ కొత్త ఆలోచనలు చేస్తాడు. కొత్త ఆలోచనలు అధికంగా చేసే రచయిత, రచనలు కూడా అధికంగానే చేస్తాడు. అంటే చలంగారి రచనల్లో -భాషా పరిశీలన చెయ్యటం అంటే బహుకాలం అధిక ప్రయాసను భరించి చెయ్యాలి. ఒక సిద్ధాంతవ్యాసపరిధిలో చెయ్యాల్సిన అవసరం ఉంది. అందువల్ల నా ఈ ప్రయత్నం కొవ్వొత్తి వెలిగించటం కూడా కాదు. అగ్గిపుల్ల గియ్యటం లాంటిదే.

చలం గారికి తన భాషా శైలిని గురించి మాట్లాడటం ఇష్టం ఉండదు. అందుకు కారణం తన భాష మీద, తన శైలి మీద ఇష్టం లేక కాదు. స్పృహ లేకా కాదు. ఈ రకమైన పరిశీలనలు తన ఆలోచనల నుంచి భావాల నుంచి పాఠకులను దారి తప్పిస్తాయని ఆయన భయం.

అట్లాంటి భయానికి ఇప్పుడు ఆస్కారం లేదు. దేనికి దానికి విడివిడిగా చూడగల పరిణత పాఠకులీనాడు అధిక సంఖ్యలో ఉన్నారు.

చలంగారు తెలుగులో రచన ప్రారంభించే నాటికి ఆధునికాంధ్ర వచన రచనను ప్రభావితం చెయ్యగలిగిన నమూనాలు లేవు. గిడుగు, గురజాడలు ప్రాచీన లక్షణ శృంఖలాల నుంచి భాషను విముక్తం చేశారు. గాని, వారి వచనం ఆధునిక రచనకు ఉత్తమమైన నమూనాలుగా తరువాత వారు భావించారని చెప్పటానికి వీల్లేదు. ఆధునిక వచన రచనను అత్యంత ప్రభావితం చేసిన వచనం చలానిది. ఈనాటి చాలా వచన రచనల్లో చలంగారి వచన లక్షణాలుగా పట్టుకోగలిగినవి కొన్ని కనిపిస్తాయి. కొన్ని కొన్ని పదరూపాలు. చలంగారి వల్ల ప్రమాణమయి తరువాత వారి రచనల్లో ఇప్పటి తరచుగా కనిపిస్తాయి.

భాషా ప్రయోగంలో కొట్టొచినట్టు కనిపించేవి ఆయన స్పెల్లింగులు. అంటే అక్షరక్రమం. ఉన్న నియమాలను బద్దలు కొట్టడానికి స్పెల్లింగుల ప్రభావం చాలా ఉంది. ఒక పదరూపానికి ఒకే అక్షర క్రమం ఉండటం రాసే భాషల్లో చాలా వాటిల్లో కనిపిస్తుంది. ఇంగ్లీషు లాంటి అతి వ్యాప్త లిఖిత భాషల్లో స్పెల్లింగుకు అత్యంత ప్రాధాన్యం ఉంది. ముఖ్యంగా రకరకాల పదప్రయోగ కోశాలకు ఈ అక్షరక్రమైకత అవసరం కూడా. అయితే చలం గారు వ్యవస్థాగత నియమ నిబంధనలకు వ్యతిరేకం. ఆయన భావాలను బట్టి ఆయనను తాత్త్విక, రాజకీయ అనార్కిస్టుగా కొందరు అభివర్ణిస్తారు. అదే నిజమైతే ఆ లక్షణమే ఆయన స్పెల్లింగులలోనూ కనిపిస్తుంది. ఉచ్చారణకు సన్నిహితంగా ఉండే విధంగా రాయాలని ప్రయత్నించారు. అయితే అది ఒక విధం కాదు. పలు విధాలు.

ఈ స్పెల్లింగులలో మళ్ళీ తెలుగు, సంస్కృతం , ఇంగ్లీషు మాటలను వేరువేరుగా పరిశీలించాలి. అయితే ఇంగ్లీషు మాటలను ఈ పరిశీలనలో తీసుకోవటం లేదు. చలంగారి ఇంగ్లీషు మనందరిలాగే పుస్తకాలనుంచి గ్రహించింది. ఆయన ఇంగ్లీషును రోమను లిపిలో రాసినప్పుడు స్పెల్లింగులను మార్చలేదు. తెలుగులో రాసినప్పుడు కొన్ని కొన్ని ఇంగ్లీషు వారి ఉచ్చారణకు దూరంగా ఉంటాయి. ([illegible] ని - నేవ్ అని రాస్తారు.)

తెలుగులో ఇ. ఈ,ఎ,ఏ ల ముందు యకారం, ఉ,ఊ,ఒ,ఓల ముందు వకారం ఉచ్చారణలో వికల్పంగా వినపడతాయి. ఉచ్చారణ విధేయంగా రాయాలనే వారు రాయాల్సిన అన్ని చోట్లా రాస్తారు. ఉదాహరణకు రాచమల్లు రామచంద్రారెడ్డి గారు అట్లా రాస్తారు. అయితే తెలుగులో చాలా మంది అట్లా రాయటం లేదు. చలంగారు ఈ అనియత స్థితిని ప్రారంభించిన వారు కాకపోవచ్చు. కాని నిస్సందేహంగా, నిస్సంకోచంగా వ్యాప్తి చేసినవారు. చలంగారి స్పెల్లింగుల గురించి రెండు మూడు విషయాలు గమనించగలం.

1. ఇ, ఈ, ఎ, ఏ ల ముంద యకారం రాసిన రూపాలతో పాటు రాయని

రూపాలు కూడా దాదాపు సమానంగానే ఉన్నాయి.

2. ఉ, ఊ, ఒ, ఓ ల ముందు వకారం చాలా ఎక్కువగా రాశారు. అందులోనూ ఉ, ఊ ల ముందు దాదాపు నిత్యంగా రాశారు.
3. పదాది ఆగమాలు వాక్యాది కన్నా, వాక్య మధ్యంలో ఎక్కువ.
4. వకారాది పదాలకు స్పెల్లింగులలో విపరీతమైన భిన్నత్వం ఉంది. వచ్చారు, వొచ్చారు, ఒచ్చారు.

చలంగారు సంస్కృతం స్పెల్లింగుల్లో ఎక్కువ స్వాతంత్ర్యం తీసుకోలేదు. నియమంగా, ఒక పద్ధతిగా చెప్పదగిన సంస్కరణ ఆయనేమీ చెయ్యలేదు. అది కొన్ని మాటలకే పరిమితం. గ్యాపకం అనీ రాశారు. జ్ఞానం అనీ రాశారు. వాఙ్మయం శబ్దాన్ని రెండు అనునాసికాల మధ్య గకారాగమం చేసి సున్నతో రాస్తారు. పరిస్థితి అనే మాటలో మహాప్రాణాన్ని తీసేస్తారు. శృంగారం, మృగం అనే మాటల్లో ఋత్వం రాశారు. శ,స,ల భేదాన్ని పాటించారు. అశాశ్వతం , శుష్కమైన, కృతజ్ఞత, ప్రజ్ఞ, ఆధ్యాత్మికానందం, అంతఃకరణం అనే మాటల్లో ఏ మార్పు ఉండదు. వర్ణించు, వర్ణన అనే మాటల్లో సంయుక్తవర్ణంలో ద్వితీయ వర్ణాన్ని అమూర్ధన్యంగా రాశారు.

ఒక విశేషం ఏమిటంటే ఈశ్వరుడు, అనే మాటలో య కారాగామం లేకుండానే ఎప్పుడూ రాశారు. అట్లాగే వ్రాయు అనే క్రియారూపాలను వకార రేఫ సహితంగానే రాశారు.

సంస్కృత సంధులను ఎప్పుడూ పట్టించుకున్నట్టు లేదు. మనోస్థితి, మనో తృప్తి, తేజోతల్పం, సద్యో ఫలితం వంటి సంస్కృత వ్యాకరణ సమ్మతం కాని సంధులను విచ్చలవిడిగా వాడారు.

ఈ పై స్పెల్లింగులు పద్ధతులు ఈనాటి రచయితల్లో మరీ ముఖ్యంగా చలంగారి అభిమానుల్లో విరివిగా కనిపిస్తున్నాయని అందరికీ తెలిసిన విషయాలే. ఆత్మ పరిశీలన చేసుకుంటే వారికే కనపడతాయి. కనక వేరుగా వారి రచనలను ఎత్తి చూపించటం లేదు. చలంగారు కొన్ని పద రూపాలను ఇష్టంగా వాడతారు. అందుకు కారణం అవి ఆయన మాట్లాడే భాషలో నియతంగా,నిత్యంగా వస్తాయేమో తెలుసుకోటానికి అధారం లేదు. తెలిసిన వాళ్లు చెప్పాలి. ఆయన రచనలను అధికంగా చదివి అభిమానించిన ఇతర చయితల కవి నమూనాలు అయ్యాయి.

తెలుగులో ఒకే కర్త భిన్న వ్యాపారాలను నిర్వహిస్తే చివరి క్రియ తప్ప మిగతావి అసమాపక క్రియలుగా ఉంటాయి. వాటిలో వచ్చి, చేసి, చూసి వంటి ఒక రకం. ఇవి కర్త

నిర్వహించిన వ్యాపారాలను (పనులను) కాలానుపూర్వంగా (సీక్వెన్స్‌ను) బోధిస్తాయి. వస్తూ, చేస్తూ, చూస్తూ, అనేవి ఇంకో రకం. ఇవి సమసామయికతను (సైమల్‌టేనిటి ని) బోధిస్తాయి. ఈ రెండూ రూపాలను చలంగారు ఎప్పుడూ వస్తో, చేస్తో, చూస్తో అని రాస్తారు. ఆయన రచనల్లో *అనుకుంటో, తిట్టుకుంటో తడుస్తో గెంతుతో, పరుగెత్తుతో* నాకు చాలా సార్లు కనిపించాయి.

(తెలుగు వర్తమాన బోధకంగా ఆయనెప్పుడూ వస్తోంది. చేస్తోంది వంటి సమాపక క్రియలనే వాడతారు. ఇటీవల కాలంలో వారి అనుయాయి ఒకరు అందరూ అదే రాయాలని అనుశాసించారు కూడా)

అట్లాగే తెలుగులో పైన పేర్కొన్న క్రియలకు వ్యతిరేకార్థంలో వాడే అసమాపకక్రియ ఒకటి ఉంది. ధాతువుకు (కుండా అనే ప్రత్యయం చేరిస్తే ఏర్పడుతుందీ రూపం. అప్పుడు ధాతువు అదంత రూపంలో ఉంటుంది. రూపాలు *'రాకుండా, చెయ్యకుండా, చూడకుండా'* అనే విధంగా ఉంటాయి. చలంగారు ఎప్పుడూ వీటిని *రాకండా, చెయ్యకండా, చూడకండా* అని రాస్తారు. ఈ 'కండాంత' రూపాలు చలంగారిని అనుసరించే వారి రచనలలోనూ కనిపిస్తాయి. *లేకండా, భోజనం చెయ్యకండా, అడక్కండా* వంటి క్రియా పదాలు చలంగారి రచనల్లో నిత్యంగా కనపడ్తాయి.

చలంగారు చాలా ఇష్టంగా వాడే ఇంకో పదం 'గావును'. కాబోలు అనే అర్థంలో వాడతారు.

తెలుగులో *పేడ, మేడ* అనే మాటల్లో రెండో అక్షరంలో అకారం వల్ల పూర్వాచ్చు వివృతం అవుతుంది. ఇంగ్లీషులో క్యాట్, ర్యాట్ , మ్యాట్, అనేమాటల ఉచ్చారణలో ఉండేలాంటి ధ్వని ఇది. దీనికి తెలుగు లిపిలో రాత గుర్తులేదు. పూర్వకాలం నుంచి దీన్ని రకరకాలుగా సూచిస్తున్నారు.

ముందటి హల్లు చ, శ వంటి తాలవ్యమయితే అచ్చును ఆ గా సూచించి 'వచ్చాడు, చేశాడు' అని రాస్తున్నాం. అక్కడ ఉచ్చారణలో చిక్కుండదు. అట్లా లేనప్పుడు – ఆగాడు, అడిగాడు వంటి చోట్ల అది భూత కాల బోధక క్రియాపదం కాబట్టి దాన్ని వివృతాచ్చుగా ఉచ్చరించాలన్న అలిఖిత మనోజ్ఞాపిక ఆధారంగా చదివేటప్పుడు సరిగ్గా ఉచ్చరిస్తున్నారు. ఈ పద్ధతిని చలంగారు ఇతర పరిసరాలకు వ్యాపింపచేశారు. ఆయన చాపలకూర, కావడం చాత, యామ్మన్నారంటే – అనే విధంగా రాస్తారు. ఉచ్చారణ విధేయంగా రాయాలని ఇంత పట్టుదల ఉన్న చలం గారు 'వ్రాసి' అనే క్రియను వ్రాసి అనే చాలా సార్లు రాస్తారుగాని

వకార లోపాన్ని గుర్తించలేరు. అంటే ఆయన సంప్రదాయ విచ్ఛేదం అన్ని చోట్లకీ ఇంకా వ్యాపించలేదన్నమాట.

చలంగారు తెలుగు భాషలో కొత్త ఫ్యాషన్‌లు వ్యాపింపజేసినవారు. ఆయన రచనలు తెలుగు రచయితలకు ఏ నమూనాలు లేని రోజుల్లో వ్యావహారిక భాషా రచనలకు నమూనాలుగా ఉపయోగపడ్డాయి. అంతగా హేతుబద్ధత లేకపోయినా ఆయన వాడిన పదరూపాలు అభిమానులకు భాషా ఫ్యాషన్‌లు (లింగ్విస్‌టిక్ ఫ్యాషన్స్) అయ్యాయి.

ఇప్పటికన్నా చలంగారు రచనలు చేసే రోజుల్లో భాషా సంకోచాలు (లింగ్విస్టిక్ ఇన్‌హిబిషన్స్) ఎక్కువ ఉండేవి. మర్యాదస్తులు చదవగూడనివి. రాయగూడనివి అంటూ కొన్ని ఉండేవి. ఇట్లాంటి వాటిని బద్దలు కొట్టిన మొదటి శక్తిమంతుడైన రచయిత చలంగారే ననుకుంటాను. పద ప్రయోగం, ఈ స్వేచ్ఛ, విచ్చల విడితనం చలంగారిలో బాగా కనిపిస్తుంది. దీన్ని నిస్సంకోచ పద ప్రయోగం ( అన్‌ఇన్‌హిబిటివ్ లెక్సికల్ ఛాయిస్) అంటున్నాను.

''ఆ స్త్రీలు పిల్లలు వొంటరిగా వున్నప్పుడు మాట్లాడుకునే బూతుల్నే వింటే ఈ కథలు వ్రాసేవారు చప్పరిస్తారు''.

''ఒక కాపరంలో ఇద్దరూ వూరికే *పందుల్లాగా కంటున్నారనీ, కుక్కల్లాగా కరుచుకుంటున్నారనీ*....యేమి వ్రాసినా పెళ్ళి అయిందంటే బూతు కాదు.''

''కొంత మంది ఒక్కసంసారాన్నే తీసుకుని *నలుపుతారు, సలుపుతారు*. కాని వాళ్ళు కథలలో చూపేది భార్యాభర్తల అనురాగం. *చొంగలు, వుచ్చులూ, మచ్చలూ*, రాద్ధాంతాలూ, ఎత్తి పొడుపులూ, ద్వేషాలూ, హాస్యాలూనూ, చదివితే పెళ్ళికాని వారెవరూ పెళ్లి చేసుకోరు.'' పై వాక్యాల్లో ప్రత్యేకంగా సూచించిన మాటలు ఈ నిస్సంకోచానికి ఉదాహరణలు.

సాధారణంగా తెలుగు వాళ్లు సంభాషణ (క్యాజువల్ కన్‌వర్‌సేషన్)లో వాడినంత ఇతర భాషా పదజాలం రాతలో వాడరు. ఇంగ్లీషు చదువుకున్నవారు ధారాళంగా ఇంగ్లీషు మాటలను పదబంధాలను వాక్య శకలాలను, అప్పుడప్పుడు వాక్యాలను, వాక్యసముదాయాన్ని తెలుగులో కలిపేస్తారు. వాక్యాల కన్న చిన్నవి ఇతర భాష నుంచి వచ్చి కలిస్తే భాషా మిశ్రమం ( కోడ్ మిక్చర్) అనీ, వాక్య, వాక్యసముదాయం పరభాషనుంచి వచ్చి కలిస్తే భాషా ప్లుతి( కోడ్ స్విచ్చింగ్) అనీ అంటారు. సాధారణంగా చలంగారి భాషలో భాషా మిశ్రమ (కోడ్ మిక్చర్) మే ఎక్కువగా ఉంటుంది. భాషాప్లుతి అసలు లేకపోయిు. మ్యూజింగ్సులో ఇట్లా ఇంగ్లీషు కలగలిపిన శైలి ఎక్కువ కనిపిస్తుంది. మ్యూజింగ్సు అంటేనే

నిర్నిబంధంగా చేసే ఆలోచనలు....

''ఈ ధర్మం, duty అంటారే..... దీనంత అబద్ధపు మాట, దొంగమాట ఘాతుకాలకి వీలైన మాట కనపడదు. Patriotism is the last refuge of scoundrels అన్నాడు గాని Duty is first refuge of the rogues అనాల్సింది.''

మహాప్రస్థానికిచ్చిన యోగ్యతా పత్రంలో నుంచి అందరికీ పరిచయమైన "economy of words and thoughts లేకపోవటం దేశభక్తికన్నా హీనమైన పాపం'' అనేది కూడా భాషా మిశ్రమానికి మరో మంచి ఉదాహరణ. ఇట్లాంటి మిశ్రమాలు చలంగారి రచనల్లో సృజనాత్మక రచనల్లో కన్నా ఇతర రచనలో ఎక్కువున్నట్లు కనిపిస్తున్నది. ఆధునికత నాగరికత వల్ల, వలస పాలన వల్ల ఏర్పడ్డ భాసా సంస్పర్శ(language contact)ఇందుకు కారణం. స్పష్టమైన అద్భుతమైన ఉదాహరణ కన్యాశుల్కంలో గిరీశం పాత్ర. చలంగారు ఉన్న నియమాలను (భాషా నియమాలతో సహా) ఛిద్రం చేసే ఉద్దేశంలో ఉండటం వల్లనూ, ఆనాటి వ్యవహారంలో కూడా విద్యావంతుల్లో ఈ శైలి అలవాటుగా ఉండటం వల్లనూ, చలంగారి ఉద్వేగ భరిత అవిలంబ(emotional and spontaneous) శైలికి ఇది అనుకూలంగా ఉండటం వల్లనూ ఆయన ఈ మిశ్రశైలిని ఎక్కువ ఆదరించినట్లు కనిపిస్తుంది. ఆయన అభిమానులు ఇంగ్లీషు మాటలను వాడకూడదన్న నియమం పెట్టుకోనప్పటికీ, ఈ రకపు శైలి ప్రయోగంలో ఆయన కన్న ఎక్కువ సంయమనం చూపించినట్లు కనిపిస్తుంది. అందుకు కారణంగా స్పష్టంగా తెలీదు. తరవాతి వారికి మాతృభాషాభిమానం ఎక్కువయిందేమో తేలీదు.

చలంగారి వచనం కవితాత్మకంగా ఉంటుందని చాలా మంది గుర్తించారు. కవితాత్మకత అనేది ఎన్నో అంశాల సమాహారం. అందులో ఆవేశాన్ని ఉద్వేగాన్ని వ్యక్తం చేసే పదాలనూ వాక్యాలనూ ఎన్నుకోవటం ఒక పద్ధతి. ఈ పద్ధతిని చలంగారు చాలా అధికంగా ప్రయోగించారు. అర్థభేదం అంత ఎక్కువగా లేని సమాంతర పదాల్ని (synonyms or near synonyms) వరుసగా గుప్పించటం ఒక పద్ధతి. యోగ్యతాపత్రంలో దీని ప్రయోగాన్ని పదేళ్ళకిందట అంబేద్కర్ ( ఆం.ప్ర) సార్వత్రిక విశ్వవిద్యాలయం వారి తెలుగు పాఠాల్లో వివరించాను. అప్పుడు దాన్ని పద గుంఫనశైలి అన్నాను. ఇప్పుడు గమనిస్తే దీనికి పద పరిమితి లేనట్లు తెలుస్తున్నది. వాక్యాల వరకూ విస్తరిస్తున్నది. పదస్థితిని అక్కడ యోగ్యతాపత్రం ఆధారంగా వివరించాను. ఇతరేతరోదాహరణాలను ఇక్కడా ఇస్తాను.

పద గుంఫనం :

''వివాహంలో వున్న కుళ్లు, దుర్నీతి, అసహ్యం, జారత్వం, పశుత్వం, అంతా నీతి శృంగారమే వీరి కళ్ళకి''.

ఇక్కడ ప్రయోగించిన పదాల్లో సామ్యం తేలిగ్గానే గుర్తించవచ్చనుకుంటాను. ఇందులో ఏ ఒక్కదాన్ని వదిలేసినా అసలు భావానికి లోపం లేదు కాని వీటిని గుప్పించటం వల్ల రచయిత ఉద్వేగం ఎక్కువ అర్థం అవుతుంది.

అట్లాగే మరో ఉదాహరణ చూడండి.

'' అసలు ఈ సంసారాల్లోని విరోధాలు, వ్యభిచారాలు, చిరాకులు, హిస్టీరియాలు, అన్నీ శరీరవాంఛ తీరకనే కాదూ!'' ఇక్కడ కూడా సంచితమైన శబ్దాలు ఒక చోట చేరటం వల్ల వచ్చిన ఉద్వేగాన్ని గుర్తు పట్టవచ్చు ఇందులోనూ, ఏ ఒక్క పదాన్ని వదిలేసినా అసలు సమాచారానికి వచ్చిన ఇబ్బంది ఏమీ లేదు.

ఈ పద్ధతినే ఒక ప్రశ్నకు సమాధానంగా చేసిన తీరు వల్ల డైలాగు పద్ధతి, పదగుంఫనం కలిపిన తీరు ఈ కింది ఉదాహరణంలో కనిపిస్తుంది.

''ఆ ఆదర్శం వల్ల వచ్చేదేమిటి?

కామ జ్వరాలూ, మదపిచ్చీ, కుటుంబ వ్యసనాలు తప్ప''.

ఒక్కోసారి ఈ శైలి పదగుంఫన పరిమితిని కూడా దాటుతుందని ఇంతకు పూర్వం ప్రస్తావించాను. ప్రశ్నార్థక వాక్యాలను వరసగా ప్రయోగించటం వల్ల కూడా ఈ ఉద్వేగాన్ని సాధించవచ్చు. దీన్ని కావాలంటే వాక్యగుంఫన శైలి అనవచ్చు. చలంగారి ఈ ఉదాహరణను చూడండి.

''దేని కోసం యీ నిగ్రహం? కామవాంఛల్ని అడ్డగొడితే ఏం లాభం? జీవితమే వాంఛలతో మిళితమై వుందే? వాంఛ లేనిదే జీవిత వికాసమే లేదే? వాంఛలు లేని వాడు ఈశ్వరుడికి ప్రియుడా. వాంఛల వల్లనే కదా ఈశ్వరుడు సృష్టి ప్రారంభించింది.?''

ఈ ప్రశ్నలు శ్రోతల నుంచి సమాధానాలను ఆశించేవి కావు. సమాధానాలు తెలిసే, ఉద్వేగం కోసం. ప్రశ్నలు గుప్పించటం ద్వారా ఈ ఉద్వేగాన్ని సాధించవచ్చు.

'యుద్ధాలతో లోకమంతా వొణికి పోతూ వుంటే పీడించుకు తింటూ వుంటే, ఇంకో దేశం తమని భద్రతనుకాపాడుతో వుంటే, ఏమీ చలనం లేకుండా ఇంకా మాలలు

పేడలు అలికేవాళ్ళూ, అంట్ల మీద నీళ్ళు చల్లేవాళ్లూ, లోటాలు తొలిచి ఎంగిలి పోయిందని కులికే వాళ్లూ, పదిరోజులు మైలపట్టేదని తర్కించేవాళ్లే- ఇదీ ప్రజల నిత్యమత జీవనశోభ!

ఈ పై ఉదాహరణలను బట్టి పదాలు, పదబంధాలు, ఉపవాక్యాలు, రకరకాల వాక్య భేదాలు - ఏ అందుబాటులోకి వస్తే వాటినన్నింటినీ తన భావవేగాన్ని వ్యక్తం చేయటానికి చలంగారు వాడుకుని తెలుగు భాషకున్న సృజన (క్రియేటివ్) శక్తిని నిరూపించారని తెలుస్తుంది.

ఇవి కాక చలంగారు పాత్రల మనోవేగాన్ని సూచించే రకరకాల భాషా ప్రయోగాలు తమ నవలలో చేశారు.

ఒక ఆవేశంలో, మైకంలో పరవశంలో ఉన్న వ్యక్తి సంపూర్ణ వాక్యాలు మాట్లాడలేరు. వాక్య శకలాలలో మాట్లాడతాడు. జీవితాదర్శంలో కొన్ని అద్భుత సన్నివేశాల్లో ఈ రకమైన వాక్య శకలప్రయోగం కనిపిస్తుంది. మెరుపు లాగా కనిపించి మాయమైన లాలసను గురించి ఆవేశంతో లక్ష్మణసింగు ఇట్లా అనుకుంటాడు.

"వాన ఆగింది. చాలా ఆహ్లాదమైన గాలి. ఆమెతో యెండాకాలంలో ఇక్కడికి తను ఒచ్చివుంటే, యీ గాలిలో తన పక్కన ఆమె, ఆ చిన్న చలికి తనకి దగ్గరగా ముడుచుకుందో? ఆమె ఇక్కడే భీమ్లీలో వుందా. ఇవాళ సముద్రంలోంచి తమను బయట పడేసిన ఆమె లాలసేనా? వుందా? ఆ ఊళ్ళోనా? ఆవేనా? తాను తెచ్చుకోగలడా? ఒస్తుందా?"

మదాలస అని తనకు పూర్వం తెలిని ఒకమ్మాయి పోలీసు లాఠీ దెబ్బలు తిన్న తర్వాత తనకి పరిచర్యచేసి కాపాడుతుంది. తరువాత తాను వెళ్లిపోతానంటాడు. ఆ సందర్భంలో వారిద్దరికీ జరిగిన సంభాషణ చూడండి.

'యేం చేస్తావు వెళ్లి'

'పెళ్లి'

'ఎవరికి'

'యేమో'

'ఇంక కనపడవు'

'ఊఁ'

సంభాషణలో అసంబద్ధతను ప్రవేశపెట్టి తద్వారా anxiety ని, tension ప్రకటించే పద్ధతి పై సంభాషణలో కనిపిస్తుంది.

సంభాషణలను రకరకాల భావ వ్యక్తీకరణలకు చలంగారు వాడుకున్నారు. ఆయన చిత్రించిన సంభాషణలు చాలా చిన్నవిగా ఉంటాయి. ఒకటి రెండు మాటలకు మించవు. ఒకసారి లక్ష్మణసింగు లాలస తనతో రానన్న తరువాత తన ఊరికి వెళ్తూ రైల్లో కూర్చున్నాడు. హఠాత్తుగా లాలస వచ్చి తనతో కూర్చుంటుంది. ఉత్కంఠను వ్యక్తం చేసే ఈ సంభాషణను చూడండి.

'ఏమిటిది' అన్నాడు అతను నవ్వుతో

'ఎక్కడికి' అడిగాడు

'మీవూరు'

'ఎందుకు?'

'పెళ్లికదూ!'

'ఎవరిది'

'నీది-నాదీ' అని అతని చేతుల్లోకి వ్రాగింది.

చలంగారి రచనల్లో చాలా చోట్ల కొండల్ని నదుల్నీ, వాగుల్నీ, వంకల్ని, పంటచేలనీ, పండ్ల తోటల్నీ వెన్నెలనీ, నీళ్లలో ప్రతిఫలనాన్నీ చూసి పరవశమైన వర్ణనలు కనిపిస్తాయి. అవన్నీ మనకి కవితాస్ఫూర్తిని కలిగిస్తాయి. కథా కథనంలో కూడా మధ్య మధ్యలో కావ్యధోరణిలోకి వెళ్ళిపోతారు. జీవితాదర్శంలో ఒక చోట-

'పోలీసుస్టేషన్ నిద్రపోతోంది లాలసను పొట్టపెట్టుకొని' అంటారు. అప్రాణి వాచకాలను ప్రాణి వాచకాలుగా వర్ణించటం వల్ల కవితా స్ఫూర్తి వచ్చింది.

లక్ష్మణసింగు జైల్లో ఉన్న లాలసను వదిలి వెళ్లిపోయాడనటానికి మెటానమిక్‌గా ''ఇనప చువ్వల్లోంచి మీద పడే ఎండలో మెరిసే ఆమె వెలుగుని ఒదిలి వెళ్లి పోయాడు'' అని వర్ణిస్తారు చలంగారు జీవితాదర్శంలో.

చలంగారు శిల్పికాదు. ఉద్వేగి, ఆవేశపరుడు. సౌందర్య పిపాసి. స్వేచ్ఛా ప్రియుడు, సంప్రదాయ విచ్ఛేదకుడు. నిరంతరాన్వేషి.

వీటన్నిటికీ తగినట్టు తెలుగు భాష ఆయనకు లొంగింది. అట్టే కష్టం లేకుండానే, రకరకాల వ్యక్తీకరణలకు ఆయనకు భాష లొంగింది. సానుకూలమైంది. అందువల్ల ఆయన వచనం తెలుగు వచన రచయితలకు మార్గదర్శకమైంది.

ఆధునిక సృజనాత్మక భావ వ్యక్తీకరణకు తెలుగు భాషలో ఉన్న నిర్మాణ రహస్యాలను కొల్లగొట్టి, శక్తిమంతంగా వాటిని ఉపయోగించి, తెలుగు భాషాశక్తిని నిరూపించిన వాడు చలం. తెలుగువచనాన్ని ఉన్నతీకరించి తన మార్గంలో సాహిత్య స్థాయిని కల్పించినవాడు.

తెలుగు వచనం ఇంత జీవశక్తి కలిగినదని చలం గారి ద్వారానే మనకు తొలిసారిగా తెలిసిందంటే అతిశయోక్తి కాదు. ఆయన భాషా ప్రయోగ రహస్యాలను గురించి పరిశోధించాల్సింది చాలా ఉంది. ఇది తొలి అడుగు మాత్రమే.

ఓల్గా (సం.) నూరేళ్ల చలం, వ్యాస సంకలనం, హైదరాబాదు:
నూరేళ్ల చలం శత జయంతి కమిటీ, 1994.

# విశ్వనాథ సత్యనారాయణగారి వచన రచనా వ్యూహాలు

తెలుగు సాహిత్యంలో విశ్వనాత సత్యానారాయణగారు విపరీత ప్రతిభావంతుడు. ఆయన రాజకీయ సాంఘిక దృక్పథం మీద నాకు సానుభూతి లేదు కనుక దాన్ని గురించి ఎక్కువ చెప్పను. అయినా ఆయన రచనాశైలిని గురించి సమగ్రంగా అర్థం చేసుకోవడానికి ఆయన సాంఘిక దృక్పథం కూడా కొంత తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. అందువల్ల అత్యంత స్థూలంగా ఆయన సాహిత్యేతర అభిప్రాయాలను గురించి నాలుగు మాటలు చెప్పుకొని ఆయన శైలిలోకి వెళ్ళిపోదాం. ఈ శైలీ విశేషాలను ఆయన రచనా వ్యూహాలు గా పరిగణిస్తున్నాను.

సత్యనారాయణగారు గొప్ప దేశభక్తుడు. తెలుగుభాష అన్నా తెలుగుజాతి చరిత్ర అన్నా ఆఖరికి తెలుగువారి భౌగోళిక పరిసరాలన్నా ఆయన ఆవేశపడతారు. ఇవికాక ప్రాచీన భారత సంస్కృతిపై అధిక ప్రత్యయం ఉన్నవారు. ఒక్కమాటలో చెప్పాలంటే, ప్రాచీన భారత సంస్కృతిలో మరీముఖ్యంగా ఆర్ష సంప్రదాయంలో ఉన్నవన్నీ ఈ కాలానికి తగినవేనని ఆయన ప్రగాఢ విశ్వాసం. ఆ సంస్కృతిలో వర్ణాశ్రమ ధర్మాలున్నాయి. బాల్య వివాహాలున్నాయి. పురుషాధిక్యం ఉంది. స్త్రీలకు విధించిన పాతివ్రత్యాది శృంఖలాలున్నాయి. మనం ఫ్యూడల్ వ్యవస్థగా పిలిచే పూర్వాంధ్ర సమాజంలో ఈ కాలానికి పనికి మాలినవనుకుంటున్న అన్ని ఆచారాలపై ఆయనకు నమ్మకం ఉంది. వేయి పడగలు నవలలో ధర్మారావుకు లాగే '' సహజముగా పూర్వాంధ్ర రాజులన్నను, ప్రస్తుతాంధ్ర దేశపు జమీందారులన్నను గౌరవము మెండు'' ప్రాచీన భారతంలో ఇప్పటి ఇక్కడి మనుష్యులకు తగినట్టి ఆదర్శ సమాజం ఉందని ఆయన అభిప్రాయం. అటువంటి సమాజాన్ని విదేశీయులు ఛిన్నాభిన్నం చేశారని దాన్ని పునరుద్ధరించవలసిన అవసరం ఉందని ఆయన గట్టిగా నమ్ముతారు. ప్రధానంగా ఈ లక్ష్యసాధనకోసమే ఆయన రకరకాల రచనా వ్యూహాల్ని ఎన్నుకున్నారు. ఆయన వచనరచనల్లో కనిపించే ఈ వ్యూహాల్ని గుర్తించడం నా ప్రధాన లక్ష్యం. దానితో పాటు ఆయన భాషా ప్రయోగంలో కనిపించే కొన్ని పద్ధతుల్ని ప్రదర్శించడం నా రెండో లక్ష్యం.

సత్యనారాయణగారు తొలుత భావకవిగా తన సాహిత్య యాత్రను ప్రారంభించారు. అప్పుడాయనకు కొన్ని సంస్కరణ భావాలుండేవి. ముఖ్యంగా తొలిరోజుల్లో ఆయన భాషా

సంస్కరణల్ని ఆదరించారు. అయితే ఆయన ఎక్కువకాలం ఆధునికులుగా నిలవలేక పోయారు. ప్రాచీనతపై అతిశయమైన అనురాగాన్ని పెంచుకున్నారు. ప్రాచీన భాషాతుల్యమైన భాషలో వచన రచన చేశారు. దీన్ని స్థూలంగా గ్రాంధికం అని పిలుస్తాం కాని , సత్యనారాయణగారి వచనానికి గ్రాందికం అన్న పేరు సరిపోదు. ఆయనరాసింది ప్రాచీన భాషకాదు. ప్రాచీనాభాసమైన ఆధునిక వ్యవహారభాష. ఇది మాట్లాడేభాషలో వినిపించే నుడికారానికి అత్యంత సన్నిహితం.

సత్యనారాయణగారి ప్రతిభలో అందర్నీ ఆకట్టుకొనే ఒక అద్భుత లక్షణం, పరిశీలన నైశిత్యం. ఆయన ఒక చిన్న గడ్డిమొక్క నుంచి అత్యంత క్లిష్టమైన మానవుల స్వభావ విశేషాల వరకు చాలా శ్రద్ధగా పరిశీలిస్తారు. జ్ఞాపకాల పొరల్లో భద్రంగా దాచుకొంటారు. అందులో భాగంగానే భాషా ప్రయోగ రీతులను కూడా ఆయన పరిశీలిస్తారు. తెలుగు భాష నుడికారపు సొంపును ఆయన పట్టుకున్నంత ఒడుపుగా పట్టుకున్న తెలుగు రచయితలు అరుదు. మాట్లాడే తీరులో ఉన్న లక్షణాలను ఆయన తన వచన రచనలో వినియోగించుకున్నారు. ముఖ్యంగా సంభాషణ శైలిలోని పదును కథన శైలిలోని తెలుగు జాతీయాల రీతిని ఆయన వచన రచనలో కనిపిస్తుంది. అలవాటయిన పదాల్లో చెప్పాలంటే ఈయన వచనం గ్రాంధికం ముసుగులో వ్యావహారికం. ఇంగ్లీషులో శాస్త్రీయంగా చెబితే His style is modern in essenc, but classical in appearance. మరింత అర్థమయ్యే పద్ధతిలో చెబితే పదనిర్మాణం ప్రాచీనం, పద సంయోజన అర్వాచీనం, భాషా శాస్త్ర పరిభాషలో చెబితే his morphology is classical but his syntax is modern. మౌఖిక లిఖిత భాషా వ్యవహారాల మధ్య భేదాల గురించి గాని ప్రాచీన ఆధునిక రచనా భాషల మధ్య భేదాల గురించిగాని వివరంగా చర్చించడానికి ఇది సమయంకాదు. అందువల్ల అవసరమైన స్థూలాంశాల్ని మాత్రమే ప్రస్తావిస్తాను.

మాట్లాడే భాషలో వాక్యాలు చిన్నవిగా ఉంటాయి. కాగితం మీద రాసినపుడు ముందు వెనుకలు చూసుకుంటే, ఎడిట్ చేసుకుంటూ పోతాం కనుక రాసే భాషలో పెద్ద వాక్యాలు సాధ్యమవుతాయి. ఎక్కడన్నా అర్థం చేసుకోవడానికి అడ్డమొస్తే పూర్వాపరాలు పునరాలోచించుకోవడానికి రాసే భాషలో అవకాశం ఉంటుంది. మాట్లాడే భాషలో అట్లాంటి అవకాశం లేదు కనక ఎక్కడికక్కడికి అర్థ గ్రహణను సులభతరం చేసే చిన్న చిన్న వాక్యాలద్వారా భావ ప్రకటన జరుగుతుంది. మాట్లాడే భాషలో ఉండే లఘు వాక్య

ప్రయోగం, కొన్ని రకాల వాక్య సంయోజనలు, నుడికారం, జాతీయాలు, సామెతలు, అసంపూర్ణ వాక్య ప్రయోగం సత్యానారాయణగారి వచనంలో కనిపిస్తాయి. ఆయన ఆత్మ కథలోనుంచి తీసుకున్న ఈ చిన్న పేరాను పరిశీలించండి.

''ఆ రెండవ వస్తువు కారపు వస్తువు. అందులో కారం ఉండదు. కారమును నంజుకుని తినవలయును. దాని పేరు పునుకులు, పెసరపునుకులు. బందరులో ఉన్న చిన్న కోమటి దుకాణాలములన్నియు వారి ప్రధాన సంపద పునుకుల మీద. వాటి రుచి చెప్పుటకు వీలు లేదు. అందులో పచ్చి మిరపకాయల కారము నంజుకుని తిన్నచో స్వర్గానికి బెత్తెడు ఎడం, కాదు పైన బెత్తెడు ఎడం. ఆ పునుకుల యందుగల రుచి ఎట్టిదనగా - అణాకు పన్నెండు పునుకులు. పెద్ద ఉసిరికాయంత ఉండును. అణా చెల్లగా అణా. మళ్ళీ అణా చెల్లగా అణా. పొద్దుటి పూట ఇవి తినని వాడు అణాకు గతిలేని వాడు. గతి అనగా చేతిలోని డబ్బు అని గాదు. అప్పుకూడా పుట్టించుకోలేని వాడు అని అర్థం''.

ఈ వచన భాగాన్ని కొంచెం సూక్ష్మంగా పరిశీలిద్దాం. ఇందులో ప్రాచీన వ్యాకరణం ప్రకారం క్రియా పదాలున్నాయి, యడాగమాలున్నాయి.

దానిపేరు పునుకులు - పెసర పునుకులు అనడంలో అంతకుముందు అసమగ్రంగా చెప్పిన దాని సమగ్రం చేసే ప్రయత్నం కనిపిస్తుంది. ఇట్లా లోప పూరణ ప్రయత్నాలు మాట్లాడే భాషలో ఉంటాయి. కొన్నివ్యక్తీకరణాలు రాసే భాషలో రాయకూడదని కాదు కానీ మాట్లాడే భాషలో ఎక్కువ సహజంగా కన్పిస్తాయి. ఎక్కువ ఇమిడినట్లు కనిపిస్తాయి. ఈ పై పేరాలో స్వర్గానికి పైన బెత్తెడు వంటిది. అట్లాంటిది. ఏదైనా ఒక వస్తువును రుచి చూసినపుడు బ్రహ్మాండంగా ఉంది అంటాం. ఇట్లాంటివి మాట్లాడేభాషలో కనిపించినంతగా రాసే భాషలో కనపడవు.

రాసేభాషలో ఒక విషయాన్ని గురించి సూటిగా చెపుతాం. మాట్లాడేభాషలో అవతలవాళ్ళు ఏదో సందేహం వెలిబుచ్చినట్టుగా మనమే భావించి దానికి సమాధానం చెప్పినట్లు మాట్లాడతాం. పై పేరా చూడండి.

*ఆ పునుకుల యందుగల రుచి ఎట్టిదనగా* అనేదాన్ని మాట్లాడేభాషలో ఆ పునుకుల్లో రుచి ఎట్లాంటిదంటే అన్న వాగ్వైఖరి అవలంబిస్తాం. ఇది అచ్చంగా మాట్లాడే భాష లక్షణం. అట్లాగే మాట్లాడే భాషలో ఒక విషయాన్ని నొక్కి చెప్పటానికి పునరుక్తి నవలంబిస్తాం. అణా చెల్లగా అణా. దీన్నే మాట్లాడే భాషలో అణా అయిపోతే ఇంకో అణా అని పునరుక్తం చేస్తాం.



ఈ విధంగా విశ్వనాథ సత్యనారాయణగారి వచనంలో ఎక్కడ చూసినా ఈ రకమైన మాట్లాడే భాషాలక్షణాలు సంభాషణలోనే కాక కథనంలో కూడా కనిపిస్తాయి. మాట్లాడే భాషలో ముఖ్యంగా తెలుగుభాషలో సంపూర్ణవాక్యాలు ఉండవు. భాషణ సందర్భాన్ని బట్టి, భాషా సంధర్భాన్ని బట్టి వాక్యంలో అవసరమైన భాగాన్ని శ్రోతలు అనుసంధించుకుంటారు. ఇది అన్ని భాషల్లోనూ అంతో ఇంతో ఉన్నమాట నిజమైనా తెలుగుభాషలో ఇట్లాంటి పరిస్థితి ఎక్కువ. కర్త, కర్మ, క్రియల పద్ధతిలో ఎక్కువ వ్యాకరణ సంబంధ బాంధవ్యాలు రచనా భాషలో ఎక్కువ బిగుసుకొని ఉంటాయి. మాట్లాడేభాషలో ఇవి వదులు వదులుగా ఉంటాయి. అయితే మాట్లాడే భాషల్లో కూడా కొన్నిటిలో ఈ సంబంధాలు ఎక్కువ బిగుతుగా ఉండవచ్చు. మరి కొన్ని భాషల్లో ఇవి వదులుగా ఉండవచ్చు. దీన్ని Talmy Givon (టాల్మీ గివాన్) అనే శాస్త్రజ్ఞుడు మొదటిదాన్ని tight syntactic mode అనీ రెండవదాన్ని loose paratactic mode అనీ అన్నాడు. ఈ రెండు కొలమానాలు రాసే భాషకూ మాట్లాడే భాషకూ ఉన్న భేదాన్ని సూచించటానికి, కొన్ని భాషల మధ్య భేదాన్ని సూచించటానికి కూడా పనికి వస్తాయి.

సత్యనారాయణగారి కథనశైలిలో కూడా సంభాషణాశైలిలో లాగే అసంపూర్ణ వాక్యాలు తరచుగా వస్తాయి. ఉదాహరణకి 'దిండు కింది పోక చెక్క' అనే నవల ప్రారంభాన్ని చూడండి. ''హిమగిరి మంచుగుట్ట. మంచు కరిగినపుడు కరుగును. కరగనపుడు ఒట్టిరాళ్ళు. మంచురాళ్ళు. మంచుగడ్డలు. అచ్చట నదులు ఏర్పడుట చిత్రము. నదులేర్పడుట అనగా కొంతకాలము మంచు కరుగునని అర్థము. కరగని భాగముండును. అది రాళ్ళుగా నుండును. ఆ రాళ్ళపైనున్న మంచుకరిగి జలముగా ప్రవహించును. రాళ్ళు కనిపించును. రాళ్ళు రెండువైపులా కనిపించును. ఆ నడుమరాళ్ళు లోతుగా నుండును. '' ఈ రకమైన వాక్యనిర్మాణం ఆయన కథనశైలిలోగానీ ఇతర వ్యాసరచనలోగానీ తరచుగా కనిపిస్తుంది. ఇందులో ప్రధానమైనది తెలుగువాక్యాల్లో ఉన్న పదలోప విధానాన్ని ఉపయోగించుకోవటం. అంటే వాక్యాల్లో ఏ పదబంధమైనా సరే వాక్యంగా నిలబడుతుంది. సంపూర్ణార్థబోధ పరిసర సమాచారం వల్ల జరుగుతుంది.

ఈ రకమైన వాక్యాల్లో వీటి అనుక్రమణికలో కూడా వైచిత్రి కన్పిస్తుంది. ఇదీ మాట్లాడే భాషను అనుసరించి వచ్చే వాక్యరీతియే. ఉదాహరణకు ఆయన ఆత్మకథలో ఒకచోట ఇట్లా అంటారు. ''ఒక జీవిత రహస్యాన్ని విచారణ చేసినచోదాన్ని వేదాంతమనుట మనదేశంలో పరిపాటి అయిపోయినది. పుట్టినాము. పెరిగినాము. కొంత ధనము వచ్చినది. కొంత ధనముపోయినది. కొన్ని సుఖములు అనుభవించినాము. కొన్ని దుఃఖములు

పొందినాము. ఇక్కడ వాక్యాల ప్రయోగంలోనూ అర్థంలోనూ ధ్రువ భిన్నత్వం ( Polarity) కన్పిస్తున్నది.

సత్యనారాయణగారు వచనశైలిలో ఇట్లాంటి ధ్రువభిన్నత్వంగానీ పరస్పర విరుద్ధమైన విషయ సంయోజనగానీ తరచుగా కన్పిస్తుంటుంది. దీనిని కావాలంటే ద్వైధీ భావ శైలి అనవచ్చు. ఇందులో విశేషమేమిటంటే ఒక వస్తువును, విషయాన్ని, సంఘటనను అసలు ప్రపంచాన్నే చూసే పద్ధతిలో రెండు పక్షాలకూ అవకాశం ఇవ్వటం. దీన్ని ఇంగ్లీషులో Yes or no Style అందాం. ఉదాహరణకు వేయిపడగలు మొదటిపేజీలో ఓ చోట ''గ్రుడ్డివాని చేతిరాయి తగిలిన తగులును, తగులదును'' అంటారు. చెలియకట్ట పదకొండో అధ్యాయంలో బైరాగి రంగారావును నువ్వు చాలా మారిపోయావు అంటే అతను ''మారాను మారటం లేదు'' అంటాడు. ఈ సంభాషణ తరవాత కూడా ఈ రకమైన శైలీరీతి ఎట్లా విస్తరించిందో గమనించదగింది.

| | | |
|---|---|---|
| రత్నావళి | : | రంగా , నీకు పాటలంటే చాలా ఇష్టం |
| రంగారావు | : | నాకు ఇష్టం లేదు. కానీ ఈ బైరాగి పాడుతుంటే వినక తప్పక వచ్చింది. అతని పాటలూ నాకిష్టం కావు. |
| రత్నావళి | : | ఎందుకిష్టం లేదు. అట్లా, నించొని వింటుంటే |
| రంగారావు | : | కుష్ఠువాడు అద్దంలో చూచుకుంటాడు చూచుకోవటం ఇష్టమే. కానీ ఆ చూచుకోవటం ఇష్టమూ లేదు. |

ఈ సంభాషణ ఆయన ద్వైధీ భావ శైలికి ఒక ఉదాహరణేకాదు వివరణ కూడా. సత్యనారాయణగారి శైలిలో కనిపించే ఒక పద్ధతి ప్రశ్నోత్తర శైలి. ప్రశ్నోత్తర శైలి అంటే అవతలివారు వేయవలసిన ప్రశ్న తామే వేసుకొని తామే సమాధానం చెప్పే శైలి. చెలియలి కట్టలో పదియవ అధ్యాయంలో ఈ భాగం చూడండి.

''ఈ రంగడు తానే స్థలమును ప్రేమించును? మునుపటి వలె తన్నే స్థలమూ ప్రేమించుట లేదు. ఆ యిసక దిబ్బలు ఇతనిని రమ్మన్నచో అతనికి ప్రయోజనము కనిపించలేదు. రంగడు రత్నావళిని ప్రేమించెను. ఆమె తన్ను ప్రేమించలేదు. ఆమె అందగత్తె కాదా? పూర్వం అందగత్తెయే. తానప్పుడు ప్రేమించలేదు. ఆ అందగత్తెను రంగడు ఏల ప్రేమించలేదు? అంతకన్నా అందగత్తె అనన్యదత్త ఒక యచ్చర తనకు లభించునని వాని హృదయములో నెక్కడో వానికి తెలియకుండ ఒక ఆశ యుండెను. ఆయాశ నేడు

మటుమాయమైనది. ఆ ఆశ పోయినంతనే రంగనికి ప్రాణము పోయినదా? రంగని మనో వ్యాపారమంతయూ నశించినదా? ఏమియు నశించలేదు''

అదే అధ్యాయంలో ఇంకో భాగం చూడండి.

''రంగడు రత్నావళిని ప్రేమించుచున్నాడు. రత్నావళి రంగని ప్రేమించుట లేదు. ఎందుకు ప్రేమించుటలేదు? పూర్వము తానామెను ప్రేమించుట లేదనుకున్నప్పుడు తన మనసున ఒకానొక భ్రాంతి యామెను ఆవేశించినది''. ఆయన ఆత్మకథలో '' ఆశతకమును (విశ్వేశ్వర శతకము) నేను 1925లో వ్రాసితిని. అందులోనేమున్నది. నాకున్ చిన్నతనమ్మునుండి అని యున్నది. అనగా నప్పటికెప్పటి నుండియో యున్నదన్నమాట'' అని అంటారు.

ఇట్లా చాలా చోట్ల కథన శైలిలో భాగంగా ఈ ప్రశ్నోత్తర శైలి ప్రశ్నోత్తర శైలి సంభాషణలో రావటం సహజం. ఆ రెంటికీ వక్తలు వేరు. కథన శైలిలో ఒకే వక్త నుంచి ప్రశ్నోత్తరాలు రావటం విశేషం.

సత్యనారాయణగారి వచనంలో కనిపించే ఇంకో పద్ధతి ఒక విషయాన్ని చెపుతూ చెపుతూ మధ్యలో కొన్ని మాటలకు లేక భావనలకు నిర్వచనం లాంటిది ఇస్తారు. దీన్ని నిర్వచనశైలి అనవచ్చు. ఇంగ్లీషులో definitional style అనుకుందాం. తాను చెప్పేది శ్రోతకు పఠితకు సరిగ్గా అర్థం అవుతుందో లేదోనని తను ఏ అర్థంలో ఉపయోగిస్తున్నాడో ఆ అర్థాన్ని వివరిస్తూ ఒక నిర్వచనం ఇస్తారు. ఆయన ఆత్మకథలోని ఈ కింది భాగాన్ని చూడండి. '' పైకి అందరము చచ్చిపోవుదమందురే గాని వ్రేళ్ళు పాతుకుని కొమ్మలు వేసి మింటికొసలు తాకుదమన్న యూహయే అజ్ఞానము చేత నావరింపబడిన బుద్ధిలో యుండును. *అజ్ఞానమనగా ఆలోచనలేక యుండుట*. సుమారు నా ముప్పది నాల్గవ ఏట నొక యోగితో నాకొక మిత్రుడు స్నేహం కల్పించినాడు. *యోగి అనగా యోగాసనములు నేర్పెడివాడు. ప్రకృతి చికిత్స చేసెడివాడు.''*

''నాకు జీవితములో వచ్చిన సంఘర్షణ,సన్నికర్షణ, విరోధములు నా యీ ప్రకృతి చేత చాలా భాగములు వచ్చినవి. జన్మలక్షణము కూడా కొంత యున్నదనుకొనవలెను. జన్మలక్షణమనగా జీవగత లక్షణము. ఒక యహంకారము ఆ జీవుని యందే ఉన్నదని అర్థం. చెలియలికట్టలో ఒక ఉదాహరణ చూడండి. ''రత్నావళి హృదయము అతని యందు ఏలకో ప్రసన్నముకాలేదు. *ప్రసన్నత యనునది క్రమపరిణామము పొందు ఒక మృదు భావము.*

ఇందులో భాగంగానే వివరణాత్మకశైలి, స్పష్టీకరణ శైలి వంటి వాటిని చేర్చవచ్చు. వీటిని ఇంగ్లీషులో clarifactory style and explanatory style అనుకోవచ్చు. ఎమెస్కో వారి మనుచరిత్రకు రాసిన పీఠికలో ఈ భాగాలు చూడండి. ''...., అందుచేత నతడు ఆంధ్రకవితా పితామహుడు. పితామహుడనగా తాతకాదు బ్రహ్మ. అదే వ్యాసంలో అంకముజేరి అనే పద్యాన్ని వివరిస్తూ ఇట్లా రాస్తారు. '' ఆ వంక కుచంబుగాన కహివల్లభ హారము గాంచి – వెదకినాడు. కుచము కనిపించలేదు. హారముగా నున్న పాము కనిపించెను. అహివల్లభుడే హారము. దానిని చూచినాడు. చూచినాడనగా తెలుసుకున్నాడు అని అర్థము. కాంచి యనకూడదు. అతనది అహివల్లభ హారముగా తెలుసుకొనలేదు. అచట నహి వల్లభ హారముండుట చేత నది మృణాళాంకుర మనుకున్నాడు. మృణాళాంకురము – తామర తూటి మొక్క

సత్యనారాయణ గారి శైలిలో చాలా మంది గుర్తించినది కొట్టవచ్చినట్లు కనిపించేది ఆయన తర్కపద్ధతి. ఈ తర్కం సాధారణంగా మనలో చాలామందికి అలవాటైన హేతుబద్ధ తర్కం కాదు. ఆయన స్వయంగా కల్పించుకొన్న కార్యకారణ పద్ధతి ఆయన తర్కంలో కనిపిస్తుంది. చాలామంది ఆయన అభిమానులు ఆయన శైలికి ఆకర్షితులై ఆ తర్కంలో పడి కొట్టుకుపోయి ఆయన చెప్పేవన్నీ నిజమనే అనుకుంటారు. చాలాకాలం క్రిందట (సుమారు 1966 ప్రాంతం) ఉస్మానియా యూనివర్సిటీలో ఉపన్యాసం ఇస్తూ ఇంగ్లీషు వాళ్ళ కన్నా తెలుగువాళ్ళే ఇంగ్లీషు బాగా మాట్లాడుతారు అని అన్నారు. అందుకు కారణమేమిటంటే తెలుగు వాడు నాలుక గీసుకుంటాడు ఇంగ్లీషువాడు నాలుక గీసుకోడు. ఆయన తర్క స్వభావం చెలియలికట్టలో రత్నావళి అన్నట్టుగా ఉన్న ఈ వాక్యాలు ఆధారంగా ఆయన మాటల్లోనే చెప్పుకోవచ్చు. '' నీ తర్కము నీ సంస్కారమును బట్టి యుండును. నీకదివరకే ఉన్న కొన్ని ఊహలను బట్టి కొన్ని విశ్వాసములను బట్టి తర్కించెదవు. కాని యచ్ఛమైన తర్కము నీకు తెలియదు. నీ తర్కము నీ విశ్వాస దూషితము'' నిజానికి సత్యనారాయణగారి తర్కం ఆయన విశ్వాసాలపైనే ఆధారపడి ఉంటుంది.

చెలియలికట్టలో రత్నావళి తన మరిది రంగారావుతో ''లేచిపోతుంది'' అతనితో మాట్లాడుతూ తానింకా సీతారామయ్య భార్యనే అని claim చేయటానికి భాషా ప్రయోగాన్ని కారణంగా చూపిస్తుంది. '' నేను మీ అన్నగారి భార్యను కానని ఎవరైన నందురా ఆయన భార్యను కాదనరు.'' అపుడు రంగారావు అటువంటి సంబంధం తనకూ ఉంది అంటే అన్నదమ్ముల సంబంధం తెంచుకోరాదనే అర్థంలో అంటాడు. అందుకు రత్నావళి :

నీకు లేదు. అన్నదమ్ములు త్రెంచుకొనిపోయిరి విడివడిరందురు. ఇంకేమి సంబంధ మున్నది. ఒక చెట్టునకు ఒక తీగెకు ఉన్న సంబంధం రెండు చెట్లకు ఉండదు.

స్త్రీ, పురుషుల మధ్య వయస్తారతమ్యం ఉండవచ్చుననీ, పురుషుడు ఎక్కువసార్లు వివాహం చేసుకోవచ్చుననీ చెలియలికట్టలో సత్యనారాయణగారు ప్రతిపాదించారు. నిజానికి సత్యనారాయణ గారి చాలా నవలల్లో ఈ సిద్ధాంతం కనిపిస్తుంది. తన సిద్ధాంతం ప్రతిపాదించే తార్కిక పద్ధతిని సీతారామయ్య మూడవ మామగారి చేత ఇట్లా అనిపిస్తాడు. '' మా యల్లునకు నలుబది ఐదేండ్లుండును. మూడవ సంబంధము ఇచ్చితిని. కొడుకు పుట్టినందుకు సంతోషించుచున్నాము. గీత బాగుగా ఉండవలెను గాని వయస్సు తారతమ్యములలో నేమున్నది. నాపిల్ల నరువది యేళ్ళ వృద్ధునకు ఇయ్యలేదు. మగవాండ్రకు అఱువది ఏండ్ల వరకూ వయసుండును. స్త్రీలకు నలుబది ఏళ్ళతో వయసుడిగి పోవును.'' మళ్ళీ అతనే ఇంకా ఇట్లా అంటాడు. ''ముప్పది ఏండ్ల పురుషుడు మూడేండ్ల యాడుది అని మనదేశంలో వాడుక. ఈ మర బియ్యంతో, కాఫీ హోటళ్ళతో వెఱ్ఱక్కాయ వేషములలో నీ కాలములో నాయుర్దాయము తగ్గిపోయినది. కానీ అరువది ఏండ్ల వరకునూ పురుషునకు ఆరోగ్యము చెడదు.... నాకు దీని తరువాత నిద్దరు మగపిల్లలు. నొక యాడుపిల్ల. ఆడుపిల్ల ఏడాదిది. నాకు వివాహము నలుబదవ ఏట జరిగెను.

సత్యనారాయణగారి పుస్తకాలలో ఆయన నమ్మే సిద్ధాంతాల ప్రస్తావన ఉంటుంది. ఆయన ఈ సిద్ధాంతాలు శాస్త్ర బద్ధమన్న భ్రమ కల్గించేట్టు రాస్తారు. ఈ రకపు శైలిని ధర్మోపన్యాస శైలి (Dharmic style ) అనవచ్చు. ఈ రకమైన ధర్మోపన్యాసాలు ఆయన నవల్లన్నిటా ఆయన క్లిష్టమైన పాత్రలో నోటితో చెప్పిస్తారు. వేయి పడగల్లో ధర్మారావు కావచ్చు. చెలియలికట్టలో రత్నావళి కావచ్చు. ఏకవీరలో ఏకవీర కావచ్చు. ఉదాహరణకి రత్నావళి చివరలో తన భర్తకు మూడవ భార్య అయిన రాజ్యలక్ష్మితో ఇచ్చిన ఉపన్యాసాన్ని ఉదాహరణ ప్రాయంగా చూడండి.

''అమ్మా ! నిజమే! నాకు తెలుసు - నేనెంత సుఖపడతానో, ఆయన యెంత సుఖపడతాడో నాకు తెలుసు. కాని నా కడుపున యింకొక బిడ్డ పుడితే నీ బిడ్డ వంటి వాడు కాడు. వాఁడొక గోళకుఁడు. వాడొక కుండకుఁడు. వాడొక కింకరుడు. అట్టి కొడుకునే కంటినా వాడు నాకు తర్పణము లిచ్చునా? తల్లీ! నీ కొడుకు చాలునమ్మా ! చాలు. నీ కొడుకు గడచిన మూఁడు పురుషాంతరాలు దాఁకా చాలు. తల్లీ! నీకు తెలియదు. నీవు శరీరాన్ని చూస్తున్నావు. ఆత్మను చూడు; మనస్సును చూడు; ప్రేమను చూడకు.

ధర్మాన్ని చూడు. సుఖాన్ని చూడకు; సంప్రదాయాన్ని చూడు. బయట చూడకు తల్లీ ! లోపల చూడు! నిన్నూ, నీ భర్తనూ చూచుకోవద్దు. నీ కొడుకును చూచుకో. సంతానాన్ని చూచుకో. నెత్తురు చెడిపోకుండా చూచుకో ! అదే వర్ణం దానిలోన గుణాలు ఉంటవి. గుణాలలో కల్తీ వస్తే వర్ణం పోతుంది. ధర్మం నశిస్తుంది. సుఖాలకేమి, దుఃఖాలకేమి, ఉద్యోగాలకేమి, ధనాలకేమి? నేను పెడ్తున్నా. మీరు వాగ్దానం మఱచిపోకూడదు.''

విస్తరభీతి వల్ల ఈ ధర్మోపన్యాసాలకు ఉదాహరణలు ఇతర గ్రంథాల నుంచీ ఇవ్వడం లేదు. విశ్వనాథసత్యనారాయణగారి నవలల్లో ధర్మోపన్యాసాలతో పాటు తరచుగా కనిపించేది ఆయన నిశిత పరిశీలన దృష్టి. ప్రపంచంలో అనేక సంఘటనలను మనుషుల స్వభావాలను, ప్రకృతినీ, ప్రపంచాన్నీ చాలా సూక్ష్మంగా పరిశీలించినట్లు ఆయన రచనలను బట్టి గ్రహించగలం. ఈ పరిశీలన దృష్టి ఆయన పాండిత్య దృష్టి కలిపి ఆయన రచనకు ఒక విజ్ఞాన ప్రదర్శన దృక్పథం ఏర్పడింది. దీన్ని ఇంగ్లీషులో Encyclopaedic sytle అనుకుందాం. ఆయన ఈ విజ్ఞాన ప్రదర్శనలో ఒక్కోసారి అసలు కథను ఆపి తనకు తెల్సిన విషయాన్ని గురించి విజ్ఞానోపన్యాసాన్ని ఇస్తారు. ఈ దృష్ట్యా ఈ రకపు శైలిని తెలుగులో విజ్ఞానోపన్యాస శైలి అనవచ్చు. ఈ శైలిలో ప్రపంచాన్ని గురించి అందులో అనేక విషయాల గురించి ఆయనకు తెలిసిందీ, ఊహించిందీ, భావించిందీ ఉపన్యసిస్తారు. వేయిపడగలు నవల్లో ఆంధ్రసాహిత్యాన్ని గురించిన ఉపన్యాసాలు చాలా ఉన్నాయి. చెలియలికట్టనవలలో ఆయన తెలుగు సంస్కృతాల వ్యాకరణ పాండిత్యం ప్రదర్శిస్తారు. ఇక కావ్యాల పీఠికల్లోను, సాహిత్య విమర్శలోనూ చెప్పక్కరలేదు. వ్యాకరణ , సాహిత్య, శాస్త్ర పాండిత్యాలను వదిలేస్తే మిగతా విషయాలగురంచి ఆయన తెలుసుకున్నది ప్రదర్శించే పద్ధతి చూడ(చదవ) ముచ్చటగా ఉంటుంది. ఆయన అక్కడ కథను ఆపేసి వేరే విషయానికి వెళతారు. కాబట్టి దీన్ని deviational style అనవచ్చు. భ్రమరవాసినిలో ప్రకృతిని వర్ణిస్తూ ఉపమానంగా కలనేత చీర ప్రసక్తి వస్తుంది. ఇక ఆయన తన పరిజ్ఞానం అంతా అందులో వివరిస్తారు. '' సూర్యోదయ మగుచుండెను. అది తూర్పు సముద్రము. సూర్యుని యొక్క యరుణకిరణములు సముద్ర తరంగముల మీద వ్యాపించి యెఱుపు నలుపు వన్నియలు కలిసి సముద్ర జల మంతయు గగన లక్ష్మి ధరించిన కలనేత చీరవలె నుండెను. ఆ కలనేత చీరలో పోగులకు మెరుగుపెట్టిరి కాబోలు ! చీరలు నేయక ముందు దారములకు కొన్ని జిగురులతో గంజిపెట్టుదురు. మైనంలో రతనపు పొడి బంగారపు పొడి కలిపి మైనమును కరగింతురు. దానిని మిక్కిలి పలుచగా చేయుదురు. ఈ దారములను వానిలో ముంచుదురు. ఎండబెట్టుదురు. కొన్ని యోషధులయందు విలక్షణమైన వర్ణముండును.

మంజిష్ఠాది ద్రవముల యందు కలది ఎఱుపు, దాని ఎఱుపు దానిది. ఓషధుల నుండి బహువర్ణములు తీయుదురు. వాని నుడికించి పలుచని ద్రవ్యము చేసి దాసరేకు పాడులు రత్న భస్మములు మరకత భస్మములు మాణిక్యభస్మములు కలిపి యా యడుసుతో దారముల నుండి యెండ బెట్టినచో నా దారములతో చీరలు నేసినచో నా చీరల యొక్క తళతళ యేమి చెప్పవలయును? సముద్రమాతీరుగా నుండెను''

ఈ పై పేరాలో Deviational style, Encyclopaedic style, and keen observational style కలసి ఉన్న పద్ధతిని గమనించవచ్చు. ఒక్కోసారి ఆయన రచన పాండిత్యానికే పరిమితం కావచ్చు. మరొకసారి పరిశీలనకే పరిమితం కావచ్చు. ఇంకోసారి వర్ణనకు సంబంధించి ఉండవచ్చు. ఇవేవి చెప్పినా కథను ఆపి విషయాంతరానికి పోవటం వల్ల దీన్ని Deviational style అని అన్నాను. ఇవి వేరువేరుగా ఉంటే లేక వేరువేరు అంశాల ప్రాధాన్యం ఉంటే ఆ పేరు పెట్టుకోవచ్చు. అన్నిటికీ కలిపి సమాహారంగా - అంతస్తత్వం లోకి వెళ్ళకపోయినా Deviational style అనవచ్చు తెలుగులో *మార్గాంతర గమన శైలి* అని అనుకుందాం.

సత్యనారాయణగారు ఉన్నది, ఉన్నాడు, కలది వంటి క్రియలతో నామాలను ప్రవేశపెట్టి తరువాత వాటి విషయం వివరిస్తారు. నిజానికి ఈ వాక్యాలను తొలగిస్తే అర్థ బోధకు నష్టం లేదు. కాని ఈ వాక్యాల ప్రయోగం మాట్లాడే భాష తీరుకి దగ్గరగా ఉంటుంది. దీన్ని *అస్త్యర్థక క్రియా వాక్య ప్రారంభ వ్యూహం* అందాం. ఉదాహరణకి కింది వాక్యాలు చూడండి.

'' వెలుతురున్నది. చీకటియున్నది. ఒకడు చీకటినే వెలుతురనును. అన్నవాడు ఊరకుండక వెలుతురని చెప్పువానితో విరోధము పెట్టుకొనును''.

''మరికొందరుందురు వారి కూహయు లేదు. భావనయుండదు. తన బంధువులలోను స్నేహితులలోను యొక మార్గమున పోవు చున్నవాడు వానికి లక్ష్యము. వాడు జెప్పునదే వీనికి వేదము.''

'' ఇంక విమర్శింపబడెడి వారు కలరు. వారందరు మహా కవులు అని చెప్పుటకు వీలు లేదు. ప్రతివాడు తనకు తానొక కాళిదాసు. తాను వ్రాసినదే సిద్ధాంతము.'' .

సత్యనారాయణగారి వచనంలో కొన్ని మాటల ప్రయోగంపై మోజుంది. ఒక విషయం చెప్పి దాన్ని వ్యాఖ్యానించే టప్పుడు కాని లేక ముందుగానే వాఖ్యాన ప్రాయ వాక్యంతోగాని మొదలుపెట్టినప్పుడు చిత్రము, చమత్కారము, రహస్యము అనే మాటలు ప్రయోగిస్తారు.

నిజానికి అందులో మనం భావించదగిన చిత్రమూ ఉండదు. చమత్కారమూ ఉండదు. ఆయన చెప్పేదాంట్లో ఏమంత రహస్యమూ ఉండదు. లేని చమత్కారాన్ని ఉన్నట్టు చెప్పడం ఆయన రచనల్లో ఒక చమత్కారము. ఇది చాలా ప్రసిద్ధమైన పద్ధతే కనుక దీనికి ఉదాహరణలు ఇయ్యటం లేదు.

సత్యనారాయణగారు కొన్ని వాక్యాల్లో చిన్న సమాచారం చెప్పి దానిమీద ఒక వ్యాఖ్య లాంటి ఒక వాక్యం ముందో వెనుకో తగిలిస్తారు. వెనక తగిలిస్తే పూర్వోక్త సమాచారాన్ని సూచిస్తుంది. ముందు సూచిస్తే ఉత్తరోక్త సమాచారాన్ని సూచిస్తుంది. ఒక్కోసారి ఈ సంధానం పూర్వాపరాలు రెండు సూచించే అవకాశం ఉంది. అప్పుడు దీన్ని ఉభయోక్త సమాచార సూచి అనవచ్చు. వీటిని క్రమంగా ఇంగ్లీషులో anaphoric, cataphoric, diphoric అని అనుకోవచ్చు. క్రమంగా ఉదాహరణల్ని చూడండి.

పూర్వోక్త సూచీ వ్యూహం : '' కవితానే ఛందస్సు స్వీకరించినను. ఇట్టి సామగ్రి బాహుళ్యముచేత దీని ప్రాధాన్యము చేత అతని రచన నీరసమగును. ఈ సామగ్రి నాశ్రయించిన భావములు సర్వదాపిష్టపేషణములు, చర్విత చర్వణములు. కాని ఈ సామగ్రినే తీసికొని ఒకానొక మంచి వాక్సై పుణ్యముగల కవి చెప్పిన తరహాలోని సొగసుచేత ఒక రమ్యత తేవచ్చును. అది మాట నాశ్రయించిన సౌందర్యము. దానికి లోతుండదు. *ఆమె యెట్టిదనిన. కనుముక్కు తీరు బాగుగా లేనిది ఆ కవిత యట్టిది*''

ఈ పై వాక్యంలో ఒక దృష్టాంతాన్నే తీసుకొచ్చి వ్యాఖ్యగా వాడుకొన్నారు.

''భాష గలదు. భావము కలదు. కవిచెప్పునట్టి విషయం యొక్క ప్రాధాన్యము కలదు. కవియొక్క నేర్పు కలదు. *ఇన్నియున్నవి.*

ఉత్తరోక్త సూచీవ్యూహం : ఇది చూడుడు. వారి విశ్వాసమొకటి. వారు ప్రచారము చేయునదొకటి.

ఉభయోక్త సూచీ వ్యూహం : ఒక కవి గ్రంథము బాగున్నది వారి మిత్రులు ప్రశంసింతురు. వారి యమిత్రులు మొగము మొరకటించు కొందురు. కొంప కూలిపోయినట్లు డిల్ల పడుదురు. *నేటి తెలుగు దేశపు స్థితి నిట్లున్నది.* పరోక్షమున తిట్టుదురు. మొగమునందు ప్రశంసింతురు.

విశ్వనాథ సత్యనారాయణ గారిని దేశము పట్టనంత కవి అని ఆయన అభిమానులు అంటుంటారు. అదేమో నాకు తెలియదు కాని ఒక పరిశోధనకు పట్టనంత రచయిత అని మాత్రం చెప్పగలను. అంటే ఆయన రచనా విస్తృతి అంత పెద్దదీ అని. అటువంటి

మహారచయితను ఒక వ్యాసంలో పట్టుకోవటం అసాధ్యం. అందువల్ల ఈ వ్యాసంలో ఆయన రచనలో కనిపించే కొన్ని అంశాల స్థూలపరిశీలన మాత్రమే చేయబడింది. అనేకాంశాల సూక్ష్మ పరిశీలనకు ఆయన రచనలన్నీ సమగ్రంగా పరిశీలించి సమాచార సంగ్రహణ చేయాలి. వాటిని వ్యాఖ్యానించాలి. సిద్ధాంత పరంగా విశ్లేషణ చేయాలి. అవన్నీ చేయాలంటే ఆయన్ను గురించి ఒక పుస్తక పరిధిలో రాయవలసి ఉంటుంది. ఆ పని నా చేత గాకపోయినా రాసే వాళ్ళకి ప్రేరణ కల్గించడానికి ఈ వ్యాసం దోహదకారి అవుతుందని ఆశిస్తాను.

1996 ఆగస్టు 3, 4 తారీకులలో ఢిల్లీలో సాహిత్య అకాడమీ జరిపిన
విశ్వనాథ సత్యనారాయణ శతజయంతి సభలలో తెలుగులో రాసుకొని
ప్రవాహవాణి, ఏప్రిల్ 2000 ఇంగ్లీషులో చేసిన ప్రసంగం

# ... అదియును ఒక చమత్కారము

ఈ తెలుగుజాతి యున్నదే, యది చిత్రమైనది. ఒక కవి తన జీవితకాలమున నెన్ని యిక్కట్లు పడినను పట్టించుకొను వారుండరు. ఆ తరువాత జయంతులందురు. వర్ధంతులందురు. మరి యేమేమో యందురు. ఇటీవల శత జయంతులను మాట నెక్కువగా వాడుచున్నారు. అసలు మరచిపోవుటకన్న నదియును మంచిదే. గ్రుడ్డిలో మెల్ల యన్నట్లుగా.

పూర్వమాంధ్ర సాహిత్య అకాడమీ యని యొకటుండెడిది. అందులో నేను జిరకాలము సభ్యుడిగ నుంటిని. దానిని ఎన్.టి.రామారావు గారి కాలమున మూసివేసిరి. మూసిరనగా నిజముగా మూసిరని కాదు. అదేదో విశ్వవిద్యాలయమున కలిపివేసిరి. సాహిత్యము బాగుపడిపోవుననని వారి చింత కాబోలు! అది యట్లుండనిండు. కేంద్రమున నొక సాహిత్య అకాడమీ కలదు. దానినెవరును మూసివేయలేదు. అక్కడి ప్రభుత్వమునకు సలహాలిచ్చు పత్రికా సంపాదకులు లేరేమో.

సాహిత్య అకాడమీయనగా నిప్పుడు కేంద్ర సాహిత్య అకాడమీయే. దానికి కార్యదర్శి ఇంద్రనాథ చౌదురి - వీరు వంగదేశపు వారు. అతడు సరసుడని విన్నాము. సరసుడనగా రసజ్ఞుడని కాదు. మంచిమాటలు వినెడివాడని యర్థము. తెలుగులో విశ్వనాథ సత్యనారాయణ యను యొక కవి గలడని యతడెరుగును. తెలుగువారిలో తొలి జ్ఞానపీఠ పురస్కారమునతని కొసంగిరనియు వెఱుంగును. భద్రిరాజు కృష్ణమూర్తి జగత్ప్రసిద్ధుడైన భాషాశాస్త్రి, శాస్త్రి యనగా పుట్టుక చేత శాస్త్రికాడు. భాషా శాస్త్రమును లోతుగా మధించినవాడు. బోధించినవాడు. ఎందువలననో భాషా శాస్త్రులందరూ ప్రాయికముగా వ్యావహారిక భాషావాదులగుదురు. ఇతడట్టివాడే. దానికేమి గాని యతనికి సాహిత్యమునంద భినివేశము కలదు. మరియు నాకవిత్వమన జాల నిష్టము. పూర్వమొకసారి నన్ను సాదరముగ దన యింటికి నాహ్వానించి నా పద్యములు చదివించుకొని మాటలను భద్రపరచు యంత్రమున కెక్కించినాడు. అదరికి వినిపింతునని ఆటేపులనిపుడు తన వెంట తెచ్చినాడట. ఇతడు నా కల్ప వృక్షమున బాలకాండమును పాఠము చెప్పినాడు. కొన్ని పద్యములు నోటికి వచ్చును. అతని సలహాపై ఇంద్రనాథ చౌదరి - అన్నట్టు చౌదరి యనరాదట. చౌధురి యనవలయునట. తెలుగువాడను గనుక నాకు తెలుగు చౌదరియే యలవాటైనది. మరియు నేను తెలుగునాట పుట్టి పెరిగినది, మెట్టి తిరిగినది యెక్కువగా

తెలుగు చౌదరులు వెల్లివిరిసిన ప్రాంతము. అది యటుండనిండు. ఇప్పుడింద్రనాధ చౌదరి-అదే చౌధురి గురించి చెప్పికొను చున్నాము గదా. ఆయన విశ్వనాథ సత్యనారాణ శత జయంతి నొక దానిని ఢిల్లీ నగరమున నేర్పాటు గావించెను. 1996, ఆగస్టునెల మూడు నాలుగు తారీఖులలో నిది జరిగెను.దానికాంధ్ర దేశపు పండితులను దారి బత్తెముల నొసంగి పిలిపించిరి. వారి వారి హోదాలను బట్టి, పలుకుబడిని బట్టి, పరిచయములను బట్టి కొందరెగిరి వచ్చిరి, ఎగిరి వచ్చిరనగా నిజముగా నెగిరిరని కాదు. వారు కూర్చున్న విమానమెగిరినది. చాలా మంది రైలుబండిలో వచ్చిరి. హైదరాబాద్ నుండి ఢిల్లీకి రైలు ప్రయాణము సుమారు ఇరువది యారు గంటలగును. ఒక పగలు నొక రాత్రి కన్న నింక రెండు గంటలధికము. అదియే విమానమైనచో రెండు గంటల వ్యవధి చాలును. రైలుబండిలో శీతలీకృతావాసముండును. ఆవాసమనగా నిల్లుకాదు. ఒక పెట్టె లేక ఒక డబ్బా . అచట మనమెక్కినపుడు కొంచెము వేడిగా నున్నట్లులనిపించును గాని పోను పోను చలి యెక్కువగును. కప్పుకొనుట కొక యున్ని దుప్పటి నొసగుదును. మరియు తెల్ల దుప్పట్లు రెండును, నొక బాలీసును నిత్తురు. పూర్వము దీనికి డబ్బు పుచ్చుకొనెడివారు. ఇప్పొడూరకనే యిచ్చుచుండిరట. చలి తెప్పించుకొనుట యెందుకు? దుప్పట్లు కప్పు కొనుట యెందుకు? అది యొక చమత్కారము.

ఈ ప్రయాణము సంగతేమి కాని మనము పోవలసినది శతజయంతి సభకు గదా! సాహిత్య అకాడమీ కార్యాలయము ఫిరోజిషా రోడ్డుపై నున్నది. ఉన్నదియును, లేదును. ఉండవలసిన రోడ్డు వైపు కాక వేరొక మార్గము వైపు దారి పెట్టినారు. ఆ వీధి యెవరో యాంగ్లేయుని పేరిట నున్నది. మన వారికింకను భావదాస్యము వదిలినదికాదు.

అకాడమీ కార్యాలయములో రబీంద్ర భవనమని యొక శాల గలదు. రవీంద్ర కవిని వంగీయులు రబీంద్రుడందురు. ఎట్లన్ననూ నొకటియే. వ, బ యోరభేదః అని యున్నది కదా !

అదెట్లు జరుగునో చూతమని నేనును బోయితిని. అశరీరుడును గదా ! ఎవరికిని తెలియకుండ నందందు చరించుట కవకాశము గలదు వర్షాతప శీతోష్ణ వాతపాతములు నన్నేమి చేయవు. నేనా శాలకు బోయినపుడిరువురే కూర్చుండి యుండిరి. అందొకరు దాసరి అమరేంద్రుడు. అతడు ఢిల్లీ నివాసియే. అతడు స్వతంత్ర కథలు, అనువాద కథలు, యాత్రాచరిత్రములు వ్రాయుచుండును.

రెండవవాడు చేకూరి రామారావు అనునతడు. అతడును భాషా శాస్త్రియే. అయినను

నిటీవల సాహిత్యము పై నెక్కువ వ్రాయుచున్నాడట. అతడు భాషాశాస్త్రమును వదలినాడని ఆయన గురువు భద్రిరాజు కృష్ణమూర్తి నిరసించునట ! తెలుగు సాహిత్యము నల్లకల్లోలము చేయుచున్నాడని సాహిత్యకులును నీసడించుచుందురట. రెంటికి చెడ్డ రేవడి కాబోలు. అది యెట్లున్నను నా రచించిన 'ఆంధ్ర భిక్షువు' అను కావ్యఖండికపై సరస వ్యాసము వ్రాసి కొంత కీర్తి గడించెను. అతనిదొక విచిత్ర ప్రకృతి. వచన కవిత్వము వ్రాయు కవులను, మరియు కవయిత్రులను నెత్తికెత్తికొనును. పద్య కవిత్వమును సమర్థించుచు వ్యాసములు వ్రాయును. ఉభయ కవి శత్రువని వాకాటి పాండురంగా వీతనికి బిరుదు నిచ్చి నాడట! లోకచిత్రములిట్లుండును ! వారేదియో నన్ను గూర్చియే మాట్లాడుకొను చున్నట్లు కనిపించుచున్నది. వినదమని దాపునకు పోయితిని, వెంటనే మానివేసిరి. నన్ను గుర్తించిరేమో యని యొక్క క్షణము కంపించితిని. కాని యశరీరులను గుర్తించు విద్య మానవమాత్రులెరుంగరు. ఎరుగుటకు వీరేమి తాపసులా? సభయారంభ మగునట్లు తోచుచున్నది. అందరును కూడినారు.

సాహిత్య అకాడమి, అధ్యక్షుడు అనంతమూర్తి భారత పునరుజ్జీవన సాహిత్యమును గూర్చి యధ్యక్షోపన్యాసము చేసినాడు. ఇతడు కన్నడమున గొప్ప రచయిత. సంతత మందహాస సుందర వదనారవిందుడు గంగిశెట్టి లక్ష్మీనారాయణ - ఇతడును సాహిత్య అకాడమీకి నొక సలహాదారు. వందన సమర్పణతో ప్రారంభ సభ ముగిసినది. ప్రతి సభ లోన కాఫీ, టీ, బిస్కత్తులనిచ్చుట యీనాటి సంప్రదాయము కదా! పానీయముల సేవించుచు, బిస్కత్తులను నములుచు మిత్రులను పరిచయస్థులను పలుకరించుచు కొంతకాలము పుచ్చి తదుపరి సమావేశమునకు లోపలికేగిరి. దానికి కృష్ణమూర్తి యధ్యక్షుడు.

ఆ సమావేశమునకు రావలసిన వారిలో కొందరు రాలేదు. వత్తుమని రాలేదో! రారని తెలిసియు వీరి పేర్లనచ్చొత్తించిరో తెలియదు. కొందరట్లు, కొంత యిట్లు జరిగియుండును. ఇలపావులూరి పాండురంగారావు అనువాడొకడు వచ్చెను. అతడాంగ్లాంధ్ర హిందీ సాహిత్యములందు పండితుడు. నా కావ్యములను బాగుగా చదివిన వాడు. నన్ను హిందీ భాషీయులకు పెక్కుసార్లు పరిచయము చేసినవాడు. విశ్వనాథ విరాడ్రూప మనునది యతడు మాట్లడవలసినది. అతడు మాత్రమేమి చేయును? మా పరిచయమును ప్రస్తావించినాడు. కొన్ని చారిత్రక విషయములకు తేదీలు సరిగా నిచ్చినాడు. జ్ఞానపీఠ పురస్కార మొసంగిన నాటి విశేషములను ముచ్చటించినాడు. నా కంతగా రాని హిందీ భాషలో నానాడు నా పాండిత్య ప్రదర్శనము చేసితినని చెప్పగా నందరును నవ్వినారు.

అవును నాకిప్పటికిని జ్ఞాపకమున్నది . దానిని దలచుకొనిన నాకును నవ్వు వచ్చుచుండును. ఏనాటి మాట యిది ! 1971 వత్సరము నవబంరు నెలలో ననగా నిరువదియైదు వత్సరముల క్రింద !

సభ యారంభమైనది. చౌధురి యందఱకును స్వాగతము చెప్పినాడు. భారత సాహిత్యమునందు విశ్వనాథ సాహిత్యమునకు గణనీయమైన స్థానమున్న దనినాడు. సాహిత్య అకాడమి యిట్టి సభ జరుపుట పరమోచితమన్నాడు. భాషా శాస్త్రి భద్రిరాజు కృష్ణమూర్తి నా జీవిత చరిత్రను , సాహిత్యమును పరిచయము చేయుటకు ప్రయత్నించినాడు. విశ్వనాథకు నొక మంచి జీవితచరిత్రను లేని లోటును పదేపదే గుర్తు చేసినాడు. నా జీవిత చరిత్ర వ్రాయుమని బొమ్మకంటి శ్రీనివాసాచార్యులకు పురమాయించిరట. ఆయన యింకను వ్రాయలేదట. ఆయనయు పెద్దవాడగుచున్నాడు. వ్రాయునో! వ్రాయడో! పూర్వము కాకతీయ విశ్వవిద్యాలయము వారు నా యాత్మకథను ప్రచురించినారు. అది చాలా చిన్నది. నాకు దోచిన విషయములేవియో చెప్పితిని. కోవెల సంపత్కుమారాచారియును, సుప్రసన్నాచారియును నదే ప్రయత్నములో నున్నట్లు తెలియ వచ్చుచున్నది. త్వరలో కాకపోయినను నెప్పుడో యొకప్పుడు నా సమగ్ర జీవితకథ వచ్చుననియే తలచెదను. చిత్రమేమనగా నన్ను గురించి చెప్పగలవారు క్రమక్రమముగా నంతర్ధానమగుచున్నారు. నా చరిత్ర సంపూర్ణముగా చెప్పుట నాకు దప్ప నెవరికి సాధ్యమగును? నేను జెప్పుటకు వీలు లేదు. చెప్పుటకు వారికి వలను పడదు. మరి యెట్లు. ఎట్లోయొకట్లు కానిండు. ఇంతకును దొరకినంతలో కృష్ణమూర్తి నా జీవిత విశేషములను బాగుగనే జెప్పినాడు.

ఆ దినమున నాంగ్ల భాషాధ్యాపకుడును ఆంధ్రభాష యందు పాండిత్యమును గల శివరామకృష్ణ రామాయణముల గూర్చి ప్రసంగించెను. అసలే యింగ్లీషు పండితుడు. ఆపైని ప్రాచీన రామాయణములను, కల్పవృక్షమును చదువుకొన్నవాడు. మంచి ప్రసంగమును చేసెను. అతడు చర్చలలో విరివిగా పాల్గొనెను. ఎవరి ప్రసంగములను నాయన మెచ్చినట్లగపడదు. తెలుగు పరిశోధకుల గోష్ఠిపత్రములలో నంత నైశిత్యముండదని యాయన నిశ్చితాభిప్రాయము వలె నున్నది. వారు పత్రములను నంత శ్రద్ధగా తయారు చేయరని యాయనకు కోపము. అయినను నీ రోజులలో పరిశ్రమము చేయువాడెవరు? ఎక్కడనో నొకరిద్దరు తప్ప. ఎక్కువ భాగము దారి బత్తెముల కొరక వ్యాసములు వ్రాయువారే. ఇచ్చుట పత్రమున కెనిమిది వందల రూపాయల పారితోషికము గలదు. అయిననూ శివరామకృష్ణ యను కొన్నంత హీనముగా లేవీ పత్రములు. ఆయనవి

పాశ్చాత్య ప్రమాణములు కాబోలు. అతనికి ప్రాచ్య సంప్రదాయముపై ప్రీతి కలదు. పాశ్చాత్య ప్రమాణములపై ప్రేమ కలదు.

ఆ మధ్యాహ్న సమావేశమునకు నాయని కృష్ణకుమారి యధ్యక్షత వహించెను. ఆమె తెలుగు విశ్వవిద్యాలయోపాధ్యక్షురాలయినప్పటికి నాంగ్లముననే ప్రసంగించెను. తెనుగున ప్రసంగించనచో నింతకన్న మధురముగా ప్రసంగింతునని వాపోయెను. అయినను నీమెయాంగ్లప్రసంగము బాగుగనే యున్నదనుకొన్నారు. ఈ సమావేశమునందు మల్లంపల్లి శరభయ్య మాట్లాడెను. అతనికి నా కవిత్వముపై ననురాగము మెండు. అతడు మంచి కవిత్వము వ్రాయుట మానుకొన్న త్యాగమూర్తి. కొంచెము నత్తియున్నది గాని యచ్చముగా నేను చదివినట్లే పద్యము చదువును. నా వలె పద్యము చదివెడి వారిలో మిగిలియున్నది యాయన యొక్కడేనేమో. ఆయన చేత రెండవ రోజు విశ్వామిత్ర మేనకా ఘట్టములోని పద్యములను చదివించిరి. మొదటి దినమున నలంకార శాస్త్రముల నుటంకించుచు నా కవిత్వముపై ప్రశంసా ప్రసంగము చేసెను. ప్రసంగము చేసిననగా మూల ప్రసంగమును తాను తెలుగున రచియింపగా నాయన కుమారుడు దానిన నాంగ్లీకరించి చదివెను.

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులును మంచి పద్యములు వ్రాయును. చదువును కూడా. ఆయనయూ సంస్కృతాంధ్రములందు పెద్ద పాండిత్యమున్నవాడు. ఆయనకును నా కవిత్వమనిన నెంతయో ప్రేమ. విశ్వనాథ కవిత్వములో నాత్మీయత యున్నది యాయన ప్రసంగ విషయము. ఆత్మాశ్రయముసే యాత్మీయత యనుచున్నాడనుకొందును. స్వవిషయము చెప్పుకున్న చోట్లన్నియు నాత్మీయతగా నుదహరించినాడు. అంకితముగా రచింపబడిన నా పద్యములను - డిగ్రీలు లేని పాండిత్యము వన్నెకు రాని యీపాడు కాలాన బుట్టి - వంటి వాటిని గూడా నీ యాత్మీయతగనే యుదాహరించెను. కల్పవృక్షమునకు వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదును శ్రోతగా జేసి శ్రోత ఫలము నందించుమని యర్థించుటలోను వాత్మీయత యున్నదనినాడు. ఇక శతకములందచ్చముగా నున్నదాత్మీయతయే నాయె. ఇతడీ సందర్భమున నిజాయితీ యను మాటయును వాడినాడు. రెండును భిన్నములో నభిన్నములో తెలియదు.

ఆత్మీయత, నిజాయితీ,కాల్పనికత వీనియన్నిటి యందు సూత్రప్రాయముగా కానిపించునదే జీవుని వేదన యనుకొందును. దానిని సంపత్కుమారాచారి వంటి పండితులు దర్శించగలిగినారు. మార్గములు వేరైననేమి? గమ్యమొకటే గదా! మన సంప్రదాయము నందే యా భిన్నత్వమున్నది. శక్తియున్న వాడు జ్ఞానమార్గమున పరమాత్మను జేరును.

లేని వాడు కర్మమార్గమునచో, భక్తిమార్గమునచో గమ్యమును చేరును. నదులన్నియు సముద్రముల జేరును. ఇదియునట్లే.

ఆ రోజు సుప్రసన్న విస్తృతమైన నా కవిత్వమునకు బీజములు తొలిరోజులలో వ్రాసిన గిరికుమారుని ప్రేమగీతములు, కిన్నెరసాని పాటలు, అంధ భిక్షువు, నీరథము వంటి కావ్య ఖండికలందే యున్నవని యభిప్రాయపడి నాడు, నా తొలి నాళ్ళ పద్యములపై నాకును ప్రీతి గలదు.

మలయవాసిని యను నొక విదుషి కలదు. ఆంధ్ర శేషగిరి రావుగారి కుమార్తె. తండ్రిగారికి వలె నీమెయు నాంధ్ర భాషయందు విదుషి. ఈమె స్త్రీల రామాయణపు పాటలపై పరిశోధించి డాక్టరేటు తెచ్చుకొన్నది. పెల్చేరు నారాయణరా వీమె పరిశోధనను మెచ్చుకొనెనట ! ఆయనయునొక పరిశోధకుడు గదా ! ఈమె తన వ్యాసమున నా పుస్తకములలో పదునాల్గింటిని భావ కవిత్వముగా గుర్తించెను. నా నిర్వచనమును బట్టియే నా భావ కవిత్వమును పరిశీలించెను.

ఆ రోజుననే చేకూరి రామారావను నాతడు నా వచనశైలిని గూర్చి మాట్లాడెను. ఈతని గూర్చి మొదటే కొంత ముచ్చటించుకొంటిమి. ఈతడు నా శైలిని పది విధములుగా వింగడించి యేవేవో పేర్లు పెట్టెను. ఈతడనును గదా ! సత్యనారాయణగారి పదరూపములు గ్రాంథికమైనను వాక్య ప్రయోగములు వాడుకభాషలోనే యుండును. ఈయన వ్రాసినంత వ్యావహారికము వేరొక తెలుగు రచయిత వ్రాయలేదు. నిజమేనేమో! బొమ్మకంటి శ్రీనివాసాచార్యులును ముప్పదేండ్ల క్రిందట తిరుపతిలో నిట్టి మాటయే యొకడనినాడు.

నిఖిలేశ్వరుడని యొకడున్నాడు. అతని యసలు పేరు యాదవరెడ్డియట! గోపాలుడు పరమేశ్వరుడని మార్చుకొన్నట్లునది. అతడొక కవియట. ఇతనిని మరియొకయైదుగును కలిపి దిగంబర కవులందురట! ఇతడన్నాడు గదా! రామాయణ కల్పవృక్షమును, రామాయణ విషవృక్షమును - రెండును నీకాలమునకు పనికిరావివే. ఇతడే పూర్వము నన్నయను గూర్చి యసభ్యముగ నేదో యనెనట. నన్నయ గారినే యనగలిగినవాడు నన్ననకుండ నూరకుండునా !

ఆ రాత్రి ఒకరిద్దరు భద్రిరాజు కృష్ణమూర్తి బసలో కలిసి సాహిత్య ప్రసంగములు చేసిరి. కృష్ణమూర్తి నిఖిలేశ్వరుని మందలించెను. అహల్యా ఖండము నుండి కొన్ని పద్యములను వినిపించి యందలి నూత్న కల్పనలను వివరించెను. ఆ సందర్భమున నొక పద్యమును గూర్చి చర్చించుకొనిరి అది యిది.

నిశినిశి యెల్ల నింద్రునకు నీల సరోరుహాలో చనావచో/నిశిత మనోహరార్థ విపణీ కృత ధీకునకున్, వచోనుగా / విశదతనూ సమార్ద్ర వినివేశన దర్శనధీరుఘరీ సహ/ ప్రశకలితాక్షి గోళునకు సాగియు సాగదు కోడికూయదున్.

ఈ పద్యమునందు వచోనుగా విశదతనూ సమార్ద్ర...అనుచోట '' అవిశదతమా'' అని విడదీసి గోపనమైయున్న తడి యంగమునేదో సూచించెనని కృష్ణమూర్తి యర్థము చెప్పెను. శరభయ్యయు, శ్రీనివాసాచార్యులును దీని నొప్పికొనలేదు. ''స్పష్టమైన శరీరమునే యార్ద్రముగా మనసునందు నిలిపికొని'' అని యర్థము చెప్పిరి రెండును పొసగుచున్నవి. రెండవరోజు సమావేశమునకు విద్యానివాస మిశ్రయను నొత్తరాహ సంస్కృతపండితు డాధ్యక్షము వహించెను. అతడు కొంత కఠినముగా ప్రవర్తించెను. ఈ సమావేశమునకు రావలసిన జి.వి.సుబ్రహ్మణ్యము రాలేదు. భీమ్‌సేన్ నిర్మల్‌యూ రాలేదు. రామాయణ కల్పవృక్షమును తమిళ కంబరామాయణముతోనూ, కన్నడమునందలి పుట్టప్ప రామదర్శనముతోనూ, హిందీలోని సాకేత రామాయణముతోనూ పోల్చి చల్లా రాధాకృష్ణ శర్మయు, తంగిరాల సుబ్బారావు, వై. విజయలక్ష్మియును ప్రసంగించిరి. పాత్ర చిత్రణమునందు కల్పవృక్షమెట్లధికమో నిరూపించిరి.

తంగిరాల సుబ్బారావు వచన కవిత్వము వ్రాయును, పద్యమనిన నిష్టము. కాని ఇతడు ప్రసంగించుచు '' పుట్టప్ప కవిత్వములో లయయెక్కువుండును. విశ్వనాథ కవిత్వమునందు తక్కువుండును'' అని యనినాడు. కిన్నెరసాని పాటల కర్త కవిత్వములో లయ తక్కువుండునా? పైగా ధనుష్ఖండములోని మేనకా విశ్వామిత్రమునందలి పద్యములను మల్లంపల్లి శరభయ్య చదువగా విన్న తరువాత కూడా నిట్లనవచ్చునా? అందునను -

మాకంద తరుశాఖికా లాప
కౌతూహలాకార కలనజేసి
ప్రాతస్సమాయాత శీతానిలాధూత
సాధు పల్లవ హస్త సంజ్ఞజేసి

ఇత్యాది పద్యము విన్న తరువాత కూడా తంగిరాల సుబ్బారవట్లనుట యాశ్చర్యము. జువ్వాడి గౌతమ రావీ పద్యమునెంత లయబద్ధముగా, నెంత రాగయుక్తముగా, నెంత శ్రవణపేయముగా, నెంత మనోహరముగా జదువును! ఈతడెప్పుడును నాయన చదువగా వినలేదా?

మధ్యాహ్న సమావేశమున మహిళా విశ్వవిద్యాలయము నుండి కుసుమ కుమారియట! ఒకామె ఫెమినిస్టు ధోరణిలో మాటాడినది. పులిమీద పుట్ర యన్నట్లు నిది యొకటి. కమ్యూనిజముపై ఫెమినిజము! పిదప కాలమునకు నిజము లెక్కువగునేమో, ఆమె ముఖ్యముగా నవలలో స్త్రీ పాత్రల గురించి మాట్లాడినది వారు పురుషాధిక్యమనియు, లింగవివక్షణ యనియేదో భాష మాట్లాడుదురు. వారి భాషయే నా కర్థముగాదు. మిగిలిన వారికి నివినేమంతయర్థమయినట్లు తోచదు.

సంపత్కుమారాచార్యులని యొక విద్వాంసుడోరుగల్లు నివాసి. ఇతడు విమర్శకుడు, కవి. పద్యము చక్కగ వ్రాయును. మరియు ఛందస్సులో నభినివేశమెక్కువ. ఇతడు జీవుని వేదనను గురించి ప్రసంగించెను. గిరికుమారుని ప్రేమగీతములయందలి '' అస్మదీయ కంఠమున యందాడుచుండె నొక యెదోగీతి బయటకు నుబికి రాదు'' అన్న గీతము నుండి జీవుని వేదనను బయటకు లాగెను. రాజశేఖరుడు ప్రతిభావ్యుత్పత్తుల కన్న భిన్నమనియన్న శక్తియే జీవుని వేదనయని వ్యాఖ్యానించెను.

లక్ష్మీనారాయణయను నాతడు తెలుగు విశ్వవిద్యాలయమునున్నాడు. అతడును నొక యాచార్యుడు. అతడాంగ్ల భాషయందు పండితుడు కాబోలు. నా కర్థము కాని యేవేవో పదములు వాడినన్ను గూర్చి మాట్లాడెను అట్లును మాట్లాడవచ్చును. నా కవిత్వము నర్థము కాని వారుందురు. ఇది యొక రహస్యము. సులభముగా నందరకర్థమైన రహస్యమెట్లగును?

ఈ సమావేశముననే మరొక ఇద్దరు ప్రసంగించిరి. ఒకడు జ్వాలాముఖి. అతని యసలు పేరు రాఘవాచారియట! పవిత్రమైన రాఘవుని నామమున తొలగించుకొని ఏవో మంటల పేర్లు తగిలించుకొనుట యేలకో! ఎవరి పిచ్చి వారి కానందము. అతడు నాపై కత్తిదూసినాడు. ఈతని వాదము నందు క్రొత్త యేమియులేదు. ఏబది యేండ్ల నుండి నేను వినుచున్నదియే. వారికి సంప్రదాయమనిన తెలియదు. పాశ్చాత్యులు చెప్పిన సిద్ధాంతములతో దాగుడుమూతలాడుకొందురు. ఎవరి సంస్కారము వారిది.

ఇనాక్ అనునాతడును నొక యాచార్యుడే! నా యుద్యోగమూడిపోయినప్పుడు నేను రచనలు చేసితిననినాడు. కేవలము ధన సంపాదన కొరకే రచనలు చేసితినని యతని సిద్ధాంతము, ఈ లోకమున బ్రదుకు వాడెవడైన ద్రవ్యము లేకనే యుద్యోగములు చేయుచున్నారా? ద్రవ్యము గ్రహించకయే గ్రంథములు వ్రాయుచున్నారా? పరీక్ష పేపర్లు దిద్దుచున్నారా? ఇబ్బడిముబ్బడిగా ద్రవ్యము నార్జించుచునే యెవరో ద్రవ్యము కొరకు వ్రాసిరనుట గురివిందగింజ చందముగా నున్నది.

ఈ సమావేశమున కధ్యక్షుడైన రంగానాధాచార్యులేమియో వచించునని వేచి చూచితిని అతడేలకో యధ్యక్షోపన్యామీయకనే ముగించినాడు.

ఇందరు పండితులిట్టులొక కవిని గూర్చి ప్రసంగించుట చిత్రముగానే యున్నది. చాలమందికి నా పద్యములు నోటికి వచ్చును. తన పద్యములు ప్రజల నాల్కలపై యుండుట ఏ కవికైనను నందమేకదా ! మంచికో చెడ్డ యందరును " అలఘుస్వాదు రసాతార..." యను పద్యమునుట్టంకించిరి. వేయేండ్ల తెలుగుపద్యము మరొక వేయేండ్ల వరకు జీవించునని యాశ కలిగినది. పద్యమున్నన్నినాళ్ళు విశ్వనాథవంటి బ్రాహ్మీమూహూమూర్తిని మరచుట సాధ్యమగునా?

ఈ ప్రసంగములన్నియు నాంగ్లములో నడిచినవి చాలామంది తెలుగువారు తన ప్రసంగములను తొలుత తెలుగులోనే ఇచ్చి పిదప నాంగ్లమునకు పరివర్తించిరి. ఇందు వ్యాసములు సాహిత్య అకాడమీ ప్రచురించునట ! ఇప్పటి తెలుగు విశ్వవిద్యాలయో పాధ్యక్షులు కృష్ణకుమారియే. కృష్ణకుమారియెవరు ? మా నాయని సుబ్బారావు పెద్ద కుమార్తె. వేయి పడగలందు ధర్మారావుకు కిరీటి యెట్లో నాకు సుబ్బారావు అట్లే.

( ఇది పూర్తిగా ఊహా చిత్రం. ఇందులో అభిప్రాయాలు విశ్వనాథ సత్యనారాయణవిగా ఊహించినవి. ఇందులో కొందరివి లేకపోవటానికి ప్రత్యేక కారణం ఏమీ లేదు.)

ఆంధ్రప్రభ, సాహితీ గవాక్షం
1996 సెప్టెంబరు 1 & 8.

# 'బడు' రాయటం చేతకాని వాళ్లే బడుద్ధాయిలు

తెలుగు పత్రికలు రచనలోనూ, ముద్రణలోనూ, పంపిణీలోనూ వచ్చిన పెనుమార్పులను జర్నలిజం శాఖ బేరీజు వేసుకోవటానికి తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహణలో సుదీర్ఘ సంబంధం ఉన్న అతిరథ, మహారథుల్ని ఒక వేదిక మీదికి తీసుకొచ్చి సముచితమైన ఏర్పాటు చేసి మీ మీ అభిప్రాయాలనూ, ఆలోచలనూ, అంచనాలను చెప్పమన్నారు. ఈ సమావేశాలు 1989 ఏప్రిల్ 11,12 తారీఖుల్లో హైదరాబాద్‌లో తెలుగు విశ్వవిద్యాలయం వారి నన్నయ హాలులో జరిగిన్నై. ఈ సమావేశాలు చాలా ప్రయోజనకరంగా జరిగినట్టు అన్ని పత్రికలూ రాసిన్నై. రెండు రోజుల పాటు జరిగిన ఈ సమావేశాల్లో మొదటి రోజున నండూరి రామమోహనరావుగారు దినపత్రికల్లో మార్పుల్ని గురించి, రెండో రోజు పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారు పీరియాడికల్స్‌లో వచ్చిన మార్పు గురించి ప్రధాన ప్రసంగవ్యాసాలను సమర్పించారు. చర్చల విశేషాలన్నీ పత్రికల్లో వివరంగానే రిపోర్టు అయినాయి కనుక వాటిని గురించి విస్తారంగా ఇక్కడ ప్రస్తావించక్కర్లేదు.

నండూరి రామమోహనరావుగారు తమ ప్రసంగవ్యాసంలో తెలుగు దినపత్రికల్లో వచ్చిన మార్పుల్ని గురించి మాట్లాడుతూ వార్తా సంగ్రహణలోనూ పత్రికా నిర్వహణలోనూ వచ్చిన మార్పుల్ని ప్రధానంగా వివరించారు. ఇదిగో సరిగ్గా ఇక్కడే ఒక చిత్రం జరిగింది.

'ఇది వరకు మద్రాసు నుంచి ప్రచురణ జరిగే ఆంధ్రప్రాంతం నుంచి ఫోనులోనో, టెలిగ్రాం ద్వారానో వార్తలు వెళ్లేవి. రెండూ ఆలస్యంగా చేరేవి. రెండూ ఆలస్యంగా ప్రచురింపబడేవి.'

అని చెపుతూ రామమోహనరావుగారు 'ప్రచురింపబడేవి' అని చదివేసి నాలిక్కరుచుకొని ఏదో తప్పు చేసినట్టు బాధపడి 'సారీ' అన్నారు. ఎందుకో తెలుసా ఆయన అంత బాధపడింది? *బడు* ధాతు ప్రయోగం చేసినందుకు. (నిజానికి *బడు* ధాతువు అని ఎక్కడా లేదు. పడు ధాతువుంది. దాన్ని హేళన కోసం '*బడు*' ధాతువంటున్నారు) ఈ *బడు* ప్రయోగం చుట్టూ అల్లుకున్న అజ్ఞానపు తెరలు చూస్తే ఆశ్చర్యం వేస్తూంది. ఈ తెరలు ఎంత దట్టంగా చుట్టుకొని ఉన్నాయంటే వీటిని ఛేదించటం ఒక పట్టాన సాధ్యమయ్యే పనికాదని నాకే అప్పుడప్పుడు భయం వేస్తుంది. పైగా మహోపాధ్యాయుల వక్కాణలను తీసుకొచ్చి మొహమాట పెట్టేస్తుంటారు.

*బడు* అనే రూపం *పడు* అనే క్రియను వేరు వేరు అర్థాల్లో క్రియకు అను బంధించినపుడు ఏర్పడుతుంది. *తిరగబడు, కనబడు, వినబడు* వంటి శబ్ద పల్లవ క్రియల్లోనూ, కర్మ ప్రధానం చేసి చెప్పిన వాక్యాల్లోనూ దీని ప్రయోగం ఉంటుందని. తెలీక *'బడు'* వ్యతిరేకులకు భయపడి *కనబడు, వినబడు* వంటి క్రియలను వాడడానికి కూడా సందేహించిన వాళ్లని చూశాను.

*బడు* ధాతువుపయోగించేవాళ్లు బడుద్దాయిలు అని ఒక తిట్టు వ్యాప్తి చేసి భయపెడుతున్నారు. ఇది ఒక రకమైన 'భాషా రౌడిజం! *'బడు'* వచ్చే కర్మణి వాక్యాలను రాసిన వాళ్లను రకరకాలుగా హేళన చేస్తుంటారు. కొందరు భాషారౌడీలు. తెలుగులో ఈ కర్మణి *బడు* ప్రయోగాలు సకర్మక క్రియలకే సాధ్యాలు. ఇది తెలియకనో, తెలిసీ అతి తెలివితేటలను ప్రదర్శద్దామనో అకర్మక క్రియలకు *బడు* చేర్చి ఎక్కడాలేని *దొరకబడును, చచ్చబడును* వంటి వాటిని, బలవంతంగా సృష్టించి *బడు* అనే రెండక్షరాల క్రమం భాషలో ఉండగూడదన్నంత వరకూ పోతారు. ఈ పనులు సామాన్యులు చేస్తే మనం పట్టించుకో అక్కర్లేదు. పండితులం, భాషా సంస్కర్తలం అనుకుంటున్న వాళ్లు కూడా ఈ చౌక బారు గమ్మత్తులు చెయ్యటం విచారకరం.

*బడు* వాడకాన్ని నిషేధించాలనే వారు అందుకు చూపించే కారణాలేమిటి? శ్రవణ సుభగంగా ఉండదంటారు. కృతకం అంటారు. సహజం కాదంటారు. ఇవన్నీ అసంగతమైన కారణాలు.

చెవులకింపు, సహజత్వం, కృతకత్వం అనేవి ఆత్మాశ్రయమైన భావాలు (Subjective Concepts ) ఇష్టానిష్టాలకు సంబంధించినవి. భాషాచర్చల్లో వాటి ప్రసక్తి ఉండదు. తెలుగుభాషలో ఇతర భాషల సంపర్కం లేకుండా వచ్చిన వాటిని సహజం అనీ ఇతర భాషల ప్రభావంతో వచ్చిన వాటిని కృతకం అనీ ఒక వాదం చేస్తుంటారు. 'కాకమ్మ కధలు' 'న్యాయం చేకూర్చడం లేదు' 'ఆత్మశాంతికి ప్రార్థించారు వంటివి తెలుగుభాషలో మొదటి నుంచి ఉన్నవి కావు. ఇంగ్లీషును అనుసరించటం వల్ల వచ్చినవి. అయినా వాటిని నిత్యం వాడుతూనే ఉన్నారు. తెలంగాణాలో ఉర్దూ ప్రభావం వల్ల తెలుగులోనూ, తెలుగు ప్రభావం వల్ల ఉర్దూ లోను కొన్ని వాక్య పద్ధతులు ఏర్పడ్డాయి. వాటి నుంచి పరభాషా రూపాలను వేరుచేసి వెళ్లగొట్టాలా? ఇది పరిశుద్ధ భాషా వాదం. దీనికి మరో పేరు భాషా నాజీజం (Linguistic Nazism )

తొలినాటి వ్యావహారిక భాషావాదుల తెచ్చిపెట్టిన తంటా ఇది. మాట్లాడే భాషకు అతి

దూరమైపోయిన రచనా భాషను మళ్లీ మాట్లాడే భాషకు సన్నిహితం చెయ్యటానికి గిడుగు రామమూర్తిగారు, గురజాడ అప్పారావుగారు ప్రయత్నించారు. 'బడు' ప్రయోగం గ్రాంధిక భాషకు మాత్రమే పరిమితమైన లక్షణంగా, కేవలం పురాతన (archaic) రూపంగా భ్రమించి కర్మణి వాక్యాల మీద దాడిచేశారు. వారిననుసరించిన సీతాపతి, నార్ల వేంకటేశ్వర రావుగార్లు ఇదే వాదాన్ని ప్రచారం చేశారు. గతానుతికంగా ఇప్పటి పండితులూ, సాంప్రదాయిక వ్యవహార భాషావాదులూ ఇదే మూఢవిశ్వాసాన్ని ప్రచారం చేస్తున్నారు. బడు ధాతువును బడుద్ధాయిలుపయోగిస్తారని హేళన చేస్తున్నారు.

కర్మ ప్రధాన వాక్యాన్ని ఇంగ్లీషులో Passive అంటారు. ఇంగ్లీషులో అయినా ఇది సాధారణ సంభాషణలో ఉండదు. Have you mailed the letter అని అడిగితే Yes the letter has been mailed by me అని ఇంగ్లీషు వాడు అనడు. Yes, I have అంటాడు. తెలుగులో కూడా అన్నం తిన్నావా? అని అడిగితే, 'అవునండీ, నా చేత అన్నం తినబడింది.' అని ఎవరూ అనరు. కాని ' ఈ విషయం పూర్వాధ్యాయంలో వివరించబడింది' ' ఈ కట్టడం 17వ శతాబ్దంలో నిర్మించబడింది'. 'సత్యం చావలేదు, చంపబడ్డాడు' అనే రకపు వాక్యాలలో *బడు* ప్రయోగం ఇముడుతున్నది.

వాక్యంలో కర్త తెలీనప్పుడూ, కర్త చెప్పటానికి ఇష్టపడనప్పుడూ, కర్తకు ప్రాధాన్యం లేనప్పుడు, కర్మకు ప్రాధాన్యం చెప్పదల్చుకున్నప్పుడూ కర్మణి వాక్య ప్రయోగం అవసరం అవుతుంది.

'బడు' లేకుండా ఇంకోరకంగా చెప్పలేమా? అని కొందరు అమాయకంగా అడుగుతుంటారు. 'బడు' చేసుకున్న పాపమేమిటో అని నా ఎదురు ప్రశ్న. 'బడు'ను వదలించటం కోసం 'చెప్పటం' జరిగింది, జరగటం జరిగింది' అని ఇంకోరకపు 'జరుగు'(డు) వాక్యాలు బలవంతంగా తెచ్చుకొని వాడుతున్నారు. అక్కడికి అని మహా సహజమైనట్టు !

మాట్లాడే భాషలలో ఉండేవే రాసే భాషలో ఉండాలి. ఇంకేవీ ఉండటానికి వీల్లేదు అనే సిద్ధాంతం ఎక్కడుంది? మాట్లాడే భాషలో లేనివి నేనేమీ రాయటం లేదు అని ఎవరన్నా గుండెమీద చేయివేసుకొని చెప్పగలరా?

మాట్లాడే భాషను మించిన విస్తృత ప్రయోజనాలు రాసే భాషకు ఉన్నాయి. అందువల్ల నిస్సందేహంగా రాసే భాష మాట్లాడే భాష కన్నా భిన్నంగా విస్తృతంగా ఉంటుంది. రాసే భాషలో శాస్త్రవిషయాలు, సాంకేతిక విషయాలూ ఉంటాయి. దైనందిన వ్యవహారంలో ఇవి ఉండవు. అట్లాగే సూత్రాలూ, ఫార్ములాలూ, ఈక్వేషన్లూ వంటివి రచనా భాషలో

ఉంటాయి. మాట్లాడే భాషలో ఉండవు. అట్లాగే దీర్ఘవాక్యాలూ, ఒక వాక్యాన్ని ఇంకో వాక్యంలో, దాన్నంతటినీ మరో వాక్యంలో పొదువుకొనే రకపు వాక్యాలు రాసే భాషలో కనిపిస్తాయి. కర్మణి వాక్యాలు కూడా శాస్త్ర రచనలోనూ, విషయ ప్రధానమైన ఇతర రచనల్లోనూ ప్రచురంగా కనపడతాయి. సాంస్కృతికావసరాలకు అనుగుణంగా భాష విస్తృతమయ్యే పద్ధతే ఇది.

శాస్త్ర సాహిత్యం ఎక్కువున్న సంస్కృత రచనలోనూ, ఇంగ్లీషు రచనలోనూ కర్మణి వాక్యాలు ఎక్కువ కనిపించటం విశేషం కాదు. ఆ భాషల ఉన్నతస్థితికి అదొక చిహ్నం అయితే ఏ భాషలో అయినా ఏ వాక్య ప్రయోగాన్నికైనా కొన్ని కట్టుబాట్లు ఉంటాయి. అవి తెలుసుకొని ప్రయోగిస్తే సందర్భశుద్ధి ఉంటుంది. భాషా వ్యవహర్తకు సందర్భ శుద్ధి (Contextual propriety) ని గురించిన పరిజ్ఞానం కూడా ఉంటుందనీ, ఇది భాషా ప్రయోగ దక్షతలో భాగమనీ భాషా శాస్త్రజ్ఞులు చెపుతున్నారు. అందువల్ల *బడు* వ్యతిరేకులకు చెప్పేదేమిటంటే 'బడు' వాడే వాళ్లు బడుద్ధాయిలు కారు. *బడు* వాడటం తెలీనివాళ్లే బడుద్ధాయిలు అని.

*చేరాతలు, 1989 ఏప్రిల్ 30*

# 'బడు' వ్యతిరేకులకు భాషాతత్వం తెలీదు

ఈమధ్య నండూరి రామమోహనరావుగారు సెప్టెంబరులో హైదరాబాద్ వచ్చినప్పుడు కనిపించారు. మేమిద్దరం కలిసినప్పుడు తెలుగు 'బడు' ప్రయోగం గుర్తు వస్తుంది. ఆయన ''మీరు లైసెన్సు ఇచ్చిన తరువాత మళ్లీ- 'బడు' ప్రయోగం విజృంభిస్తున్నదండీ'' అన్నారు. నిజానికి -'బడు' ప్రయోగం వర్థిల్లాలి!'' అని నేను నినాదాలు ఇవ్వడం లేదు. భాషా పరిశోధకులకు భాషలో కనిపించే వాక్య నిర్మాణాలపై రాగద్వేషాలుండకూడదు . (రచయితలకుంటే ఉండొచ్చు. సౌందర్యదృష్టితో వారు కొన్ని నియమాలు చేసుకుంటారు.) భాషలో ఉండే వాక్య భేదాలను పరిశీలించడటం, వాటిని గురించి తాము తెలుసుకొన్న విశేషాలను చెప్పటం పరిశోధకుల పని. భాషా పరిశోధకులకు సౌందర్య దృష్టి అసలు ఉండదనీ కాదు, ఉండకూడదనీ కాదు. సౌందర్యం వస్తుగతం కాదని మాత్రమే. తత్త్వ పరిశీలన చేసేటప్పుడు సౌందర్యదృష్టి జొరబడగూడదు

ఆ మధ్యన నల్లాన్ చక్రవర్తుల రామానుజాచార్యులు గారు (వారు వాల్మీకి రామాయణాన్ని యథామూలంగా అనువదించారు) కనిపించారు. ఆయన 'బడు' గురించి చాలా కాలం నుంచీ ఆలోచిస్తున్నారట. ఆయనంటారు, నన్నయలో ఎక్కువ 'బడు'లున్నాయి. తిక్కనలో అంత ఎక్కువ లేదు. మళ్లీ శ్రీనాధుడి దగ్గరికొచ్చేసరికి పెరిగి పోయినై. ప్రబంధ సాహిత్యంలో అవి మరీ పెరిగిపోయినై. ఆధునిక కవులలో విశ్వనాథ సత్యనారాయణ గారు నిస్సంకోచంగా 'బడు' లు వాడారు అని ఆచార్యులు గారు ఏ రకంగా లెక్కగట్టారో నాకు తెలీదు గాని ఆయన వెల్లడించిన విషయాలు వాస్తవాలేనని నమ్ముతాను. దీన్ని ఏవిధంగా వివరించాలి? నన్నయది కథా కథన శైలి అనీ, తిక్కనది నాటకీయ శైలి అనీ మన సాహిత్యకులు అంటారు. (నాటకీయ శైలి అంటే ఏమిటో భద్రిరాజు కృష్ణమూర్తిగారు భాషా దృష్టితో వివరించగా విన్నాను) నాటకీయశైలిలో ప్రత్యక్ష సంభాషణలు ఎక్కువ ఉంటాయి. సంభాషణశైలిలో ( ఏ భాష అయినా) కర్మణి ప్రయోగాలు తక్కువే ఉంటాయి.

పురాణ కవిత్వం, కథన ప్రధానమైనదనీ, ప్రబంధ కవిత్వం వర్ణన ప్రధానమయిందని వెల్చేరు నారాయణరావుగారు వివరించారు.

పురాణ ప్రబంధాల మార్గ బేధాల్ని ఇంకా వివరిస్తూ ''నిజానికి ప్రబంధం శ్రవ్య

కావ్యం కాదు. అచ్చులో పుస్తకాలలా అనేక ప్రతులు దొరకక పోవడం వల్ల తప్పితే, అది యదార్థానికి ఆనాడే పాఠ్యకావ్యం అయిపోయి వుండేది. శ్రవ్యకావ్య స్థితి నుండి కవిత్వం పాఠ్య కావ్య స్థితికి నడుస్తున్న చరిత్రలో తొలిదశ ప్రబంధానిది. (చరమ దశ వచన కవిత్వానిది'' అన్నారు.)

ఇక్కడ నారాయణరావుగారు శ్రవ్యత-పాఠ్యత అనే కొలమానం ప్రకారం చూస్తున్నారు. ఫోక్ లోరిస్టులు వాడే ఓరాలిటీ, లిటరసీ(orality literacy) కొలమానానికి ఇది సమాంతరంగా ఉంది. రెండిటినీ కలిపి మౌఖిక-శ్రవ్య, లేఖ్య-పాఠ్య కొలమానం అందాం కాసేపు. అప్పుడు ప్రబంధం లేఖ్య పాఠ్య దిశవైపు మొగ్గుతున్నది. *బడు* ఈనాటి రచనా భాషలో ఎక్కువగా ఉండటం బట్టి చూస్తే ప్రబంధ కవిత్వంలో *బడు* ప్రయోగాలు పెరగటాన్ని అర్థం చేసుకోవచ్చు.

*బడు* ప్రయోగాన్ని గురించి చేసే అవహేళనలను ఉపేక్షించి చూస్తే ప్రధానంగా రెండు రకాల వాదనలు కనిపిస్తున్నాయి. అందులో ఒకటి ''ఇది తెలుగు వాక్య పద్ధతి కాదు'' అని. రెండు '' ఇది తెలుగుకు సహజంగా ఉండదు.'' అని. నిజానికీ రెండూ ఒకటే. తెలుగు భాషలో మొదటి నుంచీ ఉంటే సహజం అని. ఈ వాక్య పద్ధతి ఇంగ్లీషు నుంచి వచ్చిందని కొందరిలో ఒక అపోహ ఉన్నట్టు కనిపిస్తున్నది. ఇది నన్నయ్య, తిక్కనలలోనే కనిపిస్తుంటే ఇంగ్లీషు నుంచి వచ్చిందనటం కుదరదు. సంస్కృతం నుంచి వచ్చిందనుకుందాం. అప్పుడదీ పరాయి భాషే కదా! అందువల్ల అది అసహజం అందామా? సంస్కృతం నుంచి వచ్చినవన్నీ అసహజమైనట్టయితే మనం చాలా వదులుకోవలసి ఉంటుంది. భాషల సంసర్గం వల్ల ఒక భాషా ప్రభావం మరో భాష మీద మనకు తెలియకుండానే పడుతుంది. ద్రావిడ భాషల ప్రభావం వల్ల ఇప్పటి ఇండో ఆర్యన్ భాషలలో కొన్ని పద్ధతులు ఏర్పడ్డాయి. ఆ మాట కొస్తే సంస్కృత భాష మీదనే ఈ ప్రభావం ఉన్నట్టు పరిశోధకులు తేల్చారు.

ముఖ్యంగా క్త్వార్థక, అనుకృతి వాక్య ప్రయోగాలు ద్రావిడ భాషలననుసరించినవేనని అంటారు. ఇప్పటి బెంగాలీ, నేపాలీ భాషల్లో క్రియాజన్య విశేషణ ప్రయోగాలు ద్రావిడ భాషల ప్రభావం వల్లనే ఏర్పడినట్టు గుర్తించవచ్చు. తెలుగులాగే బెంగాలీ, ఒరియా భాషల్లో క్రియలేని వాక్యాలున్నై. అందువల్ల ఒక భాష ప్రభావం మరో భాష మీద పడటం అత్యంత సహజమైనది. అది మన ప్రమేయం లేకుండానే జరుగుతుంది.

ఈ *బడు* వాక్యాలు సరిగ్గా ఇదే పద్ధతిలో తెలుగు కన్నడాల్లో కూడా చాలా కాలం నుంచే ఉన్నాయి. వాక్యనిర్మాణం తెలుగులాగే ఉంటుంది. అయినప్పుడు ఈ వాక్య నిర్మాణం ఇంకా ప్రాచీనం -అంటే ఈ భాషలు విడివడకముందే ఉండి ఉండాలి. సుమారు రెండువేల ఏండ్లుగా భాషలో ఉన్న ఒక వాక్య పద్ధతిని అసహజమనీ, తెలుగు వాక్య పద్ధతికి విరుద్ధమనీ, అవటానికి ప్రమాణాలేమిటి?

తెలుగు కర్మణి వాక్యాల్ని 'హిందీ భావవాచ్య' వాక్యాలతో పోల్చటంలో సామంజస్యం లేదు. రెండు భాషల్లో ఒకే రకపు వాక్య పద్ధతి ఉన్నంత మాత్రాన ఆ వాక్యప్రయోగం సరిగ్గా అట్లాగే ఉండనక్కర్లేదు. అట్లాంటి భేదాలను గురించి భాషా పరిశోధకులు వివరంగానే చర్చించారు. ఒక భాష ఒకే వాక్య భేదాన్ని రెండు మూడు రకాల ప్రయోజనాలకు వాడుకోవడం సర్వ సామాన్యం. వాక్యాలను కేవలం నిర్మాణ(structural) దృష్టితోనే కాదు, ప్రయోగ (functional) దృష్టితో కూడా చూడాలి.

ఉదాహరణకు తెలుగులో

ఆయన వస్తే ఇస్తాను

ఆయన వస్తే ఇచ్చాను

అదే వాక్యాలను ఇంగ్లీషులో

I will give it, if he comes

I had given (it), when he came

అని అంటాం. అంటే, తెలుగులో వస్తే, తెస్తే వంటి (ప్రాచీన వ్యాకరణాల్లో చేదర్థకాలు) క్రియల ప్రయోగానికి ఇంగ్లీషులో క్రియకు అన్వయిస్తూ క్లాజుకు మొదట వచ్చే if కూ ప్రయోగ సామ్యంతోపాటు భేదం కూడా ఉంది.

అందువల్ల హిందీలోలాగా

''అతని చేత నిద్రపోబడలేదు

ఆమె చేత నడవబడలేదు

పక్షిచేత ఎగరబడలేదు''

అని తెలుగులో కూడా అనకూడదా? అనే ప్రశ్నకు అర్థం లేదు.

*బడు* వాక్యాలు రాసేవాళ్ళు ఇంగ్లీషు నుంచి ప్రత్యక్షంగా గ్రహించి రాస్తున్నారనుకోవటం వల్ల ఇట్లాంటి ప్రశ్నలు ఏర్పడుతున్నై. ఇక్కడ లాజిక్కు ఏమిటంటే ఇంగ్లీషు నుంచి తీసుకున్నప్పుడు హిందీ నుంచి ఎందుకు తీసుకోగూడదు? అని.

కర్మణివాక్యాలు ప్రజలకర్థం కావు అని మరో వాదం వుంది. అర్థం అవుతుందా లేదా అనేది ప్రయోగాత్మకంగా నిరూపించాల్సి ఉంది. కర్తరి వాక్యాలతో పోల్చి కర్మణి వాక్యాలు అర్థం కావు అనలేం. *బడు* వాక్యాలను అర్థం చేసుకోలేనంత స్థాయిలో తెలుగు పాఠకులున్నారా?

*బడు* ను వ్యతిరేకించేవారు బడులేకుండా ఇంకో రకంగా చెప్పలేమా? అని అడుగుతారు. అసంకల్పితంగా ప్రయోగంలో వచ్చిన *బడు* ను అసహజమని భ్రమపడి దాన్ని పని గట్టుకుని పీకేయాల్సిన ప్రమాదం ఏ ముంచుకొచ్చిందని?

ఇంకో విచిత్రవాదం ఉంది. నిజానికి వాదం కాదు. వింత తర్కం. ఒక పేరాలో అన్నీ 'బడు' వాక్యాలే ఉంటే అది పూర్తిగా అసహజం కాబట్టి ఒక 'బడు' వాక్యం ఉంటే అంత మేరకు అది అసహజం కాదా? అనేది ఈ తర్క పద్ధతి. ఇర్వై గారెలు తింటే అజీర్ణం చేస్తుంది. ఒక్కగారె తింటే ఆ మేరకు అజీర్ణం చెయ్యదా? అని అడిగినట్టుగా ఉంటుంది ఈ తర్కం.

తర్కం విషయం అట్లా ఉంచి వాస్తవ పరిస్థితి ఆలోచిస్తే- బడు వాక్యాలున్నంత మాత్రాన ఏదీ కృత్రిమం కాదు. అవసరాన్ని బట్టి కర్మణి ప్రయోగాల సంఖ్య ఉంటుంది. సంఖ్య ప్రధానం కాదు. ప్రయోగ పద్ధతి ప్రధానం. ఒక surgical report లో వరసగా వాడిన ఈ పది passive వాక్యాలను చూడండి. తెలుగులో కూడా అట్లాంటి అవసరం కలిగితే వాడటంలో తప్పులేదు. ఇది కోలీసిస్టెక్టమీ అనే ఆపరేషన్‌కి సంబంధించింది.

The extralinguistic situation that determines the schematic information is as follows. According to the specialist informant, the procedure that is followed in the cholecystectomy procedure is relatively standard. Elements of the Surgery the the essential to the procedure include.

As incision is made.

The abdomen is opened.

The abdomen is explored.

The gallbladder is grasped with a forceps and drawn upwards.

The cystic artery is closed to prevent bleeding.

After cutting the cystic duct the galibladder is dissected.

A tube is then slipped into the cystic duct.

A chole angiogram is obtained and read by the radiologist.

The cystic duct is then dissected free to its junction with the common duct and closed.

A drain is placed and the wound is closed.

అసలీ సహజత్వ కృత్రిమత్వపు వాదనలు నాకు సరిగ్గా అర్థం కావు. రెండింటినీ ఇంట్యూటివ్‌గా వాడుతున్నారు గాని సుప్రతిష్ఠితమైన well difined అర్థంలో వాడటం లేదు. మానవ జీవితంలో మనిషి సాధించినవన్నీ కృత్రిమ మైనవి. అట్లా సాధించకపోతే మనుషులు మిగతా జంతువుల లాగే అడవుల్లోనే ఉండి పోయేవాళ్ళు.

మట్లాడే భాషలో ఉండేవే సాహిత్య సాహిత్యేతర రచనా భాషల్లో ఉండాలన్న సూత్రీకరణ చేసే హక్కు ఎవరికుంది ? ఉన్న వాటికి సూత్రాలు తయారు చెయ్యగలంగాని, ఇట్లా ఉండాలి ! ఇంతే ఉండాలి. అనే పద్ధతిలో శాసించే అధికారం ఎవరికీ లేదు. ఒకరు రాస్తే తప్పు. వంద మంది రాస్తే అది తప్పుకాదు, పద్ధతి.

ఇంతకీ సాహిత్యంలో కూడా *బడు* వాక్యాలు ఉన్నాయి

విశ్వనాథ సత్యనారాయణగారి ఆంధ్రప్రశస్తిలో చూడండి.

ఎటగనిన బూర్వపల్లవ నృపచరితలె
వ్రాయబడి పాడబడి గీయబడి యుపన్య
సింపబడి శ్రోత్రపేయమై చెన్ను దాల్చె
నీ యంతీంద్రియ శక్తి నా కెట్టు లబ్బె !

శ్రీశ్రీ 'కవితా ఓ కవితా' లో వాడిన " ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం" కలిగించిన స్పందన వల్లే శివసాగర్ తన 'ఉరికంబం' (డిసెంబర్ 1976) అనే పద్యంలో మూడు సార్లు వాడుకున్నాడు. ఆఖరు మూడు లైన్లు చూడండి.

"ఈ రాత్రి
ఉరి తీయపడ్డ శిరస్సు
ఉరినే ఉరి తీసింది "

ఇంతకీ *బడు* వ్యతిరేకులతో వచ్చిన చిక్కేమిటంటే వీళ్లు భాషాతత్త్వం తెలుసుకోరు. స్వకపోలకల్పిత ప్రమాణాలతో శాస్త్ర చర్చలు చేస్తారు.

*చేరాతలు 1989 అక్టోబరు 8*

# వెటకారం వాద పద్ధతి కాదు

కథలూ, నవలలూ రాయటంలో చాలా అనుభవం ఉన్న ఒక రచయిత్రి వాడుక భాష రాసే పద్ధతి గురించి వ్యాస పరంపర ప్రకటిస్తున్నారు. సుదీర్ఘకాలం పరిశ్రమించి పరిశీలనార్హమైన భాషాంశాలను (Linguistic data) సేకరించారు. భాషా పరిశోధకులకు అవి చాలా ఉపయోగిస్తాయి. వాటి ఆధారంగా భాషా చలనం,(linguistic dynamics) ఇంకొంచెం అర్థం చేసుకోవచ్చు.

అయితే ఈ డేటా ఆధారంగా రచయిత్రి చేసిన నిర్ణయాలు వివాదాస్పదమైనవి. మా ప్రొఫెసర్ జెరల్డ్ కెలీగారు అంటుండే వారు. "Conclusions may change but data are sacred" అని

తెలుగులో ఒక రకం కర్మ ప్రధానవాక్యాలను *బడు* ప్రయోగాలనీ, *బడు* వాక్యాలనీ తెలుగు పత్రికా రచయితలు పిలుస్తుంటారు. వాటి మీద ఒక నెగిటివ్ దృక్పథం తయారయ్యింది. ఎవరైనా ఒక రచయిత - *బడు* వాక్యం ఉపయోగిస్తే అతను ఏదో నేరం చేసినట్టుగా కొందరు భావించడం మొదలు పెట్టారు. *బడు* చుట్టూ ఒక లిటరేట్‌ఫోక్‌లోర్ (literate folklore) తయారయింది.

ఇప్పుడీ రచయిత్రి కూడా ఫోక్‌లోర్ సృష్టికి కొంత దోహదం చేస్తున్నారు. కర్మణి వాక్యాల మీద భిన్నాభిప్రాయలు ఉండటంలో తప్పులేదు. అయితే ఆ వాక్య ప్రయోగాలను శాస్త్ర దృష్టి (సైంటిఫిక్‌స్పిరిట్) తో పరిశీలించాలి గాని వాటిని వెటకారాలతో గేలి చెయ్యడం వాటి చుట్టూ కొంత ఫిక్షన్ అల్లటం విషయ పరిశీలనను వక్రమార్గం పట్టిస్తుంది.

శాస్త్ర విషయ ప్రతిపాదనకు హేతుబద్ధమైన వాదాలే (rational arguments) సరైన పనిముట్లు, వాదబలం ఉన్నచోట అవహేళనలు, వెటకారాలు పిట్టకథలు ఎందుకు?

అవి కొందరు పాఠకులకు తాత్కాలిక వినోదాన్ని కలిగించవచ్చు గాని విషయ స్థాపనకు గాని, విషయగ్రహణకు గాని ఏమాత్రం సహాయపడవు. పైగా ఒక్కోసారి రచయితనూ, పాఠకులనూ తప్పుదారి పట్టిస్తాయి. అట్లాంటి ఒకటి రెండు ఉదాహరణలు చూపిస్తాను.

ఉదాహరణకు గిడుగు రామమూర్తి గారు తన్నిన తన్నులతో - *బడు* పద్ధతి మూల బడిందని అన్నారనుకోండి. దాని వల్ల ఏం తెలుస్తుంది? గిడుగు రామమూర్తి గారికి- బడు ప్రయోగం ఇష్టం లేదని, కాని ఒక పండితుడు తంతే ఏ వాక్య ప్రయోగమూ మూల

పడదు. మరో పండితుడు రికమెండ్ చేస్తే ఏ వాక్య ప్రయోగమూ పెరగదు. సామాజికావసరాల కోసమే ఏ భాషా ప్రయోగమైనా పెరుగుతుంది, తరుగుతుంది. రామమూర్తి గారి వ్యావహారిక భాషావాదాన్ని అర్థంచేసుకోవటానికి సామాజిక పరిస్థితులను, భాషాశాస్త్ర చరిత్రను తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. అది వేరే వివరించాల్సిన విషయం గనుక ఇక్కడ దాన్ని గురించి ఇంతకన్నా ప్రస్తావించను. కాని నా ప్రధానమైన అభ్యంతరం గిడుగు రామమూర్తిగారు *బడు* ను తన్నటం గురించే.

అట్లాగే ఇంకో విషయం చూడండి. ఒక రచయిత 'పత్రికా రచనలో భాషాప్రయోగం' అనే వ్యాసంలో ''అటువంటి పద్ధతులు కొన్ని ఈ వ్యాసంలో పరిశీలించబడతై'' ''ఇక్కడ ప్రాచీన భాషలంటే సంస్కృతం ఉద్దేశించబడింది'', అనే వాక్యాలు రాశాడు. ఈ వాక్యాలు ఈ రచయిత్రికి 'తప్పులు' అని తోస్తే తనకు తోచిన కారణాలతో వాక్యాల్ని నిశితంగా విమర్శించొచ్చు. వివరంగా చర్చించొచ్చు. ''ఇది చక్కగా ప్రతి పాఠకుడికీ అర్థం అవుతుందనీ, అర్థమైనా ఇది పాఠకుల మనసులకు భాషకు సంబంధించిన అనుభూతిని ఇస్తుందని ఈ రచయిత అనుకుంటూ వుంటే అది చాలా భ్రమే'' అని వ్యాఖ్యానించారు. ఎవరి భ్రమలు వారికుంటాయి. వాటిని చర్చించుకోవచ్చు. శుభ్రంగా భ్రమలను చెదరగొట్టవచ్చు. అది సమస్య కాదు. ఈ పద్ధతిలో చెప్పడం వల్ల ఆయన శ్రమంతా బూడిదలో పోయబడ్డ పన్నీరు అయిపోయే ప్రమాదమే ఎక్కువగా ఉంది అని చేసే వెటకారమే ఇక్కడ నేను అభ్యంతరం పెట్టే విషయం.

'-బడు' వ్యతిరేకులతో వచ్చిన చిక్కే ఇది. *అవహేళనలతో సమాధానం* చెప్పబోయి ప్రయోగంలో లేని వాక్యాలు సృష్టిస్తారు. దానితో అవతల వారిని, వారి వాదాన్ని చిత్తు చేశామని సంతోషిస్తారు. ఈ విషయాల్ని గురించి ఆలోచించే శిక్షణ లేని వారు నిజమే కాబోలుననుకుంటారు. తప్పుదారి పట్టించటమంటే ఇదే.

పూర్తి వ్యాకరణ చర్చచెయ్యటానికి ఇది సమయం కాదు. కాని క్లుప్తంగా ఇందులో ఉన్న అసంబద్ధతను వివరిస్తాను.

బూడిదలో పోసిన పన్నీరు

బూడిదలో పోయబడ్డ పన్నీరు

ఈ పై రెండు పదబంధాలనూ పోల్చి చూడండి. వీటిని వీటి మూల వాక్యాలతో పోల్చి చూడండి.

బూడిదలో పన్నీరు పోశారు. బూడిదలో పోసిన పన్నీరు. పన్నీరు బూడిదలో పోయబడింది. బూడిదలో పోయబడ్డ పన్నీరు.

కర్మ ప్రాధాన్య వివక్ష కర్మణి వాక్యాల ప్రయోజనం. కర్మపదాన్ని వాక్యానికి విషయం (topic) గానూ, సబ్జెక్టుగానూ చెయ్యటం వల్ల ఆ ప్రాధాన్యం వచ్చింది.

అయితే క్రియాజన్య విశేషణలో నిర్మించిన పదసంబంధానికి హెడ్‌గా వచ్చిన నామం ప్రాధాన్యాన్ని పొందుతుంది.

బూడిదలో పోసిన పన్నీరు.

అనే పదబంధంలో 'పన్నీరు' కు ప్రాధాన్యం వచ్చింది. 'పోయబడ్డ పన్నీరు' అనే కర్మణికి ప్రయోజనం లేకుండా పోయింది.

కాని ఈ కింది జంటను చూడండి.

అడవిలో చంపినపులి. అడవిలో చంపబడ్డ పులి.

పై జంటలో పులి కర్త కావచ్చు. కర్మకావచ్చు (కొన్ని కారణాల వల్ల కర్తగా భావించటానికి ఎక్కువ కారణాలున్నాయి.) రెండో పద బంధంలో పులి కర్మగానే అర్థం చేసుకోవాలి. ఇక్కడ కర్మణికి స్పష్టీకరణ ప్రయోజనం (disambiguating function) ఉంది.

అంతేకాదు.'బూడిదలో పోసిన పన్నీరు' జాతీయం(idiom) లాంటిది. వీటికి స్థిర నిర్మాణం (fixed structure) ఏర్పడి ఉంటుంది. వీటి నిర్మాణం చెదిరితే అర్థస్ఫూర్తి కలగదు. ఇంగ్లీషులో he kicked the bucket అంటే ఉన్న స్ఫూర్తి the bucket was kicked by him అంటే ఉండదు.

భాషను అర్థం చేసుకోటానికి ఒక్క నిర్మాణ సూత్రాలు మాత్రమే చాలవు. ప్రయోగరీతులు కూడా పరిశీలించాలి.

అవహేళన కోసం ఈ రచయిత్రి కల్పనా పద్ధతి (fiction model) ఉపయోగించుకున్నారు. ( ఉద్దేశించినా, ఉద్దేశించిక పోయినా) ఇది కూడా పాఠకులను తప్పుదారి పట్టిస్తుంది. చూడండి.

'' ఆ కార్య కర్త చుట్టుపట్ల గ్రామాల్లో బాగా విమర్శించబడ్డాడు''.

అనే వాక్యం ఉంది. దీనికొక కథ అల్లారు. ఒకాయన పార్టీ పత్రికలో ఉన్న ఈ వాక్యాన్ని గ్రామస్తులకు చదివి వినిపిస్తున్న దృశ్యాల్ని కల్పించారు. 'అయ్యయ్యో ఎక్కడ

పడ్డాడూ' అని ఆ గ్రామస్థుడు కంగారుపడతాడట. ఆ కల్పన ఇంకా కొంత దూరం సాగుతుంది. అంతా 'పడు' కు స్వతంత్ర క్రియగా ఉన్న అర్థాన్ని అనుబంధ క్రియకు ఆపాదించడం మీదనే ఆధారపడింది. దీనికి సైన్స్ ఫిక్షన్‌కి ఉన్న స్థాయి కూడా ఉండదు. సైన్స్ ఫిక్షన్ సైన్స్ విషయాల విస్తృతి(extension) మీద ఆధారపడి పడదు. 'విమర్శించ బడు' లో *బడు* కు వేరే క్రియగా వర్తించే *పడు* కున్న అర్థాన్ని గ్రామస్థుడు గ్రహిస్తాడను కోటానికి ఆధారం లేదు.

సంతోషపడు, దుఃఖపడు, కష్టపడు, భయపడు, విచారపడు, ఆశ్చర్యపడు వంటి క్రియల్లో వచ్చే పడుకు లేని ప్రమాదం కర్మణిలో వచ్చే *బడు* కు ఉంది అనుకోటానికి ఆధారం ఏమిటి?

వెటకారం వాద పద్ధతికాదు. వాదానికి బలం చేకూర్చదు. పైగా వాదాన్ని తప్పుదారి పట్టిస్తుంది. వాదాన్ని బలహీన పరుస్తుంది. చెప్పదల్చుకున్న విషయ గౌరవాన్ని తగ్గిస్తుంది.

సీరియస్ విషయాలు చర్చించేటప్పుడు అలంకారాలూ, కవిత్వ పద్ధతి హానికరం అని గ్రహించిన ఈ రచయిత్రి వెటకారాలూ, అవహేళనలూ ఇంకా ఎక్కువ హాని కలిగిస్తాయని గ్రహించకపోవడం విచారకం.

*చేరాతలు 1989 అక్టోబరు, 29*

# వ్యాకరణ సూత్రాలు

# భాషా వ్యవహారాన్ని బంధిస్తాయా?

చిన్నప్పుడు ఎక్కడో చదివాను కాళ్ళకూరి నారాయణరావుగారి నాటకం. చింతామణి అనే వేశ్య బిల్వమంగళుణ్ణి కొన్ని ప్రశ్నలడుగుతుంది. (వేశ్యలకు కవిత్వం, సంగీతం, నృత్యం, వేదాంతం - ఇలా చాలా విషయాలలో విశేష పరిజ్ఞానం ఉంటుందని ఒక సంప్రదాయం ఉంది.) చింతామణి అడిగిన ఒక ప్రశ్న మాత్రం నాకు గుర్తు. 'అన్నిటి కన్నా కష్టమేమిటి? అని. అందుకు బిల్వ మంగళుడు 'తన్ను గురించి తాను తెలుసుకోవడం' అని సమాధానం ఇస్తాడు. దీని వేదాంతపరమైన అర్థంతో ప్రస్తుతం మనకంత పనిలేదు గాని దాన్ని మామూలు అర్థంలో కూడా అన్వయించుకోవచ్చు.

మన శరీరంలో చాలా భాగాలు ఉన్నాయి. ఇవి పనిచేసే పద్ధతులను ఫంక్షన్స్ అంటారు. వాటి అమరికను సిస్టమ్స్ అంటారు. ఫిజియాలజీ అనే శాస్త్రం చెప్పే వరకు వాటి సంగతి మనకు తెలీదు.

మనసు గుర్రం లాంటిదని, అది ఇష్టం వచ్చినట్టు పరిగెత్తుతుందని మన తత్త్వగీతాల సంప్రదాయం చెబుతుంది. కాని మనసు పనిచేసే విధం మనకు నిజంగా తెలీదు. దాన్ని విశ్లేషించడానికే కాంప్లెక్స్‌లు, ఫోబియాలు, కాన్షస్, సబ్‌కాన్షస్ - మొదలైన ప్రతిపాదనలు చేస్తుంది మనస్తత్త్వ శాస్త్రం.

అలాగే మనం రోజూ మాట్లాడతాం. రకరకాల సన్నివేశాల్లో మాట్లాడతాం. మనం మాట్లాడేటప్పుడు ఏమేం జరుగుతుందో? మెదడులో ఏ కణాల చలనం దీనికి మూలమో, ఏ రకమైన సిస్టమ్ దీన్ని నడిపిస్తున్నదో, ఎన్నెన్ని అంశాలు ఆ సిస్టమ్‌లో అంతర్భాగాలో లేక ప్రభావితం చేసే బహిరంశాలో మనకు నిజంగా తెలీదు. వాటిని అర్థం చేసుకోడానికి చేసే ప్రయత్నంలో భాగాలే భాషా సిద్ధాంతాల ప్రతిపాదనలు.

నిజంగా మనకు అన్నీ తెలిస్తే ఈ శాస్త్రాల అవసరం ఉండేది కాదు. ఈ శాస్త్రాలు కూడా శాశ్వత సత్యాలు ప్రవచించవు. అర్థం చేసుకోవడానికి మార్గాలు చూపిస్తాయి. ఈ శాస్త్రాల్లో కూడా లక్ష్యాల్లో సిద్ధాంత నిర్మితుల్లో (theoretical constructs) పరిశోధన

పద్ధతుల్లో, అసలు పరిశోధకాంశ నిర్ణయం(data) లో ఎన్నో భేదాలు ఉంటాయి. అది వేరే ప్రపంచం. ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి నిర్మించుకున్న వేరే ప్రపంచం.

మామూలు ప్రపంచంలో ఎన్నో విషయాల గురించి మాట్లాడుకుంటాం. సినిమాల గురించి, శరీరం గురించి, భాష గురించి-వ్యవహారానికి ఇవన్నీ అవసరమే. ఇలా మాట్లాడుకోవడం మానవ జీవ లక్షణం. ఎటొచ్చీ మనం మాట్లాడే సందర్భం (plane) ఏమిటి అనేది తెలుసుకుంటే సందర్భాలు కలిసిపోకుండా జాగ్రత్తపడతాం.

1961 ఆగష్టు నుంచి డిసెంబరు వరకు ప్రొఫెసర్ జెరల్డ్ కెలీగారని ఒక అమెరికన్ భాషా పరిశోధకుడు హైదరాబాద్‌లో ఉన్నారు. తెలుగు భాష మీద పరిశోధన చేసేవారు. అప్పుడు ముఖ్యంగా మాట్లాడే తెలుగులో సంధి(Morphophonemics) మీద పరిశోధన చేస్తుండేవాడు. ఒకసారి నేను మాట్లాడే తెలుగులో క్రియాపదాది పరుషాలు వాక్యం మధ్యలో సరళాలు కావడం గమనించారు. అంటే 'కాఫీ దాగాడు, అన్నం దినలేదు, నేంబోతాను,వాడుగొట్టాడు, ఆయన జెప్పాడు' అనే విధంగా అయ్యేవి. ఆ తరువాత నా సంభాషణను టేపురికార్డు చేసి నాకు వినిపించారు. అంతేకాదు ''తిని రాలేదు'' వంటి వాటిలో 'రా' మీద ఉన్న అచ్చు Man అనే ఇంగ్లీషు మాటలో అచ్చులాగా మారడం కూడా చూపించారు. ఇవన్నీ నేను మొదట ఒప్పుకోలేదు. టేపు మీద వినిపించిన తరువాత ఒప్పుకోక తప్పలేదు.

నా భాష నాకు ప్రమాణం కదా ! పైగా అప్పుడు వ్యావహారిక భాషా వాదపు వేడి కూడా జాస్తిగా ఉండేది. విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో అమెరికన్లకు తెలుగు పాఠాలు చెబుతూ-

''కాఫీ దాగావా? నేను దాగను, టీ దాగుతాను''

అని వ్యావహారిక ఛాదస్తంతో సంభాషణలు తయారుచేసేవాణ్ణి. అప్పుడు అదే యూనివర్సిటీలో ఉన్న కొత్తపల్లి వీరభద్రరావుగారు ఈ పద్ధతి ఒప్పుకునేవారు కాదు. సౌమ్యుడు కనుక తగాదా వేసుకోలేదనుకోండి. సున్నితంగా విభేదించారు.

అది వ్యావహారిక భాషే. అంటే మాట్లాడే భాషలో ఉంది. దాన్ని రాయడం తప్పా? ఒప్పా అంటే నేను సమాధానం చెప్పలేను. అక్కడ కావలసింది తప్పొప్పుల ప్రసక్తి కాదు. భాషా బోధన ప్రయోజనాల దృష్ట్యా ఏది ఉపయోగకరం? అనేది ముఖ్యం.

ఇప్పుడు ఆధునిక భాషలో సంస్కృత శబ్దాలు '' తప్పులు'' రాస్తున్నారు. 'ఫిల్మోత్సవ్' అంటున్నారు. అలాగే కాంగ్రేసేతర, కమ్యూనిస్టేతర అని రాస్తున్నారు. వయోపరిమితి, మనోఫలకం. మనోశక్తి వంటి రూపాలు తప్పులా రైట్లా? ఇవి సాధారణంగా మాట్లాడే భాషలో ఉండవు. రాసే భాషలో వీటి అవసరం వస్తుంది. ఒకవేళ మాట్లాడే భాషలో వచ్చినా రాసే భాషనుంచే వస్తాయి. ఏ సంస్కృతం పండితుడు ఈ మాటలు విన్నా 'శివ శివా' అని చెవులు మూసుకుంటాడు. వీటిని తప్పులనాలా? ఇది రాస్తున్నప్పుడు (26-11-89) వచ్చిన ఆంధ్రజ్యోతి అనుబంధంలో పసుపులేటి రామారావుగారు టివి విశ్వామిత్ర వ్యాసంలో 'మన్మథుడు చేసిన మనోగాయం' అని రాశారు. సంస్కృత పద్ధతిలో ఇది పెద్ద దోషమే. ఆకాశవాణి దూరదర్శన్ వారి (1989 నవంబర్) ఎలక్షన్ బులెటిన్‌లో 'ఆధిక్యతలో వుంది/ వున్నారు' అనే వాక్యాలు అధికంగా ఉపయోగించారు. ఆధిక్యత, ప్రాముఖ్యత, ప్రాధాన్యత వంటి తద్ధిత రూపాలను సంస్కృత వ్యాకరణం ఒప్పుకోదు. వీటిని సృష్టించింది సామాన్య ప్రజలు కాదు. చదువుకున్న వాళ్ళే ఈ తప్పులు చాలామంది చేస్తున్నారు. చాలా మంది చేస్తున్నారు కనుకనే వీటిని తప్పులనగూడదు. శాస్త్రకారుడు వీటిని భాషలో జరిగే సహజ పరిణామాలుగా గుర్తిస్తాడు. అనేకులు అసంకల్పితంగా చేసే 'తప్పు'లు తప్పులు కావు. నిజానికి తప్పుల వల్లనే భాషా విస్తృతి (code elaboration ) జరుగుతుంది.

తెలుగులో ఇ.ఈ., ఎ.ఏలను తాలవ్యాచ్చులని(front vowels ), ఉ, ఊ, ఒ, ఓలను ఓష్ఠ్యాచ్చులని (back vowels ) పిలుస్తారు. ఈ అచ్చులకు ముందు క్రమంగా ఉచ్చారణలో య,వలు చేరతాయి. యిల్లు, యీమె యెక్కడ, యేమిటి? వుంది, వూరు, వొకటి, వోపిక- అనే విధంగా.

ఉచ్చారణలో ఉన్నట్టు రాయాలిగా! అందుకని కొందరు య,వలు చేర్చి రాస్తారు. వ్యావహారిక భాషా వాదాన్ని సమర్థించేవారు ఇలాగే రాయాలని అంటారు. రాచమల్లు రామచంద్రారెడ్డిగారు ఎప్పుడు రాసినా అలాగే రాసేవారు. నిజానికి య,వ లకు ఈ పరిసరంలో అర్థభేదక శక్తి లేనందువల్ల రాయనక్కర్లేదు. ఒకవేళ రాసినా అన్ని చోట్లా రాస్తే అదొక పద్ధతి. కాని ఇటీవల పత్రికా రచయితలు, కథారచయితలు ఇంకా చాలామంది యకారం, రాయరు, వకారం రాస్తారు. అదీ ఉ ఊ ముందు మాత్రమే రాస్తున్నారు. రాయడం రైటనుకుంటే, అన్నిచోట్లా రాయాలి. తప్పు అనుకుంటే, అన్నిచోట్లా మానేయాలి. ఒక్క ఉ, ఊల ముందు మాత్రమే వకారం రాయడంలో ఔచిత్యమేమిటి?

సంస్కృత పదాల్ని ఈ సూత్రం నుంచి మినహాయిస్తానంటారు నండూరి రామమోహనరావు గారు. సూత్ర పద్ధతిలో ఆలోచిస్తే ఈ సూత్రం (phonetic rule ). *య, ఎ* లు రాయని చోట ఈ సూత్రానికి భంగం (violation ) జరిగినట్టే. ఈ సూత్రం పాటించక్కర్లేదనుకుంటే రాసిన చోట తప్పు అవుతుంది, తప్పొప్పుల పద్ధతిలో చూస్తే.

ఉ, ఊల ముందు వకారం చాలా ఎక్కువ మంది రాస్తున్నారు. నా మట్టుకు నేను అచ్చులే రాస్తాను. కాని మా టైపిస్టు సుధకు తెలుగు పత్రికలు, నవలలు బాగా చదివే అలవాటు ఉంది. అందుకని నేను ఉ, ఊలు రాసినా ఆమె వు, వూలు టైపు చేస్తుంది. నేను దిద్ది పంపినా మళ్ళీ అవి చేరాతల్లో ప్రత్యక్షమవుతాయి. మరి ఈ 'తప్పు' ఇంత మంది ఇంత తరుచుగా ఎందుకు చేస్తున్నారు? అయితే నేను దీన్ని తప్పు అని ఎప్పుడూ అనుకోలేదు. అనలేదు. తప్పొప్పులు వెతకడం నా పనికాదు. అంతమంది అలవాటును తప్పనడం నాకు సమ్మతం కాదు. దానికి కారణాన్ని వివరించడం నేను చెయ్యాల్సిన పని. ఇది perception కి సంబంధించిన విషయం. వ కారం ఉచ్చారణలో వినిపించడంతో పాటు కనిపిస్తుంది. అది సంవృతాచ్చు అయితే ఇంకా ఎక్కువ వినిపిస్తుంది, కనిపిస్తుంది. దీన్నే perceptual reality అంటారు. ఈ విధంగా *'ఉ'* కారం ముందు వ కారం చేరడాన్ని వివరించవచ్చు. సూత్రాలు, సూత్ర భంగాలు formulations అవుతాయి కాని, explanations కావు. ఈ రెంటికి శాస్త్రంలో భేదం ఉంది.

తెలుగు భాషకు సంబంధించినంతవరకు మన భాషా సూత్రాలే సరిగ్గా అర్థం కాలేదు. అరకొరగా అర్థమైన రెండు మూడు సూత్రాలు పట్టుకుని అందరూ తప్పులే రాస్తున్నారు అని త్వరపడి నిర్ణయాలు చెయ్యడం విజ్ఞత కాదు. కనీసం శాస్త్ర పద్ధతి కాదు. భాషా వ్యవహారం (మాట్లాడేదైనా, రాసేదైనా) కేవలం సూత్రాల మీదనే ఆధారపడి ఉండదు. భాషా వ్యవహారాన్ని నడిపించే విషయాలు చాలా ఉన్నాయి. ఈ విషయంలో అత్యధికంగా కృషి చేసిన టాల్మీగివోన్(Talmy Givon ) ఏమంటున్నాడో వినండి.

The human communicator is not a deterministic user of an autonomous, subconscious grammar as Chomsky would have us believe. Rather, he makes communicative choices. He uses rules of grammar for a communicative effect He may choose to break the rule for an effect,such as poetics, metaphor, or semantic extension. He may choose to break the rule under the pressure of conflicting communicative requirements which take precedence (i.e., whose breaking will result in greater loss of communicative efficiency.) He may also choose to forego the use of more

efficient strategy in favour of a less efficient one and take the penalty in terms of decreasing effic'ency of communicat'on, decreasing clarity, increased ndeterm nancy, etc. In situations where time is not an issue, the penalty is argely illusory.

'Talmy Givon *On understanding grammar'* New York: Academic Press, 1979, Page - 32

భాషా వ్యవహారం కేవలం భాషా సూత్రాల వల్ల జరగదని, వ్యవహార సామర్థ్యం కోసం అవసరమైతే వ్యవహర్తలు సూత్రాలను ఉల్లంఘిస్తారని గివోన్ మాటల సారాంశం. సూత్రోల్లంఘనానికి చాలా కారణాలుంటాయని కూడా ఆయన అంటున్నారు.

అయితే గివోన్ ప్రధానంగా మాట్లాడే భాషనే దృష్టిలో పెట్టుకుని ఈ మాటలంటున్నాడు. రాసే భాష కూడా మనిషి చేసే భాషా వ్యవహారమే కాబట్టి అక్కడా ఇలాంటి సూత్రోల్లంఘనం జరుగుతుంది. అందుకు ఎవరూ అతీతులు కారు. ఉదాహరణకు ఆంధ్రజ్యోతి 24-10-1989 వీక్లీలో ''ఆత్రేయ పశ్చాత్తాప పడినట్టే, కాని'' అనే శీర్షిక క్రింద రంగనాయకమ్మగారు రాసిన ఈ మొదటి వాక్యం చూడండి.

''తన ప్రవర్తనను ప్రశ్నిస్తోన్న ఆ వుత్తరాన్ని ఆత్రేయ ఆనాడే చింపెయ్యకుండా ఇంతకాలం దాచి వుంచి చివరికి తన తదనంతరం బయటికి ఇచ్చారంటే 'ఈ విమర్శకు నేను అర్హుడినే, నా నేరం లోకం తెలుసుకోవలసిందే' అని భావించారన్నమాట!

దాచివుంచి, బయటికి ఇచ్చారు అనే రెండు క్రియలున్నాయి. ఈ రెంటికీ ఒకే నామం ''సమానాశ్రయం''గా ఉండాలి అని బాల వ్యాకరణం అన్నది. దాన్ని ఆధునికులు same subject constraint అంటారు. ఇక్కడ రెండు క్రియలూ అన్వయించే నామం ఒకటేనంటే అర్థ విపర్యయం (semantic anamoly) అవుతుంది. వేరంటే వాక్య నిర్మాణం సూత్ర భంగం అవుతుంది. (syntactic violation) ఏ విధంగా చూసినా ఇది నిర్మాణ క్రమ భంగమే.

అయితే ఈ వాక్యంలో 'తదనంతరం అందేటట్టుగా' అని గాని, 'తదనంతరం అచ్చుయ్యేట్టుగా' అని గాని ఉంటే అర్థ విపర్యయం రాదు. ఒకవేళ రంగనాయకమ్మ గారు అలా రాసి ఉండవచ్చు కూడా. అచ్చులో ఎగిరిపోవడానికి అవకాశం ఉంది. నేను చేసిన వ్యాఖ్య అచ్చుల్లో కనిపించే వాక్యానికే వర్తిస్తుంది.

భాషా వ్యవహారాన్ని తప్పొప్పుల పద్ధతిలో అర్థం చేసుకోలేమనేదే ఈ చర్చ సారాంశం.

*చేరాతలు 1990 ఫిబ్రవరి 25*

# అజ్ఞానాన్ని జ్ఞానంగా అమ్ముకోటమే దారుణం

భాషా శాస్త్రంలో పరివర్తన సిద్ధాంతం అని ఒకటుంది. ఆ సిద్ధాంతం ప్రకారం భాషలో వాక్యాల్ని నిర్మాణ స్థాయిల్లో విశ్లేషించాలి. వాటిని గుప్తనిర్మాణం(deep structure) వ్యక్త నిర్మాణం (surface structure) అని పిలుస్తారు. అసలవి ఉన్నాయా లేవా అనే సంశయాలెట్లాగూ ఉన్నాయనుకోండి. అది వేరే విషయం. కాని 1965-1970 మధ్యకాలంలో అని ఉన్నాయనుకొనే వ్యాకరణ రచన జరిగింది. దాని ప్రకారం వాక్య నిర్మాణానికవసరమైన సర్వ ముఖ్య విషయాలూ గుప్త నిర్మాణంలో ప్రతిపాదించి అవసరమైనప్పుడు ఆయా రూపాలను నిష్పన్నం చేస్తారు. దీన్ని ఛార్లెస్ హాకెట్ (Charles Hockelt) 'టైం బాంబు' సిద్ధాంతం అని హేళనగా పిలిచేవాడు. అంటే గుప్త నిర్మాణంలో టైంబాంబులు పెడితే అవి ఆయా సమయాల్లో పేలి వ్యక్త నిర్మాణపు విశేషాలుగా అవతరిస్తాయి.

వాక్య నిర్మాణ వ్యాకరణలో గుప్త వ్యక్త నిర్మాణాలూ రెండూ సమప్రతిపత్తి కలిగినవే. ఏ ఒకటి తక్కువైనా వ్యాకరణం అసంపూర్ణమే. ఏది గుప్త నిర్మాణ విషయం అనేది వ్యాకర్త ఎన్నో భాషా విశేషాలను, సిద్ధాంతపరమైన సదుపాయాలను దృష్టిలో ఉంచుకొని చేస్తాడు. అయితే ఆ కాలంలోనూ( ఆ తరువాత మరికొంత కాలం వరకు కూడా)అన్నిటినీ గుప్త నిర్మాణంలో చేర్చి వ్యాకర్తలు ఆత్మ తృప్తి పొందేవారు. రసానంద సహోదరమైన వ్యాకరణానందాన్ని పొందేవారు.

మన తెలుగులో కూడా అట్లా చెయ్యకపోలేదు. ఉదాహరణకు - అతను -మంచి వాడు అనే వాక్యంలో క్రియలేదు. కాని అతను మంచివాడు కాదు, అతను మంచివాడు అయితే నాకేం, అతను మంచివాడయినా ప్రయోజనం లేదు- ఇట్లా రకరకాలుగా వచ్చే వాక్యాల్లో *కాదు, అయితే, అయినా* అనేవి క్రియా రూపాలు. అసలు వాక్యంలో క్రియ లేకుండా ఇవి ఎక్కడి నుండి వచ్చాయి? కాబట్టి గుప్త నిర్మాణంలో క్రియ పెట్టెయ్యమన్నారు. తెలుగు క్రియాంత భాష కదా! క్రియలేకపోతే ఈ వాక్యాల్లో క్రియాంతత్వాన్ని ఎట్లా నిరూపించాలి అనే నాసిరకపు వాదాల వరకూ చేసిన వాళ్లు లేకపోలేదు.

సందు చూసుకొని భాషా శాస్త్రం పాఠం (ప్రైవేటు) చెప్పేస్తున్నాడేమిట్రా బాబూ ఈ 'చేరా' అనుకోకండి.

నా ప్రధాన మేధానుభవం(intel ectual experience ) భాషా శాస్త్రంతో గనుక చాలా 'పాఠాలు' ఆ అనుభవం నుంచే నేర్చుకుంటాను. అంతకన్నా వేరే కారణం లేదు. ఇంతకీ విషయం ఏమిటంటే ఆ కాలపు భాషా శాస్త్ర పరిశోధకులు గుప్త నిర్మాణానికి ఎక్కువ విలువ ఇచ్చేవారు. వ్యక్త నిర్మాణం అంటే అదేదో తక్కువదని చిన్న చూపు చూసేవారు. ఎందువల్ల? అని ప్రశ్నించుకొంటే తేలేదేమిటంటే.

'గుప్త నిర్మాణం వ్యక్త నిర్మాణం కన్నా విలువైనది'

ఈ రకమైన విలువలు ఆరోపించడం మనుషుల ఆలోచనా సరళిలోనే ఉందేమో! ఉదాహరణకు తెలుగులో 'అతను చాలాపైకి వచ్చాడు' అంటే 'బాగుపడ్డాడు' అని అర్థం. 'కింద'కన్నా 'పైన' ఎందుకు విలువైనది కావాలి? పై నుండి వానకురిసే మాట నిజమే. కాని 'కింద' నుంచి కదా పంట వచ్చేది! మనుషులు 'కింద' కన్నా 'పైన' అనేదానికి ఎక్కువ విలువ ఇస్తారన్నమాట! స్వర్గం పైన ఉంటుంది. కింద నరకం ఉంటుంది అనే భావనకు మూలం ఈ విలువల ఆరోపణే.

'చెడిపోయాడు' అనటానిక పతనమయ్యాడు అంటాం. అంటే కిందపడ్డాడు అని అర్థం.

అట్లాగే మార్క్సిస్టులు పునాది ఉపరితల నిర్మాణం అనే విషయాల గురించి మాట్లాడ తారు. సమాజ నిర్మాణంలో లేక ప్రవర్తనలో ఆర్థిక వ్యవస్థ పునాది. సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక విశేషాలు ఉపరితం నిర్మాణం మీద ఆధారపడి ఉంటాయి. అయితే ఉపరితల నిర్మాణంలో పరస్పర సంబంధాలుంటాయి. కాని కొందరు మార్క్సిస్టు ఫండమెంటలిస్టులు అన్నిటినీ పునాదికే అంటగట్టేస్తారు. ఉపరి తల విషయాల కుండే స్వతంత్ర ప్రవర్తనను విస్మరిస్తారు. పునాదికే అన్ని విలువలనూ ఆపాదిస్తారు.

అట్లాగే మార్క్సిస్టు సాహిత్య విమర్శను తీసుకోండి. వస్తువు - రూపం అనే విభాగాలు చేస్తారు. ( ఈ విభాగం ఎంత కచ్చితంగా, sharp గా చెయ్యొచ్చునో నాకింకా అనుమానమే) వస్తురూపాల్లో వస్తువుకు ఎక్కువ విలువ ఇస్తారు. వస్తురూపాలు రెండూ విలువైనవే, వారి వారి శిక్షణను బట్టి వస్తు విమర్శ, రూప విమర్శ చేస్తుంటారు. ఈ రెండూ కలిస్తేనే సాహిత్య సమదర్శనం అవుతుందని చేప్తే కొందరు వినిపించుకోరు. రూప విమర్శ (పరిశోధన) చేసే వాళ్లను, ఫార్మలిస్టులని తిట్టేస్తారు. ఇందుకు లియోన్ ట్రాట్స్కీమొదటి కారణం 'సాహిత్య వస్తురూపాల్లో వస్తువు విలువైనది. రూపం పనికి మాలినది. లేకపోతే

ఎట్లున్నా ఫరవాలేదు' అనే భావం ఉండటమే ఇందుకు కారణం.

దీనికి అనురూపమైనదే ఇంకోటి ఉంది. ఇటీవల ప్రజాసాహిత్యం అనే మాట ఒకటి తరచుగా వినపడుతున్నది. అప్పుడెప్పుడో ( 5 0 వ దశాబ్ది మధ్యభాగం) చింతా దీక్షితులు గారు ఏ ముహూర్తాన్నో జానపద సాహిత్యానికి ప్రజా సాహిత్యం అని పేరు పెట్టారు. కమ్యూనిస్టు అభిమానుల్లో 'ప్రజా' అనే మాటకు ఎంత విలువ ఉందీ మనం ఎరిగిందే, అక్కడి నుంచి ఒగ్గు కదలు, బుర్రకథలు, కోలాటం పాటలు, ఇట్లాంటి వాటి కన్నిటికీ ప్రజాసాహిత్యం- ప్రజా కళారూపాలు అనే పేరు పెట్టేశారు. అవే విలువైనవి. నాగరికతాభి వృద్ధితోపాటు సాధించిన వన్నీ పనికిమాలినవి (కనీసం విలువ తక్కువని) అనే అభిప్రాయం అవ్యక్తంగానైనా వ్యాప్తిలో ఉంది. పైకి అనకపోవచ్చుగాని మిగతావన్నీ ప్రజా వ్యతిరేకమైనవి అన్న అభిప్రాయం ఇంకా కొంత మందిలో ఉందనే నా అనుమానం. ఏదైనా ఒక పుస్తకాన్ని ప్రచారంలో పెట్టాలంటే దాని పేరులో 'ప్రజా' అని పెట్టండి 'క్లిక్' అవకపోతే చూడండి. ఈ వ్యాపార సమాజంలో ఈ మాటక్కూడా మారకపు విలువ వచ్చింది.

ఇప్పుడేమో తెలీదుగాని కొంతకాలం కిందట సినిమాలు కొన్ని విలువలను ప్రచారం చేశాయి. కాంచనమాల నటించిన సినిమాలు చూడండి. వంగి వంగి గూనిగా నడవటం స్త్రీత్వం. సావిత్రి సినిమాలు చూడండి అతిగా సిగ్గుపడటం స్త్రీత్వం. వాణిశ్రీ సినిమాల్లో వంకరంగా నడవటం, నుంచోటం స్త్రీత్వం. ఈ విలువలు స్పష్టంగా కనపడవు. కాని చూస్తే గ్రహించవచ్చు.

గాంధీగారి పుణ్యమా అని పట్టణాల కన్నా పల్లెలకు విలువ వచ్చింది. మన సాహిత్యమూ, కళలూ ఈ విలువను ప్రచారం చేసినై. దువ్వూరి రామిరెడ్డి, ఏటుకూరి వెంకట నరసయ్య పల్లెజీవితాలను గ్లోరిఫైచేస్తూ పద్యాలు రాశారు. అవసరానికి వైద్య సహాయం అందక పోతే రోగులుపడే అవస్థలు ఈ కవులకు అర్థం అయి ఉండదు. ఆరోగ్యం బాగా ఉన్నంత వరకు వేయించిన ఊచ బియ్యం, తంపటేసి కాల్చిన వేరు సెనక్కాయలు రుచిగానే ఉంటాయి.

మాట్లాడే భాష - రాసే భాష అని రెండు రకాల భాషా వ్యవస్థలున్నాయనుకోండి. వీటిల్లో మాట్లాడే భాష ప్రామాణికమైనది. రాసే భాష దీనికన్నా భిన్నంగా ఉంటే అది తప్పు అనే వాదం ఒకటి ఇప్పుడు స్పష్టమైన రూపంలో వచ్చింది. దీనికి మూలాలు చరిత్రలో ఉన్నాయి. ప్రాచీన సాహిత్య భాషే రాసే భాషగా ఉన్నప్పుడు ఆధునిక వచన రచనకు అది సరిపోలేదు. అందుకు కొత్త రచనా భాష కావాలని గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు గార్లు ఉద్యమం నడిపారు. దీన్నే వ్యావహారిక భాషోద్యమం అంటారు. తమాషా ఏమిటంటే

వ్యావహారిక భాషోద్యమం కొత్త రాసే భాష కోసం వచ్చింది. మాట్లాడినట్టే రాయమని చెప్పటానికి కాదు.

ఆధునిక భాషాశాస్త్రం కూడా మాట్లాడే భాషకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చింది. దానికి కారణం ఉంది. ఒకప్పటి భాషాశాస్త్రం లిఖిత భాషలను ఎక్కువ పట్టించుకొన్నది. యూరపియన్ భాషలపై తులనాత్మక పరిశీలన ముమ్మరంగా జరిగిన పందొమ్మిదో శతాబ్దపు పరిస్థితి అది. తులనాత్మక దశనుండి వర్ణనాత్మక దశకు భాషా పరిశోధన మళ్లినప్పుడు మాట్లాడే భాషల సంఖ్య ఎక్కువగా ఉన్నందున ఆ పరిశోధనకు భాషాశాస్త్రం ప్రాధాన్యం ఇచ్చింది. అందుకని భాషను నిర్వచించేటప్పుడు మాట్లాడే భాషలను దృష్టిలో పెట్టుకొనే చేశారు. అది నిర్వచనానికి సంబంధించింది. పరిశోధన పరిధికి సంబంధించింది. విలువలకు సంబంధించింది కాదు. ప్రామాణికతకు సంబంధించి కాదు. మాట్లాడే భాష రాసే భాష రెండూ భాషా వ్యవస్థలో భాగాలే. రెండూ వేరువేరు పనులు నిర్వహించడటానికి ఏర్పడ్డ వ్యవస్థలు రెంటికీ భేదం ఉండొచ్చు. అక్షరాస్యత పెరుగుతున్న కొద్దీ రాసే భాషలో కొత్తగా ప్రవేశించినవికాని, విస్తారంగా వ్యాప్తిలో ఉన్నవి కాని మాట్లాడే భాషలో ప్రవేశించవచ్చు. అప్పుడు ఈ రెంటికీ అభేదం ఏర్పడొచ్చు. అక్షరాస్యత ఎక్కువున్న సమాజాల్లో రాసే భాష నుంచి మాట్లాడే భాషకు చాలా నిర్మాణ విశేషాలు ప్రవేశిస్తున్నాయి.

మాట్లాడేది మనుషులే. రాసేదీ మనుషులే. 'మాట్లాట్టం మాత్రమే వచ్చిన వాళ్ల భాషలో 'తప్పులు' చెయ్యరు, రాయటం కూడా వచ్చిన వాళ్లు పోనీ వాళ్లలో చాలా మంది, (వాళ్లలో రచయితలు, భాషావేత్తలు కూడా ఉన్నారు సుమా!) 'తప్పులు' రాస్తారు అనుకోటం, అంతే కాదు ఆ 'తప్పులు' దిద్దుకోమని కొందరు హెచ్చరించడం, ఆ హెచ్చరికను కొన్ని పత్రికలు ప్రచారం చెయ్యటం ఇటీవలి కాలంలో జరిగిన అద్భుతాలు (miracles ) ఈ భావనకు కారణం ఏమిటి?

''మాట్లాడే భాష ప్రాతిపదిక కాబట్టి అందులో తప్పులుండవు. అది స్వచ్ఛమైనది. అమోఘమైనది. అఘరహితమైనది. రాసే భాషలోనే అపభ్రంశాలు వస్తాయి. మాట్లాడింది మాట్లాడినట్టు రాస్తే ఈ అపభ్రంశాలు ('తప్పులు') ఉండవు'' అనే అమాయకపు టాలోచనలో ఇందుకు కారణం.

అమాయకత్వం ఫరవాలేదు. అజ్ఞానాన్ని కూడా సహించవచ్చు. అజ్ఞానాన్ని జ్ఞానంగా అమ్ముకోటమే దారుణం.

*చేరాతలు 1991 మార్చి 3*

# తప్పొప్పుల పద్ధతిలో భాష అర్థం కాదు

''అక్షరాస్యత పెరిగి రాసే భాషకూ మాట్లాడే భాషకూ అభేదం ఏర్పడితే అప్పుడు పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుంటుంది. తప్పులతో వున్న భాష క్రమంగా అంతరించి సక్రమంగా వున్న భాష స్థిరపడి ఆ విధంగా అభేదం ఏర్పడితే మంచిదే కానీ తప్పుల తడక భాషే మిగిలితే మన గతి ఏమవుతుంది? అభేదంగా వుంటాం కనుక సరైన భాషకూ, తప్పుడు భాషకూ భేదం తెలీకుండా వుంటామనా? అందువల్లనే రాసే భాషలో తప్పులు లేకుండా చూసుకోవలసిన అవసరం వుందని అర్థం కావడం లేదా?''

అర్థం కావడం లేదా? అని ఈ సమీక్షకులు అడుగుతున్నారు గాని నిజంగా దీన్ని అర్థం చేసుకోటానికి ఒకటి రెండు సార్లు ప్రయత్నించాను. ఇప్పటికీ పూర్తిగా అర్థమయిందని చెప్పలేను. అందుకు కారణాలు వాక్యనిర్మాణం కాదు.రాసే భాషకూ, మాట్లాడే భాషకూ ఉండే సంబంధం గురించి ఈ రచయిత ఏమనుకుంటున్నారు అనేది ఒకటి. 'తప్పులు' అంటే వీరి ఉద్దేశం ఏమిటి? అనేది రెండోది. ఈ రెండూ ముఖ్యమైన విషయాలే. పైగా రెంటికీ పరస్పర సంబంధం ఉంది. అయినా రెండిటినీ ఒకేసారి పరామర్శించడం ప్రస్తుత పరిమితిలో వీలుకాదు కనుక మొదటి సమస్యను ప్రస్తుతానికి వాయిదా వేస్తున్నాను. పైగా అది అతి విస్తృతమైన సమస్య. ఎన్నో విషయాలు స్పృశించాల్సి వుంటుంది.

భాషలో తప్పుల్ని గురించి ఇటీవల చాలా మంది చాలా ఆందోళన పడుతున్నారు గనుక ఆ విషయమే ప్రస్తుతానికి పరిశీలిద్దాం. ఉదాహరణకు నేను కోట్ చేసిన వాక్యాలే చూడండి. 'పరిస్థితి అధ్వాన్నంగా వుంటుంది.' 'మన గతి ఏమవుతుంది' అనే మాటలు ఆందోళను సూచిస్తాయనుకుంటున్నాను.

ఇప్పుడు ఈ తప్పు ఒప్పుల గురించి వీళ్ళు మాట్లాడే పద్ధతికీ, గ్రాంధిక భాషా పండితులు మాట్లాడే పద్ధతికీ సారంలో ఏమన్నా తేడా ఉందా? కాకపోతే తప్పులంటే ఏవో వాళ్ళకి ఒక అభిప్రాయం స్పష్టంగా ఉంది. ఈ కొత్త శాసకులకు ఆ స్పష్టత లేదు.

ప్రాచీన కావ్య రచనా భాష ఆధారంగా వ్యాకర్తలు కొన్ని విషయాలు ఏర్పరచారు. సూత్రాలు రచించారు. వాటికి దూరమైతే తప్పులన్నారు. పోతన్న ధూర్జటి లాంటి మహాకవులు కూడా ఆ నియమాలన్నిటినీ పాటించలేదని తప్పుపట్టారు.

ఇప్పుడు కొత్త శాసకులు భాషను సవిమర్శకంగా పరిశీలించింది లేదు. ఏ భాష

మీదా పరిశోధించింది లేదు. తమకు అరకొరగా అర్థమైన రెండు సూత్రాలు పట్టుకొని బెత్తం పుచ్చుకొని ఇదిగో ఇక్కడ దీర్ఘాలు లేవు, ఇక్కడ విభక్తి లేదు అని దండించడానికి పూనుకున్నారు.

అసలు సూత్రాలంటే ఏమిటి? చేతనంగా ఉన్నవాటినే సూత్రాలనాలా? సూత్రాలు అచేతనంగా ఉంటాయా? సూత్రాలు ప్రవర్తించే పద్ధతేమిటి? వాటి (function) ఏమిటి? భాషా వ్యవహారం సూత్రబద్ధంగా ఉంటుందా. అనే విషయాల మీద అనేక ఆలోచనలు విరివిగా జరుగుతున్నాయి. శాస్త్రజ్ఞులు వీటి మీద ప్రయోగాలు జరుపుతున్నారు. ఆ ఫలితాలు శాస్త్ర పత్రికల్లో వస్తున్నాయి. ''అవేమి మాకక్కర్లేదు. మాకు తెలిసిన ఈ రెండు సూత్రాలూ పట్టుకుని నిర్ణయాలు చేసేస్తాం'' అని కొందరు అంటే, వాటికి పత్రికలు ప్రచారం కల్పిస్తున్నాయి. ఇందుకు విషయ గౌరవం కారణం కాదని, వ్యాపార దృష్టే కారణమని తెలుసుకోవటం ఏమంత కష్టం కాదు. ఈ సూత్రాలు నిజంగా సూత్రాలా? కావా. వీటి తత్వం ఏమిటి? అని తెలుసుకుందామని బెత్తం పుచ్చుకున్న వారికి లేదు సరే, బెత్తాన్ని సపోర్టు చేసేవారికి కూడా లేకపోవడం విచారకం.

దీర్ఘాలు మాత్రమే తీసుకోండి. మాట్లాడే భాషలో ఈ దీర్ఘాల సూత్రం నిత్యంగా అన్ని మండలాల తెలుగు భాషలోనూ ప్రవర్తిస్తున్నదా? ఇందుకు దీర్ఘాలుండాలి అని మొండికెత్తి వాదిస్తే చాలదు. అచ్చుల హ్రస్వదీర్ఘతలు తులనాత్మకంగా గుర్తించే సాపేక్షమైన విలువలే కాని నిర్దిష్టంగా నిర్ణీతమైన ప్రమాణాలేవు. కొన్ని చోట్ల హ్రస్వమనుకుంటున్న అచ్చులు దీర్ఘం అనుకునే వాటికన్నా దీర్ఘంగా ఉండొచ్చు. అంతే కాదు. తెలుగు సముచ్చయంలో వస్తుందనుకుంటున్న దీర్ఘం, స్వరం (pitch) తో కూడా కలిసి వస్తుంది. ఒక్కోసారి దీర్ఘం స్థానాన్ని స్వరమే ఆక్రమించొచ్చు. దేని పాలు ఎంత అని నిర్ణయించాలంటే ప్రయోగాలు జరపాలి. ఇవేమీ లేకుండా దీర్ఘాల సూత్రం ఉంది ఇది మీరు పాటించడం లేదు. అని నోరు చేసుకొని అరిస్తే కొంతమంది అభిమానులు తయారవొచ్చుగాని శాస్త్ర విషయాలు నిర్ధారణ కావు. ఇట్లాంటి విషయాలకు (ఆభాస) తర్కనైపుణ్యం, మందిబలం పనికిరావు. 'అతి తెలివి' వ్యాఖ్యలు అక్కరకు రావు. ఇవేవీ శాస్త్ర పరిశోధనకు సమానం కావు.

''మాట్లాడే భాషలో సూత్రాలున్నాయి. వాటిని రాసే భాషలో పాటించాలి'' అన్నంత తేలిక కాదు భాషను అర్థం చేసుకోటం. అసలు మాట్లాడే భాషలో ఉన్నాయనుకుంటున్న వాటిని సూత్రాలనాలా? అనేది ఒక శాస్త్ర సమస్య. అసలు సూత్రాలకూ భాషా వ్యవహారానికి

ఉన్న సంబంధం అప్పుడే అందరికీ అర్థం అయిందని శాస్త్రజ్ఞులెవరూ అనుకోటం లేదు.

ఈ సూత్రాల పద్ధతిని గురించి ఎక్కువగా ఆలోచించిన ఛామ్‌స్కీగారు కూడా సూత్రాల ప్రకారమే రాయాలి, మాట్లాడాలి అనలేదు. ఆయన మొదట వ్యాకరణ సమ్మతి, విరుద్ధత అనే అభిప్రాయాల (concepts ) ను ప్రవేశపెట్టినా రాను రాను ఈ రెంటి మధ్యా బోలెడు అంతరువులున్నాయని గ్రహించాడు. అందుకే ఆయన degrees of grammaticality అన్నారు. వ్యాకరణ విరుద్ధ వాక్యాలు ప్రయోగసర్హాలని సిద్ధాంతం చెయ్యలేదాయన. వ్యాకరణ సమ్మతి, ప్రయోగ సమ్మతి ఒకటి కావని ఆయన చాలా స్పష్టంగా చెప్పారు.

ఇట్లా రాయండి, ఇట్లా మాట్లాడండి అని శాస్త్రం చెప్పదు. ఇట్లా రాస్తున్నారు. ఇట్లా మాట్లాడుతున్నారు. అందులో పద్ధతి ఇది అని శాస్త్రం (అంటే ఇప్పటి అర్థంలో సైన్సు) చెపుతుంది.

తప్పొప్పుల ప్రసక్తి శాస్త్రానిది కాదు. (శాస్త్రం అంటే body of knowledge అనే అర్థంలో) శాసకులది. అందుకే ఇది తప్పు. ఇది ఒప్పు అంటే శాస్త్ర పరిశోధకులకు చిరాకు కలుగుతుంది.

మాట్లాడే భాషలో చాలా సూత్రాలుంటాయి. మాట్లాడే భాషలో 20 సూత్రాలుంటే 12 మాత్రమే రాసే భాషలో పాటిస్తే చాలదు. అన్నీ పాటించాలి అని కొత్త శాసకుల అభిప్రాయం. మాట్లాడే భాషలో అన్ని రకాల లెవెల్సులోనూ ఈ సూత్రాలుంటాయి. వాటిని కూడా పాటించాలి అనే కదా దీని అర్థం.

మాట్లాడే భాషలో ఇ, ఈ, ఎ, ఏలతో మొదలయ్యే మాటలకు యకారం చేరుతుంది. ఉ, ఊ, ఒ, ఒలతో మొదలయ్యే పదాలకు ముందు వకారం చేరుతుంది. ఇది చాలా మంది శాస్త్రజ్ఞులు గమనించారు. సూత్రంగా చెబితే ఇది సూత్రమే. కాని ఇవాళ చాలా మంది (కొత్త శాసకులు వారి సమర్థకులతో సహా) ఈ సూత్రాన్ని పాక్షికంగానే పాటిస్తున్నారు. ''వుంది, వుపయోగం., వుదాహరణం' అని పనిగట్టుకొని ఈ సూత్రాన్ని అన్ని అచ్చులకు ముందు ఎందుకు పాటించరు? ఆ మేరకు అవి తప్పులు కాదా? రాయకపోవటానికి కారణాలు ఊహించవచ్చు. కాని సూత్రం ప్రకారమయితే రాయాల్సిందే కదా? మాట్లాడే భాషలో వుంది కాబట్టి పనిగట్టుకొని 'కుత్రిమం' అని రాసేవారు 'సంస్కృతం' అనే దాన్ని అట్లా ఎందుకు రాస్తున్నారు? తెలుగులో 'శ' వర్ణం సంస్కృతం మాటల్లో ఉంది. దానికి తెలుగులో 'స' వర్ణోచ్చారణతో సమానమైన ఉచ్చారణే ఉంది. మరి ఈ కొత్త శాసకులు 'శ' వర్ణాన్ని రాస్తున్నారే? ఇట్లా ఎన్నో చూపించొచ్చు. వారి ప్రకారమే ఇవి

తప్పులవుతాయి. తప్పులయిన మాత్రానంత ఇప్పుడు ముంచుకొచ్చిన ప్రమాదం ఏం లేదు.

అందుకనే భాషను తప్పొప్పుల పద్ధతిలో చూడకూడదని వాదిస్తున్నాను. భాష తప్పుల్ని వహిస్తుంది. భరిస్తుంది. అవసరమైతే ఆ తప్పుల్నే ఒప్పులు చేస్తుంది. తప్పులు చేసే అవకాశం భాషలో ఉంది. ఆలోచించే వారే తప్పులు చేస్తారు. ఆ తప్పులే భాష పెరగటానికి దోహదం చేస్తాయి.

తప్పులు అనేమాటలోనే బెత్తం పట్టుకునే స్ఫూర్తి ఉంది. అందుకనే శాస్త్రంలో norm and deviat on అనే మాటలు వాడతారు. ఒకవేళ ఎవరైనా తప్పులు అనే మాట వాడినా దండించదగింది అనే అర్థంలో వాడరు. norm నుంచి deviations ఎప్పుడూ ఉంటాయి. అంతేకాదు ఇవి మారుతూ ఉంటాయి.

అందుకని కొత్త శాసకులను నేను కోరుకునేది ఏమిటంటే రాసేవాళ్ళపై తప్పు ఒప్పుల బెత్తం ఝుళిపించకండి అని. అదీ తెలిసీ తెలియని భాషా జ్ఞానంతో.

*చేరాతలు 1991 ఏప్రిల్*

# శాస్త్ర చర్చలకు కొన్ని మర్యాదలుంటాయి

సాధారణ భాషకూ శాస్త్ర భాషకూ పద ప్రయోగంలో చాలా భేదం ఉంటుంది. శాస్త్ర భాషలో పదాలను నిర్దిష్టార్థంలో ప్రయోగించాలి. లేకపోతే శాస్త్ర విషయాల్లో నిర్దిష్టత లోపిస్తుంది. అప్పుడది శాస్త్రమే కాకుండా పోతుంది. ఒక్కోసారి సామాన్యభాషలోనూ శాస్త్ర భాషలోనూ ఒకేమాట వాడినా దాని అర్థాల్లో భేదం ఉంటుంది. ఈ భేదం తెలుసుకోకపోతే పొరపాటుపడే అవకాశం ఉంటుంది.

''ఉపయోగము నందాఖ్యాతకు తోడవర్ణకంబగు'' అని వ్యాకరణ సూత్రం ఒకటి ఉంది. ఉపయోగం అనేమాటకు సామాన్యార్థం ఇక్కడ చెల్లదు. అందుకు వ్యాకర్త ''నియమ పూర్వక విద్యాస్వీకారంబుపయోగంబునాబడు'' అని ఉపయోగం అనే మాటను నిర్వచిస్తాడు. తెలుగు వ్యాకరణాల్లో హల్లుల్లో పరుష సరళ విభాగం ఉంది. అయితే వీటిని నిర్వచిస్తూ ''కచటతపాస్తు పరుషాః గజడదబాస్తు సరళాః'' అని చింతామణి పృథక్కరించింది. శాస్త్ర రచనలో ఈ అర్థ నిర్దిష్టత తప్పనిసరి.

పరివర్తన సిద్ధాంతం అని భాషా శాస్త్రంలో ఒక సిద్ధాంతం ఉంది. అక్కడ simplicity అనే మాట వాడతారు. ఒకే భాషకు తయారయిన రెండు వ్యాకరణాల్లో అదీ, ఆ వ్యాకరణాలు ఒకే సిద్ధాంత వలయంలో తయారయితే ఆ వ్యాకరణాలు ఒక భాషను గురించి చెప్పిన విషయాలు సమానమయితే తక్కువ సూత్రాల్లో చెప్పిన వ్యాకరణం simple అని గానీ economic అనిగానీ అంటారు. అట్లాగే రెండు సూత్రాలు ఒకే విషయాన్ని చెప్పితే తక్కువ గుర్తులు వాడుకున్న సూత్రాన్ని simple అనిగానీ economic అని గాదనీ అంటారు. ఇక్కడ simp e అంటే చప్పున అర్థమయ్యేది అనిగానీ economic అంటే తక్కువ కాయితం, సిరా పట్టేది అని గానీ కాదు. కానీ ఈ సిద్ధాంత పరమైన ప్రయోగం సరిగ్గా గ్రహించక Prof. Fred Householder అంతటి సీనియర్ లింగ్విస్టు పొరపడ్డారు. (నేను ఇప్పుడా వివరాల జోలికి పోవటం లేదు).

అంతటివారు పొరపడంగా లేనిది ఇతరులు పొరపడంలో ఆశ్చర్యం లేదు. శాస్త్ర చర్చల్లో వీటి నిజాలు తేలతాయి.

అయితే మనదేశంలో - దేశమంతటి సంగతి నాకు తెలీదుగాని తెలుగులో ఒక విచిత్ర పరిస్థితి ఉంది. మనకు తెలుగులో శాస్త్ర పత్రికలు లేవు. కొన్ని చౌచౌ

పత్రికలున్నాయి. ఏ విషయం గురించి చర్చించాలన్నా అవే వేదికలు. అన్ని విషయాల గురించీ అందరూ రాస్తారు. ఎవరు ఏమాటను ఏ అర్థంలో వాడుతున్నారో తెలీదు. ఈ గందరగోళంలో శాస్త్ర విషయాలు తెలుసుకోవలసిన వాళ్లే నష్టపోతారు.

కథలు చెప్పటం ద్వారా, అతి తెలివి వ్యాఖ్యలు చెయ్యటం ద్వారా, ఆభాస తర్కం ద్వారా తనకు తెలీని విషయాలపై కొందరు వ్యాఖ్యలు చేస్తే మరి కొందరు వాటిపై 'ప్రజాస్వామ్య' పద్ధతిలో తీర్పులు చెపుతారు. ఇదంతా చూస్తే సందర్భం వేరైనా పోతన్నగారి ''కానని వాని నూతగొని కానని వాడు విశిష్ట వస్తువున్ కానని భంగి'' తయారవుతుంది పరిస్థితి. మరీ అతిశయోక్తి అవుతుందని సంకోచిస్తున్నానుగాని, నాకు గెలీలియోనాటి ఇటలీ గుర్తువస్తున్నది.

కర్మణి వాక్య ప్రయోగ సందర్భంగా ఒక వ్యాసంలో '' ఈ సహజత్వ-కృత్రిమత్వపు వాదనలు నాకు సరిగా అర్థంకావు'' అన్నాను. అందుకొకరు ' ఆ వ్యాసం అంతటికీ సరైన మాటలు ఇవే'' అని వ్యాఖ్యానించారు. ఇట్లాంటి అతి తెలివి వ్యాఖ్యలకు శ్రమ అక్కర్లేదు. చదువు అక్కర్లేదు. ఆలోచన అసలే అక్కర్లేదు. కొంచెం వక్రోక్తిచాతుర్యం, కాస్త తర్కాభాస వాద నైపుణ్యం ఉంటే చాలు. వీటితో శాస్త్ర పద్ధతిలోనే మాట్లాడుతున్న భ్రమ కలిగించవచ్చు. కానీ శాస్త్రం చతురోక్తుల సంపుటి కాదు. తర్కాభాసవాద సంకలనం కాదు.

ఇప్పుడే సహజం-కృత్రిమం అనే మాటలను తీసుకోండి ఈ మాటలను చాలా అర్థాల్లో వాడుతున్నాం. వీటి అర్థాలను సరిగ్గా నిర్వచించుకోకపోతే వీటి అర్థ విస్తృతిలో కొట్టుకుపోయే ప్రమాదం ఉంది. మనం నివసిస్తున్న ప్రపంచంలో ప్రకృతి సిద్ధంగా ఉన్నవాటిని సహజం అంటున్నాం. సహజం అంటే సహజాతం అని. మనతోపాటే పుట్టినవి. మన ప్రమేయం లేకుండా ఉన్నవి. ఇంగ్లీషులో natural అనే మాటకు ఇదే అర్థం ఉంది. దీనికి వ్యతిరేకంగా తెలుగులో కృత్రిమం అని వాడతాం. కృతకం అని కూడా ఇంకోమాట ఉంది. ఈ రెండిటిలో 'కృత్' అనే మాట ఉంది. సహజంగా ఉన్నది కాదు, చేసినది అని దీని అర్థం. అంటే మానవ నిర్మితం అని. ఇంగ్లీషులో artificial అనే మాట ఈ అర్థంలో ఉంది. ఈ మాటలో ఉన్న arti అనే ల్యాటిన్ భాషారూపానికీ ఇదే అర్థం. అయితే రాను రాను వీటికి కొన్ని రకాల విలువలు వచ్చి చేరినాయి. సహజం అంటే అసలైనది మంచిది అనీ, కృత్రిమం అంటే నకిలీది, చెడ్డది అనే అదనపు అర్థాలు చేరినయ్. ఇట్లాంటి overtones శాస్త్ర చర్చలకు అడ్డం వస్తాయి.

భాషంతా మానవ నిర్మితమే. వాక్య పద్ధతులన్నీ మానవ నిర్మితమే. వీటిల్లో కొన్నటిని సహజమనీ, కొన్నిటిని కృత్రిమమనీ వేరు చెయ్యటం ప్రయోజనకరమైనది కాదని నా వాదం. అట్లా చేసేట్టయితే ఈ మాటలను పునర్నిర్వచించుకోవాలి. శాస్త్రంలో ప్రత్యేకార్థాలు అవసరమైతే ఆ పని చేసుకోవచ్చు. రేమండ్ విలియమ్స్ అనే మార్క్సిష్ట సాహిత్య విమర్శకుడు ఎప్పుడూ వాడే మాటలే అయినా మళ్లీ వాటి అర్థాన్ని నిర్వచించుకొని వాడతాడు. ప్రతి సైన్సులోనూ కొన్ని రకాల సూత్రాలను natural ru es అంటారు. అయితే సామాన్యార్థాన్ని దీనికంటగట్టే ప్రమాదం ఉంది గనుక దీనికర్థాన్ని నిర్దేశించుకొని వాడతారు. ఒక భాషా వ్యాకరణంలో ఇప్పుడు ప్రవర్తిస్తున్న సూత్రం ఆ భాషా చరిత్రలో పరిణామాన్ని సూచిస్తే గాని, అనేక భాషా వ్యాకరణాల్లో పదే పదే కనిపిస్తేగాని అది natural rule అవుతుంది. ఇది ఎందుకు ఇట్లా నిర్వచించాల్సి వచ్చిందంటే natural rules తో పాటు కాని rules కూడా భాషలో ఉంటాయి కనుక.

తెలుగులో కొన్ని వాక్య పద్ధతులకు ఈ సహజ-కృత్రిమ విభాగంతో ముడిపెట్టి మాట్లాడుతున్నారు. ఈ మాటలను ప్రత్యేకార్థాల్లో వాడితే వాటిని నిర్వచించుకోవాలి. సామాన్యార్థంలో అవి వక్తల అభిప్రాయాలను, అభిరుచులను మాత్రమే తెలియజేస్తాయి. ఈ భేదం గమనించమంటున్నాను.

కర్మణి వాక్యాలు తెలుగుభాషకు అసహజ మంటే తెలుగులో లేవనా? లేక ఏ భాష నుంచి అన్నా తెచ్చి పెట్టుకున్నామనా? రెండూ పొరపాటు అభిప్రాయాలే. తెలుగులో ఉన్న కర్మణి వాక్యనిర్మాణం ఇతర ద్రావిడ భాషల్లో కూడా ఇదే పద్ధతిలో ఉంది. పైగా ఈ పద్ధతి సంస్కృత పద్ధతీ కాదు. ఇంగ్లీషు పద్ధతీ కాదు. ద్రావిడ భాషా పద్ధతి.

ఈ వాక్యాలను వ్యతిరేకించేవారు ప్రధానంగా రెండే వాదాలు చేస్తున్నారు.

1. ఈ వాక్యాలు అసహజంగా ఉంటాయి.

2. ఈ వాక్యాలు అర్థంకావు.

మొదటి వాదం చేసేవారు తమ అభిరుచిని, అభిప్రాయాన్ని తెలియజేస్తున్నారు. ఎవరి అభిరుచులు వారికుంటాయి. ఎవరి ప్రిజుడిస్సులు వారికుంటాయి. వాటిని శాస్త్ర చర్చల్లో ఇరికించొద్దనే నా వాదం. ప్రపంచంలో ఇంకే దేశంలోనూ ఒక వాక్య పద్ధతి మీద ఇంత వ్యతిరేకత ప్రదర్శించిన దాఖలాలేదు. ఉన్నదాన్ని లేదనటం గాని, వాడొద్దని

నిషేధించడం గాని ఎక్కడా ఉందనుకోను. ఎవరికి వారు నిర్ణయించుకోవలసిన విషయం. ఈ విషయంలో ప్రజాస్వామ్య ప్రసక్తి తెచ్చే వారు గుర్తించాల్సిందేమిటంటే మన అభిరుచులను శాస్త్ర విషయాలుగా నమ్మించి విధి నిషేధాల పేరుతో రచయితలను శాసించటం అప్రజాస్వామికం అని.

రెండో వాదం ఈ వాక్యాలు అర్థంకావు అని. ఈ వాక్యాల్లో నిర్మాణ క్లిష్టత ఉందన్నాను. నిర్మాణ క్లేశం, అర్థక్లేశం అన్ని చోట్లా సంవదిస్తాయన్న దాఖలాలేదు. కర్మణి వాక్యాలు అర్థం కావు అనే వారు ఇక్కడ కూడా తమ అభిప్రాయాన్నే చెప్తున్నారు. అర్థం కాకపోవటం అనేవి ప్రయోగాత్మకంగా ఋజువుచేసి చూపించాల్సినవి. ఇంగ్లీషులో ఇట్లాంటి పరిశోధన జరిగింది. ఇంగ్లీషు pass ve వాక్యాలు active వాక్యాల కన్నా త్వరగా అర్థమవుతున్నాయని ఆ ప్రయోగంలో తేలింది. ఇంగ్లీషు సంగతి కాదు. నాకు తెలుగు సంగతి చెప్పు అని నన్ను నిలదీయొచ్చనుకోండి.

ఇతర భాషల సామ్యం తెస్తున్నానంటే ప్రపంచ భాషా పరిణామాలకు, ప్రవర్తనలకు సామ్యాలున్నాయనే. అట్లా ఉన్నాయని భాషా పరిశోధకులు నమ్ముతారు. నమ్మటం కాదు. గమనించారు.

శాస్త్ర విషయాలను శాస్త్ర మర్యాదలననుసరించి విమర్శించాలి. కాని మనకు ఎందుకో ఏర్పడ్డ ఇష్టానిష్టాలను బట్టి కాదు అనే మొదటి నుంచి నా వాదం. ఈ విమర్శల్లో వాడే మాటలకు ముందుగా అర్థాలు నిర్దేశించుకోవాలి. అవేవీ లేకుండా చేసే వాదాలను అభిప్రాయ ప్రకటనలుగానే గుర్తిస్తాను.

*చేరాతలు 1991 ఏప్రిల్ 14*

## ఏది వక్రత? ఏది స్పష్టత?

కొంత కాలం నుంచి పత్రికారచనల్లో తరచుగా కనిపించే మాట 'వక్రీకరణ'. ఎదుటి వారి వాదనను సాధ్యమైనంత నిజాయితీతో ప్రదర్శించి దాని లోటుపాట్లను విమర్శించడం సత్సంప్రదాయం. అట్లాకాక మనకనుకూలమైన పద్ధతుల్లో మల్చుకొని, లేని లోటుపాట్లను చూపించి, ఉన్నలోపాలను అతిగా చేసి చూపించి తన వాదాన్ని గెలిపించుకునే ప్రయత్నం చేయడం వక్రీకరణ అనవచ్చు ననుకుంటాను. ఆంధ్రజ్యోతి వీక్లీ సమీక్షకులు అట్లాంటినేరం ఒకటి నా మీద ఆరోపిస్తున్నారు.

ఇంత స్పష్టంగా చెబుతున్నా రంగ నాయకమ్మగారు రాసే భాషకు మాట్లాడే భాష సర్వ ప్రమాణం అంటున్నట్లు వక్రీకరించడం ఎందుకు?'' - ఆం.జ్యో.వీక్లీ 12.4.1991

అంతస్పష్టంగా చెప్పిన విషయం ఏమటంటే- '' ఒక విషయం మీద 100 వాక్యాలు రాస్తే అందులో కొన్ని వాక్యాలు మాట్లాడే భాషలో లాగే వున్నా, కొన్ని వాక్యాలు మాట్లాడే భాష నుంచి ఎంతో కొంత తేడాగా వుంటాయి. చెప్పే విషయాన్ని బట్టి ఆ తేడా తప్పని సరి అవుతుంది''.

ఆ తేడా ఏమిటో? ఎంతో కొంత అంటే ఏమిటో రచయిత్రి స్పష్టం చేయలేదు. రాసే భాషకీ, మాట్లాడే భాషకీ ఏయే విషయాల్లో తేడా ఉంటుందో ( ఏయే తేడాలను తాము అనుసరిస్తున్నారో) ఆమె చెప్పలేదు. ఆమె స్పష్టంగా చెప్పింది మాట్లాడే భాష సర్వ ప్రామాణికతకు గురించే.

''మాట్లాడే భాష ఏర్పడిన తరువాతే దాన్ని రాయడం అనేది వచ్చింది కాబట్టి రాసే భాష మాట్లాడే భాషను బట్టే వుండవలసి వుంటుంది. అంటే మాట్లాడే భాష ఏ సూత్రాలతో వుంటుందో ఆ సూత్రాలతో రాసే భాష కూడా వుండవలసి వుంటుంది.''

ప్రభుత్వ శాసనం లాగా అనిపించే ఆ టోన్ చూడండి. అయితే ఆ పుస్తకం నిండా ఇదే ధోరణి కాబట్టి అది రచయిత్రి శైలీ విశేషం అనుకుందాం.

రాయడం అనేది మాట్లాడటం తరువాతనే వచ్చిందని నిర్ధారిస్తున్నారు. (ఈ నిర్ధారణను ఒప్పుకోని శాస్త్రజ్ఞులు కూడా ఉన్నారు. Fred Householder Wil iam Hass అనేవారు వేరే సిద్ధాంతాలను ప్రతిపాదించారు). ఈ నిర్ధారణను ఒప్పుకున్నా.

తరువాత వచ్చింది కాబట్టి రాసే భాష మాట్లాడే భాషను సంపూర్ణంగా అనుసరించాలని ఎందుకనుకోవాలి? రాసే భాషకు స్వాతంత్ర్యం లేదనేదే రచయిత్రి ఇక్కడ చెప్పదలుచుకున్నది. కాకపోతే రాసే భాషలో వాక్యాలు పెద్దవిగా ఉండవచ్చు. మాట్లాడేభాష లోలేని మాటలు కొన్ని రాసే భాషలో ఉండవచ్చు. కాని వర్తించే సూత్రాలు వేరుగా ఉండ కూడదు అని రచయిత్రి ఉద్దేశంగా గ్రహిస్తున్నాను. ఇంకా ఏమంటున్నారో చూడండి. ''మాట్లాడే భాషలో సరిగ్గా చెప్పకపోవడం అనేది వుండదు కాబట్టి..'' ''మాట్లాడే భాషలో వుండే సూత్రాల్ని రాసే భాషలో పాటించకపోవడమే నిజమైన సమస్య'' ''మాట్లాడే భాషలో వున్న సూత్రాలన్నింటినీ రాసే భాషలో కూడా పాటిస్తే రాసే భాషలో కూడా ఏ సమస్యలు ఉండవు. రాసే భాషలో తలెత్తే ఏ సమస్యనైనా మాట్లాడే భాషలో వుండే సూత్రాల ఆధారంతోనే పరిష్కరించుకోవాలి. పరిష్కరించుకోగలం కూడా.''

ఇదంతా మాట్లాడే భాష ప్రామాణికతను నిర్ధారించడం కాదా? నేను వక్రీకరిస్తున్న దెక్కడ? ఆ మాటకొస్తే నా వాదనలే వీరి రచనల్లో వక్ర రీతిలో (అసలు రీతికి భిన్నంగా) కనిపిస్తాయి. *బడు* వ్యతిరేకులకు భాషా తత్త్వం తెలీదు అని నేనంటే ''భాషా జ్ఞానం తెలీదు'' అని అన్నట్టు వీరి రచనల్లో నమోదు అయింది. స్వల్పంగా నైనా ఇక్కడ అర్థం మారుతుంది. 'జ్ఞా' అనే సంస్కృత ధాతువుకు తెలుసుకోవటం అని అర్థం. అందువల్ల మారిన వాక్యంలో పునరుక్తి వస్తుంది. ఇదీ ఒక రకమైన వాక్య దోషం అవుతుంది. (సూత్ర ప్రవర్తనలో పదాల పాత్ర ఉంటుందనే విషయానికి ఇది ఉదాహరణగా కూడా పనికి వస్తుంది) ''అజ్ఞానాన్ని జ్ఞానంగా అమ్ముకొని సొమ్ము చేసుకుంటున్నారు'' అని నేనన్నట్టుగా సమీక్షకులు రాశారు. అమ్ముకోటం వరకే నేనన్నది. సొమ్ము చేసు కోవడం నా మాట కాదు. అదనంగా చేరింది. అందువల్ల ఉద్దేశించిన అర్థానికి మించి వస్తుంది. (నిజానికి అంతవరకూ అనడమే నా పద్ధతికి విరుద్ధం. ఏవో కొన్ని దమించుకోలేని ప్రేరణల వల్ల అట్లా అన్నాను. దానికి ఇంకా అదనంగా చేర్చడం వల్ల అసలే అనిష్టమైన దాన్ని ఇంకా పెంచడమవుతుంది. అయితే వీటిని కావాలని చేశారనుకోవటం లేదు నేను. జ్ఞాపకం నుంచి కోట్‌చేయడం వల్ల జరిగిన పొరపాట్లనుకుంటాను.

భాషా వ్యవహార సూత్ర పద్ధతిలో జరుగుతుందనే దాన్ని సాధారణ పద్ధతిలో అర్థం చేసుకోకూడదు. సూత్రాలకు ప్రాధాన్యమిచ్చే చామ్‌స్కీ గారు కూడా వ్యాకరణ విరుద్ధ వాక్యాలను ప్రయోగానర్హాలన లేదు. అసలు భాషా వ్యవహారంలో నుంచి సూత్రాలను పిండవచ్చు. ఇంతకు ముందు సూచించినట్టుగా, ఇక్కడ ఇంకో విషయం తెలుసుకోవాలి.

వ్యాకరణ సూత్రాలకూ, పదాలకూ పరస్పర సంబంధాలుంటాయి. ఛామ్‌స్కీవ్యాకరణంలో Lexicon అనే భాగంలో ఉండే నామ క్రియాది పదాలు, పద సన్నిభాలు వ్యాకరణాంశాల గుత్తులే పదాలు. పదాలూ సూత్రాలు పరస్పరాధారాధేయాలు.

ఇవన్నీ చాలా లోతైన శాస్త్రీయాంశాలు. ఇపుడు వాటి జోలికి పోతే తేలడం కష్టం కాబట్టి భాషా వ్యవహారానికి సూత్రాలదే సంపూర్ణ బాధ్యత అని అనుకొని మాట్లాడుకుందాం.

మాట్లాడే భాషకూ, రాసే భాషకూ ఉన్న (లేక ఉంటుందని తాననుకుంటున్న) సంబంధం రచయిత్రి స్పష్టంగా చెప్పలేదు అనేది ఫిర్యాదు(complaint)గా చెప్పడం లేదు. చెప్పారని సమీక్షకులు పొరపాటుగా అనుకుంటున్నారని మాత్రమే. ఈ సంబంధాన్ని గురించి ఇటీవలి కాలంలో (ఎనభయ్యో దశకంలో) ఎక్కువ పరిశోధన జరిగింది. అంతకు ముందు ప్రాగ్‌స్కూలు లింగ్విస్టు జోసెఫ్ వాకెక్(Josef Vachek ) అనే ఆయన సుమారు అర్ధశతాబ్దంగా ఈవిషయం మీద వ్యాసాలు రాస్తున్నాడు. వాటిలో కొన్ని పుస్తకాలుగా వచ్చాయి. అతని ప్రతిపాదనలన్నింటినీ వివరంగా చర్చించలేనుగాని స్థూలంగా చెబితే రాసే భాష మాట్లాడే భాష - రెండూ భిన్న ప్రయోజనాలు నిర్వహిస్తున్నాయనీ, రెండూ ఒకే వ్యవస్థలో రెండు భాగాలనీ (వీటిని అప్పటి సిద్ధాంత వ్యవస్థలో భాగంగా marked and unmarked members అన్నాడు) రాసే భాష, మాట్లాడే భాష మీద ఆధారపడ్డా కొన్నిటిలో స్వతంత్రంగా వ్యవహరిస్తుందనీ, మాట్లాడే భాషలో లేని కొత్త అంశాలను (devices) ఏర్పరచుకుంటుందనీ అందువల్ల రాసే భాష కూడా ప్రత్యేకంగా పరిశోధనార్హమనీ వాదించాడు. యూరపియన్ భాషల నుంచి ఉదాహరణలు చూపించాడు. 1985లో MAK Halliday అనే బ్రిటీష్ లింగ్విస్టు ఈ విషయమై ఒక పుస్తకం రాశాడు. అమెరికన్ లింగ్విస్టులు ఇటీవల చాలా వ్యాసాలు ప్రకటించారు. Talmy Givon వంటి డిస్కోర్సు ఎనలిస్టులు ఈ విషయమై చాలా పరిశోధన చేశారు. ఇంకా ఇంకా చాలా మంది భాషావేత్తలు బహు ముఖంగా కృషి చేస్తున్నారు. భారతీయుల్లో ఇ. అన్నామలై కొంత కృషి చేశారు. రచయిత్రి గానీ సమీక్షకులు గాని ఇవన్నీ సవిమర్శకంగా చదివి రాయాలని నేనాశించడం లేదు. అందరూ అన్ని పనులు చేయక్కర్లేదు. అందరికీ అన్ని విషయాలు తెలిసి ఉండాలని లేదు. కాని ఒకరిని తప్పనడానికి ఒక శాస్త్ర విషయం మీద సిద్ధాంతం చేయడానికి ఇవి తెలుసుకోవాలి. చదవకుండా, ఆలోచించకుండా, ఏ గౌతమబుద్ధుడికి లాగానో, సత్యసాయిబాబాకి లాగానో, జిల్లెళ్ల మూడి అమ్మకు లాగానో సత్యదర్శనం

కలిగి, జ్ఞాన దీపం వెలిగి అన్నీ ఒక్కసారే అర్థమయిపోవు.

నా మట్టుకు నాకు వైద్యశాస్త్రం మీద ఆసక్తి ఉంది. అట్లాగే ఫిలాసఫీ ఆంత్రోపాలజీ లతో కొంత పరిచయం ఉంది. కాని ఆ శాస్త్రజ్ఞులతో తల పడడానికి నాకు ధైర్యం లేదు. ఆ శాఖలలో సిద్ధాంతాలు చేసే దుస్సాహసం నాకు లేదు. కాస్త ఎక్కువ శిక్షణ పొందిన సాహిత్య, భాషా శాస్త్రాలలోనైనా, ''ఇది అంతే. ఇంకో రకంగా ఉండడానికి వీలు లేదు. ఇట్లా ఉండకపోతే తప్పు'' అనే పద్ధతిలో సిద్ధాంతాలు చేయడానికి సాహసించలేదు. మరీ ముఖ్యంగా ఒకరిని తప్పు అనే ముందు మన జ్ఞాన పరిమితులను అంచనా వేసుకోవడం అవసరం. ఈ పరిమితులు గ్రహించకపోతే ఎట్లాంటి వ్యాఖ్యలు వస్తాయో చూడండి. ( ఫలాని వారికి గారెలు తినడం తెలుసా? అనే రకం వ్యాఖ్యలను గురించి కాదు నేననేది. ఇట్లాంటి వ్యాఖ్యలతో ఏమంత ప్రమాదం లేదు. రచయితల వాక్చమత్కృతికి కాసేపు నవ్వుకోవచ్చు.)

బడు వాక్యాలు సరిగ్గా ఇదే పద్ధతిలో తెలుగు కన్నడాది ద్రావిడభాషల్లో కూడా ఉన్నాయని నేనంటే అందుకు ' ఉన్నాయంటే చాలదు. రాసే భాషలో వున్నాయా? మాట్లాడే భాషలో కూడా వున్నాయా అని నన్ను నిలదీస్తున్నారు.

సోదర భాషల్లో ఒక పద్ధతి కనిపిస్తే ఆ పద్ధతి ఆ భాషలు వేరు పడక ముందే ఉండి ఉంటాయని భాషా శాస్త్రంలో ఊహిస్తారు (నిర్ధారించరు) They assume. ఆ లెక్కన ఈ కర్మణి వాక్య పద్ధతి సంస్కృతం కంటే భిన్నంగా కొన్ని ద్రావిడ భాషల్లో కనిపిస్తుంటే అది ఆ భాషలు కలిసి ఉన్న స్థితి నుంచి వచ్చి ఉండొచ్చునని ఊహిస్తాం. ఆ స్థితిలో ఈ భాషలకు రాసే స్థితి ఉన్నట్టు ఆధారాలు లేవు. అందువల్ల మాట్లాడే భాషలో ఉన్న ఒక పద్ధతిని ఈ భాషలు విస్తృత పరిచి రాసే భాషలోకి ఎక్కించి ఉంటాయని ఆ మాటకు అర్థం.

ఇదంతా ఎందుకు చెప్పకూడదు? అని నన్ను నిలదీయొచ్చు. ప్రసిద్ధమైన విషయాలను మళ్ళీ మళ్ళీ వివరించాలంటే ప్రతి చిన్న విషయానికీ ఒక పుస్తకం రాయాల్సి ఉంటుంది శాస్త్ర చర్చలు చేసేవారికి ఆ శాస్త్రంలో కనీస పరిజ్ఞానం ఉంటుందని ఆశిస్తాం.

' ఒకరు రాస్తే తప్పు, వందమంది రాస్తే అది తప్పు కాదు, పద్ధతి'' అని నేనన్నాను. అందుకు రచయిత్రి తప్పు అయిన దాన్ని ఒకరు రాసినా తప్పే వందమంది రాసినా తప్పే'' అని ఇంకా ఏమేమో పొడిగించారు. భాషాశాస్త్రంతో పరిచయం ఉన్న వారెవరూ ఇట్లా వాదించరు. (మనం మాట్లాడుతున్నది మాతృభాషా వ్యవహారం గురించి) ఎక్కువ

మంది రాసిన దాన్ని, మాట్లాడిన దాన్ని తప్పు అనడం శాసక పద్ధతి గాని శాస్త్ర పద్ధతి కాదు. ఉన్న సూత్రం నుండి విడి వడి వందమంది మిగతా అందరి కంటే వేరుగా మాట్లాడితే (రాస్తే) దాన్ని Innovation అంటారు. వాటిని తప్పులనడం అశాస్త్రీయం. భాషలో కొత్త సూత్రాలూ,పాత సూత్రాలు పోటీ పడ్డ ఘట్టాలు చాలా ఉన్నాయి. భాషా పరిణామ పద్ధతే ఇది.

ఇక సమీక్షకులు ఈ విషయాన్ని రాజకీయం చేశారు. '' మాట్లాడే భాషను ఆధారంగా తీసుకోవడం ద్వారా రాసే భాషను సరిచేసుకోవడమన్నది సక్రమమైనది. ప్రజాస్వామిక మైనదీ దానికి బదులుగా రాసే భాష ఒకటే నిలుస్తుందనుకోడం అప్రజాస్వామిక ధోరణి'' ( ఆం. జ్యో. వీక్లీ 12.4.91)

భాషను గురించి భాషా శాస్త్రం గురించి ఏమాత్రం పరిచయమున్నా ఇట్లా మాట్లాడరు. రాసే భాష ఒకటే నిలవడమేమిటి? మనుషులు మాట్లాడటం మానేస్తారని నేనన్నానా? రాసే భాష, మాట్లాడే భాషల మధ్య పరస్పరాదాన ప్రదానాలుంటాయని నా ఉద్దేశ్యం. (their relationship is bid'rect'onal) శాస్త్ర విషయాల్లో ప్రజాస్వామ్యం ఏమిటీ? వక్రీకరణను గురించి మాట్లాడుతున్న ఈ సమీక్షకులు ఎందుకీ వక్రమార్గంలో పడ్డారు.

తమకు తెలిసీ విషయాల మీద రచయితలు పుస్తకాలు రాస్తారు. అందుకు సరిగ్గా తగిన సమీక్షకులు దొరుకుతారు. ఈ పరిస్థితి బహుశా ఇంకా కొంత కాలం సాగొచ్చు. చరిత్రలో ఇట్లాంటివి అపూర్వమేమీ కాదు.

గమనిక: ఈ వ్యాసంలో రచయిత్రి అంటే ''వాడుక భాషే రాస్తున్నామా?'' అనే పుస్తకం రాసిన వారు. సమీక్షకులు అంటే ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఈ పుస్తకాన్ని సమీక్షించినవారు. అంటే రంగనాయకమ్మగారు, పి. రామకృష్ణా రెడ్డిగారు.

*వేరాతలు 1991 మే 5*

## .....శిరసి మాలిఖ! మాలిఖ! మాలిఖ!

''నాగరిక సమాజల్లో మట్లాడే భాష, రాసే భాష అని రెండు రకాల వ్యవస్థ లుంటాయి. రాసే భాషకు మాట్లాడే భాషే మూలం. అయినా ప్రయోజన భేదాల్ని బట్టి మాట్లాడే భాష కన్నా భిన్నమైన సంప్రదాయాలు రాసే భాషలో ఏర్పడతాయి !''

''ఎవరి రామమూర్తి? ఎందుకు మరోసారి'' 'మరోసారి గిడుగు రామమూర్తి' పీఠిక. హైదరాబాద్ బుక్ ట్రస్టు, 1986.

నన్ను నేను కోట్ చేసుకోవలసి రావడం అంత సంతోషకరమైన విషయమేమీ కాదు. అయితే 1986లో నేనన్నదానికి ఏదో వైరుధ్యమున్నట్టు కొందరు అపోహపడ్డారు. అందువల్ల సందేహనివృత్తి కోసం ఈ పని చెయ్యాల్సివచ్చింది. (వైరుధ్యం ఉండకూడదని కాదు. పాత అభిప్రాయాలను మార్చుకునే హక్కు అందరికీ ఉంది. అయితే ఇక్కడ అలాంటి అవసరం కలగలేదని మాత్రమే నా ఉద్దేశం)

ఒకటి మరోదానికి మూలమైనంత మాత్రాన ఈ రెండోది మొదటిదానికన్నా భిన్నంగా పరిణమించకూడదని, ప్రవర్తించకూడదని నియమం ఎక్కడా లేదు. అలా మార్పు కనిపించడమే సహజం. మారకపోతేనే ఆశ్చర్యం, ఈ మార్పు ఉండదనుకోవడం పరిణామాన్ని గురించి మనకు తెలిసిన జ్ఞానాన్ని కంతటికీ విరుద్ధం. ఈ మార్పుల్ని కృత్రిమం-సహజం అనే కొలమానంతో చూస్తే భాషాతత్వం అర్థంకాదు. నిజానికీ రెండు వ్యవస్థలూ మానవ పరిణామంలో భిన్న దశల్లో ఏర్పడ్డాయి. రెండూ సహజమే. రెండూ మానవుల అవసరాల కోసం వచ్చినవే. అంతేకాదు. రెండు వ్యవస్థల మధ్య కనిపించే భేదాలు క్రమరహితమైనవి (erratic) కావు. వీటి మధ్యన భేదాల్ని సూత్ర నిర్మాణ ప్రవర్తనల మధ్య భేదంగా గుర్తించవచ్చు. అంటే మాట్లాడే భాషకు, రాసే భాషకు సూత్ర నిర్మాణంలోను, సూత్ర ప్రవర్తలోనూ భేదాలుండొచ్చు.

మాట్లాడే భాషలో కొత్త సూత్రాలు ఏర్పడ్డట్టుగా రాసే భాషలోనూ ఏర్పడవచ్చు. అయితే రెండు భాషల మధ్య పరస్పర సంబంధాల సాంద్రతననుసరించి ఈ సూత్రాలు ఒక చోట నుండి ఒంకోచోటకి ప్రయాణిస్తాయి. అప్పుడీ సూత్రాలు ఎక్కడ మొదలయిందీ తెలుసుకోవడం కష్టం. యూరోపియన్ భాషల్లో లిటరసీ ఎక్కువగా ఉంది. దాదాపు మాట్లాడే వాళ్ళంతా చదువుతారు. చదివే వాళ్లంతా మాట్లాడతారు. అటువంటి భాషా సమాజాల్లో

రాసే భాషకు, మాట్లాడే భాషకు భేదక రేఖ గియ్యడం కష్టం. కొన్ని సమాజాల్లో చదవడం-రాయడం వచ్చిన వాళ్ళు తక్కువగా ఉంటారు. రాసేవాళ్ళ భాషలో అంటే రాసే భాషలో ఏదైనా మార్పు వస్తే అది మాట్లాడే వాళ్ళందరి వాడుకలోకి వెళ్ళడానికి కొంత వ్యవధి పడుతుంది. ఇవాళ పత్రికా భాషలో ప్రచురంగా వాడబడున్న 'జరిగింది' వాక్యాలు చదువురానివారి భాషలో తక్కువగా ఉంటాయి. అలాగే రాసే భాషలో కనిపించే కర్మణి వాక్యాలు చదువురానివారి భాషలో ఉండక పోవచ్చు. చదువుకున్నవారి మాట్లాడే భాషలో అరుదుగా కనిపించవచ్చు. ఇంగ్లీషులో ఈ కర్మణివాక్యాలు మాట్లాడే భాషకు మన భాషల కన్నా ఎక్కువ వ్యాపించాయి. దీనికి లిటరసీ (అక్షరాస్యత) సాంద్రత, కాలదైర్ఘ్యం కారణాలుగా ఊహించాలి. గిడుగు రామమూర్తిగారు అనుకున్నట్టు ఇవి ఒక భాషకు సహజమూ, మరో భాషకు అసహజమూ కావడం కారణం కాదు.

రాసే భాషకూ, మాట్లాడే భాషకు ఉన్న భేదాలను కేవలం సూత్ర పద్ధతిలోనే కాక లక్ష్యాలు-వ్యూహాలు (goals and strateg es) అనే పద్ధతి లోనూ చూడొచ్చు. జువ్వాడి గౌతమరావు గారు ఎప్పుడో 30 ఏళ్ళ కిందట గుర్తించిన కుదింపులో (చూ. జయంతి-7, 1959 మే) ఈ సూచన ఉంది. ఈ కుదింపునే క్లుప్తత (prec sion) అందాం. అవసరమైనదంతా, అవసరమైనది మాత్రమే చెప్పే పద్ధతిని క్లుప్తత అంటున్నాను. దీన్నే సంక్షిప్తత అని కూడా అనుకోవచ్చు. మాట్లాడే భాషలో భావగ్రహణ సౌలభ్యం కోసం వైపుల్యం (elaboratıon) ఎక్కువ ఉంటుంది. మాట్లాడే భాష కాలనిబద్ధమైనది. కాలంలో వెనక్కివెళ్ళలేం. రాసే భాష స్థల (space) నిబద్ధమైనది. ముందు వెనుకలు చూసుకొనే అవకాశం ఉంటుంది. ఉన్నదాన్ని కొట్టేసి తిరగరాసుకోవచ్చు. ఎడిటింగ్‌కు పుష్కలంగా అవకాశం ఉంది. మాట్లాడే భాషలో భాషణకు పూర్వం భావాన్ని ఎడిట్ చేసుకోవచ్చు గాని భాషితాన్ని ఎడిట్ చేసుకోలేం. మాట్లాడే భాషకు భావ పునరుక్తి సౌకర్యం. రాసే భాషకు ఇది అసౌకర్యం. ఈ పునరుక్తిని (redundancy) అంటారు. భాషా నిర్మాణ పద్ధతిలో ఈ పునరుక్తిని తొలగించే ప్రయత్నమే కుదింపు (reduct on). అర్థ గ్రహణకు అడ్డు రానంతవరకు పునరుక్తిని తొలగించే ఒక వ్యూహం లోప(delet on) కార్యం. ఇది తెలుగులో పద బంధ సంకలనం (co-ordinat on) లో జరుగుతుంది.

ఈనాడు 1990 సెప్టెంబరు 26న తేదీ సంచిలో కబుర్లు శీర్షికలో ఈ వ్యాసం ఉంది.

'' ఇంతకీ గేదెలు, గోవులు, గొర్రెలు, పందులు, కుందేళ్ళ శాఖలంటూ విభజిస్తారని నాకు తెలీదు''

మాట్లాడే భాషలో *గేదెల శాఖలు, గోవుల శాఖలు, గొర్రెల శాఖలు, పందుల శాఖలు, కుందేళ్ళ శాఖలు* అని ఉంటుందనుకుందాం. అయితే ఇక్కడ రాతలో జరిగిందేమిటి? పునరుక్తమైన శాఖలు అనే మాట చివర మాత్రమే ఉంచి మిగతా చోట్ల చెరిపేశాం. ఈ పద్ధతిని ఇంగ్లీషులో (coordinate reduction ) అంటాం. కావాలంటే తెలుగులో సముచ్చయ సంకోచం అనుకోవచ్చు.

బహుశా ఈ కుదింపు సూత్రం మొదట ఇలా పునరుక్త పదాలను తొలగిస్తూ మొదలయి ఉండవచ్చు. ఒకసారి ఒక సూత్రం మొదలయింతరువాత అది తన ప్రభావాన్ని విస్తరిస్తూ పోతుంది. ఈ విస్తరణలో రెండో విడత గురి (target ) పదస్థాయిలో ఉన్న ప్రత్యయాలకు పాకి ఉంటుంది. పైన, మీద ,లోపల, నుంచి, గురించి - వంటివి పద స్థాయి ప్రత్యయాలు గా గుర్తించొచ్చు.

''రవూఫ్ తాటిచెట్టు, కొబ్బరిచెట్టు మీద పద్యాలు రాశాడు''

అనే వాక్యంలో రెండో 'మీద' ఉంచి మొదటి 'మీద'ను చెరిపేశాం.

ఈ సూత్రం తరువాత గురి ప్రత్యయాలే. అందుకు కూడా తెలుగులో చాలా ఉదాహరణలు లున్నాయి.

ఆంధ్రజ్యోతి 1990 సెప్టెంబరు 9వ తేదీ సంచిలో శ్రీనివాసులురెడ్డి గారితో జరిగిన ఇంటర్వ్యూలో ఆయన అన్నట్టుగా ఈ వాక్యాలున్నాయి.

''శ్రీ చెన్నారెడ్డి నా గురువు, నా తండ్రితో సమానం

'' శ్రీ చెన్నారెడ్డి నాకు గురువు, తండ్రితో సమానం కాబట్టి ఓర్చుకున్నాను.

'' ఇన్ని అవమానాలు జరిగినా ముఖ్యమంత్రి నా గురువు, తండ్రిలాంటి వాడు కాబట్టే అన్నీ ఓర్చుకున్నాను.''

ఇన్నిసార్లు పొరపాటు పడి ఉండరు అని అనుకోవడం సమంజసమే. అయితే ఈ తో - విభక్తి కుదింపు రాతలోనే కాకుండా మాట్లాడే భాషకు కూడా పాకినట్టు గుర్తించగలం.

ఆంధ్రజ్యోతి 1991 ఆగష్టు 10 సంచికలో చెన్నారెడ్డిగారి సందేశంగా అచ్చయిన వాక్యాల్లో ఈ విభక్తి కుదింపు వాక్యాలు చాలా ఉన్నాయి. కొన్ని చూడండి.

1. గ్రామీణులు పేద జనుల జీవితాలలో..

2. గిరిజన సంస్థలు, గ్రామ పంచాయతీలు, యువజన క్లబ్బులు, ఆయకట్టుదార్లకు జిల్లా యంత్రాంగం ఈ పనులను స్థానికంగా నామినేషన్ పద్ధతిన కేటాయిస్తుంది. (ఇందులో కు - విభక్తి కుదింపు ఉంది.)

3. అరాచకత్వం, దోపిడీ బారి నుంచి బలహీన వర్గాలు, అల్పసంఖ్యాక వర్గాలు, మహిళల పరిరక్షణకు ధృడమైన చర్యలు. (ఇక్కడ విభక్తి కుదింపు, పదం కుదింపు ఉన్నాయి.)

4. అకుంఠిత దీక్షాదక్షతలు కలిగిన మహనీయులు, మేధావులు, కార్యశూరులకు పుట్టినిల్లు మనదేశం. (ఇక్కడ కు-విభక్తి కుదింపు ఉంది).

ఇలాంటి విభక్తి కుదింపులు దాదాపు అన్ని విభక్తులకూ జరుగుతాయి. ఈ కుదింపు మాత్రం వ్యాప్తిని ఈ కింది విధంగా సూచించవచ్చు.

పదబంధం (పదం) > పద సన్నిభ ప్రత్యయం > ప్రత్యయం కుదింపు సూత్రం వ్యాప్తి చెందిన మార్గాన్ని బట్టి కుదింపు పొందిన వాక్యం వ్యాకరణ స్థాయి కూడా ఉంటుంది. అంటే కుదింపులో పోయింది పద బంధం అయితే వ్యాకరణ స్థాయి (degree of grammaticality) ఉన్నతంగా ఉంటుంది. పోయింది విభక్తి ప్రత్యయమైతే మధ్యస్థంగా ఉంటుంది. కుదింపు సూత్రం వ్యాప్తిని బట్టే ఫ్రీక్వెన్సీ ఉంటుందని ఊహిస్తున్నాను. అప్పుడు ఈ పై ఫార్ములా సూత్రవ్యాప్తి మార్గాన్ని, సూత్ర ప్రవర్తన ఫ్రీక్వెన్సీని, కుదింపు పొందిన వాక్యం వ్యాకరణ స్థాయిని ఏకకాలంలో సూచిస్తున్న దన్నమాట. ఈ కుదింపు సూత్రం మీద ఆధారపడ్డ మరో సూత్రం ప్రథమకు పరివర్తి (Nom'nat ve preference princ pal)

విశేషణంగా ఉన్న పద రూపం దాని తరువాత ఉన్న పదం గాని, ప్రత్యయం గాని కుదింపులో లోపిస్తే అది ప్రథమా విభక్తి (nominat've) రూపంగా మారుతుంది.

ఉదాహరణకు పైన ఈనాడు వాక్యాన్నే తీసుకోండి. కుదింపులో 'శాఖలు' అనే మాట లోపించిన తరువాత ''గేదెల, గోవుల,గొర్రెల, పందుల'' అనే రూపాలు గేదెలు, గోవులు- వగైరా రూపాలుగా మారతాయి.

అయితే ఈ మార్పు మాట్లాడే భాషలో ముందు మొదలయిందా? రాసే భాషలో ముందు మొదలయిందా?

ఈ విషయం వెంటనే నిర్ధారించడానికి మార్గాలులేవు. విస్తృతమైన పరిశోధన జరిగితే ఇంకా కొన్ని విశేషాలు బయటపడొచ్చు. ఈ కుదింపు సూత్రం మొదట మాట్లాడే భాషలో మొదలయి తరువాత రాసే భాషకెక్కి ఆ తరువాత దాని వ్యాప్తిని అక్కడ పెంచుకొని మళ్ళీ మాట్లాడే భాషకు పాకి (లేక పాకుతూ) ఉండొచ్చు.

ఇంత క్రమ పద్ధతిలో జరిగేమార్పును గుర్తించి భాషను అర్థం చేసుకోకుండా ఇవి తప్పులు - ఒప్పులు అని శాసిస్తే ఏం సాధించినట్టు?

''భాషను గురించి మాట్లాడడానికి శిక్షణ ద్వారా వచ్చే అధికారం ఉండాలి, భాషా శాస్త్రానికి కొన్ని మర్యాదలు (convent ons) ఉంటాయి. భాషలో జరిగే మార్పులను తప్పొప్పుల పద్ధతిలో చూడకూడదు, భాషా విషయాల నిర్ణయానికి ప్రజాస్వామ్యం పనికి రాదు (అంటే irrelevant)'' అని నేనడానికి కారణాలు ఇప్పటికైనా అర్థం కాకపోతే సంస్కృతంలో వాళ్ళెవరో అన్నట్టు '' శిరసి మాలిఖ, మాలిఖ, మాలిఖ'' అనుకోవాలి.

*చేరాతలు 1991 జూలై 28*

# నేను లు లెక్కపెట్టడం మానండి

ఇటీవలి కాలంలో చేరాతలపై ఆక్షేపణలు (దండయాత్రలు అందామనుకున్నాను గాని దానికి మోయలేని అర్థభారం - తగిలించినట్టుంటుదని విరమించుకున్నాను) విరివిగా వస్తున్నాయి. అందులో ఆశ్చర్యపడాల్సింది కానీ విచార పడాల్సింది కానీ ఏమీ లేదు. తెలుగు పాఠకలోకం చాలా చైతన్యవంతంగా వుందనటానికి, ఇది ఒక సూచన. విషయం ఏదన్నాగానీ, ధోరణి ఎట్లా అయినా ఉండనీ పాఠకలోకం ఆలోచిస్తున్నది, సాహిత్య పర్యావరణకు స్పందిస్తున్నది. ఇది చాలా ఆరోగ్యకర (ఇంగ్లీషులో Hea thy కి వాడుక లోకి వచ్చిన తెలుగు ఇది) ధోరణి అనటంలో నాకే మాత్రం సంకోచం లేదు.

ఆక్షేపణలను కూడా కొన్ని పద్ధతులుగా (నా కలవాటయిన ధోరణిలో 'వ్యూహాలు' అంటున్నాను) వింగడించుకోవచ్చు. అవి 1. 'నేను' ప్రయోగారోపణ వ్యూహం 2. భావకవితా ప్రియత్వారోపణ వ్యూహం 3. కంటక కిరీటారోపణ వ్యూహం 4. స్వస్థానాభిమానారోపణ వ్యూహం. ఇంకా కొన్ని చేర్చటానికి వీలున్నా ప్రస్తుతం వీటికి మాత్రమే పరిమితం అవుదాం. చివర్నుంచీ మొదటి కొద్దాం. చివరివి అనేవాళ్ళు కూడా అంత సీరియస్‌గా ఉద్దేశించినట్టు కనపడదు.

''స్వస్థానవేష భాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధిధియః'' అని ప్రాచీన కాలం నుంచీ స్వస్థానాభిమానాన్ని పనికొచ్చే విలువగా మనవాళ్ళు ఆదరించారు. ఒకప్పుడు ఆదరించారు గాబట్టి ఇవాళ ఒప్పుకోవాలని లేదు గాని దానివల్ల ఇతరమైన ఉన్నత లక్ష్యాలకు దెబ్బ తగులుతున్నదేమో చూడాలి. ఈ ఆరోపణను నేను సీరియస్‌గా తీసుకోలేదు గనుకనే కీ.శే. కేతవరపు రామకోటి శాస్త్రిగారు ఖమ్మం జిల్లా వాళ్ళకు ఒక సభాపతి దొరికాడన్న, (సాహితీ సమితి కవులను సమర్థిస్తూ సభాపతి శివశంకర శాస్త్రిగారు - భావకవితా యుగంలో - ప్రచారం చేసేవారు) ప్రసేన్ పుస్తకం ఇంకా శివశంకర శాస్త్రిగారికి అందలేదా ? అని ఘంటసాల నిర్మల జోక్ చేసినా నవ్వేశాను. ఇవాళ చక్రవర్తుల లక్ష్మీ నరసమ్మగారి కవిత్వాన్ని మెచ్చుకుంటే జిల్లా అభిమానంగా ఎవరైనా అంటే నవ్వేస్తాను గాని సీరియస్‌గా తీసుకోను. లక్ష్మీ నరసమ్మగారి కావ్యాన్ని తెప్పించుకొని చూడండి. కవిత్వానికి ఎంత ముగ్ధులవుతారో! నేను కోట్ చేసిన పద్యాలకే ముగ్ధులయ్యారు బేతవోలు రామబ్రహ్మంగారు. ఆమె కవిత్వాన్ని నా కంటే పదేళ్ళ ముందే ప్రసిద్ధులు ప్రశంసించారు. వారిలో కొందరు మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు, జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు, బిరుదురాజు రామరాజు

గారు, నా డిస్కవరీ డిస్కవరీయే కాదు. చేరాకు (అందరిలాగే) కొన్ని అభిమానాలున్నా అందులో స్వస్థానాభిమానం కూడా ఒకటైనా; చేరాతలు స్వస్థాన పరిమితం కాదనేది పాఠకులకు తెలుసు. ఎవరి అభిమానాలు వారికుంటాయి. అందులో దోషం లేదు. దురభిమానాలే దోషాలు. మీ అమ్మ నీకెందు కిష్టం అని ఎవరన్నా అడిగితే ఏం సమాధానం చెపుతాం ?

ఈ సందర్భంలో ప్రస్తావన కొచ్చేది నండూరి రామమోహనరావుగారు చేరాతలకు రాసిన ముందుమాటలో కొంచెం లైటర్ వీన్‌లో నా స్త్రీ పక్షపాతిత్వాన్ని గురించి అన్న మాటలు. కవయిత్రులపై తూష్ణీం భావం అన్ని సమాజాల్లోనూ తరతరాలుగా ఉన్నదే. దాన్ని తొలగించాలన్న కోరిక నాకున్నమాట నిజమే. మంచి పద్యాలు లక్ష్మీ నరసమ్మగారు రాసినా, కొండేపూడి, ఘంటసాల నిర్మలలు రాసినా, పాటిబండ్ల రజని రాసినా, సావిత్రి రాసినా, మందరపు హైమవతి రాసినా, నేను వెంటనే అంటే పత్రికలో అచ్చయిన వెంటనే స్పందించిన మాట నిజమే. పూర్వపు అలక్ష్యాన్ని ఛేదించగలిగితే అది సాధించదగిన మంచి లక్ష్యమే అనుకుంటాను. అహంకారం అనకపోతే ఆ విషయంలో నా వంతు కర్తవ్యాన్ని నేను నిర్వహించాననే అనుకుంటున్నాను. నన్ను విమర్శించే విప్లవవాదులైనా ఈశ్వరి, విమలల కవిత్వాన్ని గురించి చాలా త్వరగా స్పందించింది చేరాతలనే విషయం గుర్తు తెచ్చుకోవటం మంచిది. ఎందుకంటే కృష్ణుడు, కె. శ్రీనివాస్, మాసేపల్లి, పాపినేని శివశంకర్ – ఆఖరికి (ఢిల్లీ) సుబ్బారావు కూడా ఈ విషయం విస్మరించారు. వీరంతా విప్లవ కవితాభిమానులు. చెరబండరాజు, వరవరరావు, గద్దర్ కవితల గురించి కూడా చేరాతల కంటే చాలా ముందే వేరు వేరు చోట్ల ఉపన్యాసాలుగానో సమీక్షలుగానో ప్రకటించాను. కృష్ణుడిలాంటి వాళ్ళు అప్పటికి (రచయితలుగా) పుట్టి ఉండరు.

తరువాతది అంటే ముందుది కంటక కిరీటారోపణ వ్యూహం. ఇక్కడ ఆరోపణ అంటే నెత్తిన పెట్టటం. దీని విషయం నేనేమి మాట్లాడదల్చుకోలేదు. ఇది కుటుంబ కలహం లాంటిది.

ఆ వరుసలో పైది భావకవితా ప్రియత్వారోపణ వ్యూహం. నాకు భావకవిత్వం అంటే ఇష్టమే. ఈనాడు కవితాభిమానులని చెప్పుకునే వాళ్ళెవరైనా భావకవిత్వాన్ని (నిర్వచనాల సంగతి అట్లా ఉంచండి) మెచ్చని వారెవరైనా ఉన్నారా ? అభ్యుదయ కవితా యుగంలో భావకవిత్వంపై విమర్శలు విన్నాను. వాటిని పునః ప్రస్తావించే వాళ్ళిప్పుడున్నారనుకోను. భావ కవితా ప్రారంభంలోనే ఆ కవిత్వానికి వ్యతిరేకంగా కొంత విమర్శ వచ్చింది. కవిత్వ

రూపంలో వచ్చిన వాటిల్లో అనంత పంతుల రామలింగస్వామిగారి శుక్లపక్షం చెప్పుకో దగింది. జయంతి రామయ్యగారు తమ ఆధునికాంధ్ర కవిత్వ వికాసంలో విమర్శించారు. ఆ కాలపు చాలా మంది పండితులూ కవులూ విమర్శించారు. జాషువా, త్రిపురనేని కవులు తమ వ్యతిరేకతను స్పష్టంగానే వ్యక్త పరచారు. వాళ్ళిద్దరూ సాంఘికాభ్యుదయాన్ని లక్షించే వాళ్ళు. సహజంగానే ఈ కవిత్వాన్ని మెచ్చలేకపోయారు. ఈ విషయంలో వీళ్ళు అభ్యుదయ కవులకు సన్నిహితులు.

భావ కవిత్వాన్ని చాలా నిశితంగా విమర్శించింది అక్కిరాజు ఉమాకాంతంగారు - 'నేటి కాలపు కవిత్వం' అనే పుస్తకం భావ కవిత్వంపై సాయుధ పోరాటం లాంటిది. అయితే ఉమాకాంతంగారు ఓడిపోయారనుకోండి. అయినా ఆయన విమర్శామార్గం ఇప్పటికీ అనుసరణీయమే. ఆయన వాదన ధోరణి నాకాదర్శం. తమ విమర్శ పరిధిని నిర్ణయించుకోటంలోనూ తన ప్రతిపాదనలను పరాస్తం చేసే అంశాలను తానే ముందుగా ఊహించటంలోనూ ఆయన ఆధునిక భాషా శాస్త్ర విమర్శల కత్యంత సన్నిహితుడుగా కనిపిస్తాడు. ఛందస్సు గురించి సంపత్కుమారుతో పేచీ పెట్టుకున్నప్పుడు నేను ఉమాకాంతం గారి మార్గాన్నే అనుసరించాను. (అదే ఆధునిక భాషాశాస్త్ర మార్గం కూడా)

ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే ఒక అభినవ గుప్తుడు నేను అక్కిరాజు ఉమాకాంతం గారి కాలంలో పుట్టాల్సిన వాణ్ణి అన్నాడు. నేనూ ఒప్పుకుంటున్నాను. నిజంగా ఆ కాలం, విమర్శకు బంగారు కాలం. ఆ కాలంలో పుట్టలేకపోయానే అని నేనూ విచారిస్తాను. ఆయనతో కలిసి నా పేరు ప్రస్తావించటమే గౌరవ ప్రదంగా భావిస్తాను.

ఇక ఆఖరిదీ, లిస్టులో మొదటిదీ అయిన 'నేను' ప్రయోగారోపణ వ్యూహం. చేరాతలు ప్రారంభం నుంచీ కూడా 'నేను' అనే మాట ప్రయోగిస్తూనే వున్నాను. అది నిషిద్ధంగా నేనెప్పుడూ భావించలేదు. అయితే ఇవాళ కొందరు ఆభాస మార్క్సిస్టు లింగ్విస్టులు దీనికి అభ్యంతరం చెప్తున్నట్టు కనిపిస్తున్నది.

మార్క్సిస్టులు వ్యక్తికన్నా సామాజిక శక్తికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. అది సహజమే. వ్యక్తులు లేకుండా సమాజం లేదు అని మార్క్సుకు తెలుసు అనుకుంటాను.

ప్రపంచ భాషలన్నిటిలోనూ వక్తృశ్రోతలను సూచించే పదాలున్నాయని భాషా సామ్యాలను గురించి మాట్లాడుతూ చార్లస్ హాకెట్టు అంటాడు. అంటే నేను, నువ్వు అనే మాటలు అన్ని భాషల్లోను ఉన్నాయన్న మాట. అవసరం కొద్దీ వచ్చాయి. వీటిని నిషేధించాల్సిన అవసరం కనపడదు.

'నేను' ప్రయోగం అహంకారం సూచిస్తుందని వీళ్ళ ఆరోపణ. చేరాతల్లో ఎన్ని 'నేను' లు వాడాడని లెక్కలుకట్టే వాళ్ళు. ఇంకొంచెం ఓపిక చేసుకొని ప్రయోగ ప్రయోజన నిర్ధారణ కూడా చేస్తే బాగుండు.

'అస్మాదృశుండ లఘు స్వాదురసావతార ధిషణా హంకార సంభార దోహల బ్రాహ్మీమయమూర్తి'' అని విశ్వనాథ సత్యనారాయణగారు వాడిన 'నేను' లో అహంకారం ఉంది. ఆ మాట కూడా తనే చెప్పుకున్నారు. నేను సైతం ప్రపంచాబ్జపు తెల్ల రేకై పల్లవిస్తాను అనే శ్రీ శ్రీగారి 'నేను'లో అహంకారం లేదు. ''ఎవ్వరిని ఎంతురో నన్ను ఏ ననంత శోకభీక తిమిరలోకైక పతిని'' అనే కృ.శా. గారి పద్యంలో 'నేను, నన్ను' అనే వాటిల్లో అహంకారం లేదు. కృష్ణ పక్షంలో 'నేను' లు లెక్కబెడితే కృ.శా.గారు ఏమై పోవాలి ? పాపం ఆయన కీర్తిశేషుడై బతికిపోయారు.

'నేను' ను మర్యాద కోసం కూడా వాడతారు. ఇంగ్లీషులో ఎవరినైనా సలహా అడిగితే If I were you ." అని ప్రారంభిస్తారు. అంటే 'నీ స్థితిలో నేనుంటే....' అని అర్థం. ఇది మర్యాద పద్ధతి అన్నమాట.

'నేను' ను విషయంగా చెప్పటానికి కూడా ఉపయోగిస్తారు.

''నా ఉద్దేశంలో...'' ''....నేననుకుంటాను'' అనే రకపు వాక్యాలు పెద్ద పెద్ద సూత్రీకరణలు చెయ్యటానికి ఇష్టపడనప్పుడు తన ఒక్కడి అభిప్రాయం మాత్రమే అని చెప్పటానికి ఉపయోగిస్తారు.

స్వానుభవ కథనంలో 'నేను' పాత్రధారికాక తప్పదు. ఆ మధ్య Indian Express లో first person అనే కాలమ్ కొన్నాళ్ళు నడిపారు. స్వీయానుభవ కథనం కోసమే ఆ పేరు పెట్టారు. పర్సనల్ కాలమ్‌లో పర్సనల్ టచ్ కోసం ఉత్తమ పురుష ఉపయోగిస్తాం. ఈ ''నేను - నువ్వు''ల ప్రయోగం మీద భాషా శాస్త్రంలో కొంత పరిశోధన జరిగింది. ఈ మాటల ప్రయోగంలో ఆత్మీయత ద్యోతకమవుతుందని పరిశోధకులు గమనించారు.

అందువల్ల ఎవరి రచనలో నయినా ''నేను'' లు లెక్కపెట్టటం ప్రయోజన శూన్యమైన శుష్క ప్రయత్నం.

చేరాతలు 1993 ఫిబ్రవరి 23

## భాషను శాసించడం ఎవరి తరం ?

తెనాలి బస్ డిపో నుంచి గుంటూరు వెళ్లే బస్ రూట్‌లో వంతెన దాటిన తరువాత మిషనరీ మహిళా కళాశాల కంటే ముందే ఎడంపక్క ఒక కాంపౌండూ, ఆ లోపల చాలా కాలం నుంచి తాళం వేసి ఉన్నట్టుగా ఉన్న ఒక ఇల్లు కనిపిస్తాయి. అక్కడ కాంపౌండ్ మీదా, ఇంటిమీదా –

అమ్మబడును.

అని పెద్ద లక్షరాలతో రాసి ఉంది. దీని విషయం ఆ మహిళా కళాశాల సీనియర్ తెలుగు లెక్చరర్ కె. ఎల్. సంపూర్ణగారి నడిగితే పూర్వం అదొక మిల్లు. మొదట ''ఇది అమ్మబడును'' అని వున్నట్టు జ్ఞాపకం అన్నారు. కానీ ''ఇది'' అని రాస్తే చెరిగి పోయిన ఛాయలు కనపట్టడం లేదు. ఇంటిమీద అమ్మబడును అని రాసి వుంది కాబట్టి అమ్మబడేది ఇల్లు అని అర్థం చేసుకోవాలి. తమాషా అదే రోజు ఆ లెక్చరరుగారింట్లోనే 'చిరంజీవి' అనే పత్రిక కనిపించింది. ఒక సినిమా నటుడి పేరుతో ఒక పత్రిక వచ్చినందుకు బోల్డు ఆశ్చర్యపడి తిరగేస్తుంటే అందులో ఒక ఫోటో కింద ఉన్న ఏదో నోట్‌లో ఈ వాక్యం ఉంది.

''ఎన్నిక కాబడిన ఉత్తరాలు కూడా కొన్ని ప్రచురించాం''

మళ్ళీ బడు ప్రయోగాల గురించి ఆలోచనలు మొదలయినాయి.

తెనాలి నుండి బెజవాడ వెళ్ళే బస్సులో కూడా ఈ ఆలోచనలు సాగినై. రోడ్డు కిరుపక్కలా పంట కాలువలు, నీళ్ళలో మెరిసే తాడిచెట్ల నీడలూ, అరటి తోటలు, మామిడి పూతలు ఆహ్లాదకరంగా వున్నాయి. అయినా బడు ప్రయోగాల గురించి ఆలోచించకుండా వుండలేకపోయాను.

రంగనాయకమ్మగారు బడు మీద యుద్ధం ప్రారంభించడానికి చాలా కాలం ముందు నుంచే వీటి తత్వాన్ని గురించి ఆలోచిస్తున్నాను. గిరిజన భాషల మీద పరిశోధన చేస్తున్న వాళ్ళు కర్మణి వాక్యాలను రిపోర్టు చేయలేదు. మా పరిశోధక విద్యార్థులను ప్రత్యేకంగా వెతకమని అడిగాను. అయినా వాళ్ళకూ దొరకలేదు. భద్రిరాజు కృష్ణమూర్తిగారి కొండ వ్యాకరణంలోను లేవు. సంస్కృతంలో వీటి ప్రయోగం ఎక్కువ. అయితే వైదిక సంస్కృతంలో కన్నా సాహిత్య సంస్కృతంలో ఎక్కువేమో నాకు తెలీదు. ఇంగ్లీషు వంటి

పాశ్చాత్య భాషల్లో వీటి విస్తృతి ఎక్కువ. బహుశా నాగరికతాభివృద్ధికి, కర్మణి ప్రయోగానికి సంబంధం ఉండొచ్చునేమో. బహుశా ''అభివృద్ధి'' చెందిన సంస్కృతుల భాషల్లో కర్మణి వాక్యాలుంటాయని సూత్రీకరించవచ్చునేమో అనిపించేది. లేకపోతే సాంస్కృతికాభివృద్ధికి కర్మణి వాక్యాలు ఒక భాషా సూచిక (a linguistic index to cultural development) గా భావించవచ్చునేమో అని అనుకునేవాణ్ణి. అయితే భాషాశాస్త్రంలో బలంగా పాతుకు పోయిన ఆనాటి కొన్ని అభిప్రాయాల వల్ల ఆ మాట బయటికి అనే ధైర్యం లేకపోయింది. అంటే తోటి విద్యావంతులు ఈ అభిప్రాయాలకు కంగారుపడతారని భయమేసింది. భాషలన్నీ సమానమేనని, నాగరిక భాషలు, అనాగరిక బాషలు అని వేరు వేరుగా వుండవని, అనాగరిక సమాజాలకు కూడా అత్యంత క్లిష్టమైన భాషానిర్మాణం వుండొచ్చునని భాషా శాస్త్రంలో చదువుకున్నాం. అందుకు విరుద్ధమైన ఏ ప్రతిపాదన అయినా మన ప్రజాస్వామ్య మనస్తత్వానికి (democratic sentiment) భంగకరమని భయపడ్డాను. అయితే ఇటీవల టాల్మీగివోన్ (Talmy Givon) అనే ఆయన రాసిన రెండు వ్యాసాలు చదివిన తరువాత నా ఆలోచనా క్రమం సరైన దారిలోనే ఉన్నట్టు నమ్మకం కలిగింది. ఆ వ్యాసాల్లో భాషా పరిణామ క్రమంలో Syntacticization అనే పద్ధతిని గుర్తించి కర్మణి వాక్యాలను గురించి కూడా చర్చించాడు. కర్మణి వాక్యాలు మొదట్నుంచీ ఉన్నవి కావని, తరువాత ఏర్పడినవని సూచించాడు. స్వాహిలీ వంటి భాషల్లో కర్మణి వాక్యాలు ఏర్పడ్డ మార్గాన్ని దశలవారీగా నిరూపించాడు. ఒక సమాజం సాంస్కృతికాభివృద్ధికి కొన్ని రకాల వాక్య ప్రయోగానికి సంబంధం ఉన్నట్టు అనుకోవడానికి (చెప్పడానికి) దీన్ని బట్టి వీలు కలుగుతున్నది.

కర్త ప్రాధాన్యాన్ని తగ్గించడానికి కర్మణి వాక్యం ఒక పద్ధతి. ''జరిగింది'' వంటి వాక్యం ఇంకో పద్ధతి. అయితే ఈ రెంటికీ ప్రాధాన్య వివక్షలో భేదం వుంది. కర్తరి వాక్యం కర్మ ప్రాధాన్యాన్ని వివక్షిస్తే, కర్మణి వాక్యాలు కర్మ ప్రాధాన్యాన్ని, జరుగుడు వాక్యాలు క్రియా ప్రాధాన్యాన్ని వివక్షిస్తాయి. భాషా పరిణామంలో వేరువేరు అవసరాల కోసం వేరు వేరు సందర్భాలలో ప్రయోగించడం కోసం వేరు వేరు కాలాల్లో ఇవి వచ్చి ఉండొచ్చు. సాధారణ సంభాషణ శైలిలో ఏ భాషలో అయినా కర్మణి వాక్యాలుండవు. ఉన్నా చాలా అరుదు. అయితే భాష ప్రయోజనం ఇద్దరు మాట్లాడుకోవడంతో ఆగిపోదు. రకరకాల సందర్భాలకు భాషా ప్రయోగం అవసరమవుతుంది. సెమినార్లు, రాజకీయ ప్రసంగాలు, సైన్ బోర్డులు, పత్రికా ప్రకటనలు, వ్యాసరచన మొదలైనవి ఎన్నో సందర్భాలున్నాయి. ఇవన్నీ భాషా ప్రయోగానికి సందర్భ భేదాలే. ఈ భేదాలను బట్టి భాషా ప్రయోగ భేదాలుంటాయి. ఆయా సందర్భాల కనుగుణంగా కొన్ని భాషా ప్రయోగ రీతులు ఏర్పడ

తాయి. కొన్ని రచనా (రాత) సందర్భాలలో ఏర్పడ్డ పద్ధతులు అన్ని మాట్లాడే సందర్భాల లోను వుండక్కర్లేదు. అలా ఉండవు కూడా ఎక్కడో ఒకచోట గీత గీసుకుని ఈ సందర్భాలలో వచ్చినవాటినే నేను అంగీకరిస్తాను అంటే అది వ్యక్తిగత నిర్ణయమవుతుంది. భాష సొంత ఆస్తి కాదు. ఉమ్మడి వ్యవస్థ. భాషా ప్రయోక్తలు మన శాసనాల్ని పట్టించుకోరు. వాళ్ళ అవసరాలే వాళ్ళకు ముఖ్యం.

మాట్లాడే వ్యక్తిని, రాసే వ్యక్తిని కలిపి ప్రయోక్త అని, వినే వ్యక్తిని చదివే వ్యక్తిని కలిసి గ్రహీత అని అందాం. 'బడు' ప్రయోగ విస్తృతికి ప్రయోక్త-గ్రహీతల మధ్య ప్రయోగ విస్తృతికీ సంబంధం ఉంది. దీన్నే Distanc'ng అనే process గా గుర్తించాలని 1989 జూన్‌లో అన్నామలై యూనివర్సిటీలో మొదటిసారి ప్రతిపాదించాను. అప్పుడక్కడున్న ప్రొఫెసర్ ఎన్. కుమారస్వామి రాజా దీనికి అదే సభలో తన సమ్మతిని సూచించారు. మాట్లాడే భాషకు, రాసే భాషకు భేదాన్ని సూచిస్తూ వాలెస్ షేఫ్ (Wallace Chafe) అనే ఆయన involvement&detatchment అనే అంశాలను ప్రతిపాదించాడు. వీటిని తెలుగులో సంపక్తి - నిస్సక్తి అనుకోవచ్చు. అయితే ఇది మాట్లాడే భాషకు, రాసే భాషకు విభాజక రేఖ సాధ్యమనుకుని చేసిన ప్రతిపాదన. అలాంటి విభాజక రేఖ సాధ్యం కాదని డెబోరా టానెన్ (Deborah Tannen) నియి అకినాసో (Niyi Akinnaso) వంటి వారు వాదిస్తున్నారు. ఈ Distancing (దూరీకరణ) అనే ప్రతిపాదన రెండోవర్గం వారి సిద్ధాంతానికి సమీపంగా ఉంటుంది.

ఇదిలా ఉండగా అరెస్టు కాబడ్డాడు, ఎన్నిక కాబడింది వంటివి తప్పులని రంగ నాయకమ్మగారు వాదిస్తున్నారు. భాషా ప్రయోక్తలు వాడే ప్రయోగ రీతులను తప్పులని తేలిగ్గా తీసేయడం శాసకులకు సాధ్యమేమో కాని శాస్త్రకారులకు సాధ్యం కాదు. పైగా ఈ ప్రయోగం రాతలోనే కాక మాట్లాడే భాషలో కూడా వినబడుతున్నది. 1990 జనవరి 27న వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో సాహిత్య విమర్శపై జరిగిన ఒక సెమినార్‌లో ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ కోవెల సంపత్కుమారాచారిగారు ''రసం బదనాం కాబడిన పదం'' అన్నారు. 1990 జనవరి 25 విశాఖ ఈనాడు సంచికలో 'విచారణ నిమిత్తం అరెస్టు కాబడి అండర్ ట్రయల్స్‌గా ఉన్న నక్సలైట్లను'' అని ఉంది.

ఇది భాషలో కొన్ని అవసరాల కోసం వచ్చినట్టు కనిపిస్తున్నది. ''పోలీసుల వేధింపులకు తట్టుకోలేక అరెస్టు అయ్యాడు'' అనే వాక్యాన్ని ''పోలీసు వేధింపులకు తట్టుకోలేక అరెస్టు కాబడ్డాడు'' అని అనలేం. అంటే అరెస్టు అయ్యాడు అనే క్రియకు ''తనకు తాను

కావాలని చేసే చర్య'' (వాలంటరీ) అనే అర్థం వస్తున్నది. దీన్ని నివారించడం కోసం కొత్తగా భాషలో ప్రవేశించిన రూపం 'కాబడు' అనేది. కాబడు అనేదాన్ని ధాతు నిర్మాణం (derivat on) లో భాగంగా పరిగణించాలా (కనబడు, వినబడు లాగా), లేక కర్మణి లాంటి మరో వాక్య రీతిని గుర్తించాలా అనేది చాలా విషయాలను ప్రయోగాలను పరిశీలించిన తరువాత చేయాల్సిన నిర్ణయం. ఈ ప్రయోగం తెలంగాణా జిల్లాలో చదువుకున్నవారు మాట్లాడే భాషలో తరచుగా వినవస్తున్నది. రచనలో అన్నిచోట్లా కనిపిస్తున్నది.

తెలుగులో 'బడు' స్థిరపడడమే కాదు, వ్యాపిస్తున్నది. గిడుగు రామమూర్తిగారు నిరసించినా, నార్ల వెంటకేశ్వరరావుగారు నిషేధించినా, నండూరి రామమోహనరావుగారు నాలిక్కరచుకున్నా, బూరాగారు పద్య చమత్కారాలు చేసినా, రంగనాయకమ్మగారు యుద్ధం ప్రకటించినా *బడు* ప్రయోగాలను భాషలో లేకుండా చెయ్యలేం. భాషను శాసించడం ఎవరి తరం ?

చేరాతలు 1990 ఏప్రిల్ 15

## తెలుగు స్పెషలిస్టుల నుంచి తెలుగును 'బ్రోచే' వారెవరు?

తెలుగులో తెలియు, వచ్చు అనే రెండు క్రియలున్నాయి. వాటి వాడకంలో కొన్ని గమనించదగిన విశేషాలున్నాయి. ''నాకు సంస్కృతం తెలుసు, నాకు సంస్కృతం వచ్చు'' అని రెండు విధాలుగానూ అనొచ్చు. 'నాకు సునంద తెలుసు' అనొచ్చు, కాని 'నాకు సునంద వచ్చు' అని అనకూడదు. నేర్చుకుంటే వచ్చే విద్యలకే 'వచ్చు' అనే క్రియను వాడతాం. ఏదో కొద్దిపాటి పరిచయం ఉంటే 'తెలుసు' అంటాం.

అట్లాగే భాష విషయంలో కూడా 'నాకు సంస్కృతం వచ్చు' అనే వాక్యానికి నాకు సంస్కృతం తెలుసు అనేదానికన్నా అధికార్థం ఉంది.

అసలు భాష రావటం అంటే ఏమిటి ?

దీనికి అన్ని సందర్భాలకు పనికొచ్చే సమాధానం దొరకటం కష్టం. భాషా సందర్భాన్ని బట్టి దీని అర్థం మారుతుంది.

కేవలం మాట్లాడే భాషే ఉన్నచోట ఆ భాష రావటం అంటే ఆ భాష మాట్లాడగలగట మన్నమాట. పెంగొ, మండ, కొండ, కుయి, కువి - వంటి భాషలు రావటం అంటే వాటిని మాట్లాడగలడటం. ఆ భాషల్లో పుస్తకాలు లేవు. అందువల్ల చదవటం, రాయటం ఉండవు.

మరి సంస్కృతం రావటం అంటేనో ? ఒకప్పటి సంగతి ఏమో కాని సంస్కృతం ఇప్పుడు మాట్లాడే భాష కాదు. అయినా సంస్కృతం మాట్లాడేవారు కొద్దిమంది లేకపోలేదు. ఉదయం ఏడు గంటలకు రేడియో తిప్పితే 'వార్తాః శ్రూయంతాం, ప్రవాచికా విజయశ్రీః' అని స్ఫుటమైన ఉచ్చారణతో సంస్కృతం వినపడుతుంది. కొంచెం అలవాటుపడితే అర్థమవుతుంది కూడా.

హైదరాబాదులో సురభారతివారి సమావేశాల్లో ప్రసంగాలు సంస్కృతంలో ఉంటాయి. అంతేకాదు అక్కడ సమావేశమయిన పండితులు సంస్కృతంలోనే తరచుగా మాట్లాడు కుంటారు. హిందీ ప్రచారసభవాళ్ళు మనం తెలుగులో మాట్లాడినా వాళ్ళు హిందీలోనే సమాధానం ఇచ్చినట్లు ఈ సురభారతి వారు కూడా అంతగా కాకపోయినా అప్పుడప్పు డయినా మనం తెలుగులో మాట్లాడితే వాళ్ళు సంస్కృతంలో సమాధానం ఇస్తారు.

సంస్కృతం మాట్లాడే పాశ్చాత్యుల్ని కూడా ఎరుగుదును. పెన్సిల్వేనియా విశ్వవిద్యా లయంలో జార్జి కర్డోనా, ఇలినాయ్ విశ్వవిద్యాలయంలో హాన్స్ హాక్ అనే విద్వాంసులు

మన పండితులతో సమానంగా సంస్కృతం మాట్లాడుతారు.

అయినా సంస్కృతం రావటం అంటే సంస్కృతం మాట్లాడగలగటం కాదు. ఆ భాషలో ఉన్న సమాచారాన్ని గ్రహించగలగటం అనే అర్థంలోనే వాడతాం. సంస్కృతం మాట్లాడగలిగినవారందరికీ తమ నిత్య వ్యవహారంలో వాడుకోటానికి వేరే భాషలు వచ్చి ఉంటాయి. మాట్లాడే భాషగా సంస్కృతం ప్రయోజనం పాండిత్య ప్రాగల్భ్య ప్రదర్శనమే. నిజానికి సంస్కృతం రాసే భాష కూడా కాదు. రాసిన భాష, సంస్కృతంలో మాట్లాడేవాళ్లున్నట్టు, రాసేవాళ్లు కూడా కొద్దిమంది ఉన్నారు. ఏవో పత్రికలు కూడా ఉన్నట్టున్నాయి. కొంత సాహిత్య సృష్టి కూడా జరుగుతుండొచ్చు. పూర్వం గిడుగు సీతాపతిగారు ప్రసిద్ధ తెలుగు పద్యాలకు సంస్కృతానువాదాలు చేసి సంతోషించేవారు. అవి చదివేది మళ్లీ తెలుగు వాళ్లే. సంస్కృతం నేర్చుకోటం అంటే సంస్కృతం చదివి అర్థం చేసుకునేంతవరకూ నేర్చుకోటం అనే అర్థం. ఏ ప్రాచీన భాష అయినా అంతే.

అయితే తెలుగు ప్రాచీన కావ్య భాష నిన్న మొన్నటి వరకూ రచనా భాషగా ఉండేది. లక్షణ గ్రంధాలకు రాసిన వ్యాఖ్యానాలు వ్యావహారిక భాషలో ఉన్నాయని గి. రాం. మూర్తి గారు అనుకునేవారు. వ్యావహారిక రూపాలు కాసిని కనిపించగానే అది వ్యావహారికమని మురిసిపోయేవారు రామ్మూర్తిగారు. మేం పూర్వం తెలుగు ఆనర్సులో కావ్య భాషలోనే పరీక్షలు రాసేవాళ్లం. అరసున్నాలు, బండిఱాలు, యడాగమాలు, ద్రుతకార్యాలు అభ్యాసం చేసే వాళ్లం. ఇప్పుడా అవసరం తీరిపోయింది. ఇప్పుడు కావ్యభాషలో రాసేవారు పాత కాలపు అలవాటు కొద్దీ రాస్తున్నారు గాని అవసరమై కాదు. పండితులయినా వ్యక్తీకరణ వైవిధ్యం కోసం ప్రాచీనాంధ్ర పదాలను ఎడనెడ వాడినా ఈ భాష మాట్లాడేవారు కాదు. మాట్లాడటం చేతకాక కాదు. సమాజంలో ఈ వ్యవస్థ లేదు గనుక.

ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు, అడపా రామకృష్ణరావుగారు, నేను విస్కాన్సిన్ విశ్వ విద్యాలయంలో చదువుతూ మేడిసన్ నగరంలో ( 1962-1963) ఒక ఇంట్లో ఉండే వాళ్లం. ముగ్గురమూ తెలుగు ఎం. ఏ.లమే. అప్పుడప్పుడు హుషారెక్కువై సరదాకి గ్రాంథికంలో మాట్లాడుకునేవాళ్లం. బుచ్చిబాబుగిరి చివరికి మిగిలేది నవల్లో జగన్నాథంలా 'ఇచట నరసున్న గలదు, ఇందలిది శకట రేఫము' అనే విధంగా ఉచ్చరించని రాత గుర్తుల స్థానాన్ని కూడా చెప్పేవాణ్ణి. ఇదంతా సాధారణ వ్యవహార స్థితి కాదు. దీనిని ప్రధాన స్థితి (ma'n stream) గా కాక ప్రైవేటు వ్యవహారంగా పరిగణించాలి. వీటికి functional value లేదు.

పూర్వం తంగిరాల నారాయణశాస్త్రిగారు శాసన భాషలో పద్యాలు రాశానని చెప్పుతుండే వారు. శాసనభాష ఒకప్పటి రాసే భాష. కావ్యేతరావసరాలకు వాడే వాళ్లు. ఒకసారి

అమాయకత్వం నటిస్తూ శాస్త్రిగారిని అడిగాను: 'చాలా కష్టమైన పనే కానీండి, ఎందుకంట కష్టపడటం ?' అని. ఆయన ఒక్క క్షణం బిత్తరపోయి తెప్పరిల్లుకొని నన్ను కోప్పడ్డారు.

మళ్లీ, మాతృభాష రావటానికి, పరభాష రావటానికి భేదం ఉంది. దాన్ని ఉపయోగించే అవసరాన్ని బట్టి పరభాషా భ్యాసం ఉంటుంది. పరభాషకూ మన భాషకూ ఉన్న సాంస్కృతిక సంబంధం బట్టి కూడా ఉంటుంది. సంస్కృతమే తీసుకోండి. సాహిత్య పఠనం కోసం, శాస్త్ర విజ్ఞానం కోసం ప్రధానంగా ఈ భాషను నేర్చుకుంటాం. కాని ఆధునికంగా ఇంకో విశిష్టావసరం వచ్చింది. రకరకాల సాంకేతిక పద సృష్టికి కూడా నేటి తెలుగుకు సంస్కృతం సోర్సుగా ఉంది. అందువల్ల ఇప్పుడు సంస్కృతం నేర్చుకోవటం అంటే కొంతలో కొంత సంస్కృత వ్యాకరణ సంప్రదాయం కూడా నేర్చుకోటం. మరీ ముఖ్యంగా పద ఉత్పత్తి, పద సంయోజన (సంధి-సమాస) విధులను గురించి తెలుసుకోవలసి ఉంటుంది. తేజోశక్తి, మనోచక్షువు వంటి రూపాల ఉనికి ఈ లోపం వల్లనే కావచ్చు. (తేజశ్శక్తి, మనశ్చక్షువు అని రాసినా పత్రికల ప్రూఫ్ రీడరు దిద్దే అవకాశం ఉంది. శక్తిమంతుడు అని నేను రాస్తే తప్పనుకొని పత్రికలవారు శక్తివంతుడు అని దిద్దారు. అట్లా దిద్దనవి చాలా ఉన్నాయి. అది వేరే కథ).

పరభాషలు నేర్చుకోటానికి వ్యక్తిగతమైన అవసరాలు, ప్రయోజనాలు, అలవాట్లు, ఇష్టానిష్టాలు, అవకాశాలు - ఇట్లాంటివెన్నో కారణాలుంటాయి. నామట్టుకు నేను కాలేజీ చదువుల్లో సంస్కృతం నేర్చుకున్నా వ్యాకరణం మీదే చూపుండేది కాని ఆ భాషలో గ్రంథాలు చదవాలని కోరికుండేది. క్లాసు పుస్తకాలకు మించి ఆ చదువు విస్తరించలేదు. రసగంగాధరమో, ధ్వన్యాలోకమో తెలుగులో దొరుకుతుండగా సంస్కృత వ్యాఖ్యలు చదవటానికి బద్ధకం వేసేది. మళ్లీ చింతామణి, అథర్వణ కారికావళి మూలంగా చదవటానికి ఉత్సాహంగా ఉండేది. అదే ఇంగ్లీషులో అయితే ప్రధానంగా శాస్త్ర గ్రంథాలు చదవటంలో ఉన్న ఆసక్తి సాహిత్యంపై ఉండేది కాదు. ఇంగ్లీషు కవుల, అందులోనూ పాత వాళ్ల సాహిత్య భాష అంత కొరుకుడు పడేది కాదు. ఒకప్పుడు శ్రమపడి ఫ్రెంచి నేర్చుకున్నా, ఇప్పుడు మిగిలింది ఆ భాష వ్యాకరణాన్ని గురించి చేసే చర్చల్లో ఉదాహరించే వాక్యాలే. ప్రయోజనాన్ని బట్టే భాష నేర్చుకుంటాం. పాశ్చాత్యులు తెలుగు నేర్చుకుంటే అది మన భాష మీద ప్రేమ వల్లనేనని మురిసిపోతుంటాం. అప్పుడప్పుడు మన భాష గొప్పతనాన్ని గురించి బడాయి పోతుంటాం కూడా, మనం పరభాషలను ఎంత ప్రేమగా నేర్చుకుంటామో, వాళ్లు తెలుగు నేర్చుకున్నా అంతే. అవసరం లేనప్పుడు నేర్చుకున్నదీ మిగలదు, మా మేడిసన్ చదువుల నాటి డ్యాన్‌మీట్సన్ తెలుగు లాగా, నా ఫ్రెంచి లాగా.

పరభాషల విషయం కాసేపు అవతల పెడదాం. మాతృభాష రావటం అంటే ఏమిటి?

ఇది కూడా చాలావరకు అవసరాలను బట్టే ఉంటుంది. ఆ భాషా వాతావరణంలో పుట్టి పెరుగుతాం కాబట్టి దాదాపు ఆటోమేటిక్‌గా మాట్లాడగలుగుతాం. ఇందులోనూ సందర్భాలను బట్టి తరతమ భేదాలుంటాయి. కొంత మంది ధారాళంగా మాట్లాడతారు, కొంత మంది ఆగి ఆగి మాట్లాడతారు. కొందరు సామెతలు, దృష్టాంతాలు, పోలికలు, జాతీయాలు - సమర్థంగా వాడుతూ ఆసక్తికరంగా మాట్లాడతారు. కొంతమంది ఉపన్యాసాల్లో కవిత్వం మాట్లాడతారు. కొంతమంది వచనమే మాట్లాడతారు. ఇవి సాధారణంగా వాతావరణాన్ని బట్టి పరిసరాలననుసరించి అసకంల్పితంగా నేర్చుకునేవి. అక్షరాస్యులైనవారు ఉత్తరాలు రాయటం నేర్చుకుంటారు. ఇది కూడా కొంతవరకు ఆటోమేటిక్‌గా నేర్చుకునేది.

భాషలో రచనా సంప్రదాయం ఉంటే ఆ సంప్రదాయ రీతులను ఆకళించుకోటం కూడా భాష నేర్చుకోటంలో భాగమే.

ఆధునిక కాలంలో భాషను ఎన్నో అవసరాలకు వాడుతున్నాం. ఈ అవసరాల్లో మాట్లాడటం ఒక భాగం మాత్రమే. రాసే భాష ఇంకా చాలా అవసరాలకు ప్రయోగిస్తున్నాం. రాసే భాష అంటే మాట్లాడిందాన్ని లిపి బద్ధం చేసింది అనే అర్థం చాలా పాతది, సంకుచితమైనది, రాసే భాష సందర్భాల్ని బట్టి రచనా సంప్రదాయాలను ఏర్పరచుకుంటుంది. ఈ భేదాలు పదప్రయోగంలోనూ, వాక్య నిర్మాణంలోనూ, వాక్య సంయోజనలోనూ ఉంటాయి. ఇవి వాడటం తెలుసుకోకపోతే రాసే భాష తెలిసినట్టు కాదు. మాతృభాషా సమాజంలో సమగ్ర వ్యక్తిత్వం కావాలనుకునే వాళ్ళు ఈ సంప్రదాయాలను గ్రహించాలి. రాసే భాష బంధు మిత్రులకు ఉత్తరాలు రాసుకోటానికి పరిమితం కాదు. వ్యాసరచన, సమీక్షా రచన, ప్రణాళికా రచన, సిద్ధాంత రచన - ఇట్లాంటి రచనా భేదాలు అభ్యసించటం మాతృభాషా ప్రావీణ్యంలో భాగాలే. రచనా భాషలో మెలకువలను ఎరిగి ప్రయోగించటం భాష రావటంలో భాగమే.

పూర్వం సాహిత్య భాషలు, సాహిత్యం లేని భాషలు అని ఒక విభాగం చేసేవారు. సాహిత్యంలేని భాషలంటూ చేసేవారు. సాహిత్యంలేని భాషలంటూ ఉండవు. లిఖిత సాహిత్యం ఉన్న భాషలు, లేని భాషలు అని వీళ్ల అర్థం. అయితే సాహిత్య స్థితిలో మౌఖిక లిఖిత సమాజాల మధ్య కొన్ని గుణాత్మక భేదాలున్నాయి.

మౌఖిక భాషా సమాజాలు చిన్నవి. ఈ సమాజాల్లో సాహిత్య సృజన సద్యస్సామూహిక వ్యాపారం. ఎక్కువమందికి అందులో క్రియాశీల పాత్ర ఉంటుంది. లిఖిత భాషా సమాజాల్లో కన్నా మౌఖిక సమాజాల్లో కవుల శాతం ఎక్కువ. లిఖిత సమాజాల్లో ఇది ప్రధానంగా వ్యష్టివ్యాపారం. కర్తృత్వం, కాపీరైట్లు ఉంటాయి. అందువల్ల లిఖిత సమాజాల్లో సాహిత్య సృష్టిచేసే వారు వేరుగా ఉంటారు.

మౌఖిక సమజాల్లో శ్రోతలందరూ సాహిత్య వినియోగదారులే (consumers). లిఖిత సమాజాల్లో సాహిత్య పాఠకులు వేరే ఉంటారు.

మౌఖిక సాహిత్యంలో ప్రాచీన సాహిత్యం అంటూ ఉండదు. అది ఎప్పటికప్పుడు వర్తమానం అవుతూ ఉంటుంది. లిఖిత సాహిత్యంలో ప్రాచీన స్థితి చాలావరకు (పాఠాంతరాలు, ప్రక్షిప్తాలు ఉన్నా) పరిరక్షితమవుతుంది.

అందువల్ల లిఖిత సాహిత్యంలో (వివాదాలున్నా) కాలక్రమం chronology తెలిసే సాహిత్యం ఉంటుంది. అంతేకాక లిఖిత సాహిత్యం పరిమాణం సాధారణంగా మౌఖిక సాహిత్య పరిమాణం కన్న ఎక్కువ ఉంటుంది. ప్రక్రియా (genre) భేదాలు ఎక్కువ ఉంటాయి.

మాతృభాషా వ్యవహర్త ఇవన్నీ నేర్చుకోవాలా ? అనే ప్రశ్న వస్తుంది. ఆధునిక సమాజంలో అందరికీ సాహిత్యం మీద ఆసక్తి ఉండకపోవచ్చు. కాని ఆ సమాజంలో సంపూర్ణ వ్యక్తిత్వం పెంపొందించాలనుకునే వాళ్లకు ఆ సాహిత్యంలో పరిచయమూ అవసరమే. అది లేకపోతే ఆమేరకు అతనికి ఆ భాష రానట్టే.

ఆశ్చర్యకరమైన విషయమేమింటే, తెలుగులో రాసినవి చదవలేని తెలుగు స్పెషలిస్టులు తయారవుతున్నారీ దేశంలో. ఈ తెలుగు స్పెషలిస్టులకు ప్రాచీన వ్యాకరణ రచనా సంప్రదాయం ఒకటుందని తెలీదు. ప్రాచీన వ్యాకర్తలు కొన్ని విలువైన విషయాలు చెప్పారని వీళ్లెరగరు. అవి చదవలేరు. ఎందుకంటే అవి తెలుగులో ఉన్నాయి కదా ! తెలుగులో 'ఇంచు' (సంతోషించు, కోపించు, కరుణించు వంటి మాట్లల్లో) క్రియోత్పాదక ప్రత్యయమని ఒక తెలుగు లింగ్విస్టు ఇంగ్లీషులో రాసేదాకా మరో తెలుగు లింగ్విస్టుకు తెలీదు. స్వరసమీకరణం (vowel harmony) అనేది గత శతాబ్దంలోనే (సంస్కృతంలో అయితే ఇంకా ముందే) తెలుగు వ్యాకరణాలు గుర్తించాయని ఎరుగరు (ఇకారంబుమీది కు, ను, వు క్రియా విభక్తి యుత్వంబునకిత్వంబగు) లు వర్ణం, బహువచన ప్రత్యయమనీ, అపవాది ఇవర్ణాలు, ఈ ప్రత్యయం ముందు ఉవర్ణాలు మారతాయనీ చెప్పటానికి 1985లో ఇంగ్లీషులో వచ్చిన పుస్తకాన్ని ఆధారంగా కోట్ చేసే తెలుగు స్పెషలిస్టులు మనకున్నారు.

ఈనాటి తెలుగు స్పెషలిస్టులకు తెలుగు చదవలేకపోవటం సిగ్గుపడవలసిన లోపంగా కనపడటం లేదు. సగర్వంగా ప్రకటించుకోదగిన సలక్షణంగా కనిపిస్తున్నది.

ఈ తెలుగు స్పెషలిస్టుల బారి నుంచి తెలుగును బ్రోచేవారెవరు ?

చేరాతలు 1991 జూన్ 9

# ప్రితీష్‌నందీ ఆంగ్ల కవితలకు త్రిపురనేని శ్రీనివాస్ అనుసృజన

ఇతర భాషల నుంచి కవిత్వాన్నీ, కథల్ని, నవల్ని తెలుగులోకి తెచ్చుకొనే అలవాటు మనకు మొదట్నుంచీ ఉంది. తొలినాటి, మలినాటి పురాణ సాహిత్యాన్ని అట్లా ఉంచండి. ఆధునిక కాలంలో హిందీ బెంగాలీల నుంచి చాలా సాహిత్యం అనువాదమయింది. ఈ శతాబ్దపు పూర్వార్ధ భాగంలో ఈ అనువాదాలు ముమ్మరంగా జరిగేవి. మళ్లీ ఇప్పుడు కవిత్వానువాదాలు ప్రపంచ సాహిత్యం నుంచి బాగా జరుగుతున్నయ్. శివారెడ్డి , స్మైల్, దేవరాజు మహారాజు, సౌభాగ్య ఇట్లాంటివారు ఆఫ్రో ఏషియన్ భాసల నుంచి కూడా చాలా చేశారు. కానీ ఇంకో ఆంగ్లికన్ కవులుగా ప్రసిద్ధిచెందిన కవుల అనువాదాలు తెలుగులో అంతగా కనపడవు. ఎ.కె. రామానుజన్, నిసిమ్ ఎజెకియెల్, కేకి దారువాలా వంటి కవుల ఇంగ్లీషు పద్యాలు తెలుగులో కనపడవు. ఆ లోపాల్ని పూరించటానికా అన్నట్లుప్రీతిష్ నందీ ( 1 9 4 8 ) ని తెలుగులో అందించాడు త్రిపురనేని శ్రీనివాస్. నందీ 1967 నుంచి 15కి పైగా కవితా సంపుటాలు ప్రకటించాడు. అందులో Any where is another place (1979), The Rainbow Last Night (1981) అనే రెండు సంపుటాల్లో నుంచి (ఈ రెండిట్లోనూ కనిపించేవి చాలా ఉన్నాయి.) తీసుకున్న 33 కవితలను శ్రీనివాస్ 'యెక్కడైనా యిక్కడే' అనే పేరుతో తెలుగులోకి అనువదించి 16 పేజీల పుస్తకం 2 రూ. ధరతో కవిత్వం ప్రచురణలలో రెండోదిగా వెలువరించాడు.

శ్రీనివాస్ చేసిన ప్రయత్నం చాలా దొడ్డది. నేను చేసే ఏ వ్యాఖ్యలైనా అతని ప్రయత్నాన్ని కించపరచే ఉద్దేశంతో చెయ్యడం లేదు. అతని అనువాదాన్ని మూలంతో పోల్చి అనువాదంతో వచ్చే సమస్యలను, ముఖ్యంగా భాషా దృష్టితో పరిశీలించటమే నా ఉద్దేశం. ఈ అనువాదాలు ఎవరు చేసినా ఈ సమస్యలు ఎదురయ్యేవే. పైగా ఇవి కవితానువాదాలు.

కవితానువాదాల్లో అనువాదకుడి బాధ్యత పెరుగుతుంది. అందువల్ల కష్టమూ పెరుగుతుంది. విషయ ప్రధాన వచనంలో విషయం ముఖ్యం మాత్రమే. కవిత్వంలో విషయంతోబాటు చెప్పే పద్ధతికి ప్రాముఖ్యం ఉంది. యాకబ్సన్ అన్నట్లు కవిత్వంలో code is message పద ప్రయోగంలో, పద సంయోజనలో, వ్యక్తీకరణలో – ఇంకా చాలా వాటిల్లో కవితా రచన వచనం కన్నా భిన్నం. ఇవన్నీ అనువాదంలో పట్టుకోవడం కష్టం. ఈ కష్టం వల్లనే క్రిస్టోఫర్ కాడ్వెల్ Poetry is difficult to translate అన్నాడు. ఆ

మధ్యలో తిరుపతిలో జరిగిన అనువాద సమస్యల సదస్సులో భద్రిరాజు కృష్ణమూర్తిగారు. 'కవిత్వం' అనువాదం చెయ్యలేరు మానేయండి' అని సలహా ఇచ్చారు.

కవిత్వానువాదంలో ప్రత్యేక సమస్యలున్న మాట నిజమే. ఆ మాటకొస్తే ఏ అనువాదం లోనైనా సమస్యలుంటాయి. ఒకే భాషలో అయినా ఒకరు చెప్పినవి. మళ్లీ చెప్పాలంటే కష్టం. అందుకని ఇవేమీ మానుకోం. అన్ని రకాల భాషాంతరీకరణలు అన్ని కాలాల్లోనూ జరుగుతూనే ఉన్నాయి. కవిత్వానువాదంలో కవి ఉద్దేశించినవి ఉద్దేశించనివి అనువాదకుడు గ్రహించి ఉద్దిష్ట భాషలో చెప్పాలి. ఈ చెప్పటంలో ప్రత్యేకమైన ఇబ్బందులు ముఖ్యంగా భాషా సంబంధమైనవి ఎదురవుతాయి. వాటిల్లో కొన్ని ప్రదర్శించడమే ప్రధానోద్దేశంగా శ్రీనివాస్ అనువాదాలను పరిశీలిస్తాను. ఈ పరిశీలినలో ప్రీతీష్‌నంది కవిత్వాన్ని నేనర్థం చేసుకున్న పద్ధతి కూడా కనిపిస్తుంది. అది శ్రీనివాస్ పద్ధతి కన్నా భిన్నంగా ఉండొచ్చు. అంతమాత్రాన ఈ రెంటిట్లో ఏదో ఒకటే సరైనది అని చెప్పలేం. రెండూ సరైనవి కావచ్చు. రకరకాల భేదాలతో రెండిట్లోనూ మంచి చెడ్డలుండొచ్చు. అందువల్ల ఈ నిర్ణయాలతో సంబంధం లేకుండా అనువాదాలను పరిశీలిద్దాం. The Rainbow last Night అనే సంపుటలో నందీని పరిచయం చేస్తూ ఇట్లా అన్నారు.

"In this, his new book. Pritish Nandy, the ce ebrated young poet, explores a new form. The brief lyric, Tout Intense, bareboned and fasc natingly crafted, each poem can be experienced as it were ıt many livels

అని వర్ణించారు. అంతకుపూర్వం పుస్తకం (any where is another place) లో కూడా ఇదే అభిప్రాయాన్ని చెబుతూ నందీ కవితా రూపాన్ని fragmented lyric form అన్నారు. దీన్నే తెలుగులో చెవుతూ శ్రీనివాస్ 'క్లుప్తగీతం' అన్నాడు. నందీ నిసర్గ భాషలో లోతైన భావాలను అత్యంత క్లుప్తంగా చెప్పి గాఢమైన కవిత్వానుభవాన్ని కలిగించే కళలో నిష్ణాతుడు. ఈ క్లుప్తతను నందీ జాపనీస్ హైకూల నుంచి గ్రహించినట్టు ఈ కవితను బట్టి గ్రహించవచ్చు.

| | |
|---|---|
| **Butterfly** | సీతాకోకచిలుక |
| the angry squal | ఆగ్రహించి ఈదురుగాలి |
| subs des | అణగి పోయింది |
| the fallen flower returns to the | రాలిన పువ్వు తిరిగి కొమ్మ చేరింది |
| branch with wings | రెక్కలతో |

వానగాలి అణిగిన తరువాత చెట్టుకొమ్మరెమ్మపై వాలిన సీతాకోకచిలుక వర్ణ్య వస్తువు.

గాలికి రాలిన పువ్వు రెక్కలతో మళ్లీ కొమ్మను చేరిందా అన్నట్టుగా ఈ సీతాకోకచిలుక కనిపిస్తున్నదని భావం. గాలికి పువ్వు రాలటం సహజమే. అయితే అదే పువ్వు రెక్కలు మొలిపించుకొని మళ్లీ వెనక్కి చేరిన భ్రాంతి కలిగిస్తుంది. ఇట్లా పొడిపొడి మాటలతో లోతైన భావాన్ని క్లుప్తంగా ప్రదర్శించే టెక్నిక్ జపనీస్ హైకూది. నిజానికి నందీ పేరుతో అచ్చయిన ఈ పద్యానికి పూర్వ రూపం హైకూల గురించి ఏ పుస్తకంతో పరిచయమున్న వారికైనా దొరికిపోతుంది. అయితే హైకూలకు అక్షర సంఖ్యానియమం( 5 - 7 - 5 ) ఉంది. అందువల్ల వాక్యాలను పూర్తిచెయ్యడానికి కూడా వీలు పడకపోవచ్చు. నందీ ఆనియమం పెట్టుకోలేదు. ఆక్లుప్తతను సాధించడానికి మాత్రం నందీ ప్రయత్నించాడు. దాన్నే brief lyric అన్నారు. 1980వ దశాబ్దంలో తెలుగు వాటి మినీ కవితోద్యమానికి ఈ ప్రేరణ కూడా కొంత పనిచేసి ఉండవచ్చు.

నందీ చంధస్సు పాటించలేదు. కాని పదాల ఎన్నికలో అనుప్రాప గుణం (assonance) అక్కడక్కడా వచ్చేట్లు ప్రయత్నించాడు అది ఈ కవితలకు శబ్ద సంబంధమైన లిరిక్ గుణాన్ని సమకూర్చింది. శ్రీనివాస్ కూడా అక్కడక్కడ అది సాధించాడు. కాని చాలా చోట్ల అది కుదరలేదు.

| | |
|---|---|
| **Reflection** | ప్రతిబింబం |
| not home | ఇల్లూకాదు |
| nor wounded country side | గాయపడిన పల్లే కాదు |
| in your eyes | నీ కళ్లలోని |
| the tender violence | మృదు హింసే |
| mirrors my | నా జ్వర పీడిత రాత్రులకు |
| fevered nights | ప్రతిబింబం |

పై ఇంగ్లీషు పద్యంలో not-nor లకీ, violence-eyes లకీ, mirrors-my లకీ ధ్వని సామ్యాలు కనిపిస్తాయి. కాని తెలుగులో ఇల్లూ-పల్లే మధ్యనే అది సాధ్యమయింది. ఇది ఇంగ్లీషులో ఉన్నట్టుగా తెలుగులో సాధ్యంకాని మాట నిజమే కాని శ్రీనివాస్ అసలు ప్రయత్నించాలా అని.

ఇంగ్లీషు మంచి తెలుగు చేసేటప్పుడు భావానువాదమే కాక ఇతర విషయాలు కూడా చూడాలి. శీర్షిక reflect అనే క్రియ నుంచి విష్పన్నమైన Reflection అనే నామం. క్రియా లక్షణమైన process (చలనం) ఇక్కడ కనిపిస్తుంది. పద్యంలో mirrors అనేది క్రియా గుణాన్ని సూచిస్తుంది. శ్రీనివాస్ దీన్ని ఉపేక్షించాడు. 'ప్రతిబింబం' అని శీర్షిక పెట్టాడు. పద్యంలోనూ అదే వాడాడు. దాని వల్ల 'నీ కళ్లల్లో కనిపించే మెత్తటి హింస నా గాయపడ్డ

రాత్రులను ప్రతిఫలిస్తుంది' అనే భావం తెలుగులో సరిగ్గా రాక రూపం వెనకాల దాక్కుంది.

ఒక భాషలో నుంచి మరోభాషకు అనువాదం చేసేటప్పుడు ఏ పదానికి ఏ సందర్భంగా ఎంత అర్థం వస్తుందో జాగ్రత్తగా చూసుకోవాలి. ఏమరుపాటు వల్ల ఎట్లా ప్రమాదాలు జరగుతాయో చూడండి.

| | |
|---|---|
| **Freedom** | స్వేచ్ఛ |
| Fingers of the w'nd | గాలివేళ్లు |
| pluck | వొంటరితనం తీగల్ని |
| the strings of solitude | తెంపుతాయి |
| the frontiers | నిన్నటి సరిహద్దులు |
| of yester open up | వొకదాని తరవాత మరొకటి |
| one by one | తెరుచుకుంటాయి. |

పై పద్యం ప్రాణం Pluck అనే మాటలో ఉంది. ఈ మాటకు 'తెంపుతాయి' అని తెలుగు చేశాడు కాని pluck అనే మాట పూలూ పండ్ల సందర్భం అయితే 'తెంపటం' అర్థం సరైనదే. కాని ఇక్కడ తీగెలు వాద్య పరికరాన్ని సూచిస్తున్నాయి. 'మీటటం' అనే అర్థం గ్రహించాలి ఈ సందర్భానికి. అట్లాగే తెలుగులో నిన్నటి సరిహద్దులు అంటే ఇంగ్లీషులో ఉద్దేశించిన అర్థంకాదు. 'నిన్న'కు సరిహద్దులు అనాలి. గాలి వేళ్లు ఒంటరితనపు తంత్రుల్ని మీటితే పురాస్మృతులు ఒక్కటొక్కటే విచ్చుకున్నాయి అని భావం. ఈ భావం తెలుగులో దెబ్బతిన్నది. Nowhere (కాదెక్కడా) అనే పద్యంలో కూడా "It is a long way of to Yesterday" అనే వాక్యాన్ని 'నిన్నటికిది సుదూరం' అని తెలిగిస్తాడు. కాని ఇక్కడ భావం గతం నుంచి చాలా దూరం వచ్చేశామని. 'నిన్న'కు అని ఉండాలి. భాషాంతరీకరణం భాషతో పని. భాషలో ఏ శబ్దానికెంత శక్తి ఉందో? ఏ వ్యాక రణరూపాలకే అర్థచ్ఛాయా భేదాలున్నాయో తెలుసుకోకపోతే అనువాదంలో ప్రమాదాలెదురవుతాయి.

తెలుగు అనువాదంలో ఎక్కువ స్వతంత్రం తీసుకుంటే మూలకవి ఉద్దేశానికి విఘాతం కలుగుతుంది. ఈ ఖండిక చూడండి.

ఇంగ్లీషులో turn అనే క్రియలో ఉన్న సున్నితత్వం తెలుగులో స్వతంత్రించి 'నిలుపు తుంది' అనటం వల్ల మొద్దుబారిపోయింది. అట్లాగే whisper ను 'సవ్వడి' అనటం వల్ల అర్థ విస్తృతి జరిగి స్పెసిఫిటీకి ఉన్న ప్రాధాన్యం పోయింది. ''వసంతపు గుసగుసలకు ఆకులు హరిత వర్ణానికి తిరిగి'' నయ్యని భావం.

అట్లాగే ఇంకోటి చూడండి.

| | |
|---|---|
| **Again** | మళ్లీ |
| night falls | జ్ఞాపకాలు |
| as memories grow | యేకాంత అరణ్యాల్లో విస్తరించినట్లు |
| in the forests | చీకటి పడుతుంది |
| of solitude | అమాయకత్వంలో |
| tender y we sin in | మనం |
| our innocence | చిన్న చిన్న తప్పులు చేస్తాం |

మూలం నుంచి దూరం వెళ్లిపోయి అసలు భావాన్ని ఎట్లా భంజిస్తున్నాడో.

ఇక్కడ grow అనే మాటను విస్తరించటంగా భావించకూడదు. ఒంటరి తనపు అడవుల్లో జ్ఞాపకాలు పెరిగినట్లు చీకటి పడింది. అని భావం. అట్లాగే 'చిన్న చిన్న తప్పులు చేస్తాం' అనే భావం కవి ఉద్దేశించలేదు. 'చీకటి తప్పులు' అనే ధ్వని కూడా ఉంది.

ఒక్కోచోట నందీ కొన్ని మాటకున్న రెండు అర్థాల్ని ఉద్దేశించినట్టు కనిపిస్తాడు. తెలుగులో అది కష్టమవుతుంది. centuries betray the skyline అన్నచోట betray కు దృశ్యమానం చెయ్యటం, నమ్మకద్రోహం చెయ్యటం అనే రెండర్థాలూ ఉన్నాయి. రెంటికీ ఇక్కడ ప్రమేయం కల్పించవచ్చు. తెలుగులో ' ఆకాశం, శతాబ్దాల వ్యక్తీకరణ' అని మాత్రమే చేసి ఊరుకున్నాడా. అట్లాగే పైన ఉదహరించిన 'మళ్లీ' లో grow సంఖ్యా వృద్ధి కావచ్చు, పరిమాణ వృద్ధీ కావచ్చు. ఇవన్నీ తెలుగులోకి తేవటం కష్టమే. కాని అనువాదకులు కేవలానువాదకులు కాదు. వ్యాఖ్యాతలు కూడా. అందువల్ల ఏదన్నా మార్గం సూచించాలి. రెండర్థాలలో ఒకేసారి సాధ్యం కాకపోతే రెండూ వేరువేరుగా ఇవ్వాల్సిరావచ్చు.

ఇదే సందర్భంలో ఇంకొకటి ప్రస్తావించాలి. ప్రీతిష్ నందీ కవిత్వంలో రకరకాల నిర్మాణాలున్నాయి. ఈ సంబంధాల్ని స్టాంజాల విభజన ద్వారా సూచిస్తాడు. ఎక్కువ భాగం రెండూ లేక మూడు స్టాంజాలుగు విభజిస్తాడు. 'రెండు స్టాంజాల మధ్య సాధారణంగా వైరుధ్యం కాని, విరోధా భాస కాని ఉంటుంది. మూడు స్టాంజాలున్న చోట మూడోది పద్యానికి ఒక తాత్త్వికమైన ముగింపు వస్తుంది. అనువాదంలో వీటిని కూడా దృష్టిలో ఉంచుకోవాలి. శ్రీనివాస్ ఈ నిర్మాణ దృష్టిని పట్టించుకున్నట్టు లేదు.

ఇంకో విషయం ఈ విషయం పై ఇంత విపుల పరిశీలన చేయటానికి తాను అనువదించిన పద్యాల మూలాలను శ్రీనివాస్ నాకందించి సాయపడ్డాడు. అందుకు అతని నిజాయితీని అభినందిస్తున్నాను.

పనిచేసేవాడినే ఇంకా బాగా చెయ్యాలంటాం. ఏమీ చెయ్యని వాణ్ణి ఏమీ అనంకదా!

*చేరాతలు 1990 సెప్టెంబరు 23*

# భారతీయాంగ్ల కవితలకు
# బేతవోలు రామబ్రహ్మం - పునస్సృజన

ఒక భాషలో చెప్పింది మరో భాషలో చెప్పటం అనువాదం అంటాం. అయితే ఇది అనుకున్నంత తేలికకాదు. అనువాదంలో భాషా సమస్యలు. సాంస్కృతిక సమస్యలు అంటూ అనువాద విధాన పరిశోధకులు మాట్లాడుతుంటారు. ఇవన్నీ ఇట్లా ఉండగా కవిత్వానువాదం అని ఒకటుంది. ఒక భాషలో చెప్పిన కవిత్వాన్ని మరో భాషలో కవిత్వంగా చెప్పగల్గితే దాన్ని కవిత్వానువాదం అంటాం. ఇక్కడే చిక్కులున్నాయి. ఒక భాషలో కవిత్వంగా అనుకున్న దాన్ని మరో భాషా సమాజంలో కవిత్వంగా అనుకోవడానికి అడ్డు వచ్చే విషయాలు చాలా ఉంటాయి. నిజానికి ఒక భాషలోనే ఒకరు కవిత్వం అనుకున్న దాన్ని మరొకరు కవిత్వం అనుకోకపోవచ్చు. అందుకు అభిరుచి భేదాలు కారణం. భిన్న భాషా సమాజాల మధ్యన అభిరుచుల భేదాలతో పాటు సామాజికుల ఆలోచనలలోనూ, అలవాట్లలోనూ ఉన్న భేదాలు కవిత్వ నిర్ణయంలో పాత్ర వహిస్తాయి.

కవిత్వం భాషలో ఉన్నా కవిత్వ భాష సాధారణ భాషకన్నా భిన్నం. సాధారణ భాషలో సమాచార ప్రసారమే ప్రధాన లక్ష్యం. కవిత్వంలో సౌందర్యదృష్టి అదనంగా ప్రవేశిస్తుంది. ఈ దృష్టి ధ్వనుల కూర్పులోనూ, పదాల ఎన్నికలోనూ, వాక్యాల వరణంలోనూ అర్థ స్ఫూర్తి లోనూ ఇంకా ఇట్లాంటి అనేక ఇతరాంశాల్లో ఉంటుంది. ఒక భాషలో సౌందర్య రచనకు పనికొచ్చే సామగ్రి మరో భాషలో అదే పద్ధతిలో ఉండదు. అందువల్ల ఒక భాషలో సాధ్యమైనవన్నీ ఇంకో భాషలో అదే పద్ధతిలో సాధ్యం కావు. ఒక భాషలో ఒక కవికి కవితావేశం ఉంటుంది. ఆ కవితావేశంలో ఎక్కువ ఆలోచించకుండానే సహజం అనిపించే పదాల, వాక్యాల, అర్థాల కూర్పు ఏర్పడుతుంది. ఈ కూర్పుతోపాటు వీటికి అనుగుణంగా గానీ లేక అదనంగా గానీ చెవుల కింపైన ధ్వనుల కూర్పుంటుంది. మూల కవి పొందిన ఆవేశమూ, అనుభూతి అనువాదకవి అదే పద్ధతిలో తెచ్చుకోవటం సాధ్యం కాదు. అందువల్ల అనువాదకుడు నిజానికి కవిత్వాన్ని అనువదించినట్లు కనిపించినా అతను చేసేది సాధారణార్థంలో అనువాదం కాదు. ఒక మూల కవితలోని భావం తనలో ప్రేరేపించిన భావాలను అనువాదకుడు వేరే భాషలో పెడ్తాడు. అందువల్ల మూలాన్ని అనువాదాన్ని కవిత్వంలో పోల్చి అంచనాలు కట్టడం అంత తేలికైన విషయం కాదు.

భాషా భేదాల దగ్గరకొస్తే ఒక్కో భాషలో ప్రాచీనం, ఆధునికం, ప్రాంతీయ మాండలికం, వర్గ మాండలికం అంటూ భేదాలుంటాయి. ఈ భేదాలను ఇతర భాషల్లో చూపించటం సాధ్యం కాకపోవచ్చును. కాని వాటి సాయంతో పునస్సృజన చేయవచ్చు.

ఎంత గొప్ప అనువాదకుడైనా మూలభాషలోని కవితా సౌందర్యాన్ని యథాతథంగా అనువాదంలో దించలేడు. తప్పనిసరిగా కొంత నష్టం జరుగుతుంది. అయితే సమర్థుడైన అనువాదకుడు జరిగిన నష్టాన్ని పూడ్చుకునే ప్రయత్నం చేస్తాడు. ఈ నష్టం పూడ్చటం కోసం అనువాదంలో కొన్ని కొత్త సృజనలు చేస్తాడు. ఈ దృష్టితో చూస్తే అనువాదం మూలకవిత్వంతో పోల్చినపుడు లాభనష్టాల సమ్మిశ్రంగా కనిపిస్తుంది. జరిగిన నష్టాన్ని భర్తీ చేసుకోవడానికి అనువాదకుడు కొత్త భాషలో కొన్ని ప్రయత్నాలు చేస్తాడు. ఇవి మూలభాషలో ఉన్నాయా ? లేవా ? అని చూసే బదులు అనువాదంలో భావవ్యక్తికి ఎంత సహకారులుగా ఉన్నాయో చూడటమే సరియైన పద్ధతి.

పలుకు చిలుక పేరుతో అచ్చవుతున్న ఈ అనువాద కవితలు వివిధ భారతీయ భాషల నుంచి ఇంగ్లీషు ద్వారా తెలిగించిన కవితలు. అసలు మూలకవితలో భావం ఇంగ్లీషులో ఎంత నష్టపోయిందో తెలియదు. ఇంగ్లీషులో కనిపించే సౌందర్యం కాని, అసౌందర్యం కాని మూలంలోదే అని చెప్పటానికి వీలులేదు. ఇప్పుడు ఈ తెలుగులో కనిపించే భావం అసలు మూలానికి ఎంత దూరంగా ఉందో చెప్పలేం. ఇవన్నీ చిక్కులే. ఇన్ని చిక్కుల్ని ఎదుర్కొంటూ అనువాదం చేయకపోతే ఏం అనే సందేహం రావచ్చు. అయితే అతి ప్రాచీన కాలం నుంచీ కవిత్వానువాదాలు జరుగుతూనే ఉన్నాయి. కవిత్వాభిమానులు వాటిని చదువుతూనే ఉన్నారు. పోయినంత పోగా మిగిలిన దాన్నీ కొత్తగా ఉత్పత్తి అయిన దాన్నీ గ్రహిస్తూనే ఉన్నారు. అనుభూతి చెందుతూనే ఉన్నారు.

కవిత్వానువాదం కవే చేయాలి. కవి ఊహించేతీరును సాధారణుల కన్నా మరో కవే పట్టుకోగల్గుతాడు. ఈ ''పలుకు చిలుక'' కవి ఇంతకు పూర్వం ''క్రొత్త గోదావరి'' కవిగా ప్రసిద్ధుడు. భాషా విభవం బాగా ఉన్న వాడు. పద్యరచనలో రాటు తేలినవాడు. పదాల రంగు, రుచి, వాసనలు తెలిసినవాడు. అందువల్ల ఈ అనువాదకవితలు పాఠకులలో కవితానుభూతి కలిగించడంలో సఫలమవుతాయి. అయ్యాయి కూడా.

ఈ మూలకవితల్లో చాలా వైవిధ్యం ఉంది. కొన్ని కవితలు ప్రకృతిని వర్ణిస్తే మరికొన్ని కవితలు మానవ ప్రకృతి లోతుల్ని దర్శిస్తాయి. కొన్ని కవితలు సామాజిక దృక్పథాన్ని ప్రదర్శిస్తే మరికొన్ని కవితలు ప్రపంచపు లోతుల్ని స్పృశిస్తాయి. ఇంత వైవిధ్యం ఉన్న

కవిత్వాన్ని ఒకే కవి నిర్వహించటం అంత సులభ సాధ్యమైన పనికాదు. అయితే రామ బ్రహ్మంగారికి ఉన్న కవితానుభవం ఈ పనిని సమర్థంగా నిర్వహించింది. ఈ పద్యాలను చదువుతుంటే ఎక్కడా అనువాదం చేసినట్లు కనిపించదు. పనిగట్టుకొని పద్యాలు రాసినట్లుండదు. ఈ పద్యాల్లో ప్రౌఢమైన వృత్తాలూ ఉన్నాయి. తెలుగు పలుకుబడికి ఒదిగిపోయిన వృత్తాలూ ఉన్నాయి. ఇందులో మందగమనాల గీతాలతోపాటు చిందులు తొక్కే అందాల కందాలూ ఉన్నాయి. పద్యసౌందర్యం, భావస్ఫూర్తి పెనవేసుకుపోవటం రామబ్రహ్మం తెలుగు కవిత్వ సాధనలో అందుకున్న ఒక ఉన్నత శిఖరం.

పలుకు చిలుక పద్యాలు ఆయనచేత చదివించుకొని వినటమే కాక స్వయంగా మళ్ళీ మళ్ళీ చదువుకొని ఆస్వాదించాను. చాలా పద్యాల ఆంగ్ల మూలాలను చదివాను. రెంటినీ తులనాత్మకంగా చదివాను. రామబ్రహ్మం గారు ఇందులో ప్రాచీనాంధ్ర కవుల ఒరవడిని, అంటే మూలానికి మెరుగులు పెట్టే ఒరవడిని పాటించారు. మూలంలో ఉన్న అందాలు జారిపోయిన జాడలేవీ లేవు. మూలంలోని సారాంశం ఎక్కడా నష్టపోలేదు.

మూలంలో ఆంగ్లానువాదాలలో శైలీ భేదాలు లేవు. ఛందో భేదాలు అంతకన్నా లేవు. అన్ని భావాలూ తేలికైన భాషలో సూటిగా ఉన్నాయి. రామబ్రహ్మంగారు మూలంలోని అదనపు విలువలు తీసుకొచ్చారు. సూటిదనాన్ని త్యాగం చెయ్యకుండానే రచనకు కొత్త అందాలు కూర్చారు.

కవిత్వ భాష కవులు తమకు తామే తయారు చేసుకునేదయినా, అందుకు కొన్ని భాషలు కొన్ని ప్రత్యేక సౌకర్యాలు అందిస్తాయి. తెలుగులో మాండలిక భేదాలు రచనా సౌందర్యానికి ఎంత దోహదం చేసిందీ ఆధునిక వచన రచన, కవితా రచన రుజువు చేశాయి. అయితే ఈ అనువాద కవితలకు అట్లాంటి అవసరాలు కలగలేదు.

తెలుగులో సంస్కృతాది భాషల నుంచి వచ్చిన పదాలు ఒక్కో భావానికి బరువును అందిస్తాయి. తెలుగు మాటలు భావానికి సారళ్యాన్ని సమకూరుస్తాయి. పద్య రచనలో ఇంకా ప్రచురంగా వాడుకలో ఉన్న ప్రాచీన భాషా పదాలు మరోరకపు హుందాతనాన్ని చేకూరుస్తాయి. సంస్కృత సమాసాలు సందర్భశుద్ధితో తెలుగులో ప్రయోగిస్తే వచ్చే సౌందర్యం చాలా ఉంది. ఆ సమాసాలు మళ్ళీ చిన్నవీ, పెద్దవీ, మధ్యరకంవీ. ఒక్కోరకం ఒక్కో భావ వ్యక్తీకరణకు పనికొస్తాయి. ఇవి కాక తెలుగు కవిత్వ భాష అందించే మరో సౌకర్యం ఛందోవైవిధ్యం. సరిగ్గా వాడుకోవాలేకాని ఆంధ్ర కవితా సంప్రదాయం (నిజానికి ఇది ఒక సంప్రదాయం కాదు, అనేక సంప్రదాయాల సమాంతర ప్రవాహాలు)

అందించినంత ఛందో వైవిధ్యం ఇతర భాషల్లో లేదేమోనని నా అనుమానం.

గుర్వధికమైన శార్దూల మత్తేభాది సంస్కృత వృత్తాలు, చిరుసమాసాలకు అనువైన చంపకోత్పలాలు, అలతియలతి పదముల కాహళ సంధించినట్లు చెప్పటానికి వీలైన దేశిపద్యాలు, రగడలూ, వాటితో కూర్చిన దరువులు, పాటలూ, పల్లవులు, కీర్తనలూ, సంకీర్తనలూ - ఇట్లా ఎన్నెన్నో; వీటిలో ఒక సంప్రదాయం అందించిన వైవిధ్యం అంతా ఒడుపుగా వాడుకున్నారు రామబ్రహ్మంగారు. ఇంత ఒడుపుగా ఈ పద్య వైవిధ్యాన్ని, మళ్ళీ వాటిలో శైలీ భేదాల్ని వాడుకున్న పద్యకవులీ తరంలో అరుదు. అందులో రామబ్రహ్మం అగ్రేసరుడనటానికి సందేహించక్కరలేదు.

ఒట్టి గీతపద్యాన్నే తీసుకోండి. ఈ అనువాదాల్లో వాటిని విరివిగా వాడుకున్నారు. అందుకు కారణం బహుశా ఆయన ఎన్నుకున్న భారతీయ కవితల్లో వస్తురీతుల సారళ్యం, గాఢత కావచ్చు.

అయ్యప్ప పణిక్కర్ అనే మళయాళకవి మళయాళంలోనూ, ఇంగ్లీషులోనూ సరళంగానూ, గంభీరంగానూ కవిత్వం రాస్తారు. I don t l'ke the Himalayas అని ఒక కవిత రాశారు. ఇక్కడ హిమాలయా లంటే నిజంగా హిమాలయ పర్వతాలు కాదు. అసమ సమాజానికి సంకేతంగా గ్రహించారు. ఇది ఆయన చెప్పరు. అందమైన హిమాలయాలను అసహ్యించుకోటం ఏమిటి అని వాచ్యార్థాన్ని భంజించి ఉద్దిష్టార్థాన్ని గ్రహించాల్సి ఉంటుంది. మూల మళయాళ కవితకు తానే చేసుకున్న ఆంగ్లానువాదం ఇది –

I don't like your Himalayas, you know,<br>
First, they're too high :<br>
they do not su t our country<br>
Second, they're too proud

* * * *

Third, they re too cold,'<br>
it snows there even 'n Summer;<br>
But look at these plains<br>
I like them

You can walk about if you like
just what suits our ideology
So I've explained to you
Why I don't like the Himalayas
but if you can flatten them
for instance like the beech,
there I shall try my hand
but no compulsion, please

పై కవితలో ideologies అనే మాటలో సూచన. మైదానాల ప్రశంస. వగైరాల గురించి ఆలోచిస్తే పద్యంలో ఉద్దిష్టార్థాన్ని గ్రహించ వచ్చు. ఇట్లాంటి సందర్భాల్లో ఈ గాంభీర్యాన్ని రామబ్రహ్మంగారు గీత పద్యాల ద్వారా సాధిస్తారు, చదును (పుట - 29) అనే ఖండిక చూడండి.

నేను, మిత్రమా ! మెచ్చుకోలేను వీని
నీ హిమాలయంబుల నంటేసి మంచు
ముద్దలందమా ? చందమా ? మొద్దుబారు
తనువు రవ్వంత స్పృశియంతమని నయంత
• • • •

ఇంకనొక్కటి కంటివే, ఎంత గర్వి
మయ్యవీనికి ఠీవిగానలరి నిలిచి
నలుసున్నట్లు వీక్షించుజనాళినెల్ల
ఛాఛ! ఇంత అహంకృతి నబబటయ్య
• • • •

మండు వేసవిలోను నీక్ష్మాధరాన
మంచు కురియుచు నుండు ముమ్మాటికొక్క
ఋతువుగాని, వనప్రియ రుతుముగాని
లేని ఈ బండ తెలికొండ లేను మెచ్చు
• • • •

శీతనగము నేల ఛీత్కరింతు
నో వచించితి మిత్రమా ! ఒకట నీవు
చమను పరతువేనద్దాని జయను పరపు
మపుడు మెచ్చెద - యత్నింపుమాశయున్న
కాని, యొకమాట ! నిర్బంధకలన సున్న.

సమతాభావం ఇందులోని ఐడియాలజీ అన్న విషయం చెప్పీ చెప్పకుండా తెలుగులోనూ కనిపిస్తుంది.

అయ్యప్ప పణిక్కర్‌గారిదే మరో కవిత Freedom అనేదీ అట్లాంటిదే. దాన్ని స్వతంత్రత (పుట - 81) అనే పేరుతో అనువదించారు. వేళకు అన్నానికి కూడా వెళ్ళలేని అస్వతంత్ర ఖైదీల మనఃస్థితిని సున్నితంగా వర్ణించిన కవిత ఇది. ఆ పద్యంలో ఉత్తరార్థంలో మూలాన్ని, తెనిగింపును చూడండి.

Long after the day
had burnt down, and
the double tongued darkness
licked away
the l'ght of the stars
to the ınmates
ıt was not yet day - break
How are they to know it s dawn
without orders from above ?

వెలిగి వెలిగి ప్రొద్దను వత్తి మలగిపోయె;
రెండు నాల్కల చీకటి - రిక్కగముల
వెలుగు నెల్ల మెల్లన నాకి వేసె; లోని
వారికింకను తెల్లవారలేదు
అంధకారము తొలగిన దఖిలభువికి
తెల్లవారిన దనుమాట తెలిసికొనుట
వారి కగునటే; పైనున్న వారి ఆజ్ఞ
లేక ఊపిరైనను బీల్చలేనివారు.

పైన double tongued darkness అనే మాటను *రెండు నాల్కల చీకటి* అనీ, the light of the stars అనే మాటను *రిక్కగముల వెలుగు* అనీ అనువాదం చేశారు. మొదటి పదంలో తెలుగు నుడికారం, రెండో పదంలో పాత తెలుగు సొగసు, రెండిట్లోనూ సాధించిన పొదుపు చూడండి. భాష స్వాధీనంలో ఉంటే, అదునుకు తగినట్లు ఎన్నుకునే నేర్పుంటే తొలి సృజనతోపాటు పునస్సృజన కూడా ఎంత ఫలవంతంగా చెయ్యవచ్చునో తెలుస్తుంది. పిచ్చుక అనే ఉర్దూ కవితానువాదంలో (పుట - 56) గీతపద్యంలో పల్లవి నిర్మించి పాటలాగా నడిపిన వైనం చూడవచ్చు.

ఓసి చిన్నారి పిచ్చుకా . ఉండియుండి
నీవు కదలాడ గదలాడు నీదు నీడ
. . . .

ఓసి గారాల పిచ్చుకా ! ఉండి యుండి
నీవు పాడంగ పాడును నీదు నీడ
. . . .

ఓసి రతనాల పిచ్చుకా ! ఉబుసుపోక
అడుగుచుంటిని చెప్పవే ఎడద విప్పి

మూలభావ స్వరూపాన్ని చెడనీయకుండా ఛందో గమనంలో అందం సాధించిన మరో ఖండిక చూడండి.

అత్తూర్ రవివర్మ రచించిన Times అనే ఖండికను (ఆంగ్లాను వాదకుడు ఆర్. విశ్వనాథన్) వేళలు (పుట - 74) అనే పేరుతో అనువదించారు.

Years ago
Before I held, slate or book
In the house where I lived with dad
No clock ticked from a wall

చిన్నప్పుడు పూరింటను
నున్నప్పుడు పలక - బలప మొడిలో పడి తా
మున్నప్పుడు మా యింటను
నున్నట్లెరుగ గడియార మొక్కటియేనిన్

మూలాంగ్లంలో గడియారం చప్పుడు అనువాదంలో రాలేదు. నాన్న ప్రసక్తి రాలేదు. అయినా అసలు భావానికి నష్టం కలగలేదు. ఆ కొద్దిపాటి నష్టాన్ని లయద్వారా, మొదటి మూడు పాదాల్లో అధిక ప్రాసతో సాధించిన ఛందస్సౌందర్యం ద్వారా పూరించడం చూడండి. శంకర పిళ్లైగారి Dobi and Dhoti అనే మళయాళీ కవితను ''ఎర్రంచుల తెల్ల పంచె'' (పుట- 16) అని అనువదించారు. పద్యంలో ఎరుపు బహుశా తిరుగుబాటు స్వభావానికి సంకేతం కావచ్చు. అణచివేతకు ఎదురు తిరగటం, వ్యాప్తి చెందటం సూచించారు. దీనిలో కందపద్యాల లయవిన్యాసం ద్వారా సాధించిన గమన వైవిధ్యం భావాన్ని, లక్ష్యాన్ని కదను దొక్కించిన వైనం కనిపిస్తుంది.

కొన్ని ఉదాహరణలు చూడండి

గుంజిన కొలదిగ నెరుపై
రంజినతో పంచెయెల్ల రక్తారుణ కాం
తిం జెలువారుచు సాయం
సంజలనస్త్రాద్రిసాను సాత్మ్యము నొందెన్

ఈ రంగేమిటి బాబూ
ఆరారగనూరుచున్నదని యచ్చెరుపై
నారీమణి యచ్చెరువున
నీరంతయు తెచ్చి గుంజి నీరసపడియెన్

ఈ లీలను గని యమ్మడి
వేలును నాశ్చర్యపడుచు - విసిగిపడుచున్
లేలెమ్మని, తే తెమ్మని
బేలమ్ముమను తానుపట్టె - శిలపైగొట్టెను

కంద పద్యానికి లక్షణం కూర్చేవి చతుర్మాత్రాగణాలయినప్పటికి వాటిని త్రిశ్రగతిలో ఆరేసి మాత్రలకు విరుస్తూ నడవటం ఇక్కడ సొగసు. ప్రాసను మరింత విస్తరించటం మరో సొగసు.

ఋతువర్ణన పూర్వాధునికవు లెందరెందరో చేశారు. ఆ మధ్యన చేరాతల్లో కొన్ని చైనీస్ ప్రకృతి కవితలను నేను పరిచయం చేశాను. మరి కొన్నింటిని ''వార్త'' (1996 జూన్ 8) సృష్టిలో వాడ్రేవు చినవీరభద్రుడు పరిచయం చేశాడు. ఋతువులు

ప్రకృతిలో జరిగే మార్పులు గనుక ఋతుగీతులన్నీ ప్రకృతి కవితలే. ఈ రకపు కవితలు ప్రపంచ సాహిత్యంలోనే నిత్య వైవిధ్యంతో వెలువడుతుంటాయి. కవితా శక్తిని ప్రదర్శించటానికి ప్రకృతి కవితలు మంచి సాధనాలు. శైలీ భేదాన్ని ప్రదర్శించటానికున్న అవకాశాల్ని రామబ్రహ్మం గారు వాడుకున్న తీరును గమనించండి.

ఆంగ్ల మూలంలో ఈ భాగాలు చూడండి -

Then comes the month of Ashad, and dusty w'nds, blow-the spr'ngs almost dry up, the pines heave deep s'ghs, the Sun r'ses hot and the earth become's copper, red. Harried by burning heat, the creatures look for shelter the birds sneak into cool nooks, 'their throats parched; the ponds dry up and there is hue and cry for water.

తారాస్మైల్‌పురీ అనే డోగ్రీకవి చేసిన Seasons అనే ఖండికలోది పై భాగం. ఇక్కడ గ్రీష్మర్తువర్ణన జరిగింది. ఆంగ్లశైలి అంతా ఒకే రకంగా సింపుల్‌గా ఉంది. గ్రీష్మఋతువులో ఎండ చండ ప్రచండంగా ఉంటుంది. ప్రాణికోటి దయనీయ స్థితిలో ఉంటుంది. కవితా శక్తి ఉన్న కవి ఈ భేదం గమనిస్తాడు. అందులో ఆంధ్రభాషలో శబ్ద సంపద, సమాస గ్రథన భేదం, ఛందోవైవిధ్యం పట్టుబడ్డ కవి ఊరుకుంటాడా ? ఋతుగీతి (పు 13) లో తెలుగు పద్యాలు చూడండి.

దవధూమైధిత వాత్యక ప్రతతులన్ దావానలాభాతప
ప్రవిశుష్యద్ ద్రవ సారణి శ్రజములన్ భాస్వన్మహోష్ణర్బుధ
చ్ఛవిమద్బాలదివాకరోదయములన్ సంతుష్ట ఖర్జూర భూ
జ వినిఃశ్వాసశిరః ప్రకంపముల నాషాఢమ్ము విచ్చేసినన్.

కాగిన రాగిపళ్లెరముగా సెరుపెక్కిన నేల మీద నే
మూలను నిల్వలేక పశువుల్ పిసరంతటి నీడకోస ము
ద్వేల గవేషణమ్ము జరిపెన్ పులుగుల్ తమ గూండ్లు వీడిరా
జాలక గొంతుకల్ తడుపజాలక కూసెను గోడు గోడునన్.

మొదటిది శార్దూలం. మహా ప్రాణవర్ణ - దీర్ఘాక్షర ఘటితం, ప్రౌఢ సమాసగ్రథితం. గ్రీష్మాతప తీక్ష్ణత వర్ణితం. రెండోది ఉత్పలం. సమాస రచన దాదాపు లేదు. వ్యస్తపదత్వం ఉంది. మహాప్రాణం ఒక్కటి కూడా లేదు. ప్రాణికోటి దీనావస్థ వర్ణితం.

మొదటి పద్యంలో the dusty winds blow అనేదానికి ''దవధూమ్రైధిత వాత్యక ప్రతతులన్'' అన్నారు.

The springs almost dry up - అనే దానికి ''దావాన లాభాతప ప్రవిశుష్యద్ ద్రవ సారణి వ్రజములన్'' అన్నారు.

'the sun rises hot' అనే దానికి ''భాస్వన్మహోషర్బుధచ్ఛవి మద్భాలదివాకరోదయములన్'' అన్నారు. భాష అందించే అవకాశాన్ని అందిపుచ్చుకోటమంటే ఇదే.

ఈ కావ్యఖండిక అంతా విశ్లేషించి పరిశీలించదగిందే అయినా విస్తర భీతివల్ల ఆ పని చెయ్యటం లేదు.

The night showers pearl like dew drops
on the green grass and fields
As 'f the whole scene has been tastefully decorated"

అశ్వయుజాన్ని గూర్చిన ఈ భాగం తెలుగులో ఎంత మధురమైన పద ప్రయోగంతో అవతరించిందో చూడండి.

పచ్చని చేలపై పయిరు పంటలపై ఎసలారు మంచు బొ
ట్లచ్చపు ముత్తెముల్ పొదిగినట్టుల, నేరొ కళారిరంసమై
నిచ్చట తెల్లవారులు నదే పనిగా గయిసేసినట్లు - శో
భోచ్ఛ్రయ వాసముల్ - తళుకులూను బెడంగుగ ఆ ప్రభాతమున్.

ఇదే ఖండికలో చలికాలపు జల్లులను వర్ణిస్తూ ఇంగ్లీషులో when it drizzles, one feels as if a sword has pierced one's skin అని ఉంటే తెలుగులో -

(ఎముకలు కొరికెడు చలిలో
అమలాపగ నీరమెల్ల అళినీలము కాన్;)
అమరిన చిరు జల్లులుగా
గొమరొందిన వానకత్తి కోసెను తనువుల్.

''వానకత్తి'' అనే మాటలో సాధించిన పాదుపరితనం గమనించండి ఇదే పునస్సృజన అంటే.

ఉదాహరించటం లేదు గాని, అదే ఖండికలో చివరి పద్యంలో చాలా భాగం మూలంలో లేదు. అందులో మెరుపుకి పర్యాయపదంగా ''మబ్బు పువ్వు'' అనే ప్రయోగం

కొత్తది. ''మఘువువిల్లు నికుంజపు శయ్యలందు నిద్రింపులు పూసెనా?'' అనే ఊహ కొత్తది.

ఇది పర్వతమయ్యెనా అనే నాలుగో ఖండికలో (పుట - 5)

Flakes of fragrance
have sett ed on flowers
mus c on w'ngs of birds
snow cold white darkness
covers the earth
w'nter sneaks 'nto
my hot b ood heart

అనే ఆంగ్ల భాగాన్ని అనువదించిన తీరులో పునస్సృజన చూడండి.

అలసి పరీమళంబులు సుమావళిపైన ఘనీభవించె; పు
ల్గుల నునురెక్కలందు కలకూజితముల్ నిదురించుచుండె, మి
న్నలమి, హిమంబుమై నివముతౌ తెలిచీకటు లావరించె: శీ
తలరుచి నా నఖంపచహృదగ్ర ఝురమ్ముల గ్రుంకె మెల్లగన్.

Flakes of fragrance have settled అనేదాన్ని ''అలసి పరీమళంబులు సుమావళిపైని ఘనీభవించె'' అని అనువదించటం, కలకూజితములు పక్షుల నునురెక్కలపై నిదురిస్తున్నాయనటం తెలుగు కల్పనలు. wh'te darkness అనే మాటను తెలిచీకటులు అనటం మంచి పదసృష్టి.

పరిచయ వాక్యాలు రాయటం మొదలుపెడితే పరిశోధక వ్యాసంగా మారే ప్రమాదం వచ్చింది. రామబ్రహ్మంగారి అనువాద కవితలపై సిద్ధాంత వ్యాసమే సమర్పించదగినంత వస్తువుంది. ఇంకా ఎన్నో రకాల పునస్సృజనలను ప్రదర్శించే లౌల్యాన్ని అణచు కోవాల్సి వస్తున్నది. అయినా రామబ్రహ్మంగారి కవితానువాద పద్ధతిని గ్రహించటానికి పైన చూపించినవి చాలు.

ఇట్లా వివిధ వస్తు సంభారంతో రకరకాల శైలీ ఛందో వైవిధ్యంతో రామబ్రహ్మం గారు భారతీయ కవితలను తెలుగువారికి పరిచయం చేస్తున్నారు. పేరు కనువాదాలేగాని అచ్చమైన తెలుగు నుడికారంతో, కవితా సంప్రదాయంలో రాసిన తెలుగు పద్యాలు, తెలుగు పద్యాల శక్తిని మళ్ళీ ఇంకోసారి రామబ్రహ్మంగారు ప్రదర్శించారు.

ఈ పలుకు చిలుక – కవిత్వానువాదంపై పరిశోధన చెయ్యదల్చుకున్న వారికి చేతి కందివచ్చిన పసిడిపంట. అచ్చపు కవిత్వాన్ని ఆస్వాదించదల్చుకున్నవారికిది మృష్టాన్న భోజనం. తెలుగు పద్య శక్తిపై ఇంకా అనుమానాలున్న వారికిది సర్వశంకానివారిణి. తెలుగు పద్యాల్లో ఎంత వస్తు వైవిధ్యాన్ని ఒదిగించవచ్చునో, ఎంత శైలీ వైవిధ్యాన్ని ప్రదర్శించ వచ్చునో చూపించారు. తెలుగు భాషా ఛ్ఛందశ్శక్తులను అమితంగా ప్రదర్శించిన, ఈ కవితా సంపుటిని చదివి ఆస్వాదించటానికి రసజ్ఞపాఠకలోకానికిదే నా ఆహ్వానం. ఇంతకన్నా విస్తృతంగా తెలుగు కవిత్వభాషాశక్తిని, ఛందశ్శక్తిని, తన కవితాశక్తిని నిరూపించే మరో బృహత్సంపుటి కోసం ఎదురు చూస్తుంటాను.

రసజ్ఞ పాఠకలోకానికి మరో ఆహ్వానం పేరుతో బేతవోలు రామబ్రహ్మం
పలుకు చిలుకకు రాసిన తొలిపలుకు 1996 అక్టోబరు.

